# శివతత్త్వ ప్రభాంద్రీకరణ



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్య, ధర్మశాస్త్రాది అనేక విషయాలు తెలుసుకోండి...

శ్రీ మహాగణాధిపతయే నమః

తైత్తిరీయ, ఐతరేయ, శ్వేతాశ్వతర, జాబాల, కాలాగ్ని రుద్ర, అథర్వశిర, అథర్వశిఖ, రుద్రహృదయ, భస్మజాబాల, రుద్రాక్షజాబాల, బృహజ్జాబాల, మహానారాయణ, [illegible], ఛాందోగ్య, బృహదారణ్యక (పంచదశ) ఉపనిషత్తులకు

శ్రీశ్రీ నీలకంఠాచార్య కృతభాష్యమును ఇతర శైవ భాష్యములను శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి కృత పరిష్కారము ననుసరించి-

శ్రీ నిర్మల శంకరశాస్త్రి కృత

# శివతత్త్వప్రభాఽఽవిష్కరణము



ప్రకాశకులు- శివజ్ఞానలహరి, ధార్మికసంస్థ, రిజిష్టర్డ్,
హైదరాబాద్.

అధ్యక్షులు- శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావు గారు
విజయవాడ-10



శ్రీధాత్రసం॥ మార్గశిర పూర్ణిమ. వెల రూ. 90/-

# విషయసూచిక

ఓం శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ నీలకంఠీయ ఉపనిషత్‌భాష్యాంధ్రీకరణ ప్రాశస్త్యముఁ గురించి-

# తొలి పలుకు

ఉపనిషత్తులు_వేదాంతములని చెప్పఁబడును. "ఉప-శివసమీపే అభిః జీవాత్మా నిషీదతి" అని ఉపనిషచ్ఛబ్దవ్యుత్పత్తి. ఉపనిషచ్ఛబ్దార్థము-రహస్యము అనియు చెప్పవచ్చును. అధ్యాత్మవిద్యారహస్యము గల ఉపనిషత్తులు_శివ జీవ ప్రపంచ లక్షణములను నిరూపించునవి. "బ్రాహ్మణము ఆరణ్యకము ఉపనిషత్తులు అను మూడు విభాగములు వేదవాఙ్మయమున నొప్పారుచున్నవి. బ్రాహ్మణభాగము-యజ్ఞయాగాదులను, ఆరణ్యకము-యజ్ఞాద్యాచరణమును, ఉపనిషత్ భాగము మోక్షసాధనములను విశదీకరించినవి. వేదాంతములు_గద్యాత్మకములుగాను గద్యపద్యాత్మకములుగాను ఆఖ్యానరూపములు గాను ప్రశ్నోత్తరరూపములుగాను విరాజిల్లుచు పరమేశ్వరుని మహిమను చాటుచున్నవి.

ఇయ్యవి_అష్టోత్తరశత (108) సంఖ్యాకములైన నవ్వానిలో- ఈశ కేన కఠ ప్రశ్న ముండ మాండూక్యఐతరేయ తైత్తిరీయ ఛాందోగ్య బృహదారణ్యక దశ ఉపనిషత్తులు ముఖ్యములై-ఇతర ఉపనిషత్తుల సారాంశము కలిగియున్నవని గుర్తించి శ్రీ నీలకంఠాచార్య భగవత్పాదులు-భాష్యములను వ్రాయగా కీ. శే. మహోపాధ్యాయ, శివశ్రీ॥ ముదిగొండ నాగలింగశాస్త్రి మహోదయులు పరిష్కారరూపములైన సంస్కృత వ్యాఖ్యానముల నుల్లేఖించిరి. అట్టి దశోపనిషత్తులతో శ్వేతాశ్వతరాదులను జతపరచి_శైవులందరికి ఉపనిషత్సారాంశము తెలియుటకై_లోకారాధ్యులు పరమార్థప్రియులు విజయవాడ వాస్త

వ్యులు నగు శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారి ప్రోత్సాహముతో సంపూర్ణ ఆర్థిక సహకారముతోడను శైవమహాపీఠాధిపతి, మద్గురు తుల్యులు, ఆసన్న అర్ధశతాధిక గ్రంథకర్తలు, వయోజ్ఞాన వృద్ధులు నగు శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు-తమ శారీరక అస్వస్థ తను పాటింపక-తేట తెలుగున పదార్థమును భావమును సారాంశ మును ముఖ్యవాక్యముల నుదాహరించుచు వ్రాసి-వెనువెంటనే ముద్రింపఁజేసి-తమ కీర్తి ప్రతిష్ఠల నినుమడింపఁజేసికొనుట-మాదృశు లకు ముదావహమై భావితరమువారికి ఆదర్శమునైనది.

భారతీయ సంస్కృతి గల ఉపనిషత్తుల యనువాదము "శివ తత్త్వప్రభ" అను పేరుతో నుండుట-కడుంగడు ప్రశంసనీయము. భోగ్యరూపమైన స్థిరచరమును యథాలాభము అనుభవించుచు పర ధనము నపేక్షింపకుమని ఈశావాస్యము మానవుని ధర్మన్యాయ ప్రవర్తనమును ప్రబోధించినది. ఇట్లే ఇతర ఉపనిషత్తులు శ్రేయ స్సును నిఃశ్రేయస్సును విశదీకరించినవి. "మనోనిగ్రహం ఇంద్రియ వశీకరణేన సంపాద్య-మనః ఈశ్వరాభిముఖం కృత్వా శాంభవదీక్షా స్వీకారేణ ఇష్ట ప్రాణ భావలింగాన్యారాధ్య-పునరావృత్తి రహిత శాశ్వత శివసాయుజ్యం ప్రాప్నుయాత్" అను శాస్త్రిగారి అను వాదముఁదగు సారాంశమును విబుధులు గుర్తించి ఈ గ్రంథము నామూలాగ్రము చదివి పామరులకు వినుపించియు శ్రీవారి కృషిని సార్థకము నొనర్తురు గాక! అని శైవమహాజనులను కోరుచున్నాను.

ఇట్లు

శ్రీ రామగిరి సిద్ధరామేశ్వరశర్మ

శైవశ్రేయోఽభిలాషి, సాహిత్యాలంకార

వారాసిగుడ-సికిందరాబాద్. 27-11-1996

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే శివాయ పరబ్రహ్మణే నమః
లోకారాధ్యానాం శివశ్రీసంపన్నానాం అన్నదేవర-సుబ్బారావు
(సుబ్రహ్మణ్య) సమాఖ్యానాం షష్టివర్ష పూర్తి సందర్భే-
శుభాశీఃపురస్సరం

# స్వాభినందనమ్

శ్రీమతో మహాదేవస్య ఆజ్ఞావశాత్-సప్తత్రింశత్యుత్తర పంచ సహస్ర పరిమితతయా (5037) గతే కలియుగే- అష్ట పంచాశ దుత్తర అష్టాదశ శత సంఖ్యా పరిమితే (1858) శాలివాహనశకే- ధాతృనామ సంవత్సర- కార్తికశుద్ధ త్రయోదశ్యాం గురువాసరే- చత్వారింశ న్నిమేషోత్తర దశఘంటాసు (10-40) శివశ్రీ॥ "అన్నదేవర- గురునాథప్రసాదరావు, సౌ॥ అన్నదేవర మాణిక్యాంబా సమాఖ్యయోః శ్రీవత్ససగోత్రయో రాదర్శపుణ్యదంపత్యోః- ఆంధ్రప్రదేశే- తూర్పుగోదావరిజిల్లా (ప్రాగ్గోదావరీ మండల) అంతర్గతే కొత్తపేట- కమ్మిరెడ్డిపాలెం గ్రామే కాశికీనదీతీరస్థితే- అశ్విని నక్షత్రగత తృతీయచరణే మేషరాశౌ- షష్ఠసంతానతయా సంభూతా అన్నదేవర సుబ్బారావు సమాఖ్యా ఏతే- సప్తనవత్యుత్తర పంచ సహస్ర (5097) పరిమిత గతకలౌ- అష్టాదశోత్తర ఏకోనవింశతి శతతమ (1918) శాలివాహనశకే- శ్రీ ధాతృనామ సంవత్సర- కార్తికశుద్ధ త్రయోదశ్యాం (23-12-1996) శనివాసరే- విజయ వాటికాయాం స్వషష్టి వర్షవయఃపూర్తి మాలక్ష్య వైదిక శివాగమ

విధానేన శ్రోత్రియబ్రాహ్మణానాం స్థానికానాం సస్వర వేదమంత్రో చ్చారణ పురస్సరం పౌష్టికం కార్యక్రమ మాచక్రుః- దినత్రయే;

ఏతే మహాభాగాః- "అన్నం నామ పృథివ్యుపలక్షిత పంచ మహాభూతాని, తేషాం మూలప్రకృతేశ్చ సద్యోజాతాది పంచబ్రహ్మ రూపేణ, దేవర- ప్రభోః ఇతి "అన్నదేవర" ఇతి గృహాభిఖ్యాయాః సార్థక్యం భవతి ఇత్యతః సుబ్రహ్మణ్యం (సుబ్బారావు) ఇత్యస్య పూర్వోక్త పంచబ్రహ్మరూపే పరశివబ్రహ్మణి సుష్ఠు నిష్ఠావా నిత్య ర్థాత్"-శివభాగవతాగ్ర గణ్యాత్వార్హా భవంతీతి కథయితుం నకోఽపి శంకావకాశః.

అపిచైతే కొత్తపేట గ్రామే బాల్యే ప్రాథమికవిద్యామభ్యస్య రాజమహేంద్ర (రాజమండ్రి) పురే-ప్రభుత్వకళాశాలాయాం డిగ్రీ పర్యంత మాంగ్లవిద్యాభ్యాసం విధాయ1965,(67) సంవత్సరే గృహ స్థాశ్రమంనిర్వోఢుం శ్రీమత్యా సాధ్వీమతల్లికయా సత్యవతీసమాఖ్యయా పాణిగ్రహణం (వివాహం) అకుర్వన్.

ఏతే బాల్యే దశమవర్షే జ్వరార్తాః స్వదేహవిస్మృతిం ప్రాప్తవంతః. తదా జనకే చింతాక్రాంతే సతి—"మమ శివః సాక్షాద్భూయ అభయ హస్తం ప్రదర్శితవా నతః మాభీః" ఇతి స్వయం శివవాణీరూపేణ జనకస్య ధైర్యం పరికల్ప్య-స్వస్థతానంతరం జనకేన పృష్టాః సంతః "మమ న కిమపి జ్ఞాయతే" ఇత్యూచుః-ఏతేన శివానుగ్రహపరిపూర్ణా ఏతే ఇతి విజ్ఞాయతే. 1957 సంవత్సర మారభ్య భాగ్యనగరే (హైదరాబాదే) ఇన్‌కమ్ ట్యాక్స్ ఆఫీసర్ ఉద్యోగం విధాయ 1978 ప్రభృతి విజయవాటికాయాం స్థిరనివాసం చక్రుః శ్రీసోమవారవ్రతం సమాచరిత్వా 1989 వత్సరే కార్తికమాసి-సోమవారవ్రతోద్యాపనం విధివిధానతయా కృత్వా-తస్మిన్నేవ వర్షే గోకర్ణక్షేత్రే-శ్రీమహాబలే

శ్వర సన్నిధౌ ఉమామహేశ్వరాఖ్యయా శివలింగప్రతిష్ఠాం విధాయ చ శ్రీశైలమహాక్షేత్రే శ్రీ భ్రమరాంబామల్లికార్జునయో రాదిదంపత్యో ర్జగన్మాతాపిత్రోః కల్యాణం ప్రతివర్షం కుర్వంత ఏతే శైవోత్తమ ధన్యజీవనా అభవన్నిత్యుక్తిః స్వాభావిక్యేవ.

శ్రీ కాళహస్తి క్షేత్రే విరాజమానాయాః జ్ఞానప్రసూనాంబాయాః కృపయా ఏతే సంతానభాగ్యయోగం ప్రాపుః । కాశీ ప్రయాగ బదరీ కేదార త్ర్యంబకేశ్వరాది దివ్యక్షేత్రాణి సంసేవ్య-తత్రత్య శివ మారాధయామాసుః. । కొల్హాపురక్షేత్రే మహాలక్ష్మి దర్శనం. పట్టిస క్షేత్రే శ్రీ వీరభద్రస్వామిదర్శనాదికం విధాయ-కాంచీ జంబుకేశ్వర అరుణాచల చిదంబర తిరునల్లార్ కుంభకోణ పక్షితీర్థ మధురా కన్యాకుమారి శ్రీరంగ తిరుపతి శ్రీ కూర్మ సింహాద్ర్యాది దక్షిణపుణ్య క్షేత్రాణి సందర్శయామాసుః-కాశ్మీరదేశే-శ్రీనగరే మహాసరస్వతీం సంపూజ్య-విజయవాటికాయాం విద్యమానస్య శైవమహాపీఠకేంద్రస్య అనుబంధతయా తత్త్వద్విద్వన్మాహేశ్వరవిరచిత శైవగ్రంథాన్ సంపూర్ణ ఆర్థికబాధ్యతయా ముద్రాపయిత్వా స్వసత్స్వభావం ప్రకట యామాసుః. షోడశవర్షేషుఉమామహేశ్వరవ్రతం విధాయ తదుద్యాప నమప్యాచక్రుః. ఏతత్సుప్రజాయా గార్హస్థ్యఫలభూతాయాః క్రమశః, సుపరిచయశ్చాత్ర సముల్లిఖ్యతే. తద్యథా?

1. ప్రథమపుత్రః-వేంకటశేషరామచంద్రశేఖరాఖ్యః 28 సం॥ వయస్కః చార్టెర్డ్ అకౌంటెంట్ పదవీకః

2 ద్వితీయపుత్రః-గురునాథ కృష్ణప్రసాద్ సమాఖ్యఃB,Com.CA-20 సం॥ వయస్కః,

3. జ్యేష్ఠపుత్రికా-అనురాధనామ్నీ, వివాహితా B.Com.C.A. 27 సం॥ వయస్కా,

4. ద్వితీయపుత్రికా-కుమారీ లక్ష్మీసుధనామధేయా భౌతికశాస్త్ర ప్రవీణా, 25 సం॥ వయస్కా,

5. తృతీయ పుత్రికా-ఉమానామ్నీకుమారీ,M.A.23 సం॥వయస్కా,

6. చతుర్థ పుత్రికా-నాగరమాసమాఖ్యా-కుమారీ, M.A. 21 సం॥ వయస్కా,

ఏతే సర్వే యోగ్యశీలా మాతాపిత్రో రనుమత్యా పవిత్రజీవనం కుర్వంతః శివానుగ్రహాత్ దీర్ఘాయు ర్భాగ్య ఆరోగ్య విజయాది సంపన్నాః కల్యాణ భాజనం సత్వరం సంభూయ సుఖం జీవేయురితి; శ్రీ అన్నదేవర సుబ్బారావు మహోదయాః స్వధర్మపత్నీసమేతాః శతం సమాః సుఖం జీవేయురితి; ఆధునిక శైవోపయుక్తసద్గ్రంథ ముద్రాపణం, అన్య ఆవశ్యక సత్కార్యాచరణం, స్వరక్షణం, స్వకుటుంబ పర్యవేక్షణం కుర్వంతః పూర్వాధిక ప్రతిష్ఠాం ప్రశంసాం స్వీకృతశాంభవదీక్షాసాఫల్యపూర్ణతాం చ సంప్రాప్నుయురితి చ శివం సదా ప్రార్థయన్ విరమామీత్యలమధికేన-శుభం భూయాత్.

"భార్గవచ్యవన అప్నవ ఔరవ జమదగ్ని పంచార్షేయ ప్రవరాన్విత శ్రీవత్ససగోత్రాః ఆశ్వలాయన సూత్రా ఋగ్వేదాధ్యాయినశ్చైతే-ధన్యతమా ఇతి విజ్ఞాయతే.



## శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు-కవితా గోష్ఠిలో పాలుగొని స్వయముగా రచించినట్టి శివ ప్రార్థన పద్యము

సీ॥ అరవగర్భాన నవతరించిన నన్ను-
జ్యేష్ఠపుత్రునిగాగ జేసినావు।
తండ్రి డెందంబులో దాక్కొన్న నాదైన-
మరణభయంబును మాన్పినావు।
జ్ఞానప్రమానాంబికా వరస్ఫూర్తి-
సంతానభాగ్యప్రశాంతి నొసఁగినావు।
అశ్రాంతభావనాఽఽనందాత్మ మూర్తివై
ఏడుగడయు గాగ నెసఁగినావు।

తే॥ గీ॥ సార గోకర్ణ ధామవాస విభవుండ-
సతతపంచాక్షరీజపోత్సాహపరుండ।
అట్టి పరమశివుఁడు మదాత్మ వెలుఁగ-
శతసహస్రనమస్సులర్పితముఁజేతు॥

ఇత్థం-నివేదకః
ఆచార్య-నిర్మల శంకరశాస్త్ర్యారాధ్యః
(శైవమహాపీఠాధిపతిః)

సర్వమంగళా-శివ-విజ్ఞానసదనమ్-
(120) 184/ఎ-వెస్ట్ (పశ్చిమ) మారేడుపల్లి,
రోడ్ నెం. 6, సికిందరాబాద్-500026, ఆం ప్ర.

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# తైత్తిరీయోపనిషత్తు

## "శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాద సహితము

"ఓం శం నో మిత్రః శం వరుణః, శం నో భవత్వర్యమా శం న ఇంద్రో బృహస్పతిః, శం నో విష్ణు రురుక్రమః నమో బ్రహ్మణే, నమస్తే వాయో! త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాఽసి, త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి తన్మామవతు అవతు మాం అవతు వక్తారమ్; ఓం శాంతిః శాంతిః శాంతి.

సూర్యుఁడు, వరుణుఁడు, అర్యముఁడు, ఇంద్రుఁడు, బృహస్పతియు, గొప్ప సామర్థ్యము గల విష్ణువున్ను మాకు సుఖము ను కలుగ జేయుదురుగాక! సూర్యునివలన ప్రాణరక్షణము, వరుణునివలన అపాన వాయుస్థితి, అర్యమునిచే నేత్రసామంజస్యము, ఇంద్రునివలన శరీర బలము, బృహస్పతివలన వాక్ బుద్ధులు పరిపుష్టములగుటయు, విష్ణువు వలన యోగక్షేమములు చేకూరుననుట "శం" అనుదాని యర్థము.

ప్రస్తుతము అధ్యయనము చేయఁబడనున్నట్టి ఉపనిషత్తగు వేదమునకు "నమో బ్రహ్మణే" అని నమస్కారము గావింపఁబడినది వాయువే-ప్రాణ అపానాదిరూపమున శరీరమును ప్రవర్తింపఁజేయునదై శరీరముచే చేయఁబడు క్రియలను నిర్వర్తింపఁజేయుచు జీవనసాధనములలో ముఖ్యమగుటచే "నమస్తే వాయో" అని వాయు దేవుఁడు నమస్కరింపఁబడెను. "నీవే ప్రత్యక్షమైన బ్రహ్మము గాన నిన్నే ప్రత్యక్షబ్రహ్మముగా మనోవాగ్వికారరహితముగా చెప్పు చున్నాను. అట్టి వాయురూపమైన బ్రహ్మము-వేదాధ్యయనముఁజేయు నన్ను రక్షించుగాక! అధ్యాపకుడైన ఆచార్యుని కాపాడుగాక!

ఆధ్యాత్మిక అధిభౌతిక అధిదైవిక తాపత్రయ నివారణకై "శాంతిః" అని ముమ్మారు పఠింపఁబడినది.

ఇఁక నీ యుపనిషత్తు-శివాద్వైతము నెట్లు సమర్థించుననఁగా-"బ్రహ్మవిదాప్నోతి పరం" "పరమేశ్వరు నుపాసించువాడు-పరమేశ్వరుని పొందును" అనుచో-పొందువాడు (ప్రాప్త) పొందఁబడునది యను జీవేశ్వరుల భేదమే కంఠరవముతో చెప్పఁబడినది. ఇట్టి జీవేశ్వరభేదము-కేవలాద్వైతమునందు సంఘటితము కాదు. "బ్రహ్మవిత్ = బ్రహ్మానుభవము గలవాడు, పరం అప్నోతి = తాను బ్రహ్మమగును" అని జీవేశ్వరభేదము నిరాకరింపఁబడినదనునెడ-జీవేశ్వరభేదము- బహుశ్రుతి సంప్రతిపన్నమగుటచే. స్వయము వేరైన జీవేశ్వరులకు ఐక్యము సంభవింపదు. ఇఁటగల విదధాతువు-"ఉపాసనారూపమగు జ్ఞానము" అను అర్థము కలదగుటచే-అనుభవరూపమైన జ్ఞానమును అర్థముఁజెప్పుట-సముచితము కాదు.

"మనో బ్రహ్మేత్యుపాసీత" 3-18-1, అనుచో ఉపాసనతో

ప్రారంభించి "భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన, య ఏవం వేద" అనుచో వేదనముతో ముగించిన సందర్భము ఛాందోగ్యమునందు ఉండుటవలన విద్యుపాస్త్యులు ఏకార్థకములని తేటపడుచున్నయది. భగవద్భాష్యకారులు "బ్రహ్మవిదాప్నోతిపరం" ఇత్యాదులయందు-బ్రహ్మస్వరూపము బ్రహ్మోపాసనము తత్ఫలంబు నుపదేశింపఁబడినవి అట్లుకానిచో సత్యత్వాదివిశిష్టమగు బ్రహ్మముతో గూడ సకలకామావాప్తిరూపఫలము, అట్టి బ్రహ్మము సాక్షాత్కరించు టయు ఎట్లు పొసఁగు"నని నిరూపించిరి.

అట్టితఱి ఉపాస్య ఉపాసకభేదమునందే "ధ్యాత్వామునిర్గచ్ఛతి భూతయోనిం" "జ్ఞాననిర్మథనాదేవ పాశం దహతి పండితః" "శంభు రాకాశమధ్యేధ్యేయః" "ప్రాచీనయోగ్యోపాస్వ" ఇత్యాది వేదాంతవాక్య ములు సార్థకములగును.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనుచో-జ్ఞానపదముతో-జడ మైన జగత్తున కంటె, అనంతపదముతో-అణువైన జీవునికంటెను బ్రహ్మము విలక్షణమైనదనియు, సజాతీయ విజాతీయములగు జీవ జగత్తులకు బ్రహ్మమునకు సహజమైన భేదము కలదనియు; జగత్తు సత్యమనియు, "భీషాఽస్మా ద్వాతః పవతే" ఇత్యాదిని-పరమేశ్వరుని ప్రశాసకత్వము సహజమనియు "ఈశ్వరుఁడు మాయాకల్పితుఁడు బ్రహ్మము సజాతీయ విజాతీయాది భేదరహితము" అను వాదము అసంగతమనియు ఇందు నిరూపింపఁబడినది.

"సోఽశ్నుతే సర్వాన్ కామాన్, సహబ్రహ్మణా విపశ్చితా" అను వాక్యమున "సర్వజ్ఞుడైన పరమేశ్వరునితో కూడ ముక్తాత్మ-కామితముల నన్నిటి ననుభవించు" నని చెప్పఁబడినందున-ముక్తావస్థ యందును జీవబ్రహ్మములకు భేదముండునని విదితమగుచున్నది.

ఇట-"సహ" అనుదానికి "ఏకకాలమున" అని యర్థముఁ జెప్పఁ గూడదు. అట్లు చెప్పినచో "బ్రహ్మణా" అను తృతీయావిభక్తి-నిరర్థక మగును. "సర్వాన్ కామాన్" అనునది-బ్రహ్మము నిర్విశేషము" అను వాదమును నిరాకరించుచున్నది. "భోగమాత్రసామ్యలింగాచ్చ" అను వ్యాససూత్రము- సకలకామావాప్తిరూపమగు శివానందభోగమును అట్టి అనుభవముతో శివసామ్యమును నిర్ధారించినది. "భోగమాత్ర సామ్యలింగాచ్చ" అను సూత్రము సగుణ బ్రహ్మపరమైనదని-అద్వైతులుగూడ అంగీకరింపవలసివచ్చినందున- శివాద్వైతమున నిర్గుణ మాత్రతత్త్వము లేనందునను శివాద్వైతమే ఈ యుపనిషత్సారాంశ మగునని విదితమైనది.

"యతో వాచో నివర్తంతే" ఇత్యాదిని-బ్రహ్మానందము వాఙ్మనోఽతీతమగునని చెప్పఁబడినది. కాని బ్రహ్మము వాఙ్మనస్సులకు అందరానిదని చెప్పఁబడలేదు.

శ్లో॥ యన్ముహూర్తం క్షణం వాపి-మహాదేవో న చింత్యతే ।
సా హాని స్తన్మహానర్థః-సా భ్రాంతిః సా చ విక్రియా ॥

వరం హుతవహజ్వాలా-పంజరాంత ర్వ్యవస్థితిః ।
న సాంబచింతావిరహ-సంస్థితిర్హి ప్రశస్యతే॥

ప్రతి దినము ముహూర్తకాలముగాని క్షణకాలము గాని శివధ్యానము చేయకుండుట-హాని, గొప్ప అనర్థము, భ్రాంతి, వికారంబు నగును. "అగ్నిజ్వాలాపంజరమున చిక్కుకొనుట-శివధ్యానరహితమగు జీవనము కన్న-శ్రేష్ఠముగ ప్రశంసింపఁబడుచున్నది" అను శివమహాపురాణము ఉపబృంహించిన-శివధ్యానాభావనిందను ఈ యుపనిషత్తున "యదా హ్యేవైష ఏతస్మి న్నుదర మంతరం కురుతే-అథ

తస్య భయం భవతి" "యదా = ఎప్పుడు, ఏషఏవ = ఈయుపాస కుఁడే, అరంఉత్ = స్వల్పము (కొద్ది)గ నైనను, అంతరం = శివధ్యాన భంగమును (అనగా ప్రతిదినము నియమితసమయములో శివధ్యానముఁ జేయకుండుటను), కురుతే = చేయునో, అథ = అట్లై నచో, తస్య = అట్టివానికి, భయం = జననమరణాది సంసారభయము భవతి = సంప్రాప్తమగును" అను వాక్యము సమర్థించినది. ఇట్లే ఐతరేయోపనిషత్తు గూడ "స ఈక్షత లోకాన్నుసృజా" ఇత్యాది వాక్యములతో-"బ్రహ్మము సప్రపంచము" ఇత్యాదులను నిర్ధారించి-నిర్గుణబ్రహ్మవాదమును నిరాకరించుచున్నది. ఐతే ఈ తైత్తిరీయ ఉపనిషత్తుయొక్క-విశిష్టశివాద్వైత ప్రతిపాదనము నుల్లేఖించుట-మహోపాధ్యాయ, ముదిగొండ నాగలింగశాస్త్రిగారి వైదుషీ లేశము గల నాకు-శివప్రేరణచే అనివార్యమైనది.

తైత్తిరీయోపనిషత్తునందు శిక్షావల్లి, ఆనందవల్లి, భృగువల్లి అను మూడు వల్లులు, సుమారు నలుబది వాక్యములు గలవు.

శిక్షావల్లిలో "శం నో మిత్రః" ఇత్యాది శాంతిపాఠముఁదగు అర్థము వ్రాయఁబడినది. ఇది-ప్రథమానువాకము.

ఇఁక అకారాది అక్షరము, ఉదాత్తాదిస్వరము, హ్రస్వాదిమాత్ర, ప్రయత్నవిశేషమనఁదగు బలము, ఉచ్చారణలో సమానత్వమనఁ బడుఁగు సామము, సంహిత యనఁబడు సంతానము అను ఆరు లింగ ములు గల శిక్షను విశేషించి చెప్పుదుమని శిక్షావల్లియందు మొదటి వాక్యమున సూచింపఁబడినది.

## ఇది-ద్వితీయానువాకము

తృతీయానువాకమున-నాలుగు వాక్యములయందు- మొదట

ఆచార్య శిష్యులమగు మా ఇరువురికి-కీర్తి, బ్రహ్మవర్చస్సు ఎల్ల కాలము ఉండుగాక! అని ప్రార్థించి-అధిలోకము, అధిజ్యోతిషము, అధివిద్యము, అధిప్రజము, అధ్యాత్మము అను ఐదు అధికరణములు చూపఁబడినవి.

ఒక్కొక్క అధికరణము-పూర్వరూపము, ఉత్తరరూపము, సంధి, సంధానము అను నాలుగు విభాగములు కలిగియుండును

1. పృథివి-పూర్వరూపము, స్వర్గము-ఉత్తరరూపము ఆకాశము సంధి, (అంతరము), వాయువు-సంధానము (కూర్పు) ఇది-అధిలోకమనఁబడును.

2. అగ్ని-పూర్వరూపము, ఆదిత్యుడు-ఉత్తరరూపము, ఉదకము-సంధి, మెరుపు-సంధానము, ఇది-అధిజ్యోతిషము.

3. ఆచార్యుడు-పూర్వరూపము, అంతేవాసి (శిష్యుఁడు) ఉత్తర రూపము, విద్య-సంధి, ప్రవచనము-సంధానము, ఇది-అధి విద్యము.

4. మాత-పూర్వరూపము, పిత-ఉత్తరరూపము, సంతానము-సంధి, ప్రజననము-(గర్భమును కలిగించుట) సంధానము, ఇది-అధి ప్రజము.

5. క్రింది చెక్కిలి (దౌడ) పూర్వరూపము, పైచెక్కిలి-ఉత్తర రూపము, వాక్కు-సంధి, జిహ్వ-(నాలుక) సంధానము. ఇది-అధ్యాత్మము

ఇవి మహాసంహితలనఁబఱఁగును. ఇట్లు వ్యాఖ్యానింపఁబడిన ఈ మహాసంహితలను భావించువాడు-సంతానము, పశువులు, బ్రహ్మ వర్చస్సు, అన్నవస్త్రములు మున్నగు సంపత్తు గలవాడగును.

## ఇది-తృతీయానువాకము

నాలుగవ అనువాకములో మూడు వాక్యములు గలవు.

"య శ్ఛందసా మృషభో విశ్వరూపః । ఛందోభ్యోఽ
మృతాత్ సంబభూవ। స మేంద్రో మేధయా స్పృణోతు
అమృతస్య దేవ ధారణో భూయాసం। శరీరం మే విచ
ర్షణం । జిహ్వా మే మధుమత్తమా । కర్ణాభ్యాం భూరి
విశ్రువం । బ్రహ్మణః కోశోఽసి-మేధయాపిహితః ।
శ్రుతం మే గోపాయ" 1

వాక్యార్థము-యః = ఏ ప్రణవము, ఛందసాం = వేదములలో, ఋషభః = శ్రేష్ఠమై, విశ్వరూపః = ప్రణవవాచ్యుఁడైన శివునితో భిన్నము కానందున-విశ్వము రూపముగాగలదై, (అథవా = వాఙ్మయమున కంతటికి మూలరూపమై), ఛందోభ్యః = ఋగ్యజుః సామవేదములనుండి, అమృతాత్ = వేదయోనియగు పరమేశ్వరునుండియు, సంబభూవ = ఆవిర్భవించినదో. సః = అట్టి ప్రణవముతో నిరూపింపబడు, ఇంద్రః = పరమేశ్వరుఁడు, మా = నన్ను, మేధయా = ధారణాశక్తిగల బుద్ధిచే, స్పృణోతు = జీవింపఁజేయుగాక! హే దేవ = పరమేశ్వరా! అమృతస్య = మృత్యుంజయుడవైన నీ లింగరూపమును, ధారణో = బాహ్యశరీరమున నిరంతరము ధరించువాడను, భూయాసం = అగుదునుగాక! మే శరీరం = నా స్థూలశరీరము, విచర్షణం = బలారోగ్యసంపన్నముగ సమర్థమగుగాక! మే జిహ్వా = నా నాలుక, మధుమత్తమా = శివారాధనమంత్రోచ్చారణతో మధురభాషిణి యగు గాక! కర్ణాభ్యాం = చెవులచే, భూరి = బ్రహ్మవిద్యావబోధక

మగు ఉపనిషచ్ఛివాగమాగాదిశాస్త్రము నధికము, విశ్రుతం = వినుదు గాక! (దేవ = పరమేశ్వరా!) బ్రహ్మణః = నిరాకారమగు జ్యోతిః స్వరూప మైన పరమాత్మకు, కోశోఽసి = కత్తికి యొఱవలె, ఇష్టలింగ రూపమున ఆశ్రయమగుదువు, మేధయా = శివజ్ఞానరహిత మైన బుద్ధితో, పిహితః = తప్పఁబడినవాడవు, అథవా భవద్వాచకమగు ప్రణవ ముతో-లేక-ప్రణవషడక్షరితోడను పిహితః = ఆశ్రయముగా కప్పఁ బడినవాడవు, అనఁగా-ప్రణవషడక్షరియందు నెలకొనియున్నావని భావము శ్రుతం మే = శాంభవదీక్షాదేశికాదులవలన నేను వినిన ఇష్ట ప్రాణభావలింగారాధనాది విధానమును, గోపాయ = నాచే అచరింప జేయుచు రక్షింపుము!

ఈ మంత్రమున గల "యశ్ఛందసాం = స్పృణోతు" మంత్ర మును విద్వాంసులు విద్యార్థులును ధారణాశక్తికై జపించవచ్చును. లక్ష జపింపవలెను.

"ఆవహంతీ వితన్వానా-కుర్వాణా చీర మాత్మనః।
వాసాగ్ంసి మమ గావశ్చ-అన్నపానే చ సర్వదా।
తతో మే శ్రియ మావహ-లోమశాం పశుభిఃసహస్వాహా"

ధర్మాచరణమునకు ఉపయోగించు అర్థసంపత్తిని సమీపింపఁ ఏ విస్తరింపఁజేయునదై చిరకాలము అనుసరించునట్టి శ్రీదేవి-నాకు ప్రసన్నురాలు అగుగాక! అదేవిధముగా-వస్త్రములు గోవులు అన్న పానీయములు యావజ్జీవము లభించుగాక! అందువలన పరమేశ్వరా! నాకు పశువస్త్రధనధాన్యసమృద్ధిరూపమగు సంపదను నిరంతరము కలుగఁజేయుము!

ఈ మంత్రము చివర "స్వాహా" పదముండుటచే-సంపదకై - దీనితో విధియుక్తముగ హవనమును చేయవలెనని తెలియుచున్నది

ఇక నీ రెండవ మూడవ మంత్రములయందు-

బ్రహ్మచారులైన విద్యార్థులు నన్ను చేరుదురు గాక! వేదాధ్యేత లందరిలో నేను యశస్వి నగుదును గాక! సంపన్నులలో ప్రశంస నీయుఁడ నగుదును గాక! భగవానుఁడా! నీలో నేను ప్రవేశింతును గాక! అట్టి సర్వాశ్రయుఁడవగు భగవానుఁడా! నాలో నివసింపుము! ప్రణవవాచ్యుడవైన పరమేశ్వరా! (లేక వాచ్యవాచకములకు భేదము లేనందున ప్రణవమా! అనియు చెప్పవచ్చును.) సహస్రశాఖలు గల నీ అనుసంధానముతో నన్ను శోధింపఁజేసికొందును. (పాపరహితుఁడ నగుదును.) పరమేశ్వరా! ఉదకములు క్రిందికి ప్రవహించునట్లు- నెలలు సంవత్సరము నాశ్రయించునట్లు బ్రహ్మచారులు నన్ను సమీపింతురు గాక! నీవు చేరువనుండు గృహమువంటిదానవు. నన్ను రక్షింపుము! నన్ను పొందుము!

## ఇది-చతుర్థానువాకము

ఐదవ అనువాకమున గల మూడువాక్యములకు భావార్థమును దిగువ విధము గాననగును.

"భూః" "భువః" "సువః" అనునవి-మూడు వ్యాహృతులుకాగా ఈ మూడిటికి-నాలుగవదగు వ్యాహృతిని మహాచమస్యుఁడను మంత్ర ద్రష్ట- అనుసంధింపఁజేసెను. అది "మహః" అనఁబడును. "మహః" అనఁగా—సర్వశ్రేష్ఠమైన బ్రహ్మమగును. మహఃశబ్దవాచ్యుఁడైనవాడే పరమాత్మ యగును. ఇతరులు—అంగదేవతలగుదురు. "భూః" అను నది—భూలోకమును, "భువః" అనునది-అంతరిక్షమును, "సువః" అను నది స్వర్గలోకమును, "మహః" అనునది-సూర్యుని సూర్యాంతర్వర్తిని నిర్వచించును. సూర్యునిచేతనే లోకములన్నియు ప్రకాశించుచున్నవి.

ఇవ్విధముగనే అగ్ని వాయు రవిచంద్రులను భూరాదులయందు భావింపవలెను-చంద్రునివలననే జ్యోతిస్సులన్నియు వెలుగందు చున్నవి. ఋక్ సామ యజుస్సులను ప్రణవమును భూరాదులయందు భావింపవలెను. ప్రణవముచేతనే వేదములన్నియు రాణించుచున్నవి. ప్రాణ అపాన వ్యానదృష్టిని భూరాదులయందు నెలకొలిపి-మహస్సు నన్నముగా భావింపవలెను-అన్నమువలననే ప్రాణాదులు పరిపుష్టము లగుచున్నవి.

భూరాదివ్యాహృతులు నాలుగిటియందు-భూ అంతరిక్ష స్వర్గ సూర్యభావన, అగ్ని వాయు రవిచంద్రభావన, ఋక్ సామ యజుః ప్రణవభావన, ప్రాణ అపాన వ్యాన అన్న భావనయను నాలుగు విధములు గలవని గుర్తించువాడు-చెప్పఁబోవు బ్రహ్మవిద్యను తెలిసికొనఁ గలుగును. ఇట్టివాని నమరులు గౌరవింతురు.

ఇది-పంచమానువాకము

ఇఁక షష్ఠానువాకమున

"స ఏషోఽన్తర్హృదయ ఆకాశః। తస్మిన్నయం పురుషో మనోమయః। అమృతో హిరణ్మయః। అన్తరేణ తాలుకే। య ఏష స్తన ఇవావలంబతే। సేన్ద్రయోనిః। యత్రాసౌ కేశాన్తో వివర్తతే। వ్యపోహ్య శీర్షకపాలే। భూరిత్యగ్నౌ ప్రతితిష్ఠతి। భువ ఇతి వాయౌ"

సువరిత్యాదిత్యే। మహ ఇతి బ్రహ్మణి। ఆప్నోతి స్వారాజ్యమ్। ఆప్నోతి మనసస్పతిమ్। వాక్పతి శ్చక్షుష్పతిః। శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః। ఏతత్తతోభవతి।

ఆకాశశరీరం బ్రహ్మ । సత్యాత్మ ప్రాణారామం మన
ఆనందం శాంతి సమృద్ధమమృతమ్ । ఇతి ప్రాచీన
యోగ్యోపాస్వ'' 2

"హృదయములో ప్రకాశించు ఆకాశ (అవకాశ)ము చిదంబర మనఁబడును. మనస్సు నధిష్ఠించు మహాపురుషుఁడు-చిదంబరము నందుండువాడు. జరామరణాదులు లేనివాడై బంగారువన్నె గల దివ్యమంగళ విగ్రహము గలిగిన పరమేశ్వరుఁడు—జీవాత్మద్వారా శరీరమునుండి బయలుదేరుటకు దౌడల నడుమగల మాంసగ్రంథి (స్తనము) నుండి శిరస్సుఁజెందిన శిఖాస్థానము మార్గమగును.

భూలోకపర్యవసానమగు అగ్నియందు కొంతకాలము, భువర్లోక ముఖ్యమగు వాయువునందు కొంతకాలము, సువర్లోకాధారమగు సూర్యు నందు కొంతకాలము-ముక్తాత్మ నివసించి మహస్సును బ్రహ్మముగా నుపాసించుటచే బ్రహ్మమును పొందును. బ్రహ్మప్రాప్త్యనంతరమే సచ్చిదానందమయమగు నిజరూప (స్వారాజ్యము)ను పొంది-సంకల్ప మాత్రముననే సకలకామ్యముల ననుభవించును. అనఁగా ప్రాకృత సంకల్ప వికల్పముల నతిక్రమించిన దివ్యమైన మనస్సు గలవాడగు నని భావము. వాక్కునకు చక్షురాది ఇంద్రియములకును ప్రభువై వాగాదుల నీశ్వరాభిముఖములుగ నొనర్పఁగలుఁగును. అందువలన జీవాత్మకు-సంసారబంధవిముక్తి కాగానే-ఇంతవరకు ప్రాకృతముగా కనుపడిన ప్రపంచము-చిదంబరశక్తి శరీరముగా గలదియు, నిరంతరమైన సత్త (ఉనికి)యగునదియు, సమస్త ప్రపంచమును జీవింపజేయు ప్రాణశక్తిని విహరించునదియు, దివ్యమైన మనస్సునందే ఆనందముగలదియు, వికారరహితమైన శాంతిచే నిండినదియు, జన్మ జరామరణములు లేనిదియు నగు బ్రహ్మముగా గోచరించును. అనఁగా

ముక్తపురుషునకు జగత్తంతయు శివమయముగా కనుపడునని భావము.

ప్రాచీనయోగ్యుఁడా! ఈ విధముగా శివునుపాసింపుము! అని ఆచార్యుఁడు శిష్యునకు ఉపదేశించెను.

"ఏతత్తో భవతి" ఇత్యాదివాక్యమున "మన ఆనందం" అని యుండుటచే-పరమేశ్వరునకు ముక్తాత్మకును ఆనందానుభవమునకై దివ్యమైన మనస్సు ఉండునని విదితమగుచున్నందున "లింగశరీర భంగఏవ మోక్షః" "మనోబుద్ధ్యాదివిశిష్టమగు సూక్ష్మశరీరము లేకుండుటయే మోక్ష"మను వాదము-భంగపడినదని-పాఠకులు గ్రహింతురు గాక!

## ఇది షష్ఠానువాకము

సప్తమానువాకమున గల ఒకే ఒక వాక్యమునందు-

పంక్తి యను ఛందస్సునకు సంబంధించిన పాంక్తోపాసనము నిరూపింపఁబడినది. ఎట్లనఁగా- అధిభూతము, అధ్యాత్మము ఇత్యాదులలో ఒక్కొక్కటి ఐదు విధములగునది.

పృథివి, అంతరిక్షము, స్వర్గము, మహాదిశలు, అంతర్దిశలు ననునవి అధిభూతమనఁబడును. అగ్ని, వాయువు, ఆదిత్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములుననునవి-రెండవ పంచకమగునవి ఉదకము ఓషధులు, వనస్పతులు, ఆకాశము ఆత్మ యనునవి-మూడవ పంచకముగాను, ప్రాణవ్యాన అపాన ఉదాన సమానవాయువులు—నాలుగవ పంచకముగాను, చక్షుః శ్రోత్ర మనో వాక్ త్వక్కులు-ఐదవపంచకముగాను, చర్మ మాంస స్నాయు అస్థి మజ్జలు-ఆరవ పంచకముగాను వ్యవహరింపఁబడును.

ఇట్టి విభాగమును భావింపవలెనని ఒకానొక ఋషి-వర్ణించెను పంక్తియను ఛందస్సున ఐదక్షరములుండుటచే పంచపంచ విభాగము గలిగిన ఆరు పంచకములను తలచుకొనువాడు—సమస్త ప్రపంచవైభవము గలవాడగునని నిరూపింపఁబడినది.

## ఇది—సప్తమానువాకము

అష్టమానువాకమున ఒకే ఒక వాక్యమునందు "ఓమ్" అనునది ప్రణవస్వరూపమగు బ్రహ్మంబేను, వాచకమగు ప్రణవము వాచ్యమగు బ్రహ్మముతో భిన్నము కాకుండుటచే ప్రణవము బ్రహ్మముగా ప్రశంసింపఁబడుచున్నది. ప్రణవమే సమస్త వాఙ్మయమగును. శబ్దములన్నియు వేదమునుండి ఆవిర్భవించుటచేతను, వేదమునకు మూలము ప్రణవమగుటఁజేసియు వాఙ్మయమంతయు ప్రణవమగునని చెప్పఁబడినది.

వైదికకార్యమును గుర్తించువారు-మొదట "ఓమ్" అని ఉచ్చరింతురు "ఓమ్" అని వినుపింపఁబడును. ఉద్గాతలు "ఓమ్" అని ప్రారంభించియే సామవాక్యముల గానముఁ జేయుదురు. "ఓమ్" అను ప్రారంభముతో ఋక్కులను పఠింతురు అధ్వర్యువు, హోతయు అగ్నిహోత్రమున హవనమును వేదపఠనమును "ఓమ్" అనియే ప్రారంభింతురు. వేదపఠనముద్వారా ప్రణవమును గుర్తించి-ప్రణవమును అనఁగా పంచావయవఘటితసూక్ష్మపంచాక్షరి యనఁదగు ఓంకారమును స్థూలపంచాక్షరి యగు శివమంత్రముతో జతపఱచి. శివు నుపాసింపవలె నని-సారాంశము.

## నవమానువాకమున-

వేదాధ్యయనమునందు అధ్యాపనమునందును-యథార్థ సంభాషణ

మును (చూచినది చూచినట్లు ప్రాణులకు హితముఁ గొలుపు మాట లాడుటను;) లేక సమదర్శనమును; శివపంచాక్షరీ మహామంత్రజప రుద్రాధ్యాయాది పఠనాదికమగు తపస్సును; బాహ్యేంద్రియజయ మును; అంతఃకరణ నిగ్రహమును; అగ్నులను, అగ్నిహవనమును, అతిథిసత్కారమును, కళత్రాది బంధు భృత్యజనాది పోషణమును, ధార్మికసంతాన ప్రాప్తి ప్రయత్నమును, పౌత్రాది వంశవృద్ధి వాంఛను. విడువరాదు. గృహస్థాశ్రమాంగములగు పైవాని నాచ రించుచు శివజ్ఞానోన్ముఖుఁడు కావలెను.

సత్యవచస్కుఁడైన రథీతరుఁడు అను ఋషి-సత్యమే ముఖ్య మైనదనియు, తపోనిత్యుఁడైన పౌరుశిష్టియను మునీంద్రుఁడు-తపస్సే ప్రధాన మనియు, నాకుఁడు అను మౌద్గల్యుఁడు-స్వాధ్యాయ ప్రవచ నములే ముఖ్యములనియు, నిరూపించినవారు.

దశమానువాకమున-

శాఖోపశాఖాసహస్రసంకులము ఛేద్యస్వభావము గల వృక్షమువంటి అహంకార మమకార సంవేష్టితమగు సంసారము అను వృక్షమును ఏనాటికైనను నేను ఛేదింతును. అనఁగా-దేహమే ఆత్మ యను అభిమానము లేనివాడ నగుదునని భావము

సంసారవృక్షమును ఛేదించి శివజ్ఞానము గలిగినట్టి నాకీర్తి-పర్వతముఁదగు పై ప్రదేశమువలె-అత్యున్నతమగుగాక! సూర్యుని వలె మిక్కిలి పవిత్రుఁడనై పరమేశ్వరునితో సమానుఁడ నగుదును గాక! జ్ఞానైకసాధనమగు దివ్యకాంతి గల వస్తువునగుదును గాక! సంసారదుఃఖము నత్యంతము పోగొట్టు శివజ్ఞానముతో సుమేధస్సు గలవాడ నగుదునుగాక!

మరణము క్షయము లేనివాడ నగుదును గాక!

ఇట్లు త్రిశంకువు అను ఋషి - శివజ్ఞానప్రదమగు వచనము నుచ్చరించెను.

## ఇఁక నేకాదశానువాకమును గమనింపుడు!

గురుకులవాసమున శిష్యునకు ఆచార్యుఁడు వేదమును నేర్పి- స్నాతకుఁడై గృహస్థుఁడు కాబోవు శిష్యుని దిగువవిధము శాసించు చున్నవాడు.

"సత్యం వద" "నిజము మాట్లాడుము!" అబద్ధములాడువాడు- కాలక్రమమున క్షీణదశ ననుభవించునని భావము

"ధర్మంచర" "నీ యధికారము ననుసరించి-శ్రౌత స్మార్త కర్మ నాచరింపుము!"

స్వాధ్యాయాధ్యయనమునకు భంగము నాపాదింపకుము! ఆచార్యునకు ప్రియమగు ధనము నార్జించి సమర్పించి ఆచార్యు ననుజ్ఞఁ బొందియు గృహస్థుఁడవై పుత్రపౌత్రాది సంతానముఁ బడయుము!

సత్యము నాచరించుట యందు ప్రమాదముఁజెందకూడదు. పొరపాటున అసత్యమునాచరింపకూడదని భావము.

తన క్షేమమును కాపాడుకొనవలెను. ఆపత్కాలమున భస్మస్నానాదులచే శరీరమును రక్షించుకొనవలెనని భావము. భస్మధారణాదులచే కలుగు ఐశ్వర్యమునకై పాటుపడవలెను. శుభప్రదములగు పుణ్యకర్మల నవశ్య మాచరింపవలెనని భావము.

వేదముఁ జదువుటయందు చదివించుటయందును ప్రమాదము కూడదు.

దేవకార్యములగు వైశ్వదేవాదులను, పితృకార్యములగు శ్రాద్ధాదులను విసర్జింపకుము! కన్నతల్లిని దైవముతో సమానముగ పూజింపుము! తండ్రి దైవమని భావింపుము! ఆచార్యుఁడు దైవమని సత్కరింపుము! అతిథులను గౌరవింపుము!

శిష్టాచారప్రాప్తములు దోషరహితములునగు పుణ్యకర్మల నాచరింపుము! శిష్టులచే ఆచరింపఁబడినను దోషసహితముల నాచరింపకుము!

శిష్టులు గూడ రజోగుణప్రభావముచే ఒకప్పుడు నింద్యకార్యములఁ జేయుదురు. గాన వారి ఆచారము దుష్టమగునెడల-కర్తవ్యకర్మ విషయమై- ప్రమాణము కాదని భావము.

మన ఆచార్యుల సుచరితములు శ్రుతి స్మృత్యవిరుద్ధములగుచో నయ్యవి గ్రహింపఁదగినవి. ఆచార్యులు గూడ రజస్తమోగుణ సంబంధమున కదాచిత్ అనాచారములఁ జేయుదురు. అట్టివానిని విడనాడవలెనని భావము

ఏ బ్రాహ్మణులు వయస్సులో పెద్దవారై సదాచార సంపన్నులై యుందురో, అట్టివారిని ఆసనదానాదులతో వినయమున సత్కరింపవలెను. వారిముందు నమ్రతతో ప్రవర్తింపవలెను. శ్రద్ధతో దేనినైన నొసఁగవలెను. అశ్రద్ధతో నీయరాదు. మనస్తృప్తితో దానముఁ జేయవలెను. ఎక్కువ ఇచ్చుచున్నను ఇది తక్కువే అను సిగ్గుతో నొసఁగవలెను. దానముఁజేయనిచో తస్కరాదులు అపహరింతురను భయముతో నొసఁగవలెను. స్నేహముతో నీయవలెను. ప్రతిఫలము నపేక్షింపఁ గూడదని భావము.

ఇట్లైనను నీకు - కర్మయందుగాని ప్రవర్తనమునందు గాని సంశయము కలుగునెడల- ఆ సమయమున- కర్తవ్యమగు కర్మను

శాస్త్రీయమగు ప్రవర్తనమును బాగుగా విచారింప సమర్థులగువారు, నియమముతో కర్మ నాచరించువారు, సమస్త శ్రౌతస్మార్త కర్మలను సాంగోపాంగముగ పరిశీలించువారు, కఠిన స్వభావము లేనివారు, ధర్మమునే అపేక్షించువారు నగు బ్రాహ్మణులు- సందిగ్ధములైన కర్మలను గురించి ప్రవర్తనములను గురించియు ఎట్లు నడుచు కొనెదరో, అట్లే నీవు ప్రవర్తింపుము!

ఇదియే మా ప్రశాసనము. ఇదియే మా ఉపదేశము. ఇదియే వేదములచే రహస్యముగ చేయఁబడు హితోపదేశము. ఆచార్యులందరిచే శిష్యునకు చేయఁబడు అనుశాసనము. ఈ చెప్పిన విధమున వేదాధ్యయనాదుల ననుష్ఠింపవలెను. ఇవ్విధముగానే ప్రవర్తించుట- శ్రేయస్కర మగును.

## ద్వాదశానువాకమున-

"శం నో మిత్రః శం వరుణః" ఇత్యాదిశాంతిపాఠమున

"అవాదిషమ్" ఇత్యాది భూతార్థక్రియల నుచ్చరించుట యను విశేషము- ఇందు గలదని గుర్తింపవలెను.

దీని యర్థము ఈవరకే వ్రాయఁబడినది.
ఇయ్యది-తైత్తిరీయోపనిషత్తుఁజెందిన శిక్షావల్లి.

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# తైత్తిరీయోపనిషత్తు

## ఆనందవల్లి

**శాంతిపాఠము**

"ఓం సహ నా వవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై తేజస్వి నావధీత మస్తు, మా విద్వి షావహై" ఓం శాంతిః శాంతిః శాంతిః.

పదార్థము- విద్యాప్రాప్తివిఘ్నములను శమింపఁజేయుటకు- విద్యాప్రారంభమున చదువఁదగిన శాంతిమంత్రము- మొదట విను పింపఁబడుచున్నయది.

విద్యచే గమ్యమానమగు దేవత—నౌ = శిష్యాచార్యులను, సహావతు=అనర్థమునుండి ఏకకాలమున రక్షించుగాక! సహనౌభునక్తు = అర్థము ననుభవింపఁజేయుగాక!

అనర్థముఁజెందకుండ కాపాడుటయే గాక అర్థము (విహితమైన ప్రాభీష్టము)ను సిద్ధింపఁజేయుగాక అని భావము.

సహ వీర్యం కరవావహై = అధ్యయనముతో అధ్యాపనము తోడను విద్యాఫలమగు సామర్థ్యమును చూపుదుము గాక! తేజస్వినా వధీతమస్తు=మా అధీతము-ఇతరులచే తిరస్కరింపఁబడని తేజస్సు గలదగుగాక! మా విద్విషావహై= మేమిద్దరము అసహనాది ద్వేషము లేక-ధర్మభంగమువలన నైన ద్వేషము లేనివారమగుదుము గాక!

ఆనందవల్లిలో తొమ్మిది అనువాకములు గలవు. మొదటి అనువాకమున-బ్రహ్మవిద్య ప్రశంసింపఁబడుచున్నయది.

''బ్రహ్మవిదాప్నోతి పరమ్''

"బ్రహ్మోపాసకుఁడు సర్వశ్రేష్ఠమైన బ్రహ్మమును పొందును" బ్రహ్మోపాసనకంటె ఇతరములైనవి అపరములనఁబడును. చేతనా చేతనముల నతిక్రమించిన బ్రహ్మము (శివు) నుపాసించుట-ఇంద్ర చంద్రాద్యుపాసనలకు నతీతమగుటచే- అట్టి యుపాసనచే పొంద బడునది బ్రహ్మంబే (శివుఁడే) నగును.

శాంభవదీక్షితుఁడై ఇష్టప్రాణ భావలింగములయందు బ్రహ్మము (శివు) నుపాసించినయెడల - ప్రారబ్ధాంతమున పొందఁబడువాడు- శివుఁడేనని సారాంశము.

"తదేషాఽభ్యుక్తా"

అట్టి బ్రహ్మముఁ గూర్చియే ఈ ఋక్కు చెప్పఁబడినది.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"

సత్యం= శాశ్వతమైన సత్త (ఉనికి) గలిగినది,

అనఁగా- అచేతనమైన ప్రకృతిని, ప్రకృతితోకూడిన జీవాత్మను అతిక్రమించునదని భావము.

జ్ఞానం = నిత్యము అసంకుచితము నగు జ్ఞానగుణము నిండి యుండునది,

ఇట్లు చెప్పుటచే-ముక్తపురుషులను మించినదని తెలియుచున్నది. ముక్తపురుషులు బద్ధదశలో సంకుచితజ్ఞానము గలవారై శివానుగ్రహమున ముక్తులై పరిపూర్ణ జ్ఞానము గలవారగుదురు గాన పరమేశ్వరుని జ్ఞానమునకు సంకోచము ఎప్పుడును లేదని తెలియవలెను.

అనంతం = దేశకాల వస్తుపరిచ్ఛేదము (అవధి కొలత) అంతమనఁబడును. అట్టి అంతములేనిదియు బ్రహ్మంబగును.

"యో వేద నిహితం గుహాయామ్"

"యః = ఎవఁడు, గుహాయాం = హృదయ గుహయందు

నిహితం = ఉన్నవానిగా, వేద = పరమేశ్వరు నుపాసించునో, పరమేవ్యోమన్ = పరమాకాశమనఁదగు దివ్యధామమున, "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా" సః = అట్టి యుపాసకుఁడు, సర్వాన్ కామాన్ = పరమేశ్వరుని సర్వజ్ఞత్వాది కల్యాణ గుణములను, సహ విపశ్చితా = సర్వజ్ఞుఁడైన, బ్రహ్మణా = బ్రహ్మముతో కూడ- అశ్నుతే = అనుభవించును".

శాంభవదీక్షితుఁడై- గుహవంటి హృదయములో పరమ ప్రకాశమగు చిదంబరమునందు భావలింగము నుపాసించుటకు మొదట ఇష్ట ప్రాణ లింగముల నుపాసించినచో- శరీర వియోగానంతరము పరిపూర్ణ జ్ఞానము గలవాడై శివానందము ననుభవింపఁ గలుగునని సారాంశము.

ఇఁక సృష్టిక్రమము నిర్దేశింపఁబడుచున్నయది. బ్రాహ్మణము నందు "బ్రహ్మవిదాప్నోతి పరమ్" ఇత్యాదిని ప్రశంసింపఁబడిన

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనుచో చెప్పఁబడిన పరమాత్మ నుండి- ఆకాశము ఆవిర్భవించినది. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి అగ్ని, అగ్నినుండి ఉదకములు, ఉదకములనుండి భూమి, భూమినుండి ఓషధులు, (వరి ధాన్యాదులు) ఓషధులనుండి అన్నము, (ఆహారము) అన్నమునుండి పురుషుఁడు ఆవిర్భవించును.

ఆ పురుషునకు- ఈ కనఁబడునదియే శిరస్సు. ఇదియే దక్షిణ (కుడి) భాగమున హస్తము, ఇదియే వామ (ఎడమ) భాగమున హస్తము, ఈ ప్రసిద్ధమైన మధ్యశరీరమే ఆత్మగా చెప్పఁబడును. ఈ పాదములే ఆధారము, ఈ శ్లోకము అన్నమయునిఁ గూర్చి చెప్పఁబడినది.

## ఇది- ప్రథమానువాకము

## ద్వితీయానువాకమున-

భూమిపై గల ప్రజలందరు అన్నమునుండియే పుట్టుచుందురు. మరియు అన్నముచేతనే జీవింతురు. చివరను అన్నము (పృథివి)నే పొందుదురు. పృథివీ సంబంధములగు వస్తువులలో అన్నమే శ్రేష్ఠమైనది. అందువలన అన్నము సర్వౌషధమని చెప్పఁబడును. అన్నమును బ్రహ్మముగా భావించువారికి- సర్వవిధమైన అన్న (ఆహార) ము సమకూరును

అన్నము బ్రహ్మమెట్లనఁగా ?

బ్రహ్మము సర్వశ్రేష్ఠమైనట్లు పృథివ్యాది పంచభూతములలో అన్నము శ్రేష్ఠమైనది. బ్రహ్మము తాపత్రయమును నివారించి సర్వౌషధమగు నట్లు అన్నము శరీరపుష్టిఁ గలుగఁజేయునదగుటచే సర్వౌషధ మగునది. అన్నము వలన ప్రాణులు జన్మింతురు.

బ్రహ్మము వలన ప్రాణుల జన్మలు సంభవించును. అన్నమునకు బ్రహ్మమునకును ప్రాణి జనకత్వము సమానమగుటఁజేసి అన్నము నందు బ్రహ్మభావనఁజేయవలెనని తెలియుచున్నది.

"అద్యతే" "తినఁబడుచున్నది" ఇతి—అన్నం, "అత్తి చ భూతానీతి" ప్రాణుల సంత్యకాలమున భక్షించును. "అనఁగా తనలో చేర్చుకొనును" గాన అన్నమని చెప్పఁబడును.

పరమాత్మనుండి ఆకాశాదిక్రమముగ జన్మించు పురుషుని *స్థూలారుంధతీన్యాయమున ప్రదర్శించుటకై మొదట పురుషుఁడు అన్నమయుఁడనియు, అన్నమును బ్రహ్మముగా భావించుటచే అన్న సమృద్ధియేగాక ప్రాణమయాదికోశక్రమమున పరమాత్మను గుర్తింపఁ గలుఁగు ననియు ఇఁట విదితమైనది.

సర్వోపాదానమగు పరమాత్మ-ఈ శరీరమునందే లోన ఉన్నవాడై అన్నరసమయుని కన్న వేరైనవాడు. అతఁడు ఎవఁడనఁగా? ప్రాణమయుఁడు.

సర్వాంతరుఁడు సూక్ష్మతముఁడు నగు పరమాత్మను ఇట్టివాడని నిర్దేశింపవలనుపడదు గాన అన్నమయునిపై నుండి బ్రహ్మదృష్టిని మరలించి-క్రమముగా ఆనందమయుఁడైన పరమాత్మయందు బ్రహ్మదృష్టిని నిలుపవలెనని-వేదపురుషుఁడు—ఒక్కొక్క కోశమును నిరూపించుచు అద్దానిపై బ్రహ్మభావన నొనర్చి-అటుపిమ్మట మరియొక

---

* స్థూలారుంధతీన్యాయమనఁగా-ఆకసమున అరుంధతీ నక్షత్రమును మొదట చూవలేక దాని ప్రక్కనుండు చుక్కలలో ఒకదాని తరువాత మరియొక చుక్కను వివాహదంపతులకు చూపెట్టి అనంతరము అరుంధతీనక్షత్రమును ప్రదర్శింపఁజేయుట యగును.

కోశముపై బ్రహ్మభావన నొనర్పవలెనని విశదపఱచుచున్నవాడు. ప్రాణమయునకు-ప్రాణము శిరస్సు. వ్యానము దక్షిణపక్షము, అపానము వామపక్షము, ఆకాశము ఆత్మ, పృథివి ఆధారంబునగును. ప్రాణము నుద్దేశించి దిగువ శ్లోకము ఉదాహరింపఁబడినది.

## తృతీయానువాకమున-

దేవతలు మనుష్యులు పశువులు ప్రాణవాయువు ననుసరించి జీవించువారు. ప్రాణమే శరీరధారిజీవాత్మలకు ఆయుష్యము. అందు వలన ప్రాణము సర్వాయుష్యమని చెప్పఁబడును.

ప్రాణము బ్రహ్మంబని భావించువారికి -పూర్ణాయుష్యము సంఘటించును.

ప్రాణమయునికన్న-మనోమయుఁడు-వేరగువాడు. మనోమయునకు—యజుర్వేదము శిరస్సు, ఋగ్వేదము-దక్షిణభాగము, సామవేదము—వామభాగము, విధినిషేధములను నిర్దేశించు ఆదేశ (అనుశాసన)ము ఆత్మ, అథర్వాంగిరస్సులచే కనిపెట్టఁబడిన మంత్రవిశేషములు-ఆధారంబునని తెలియవనెను. యజుర్వేదాదులు వాగ్రూపములైనను ఆ యా విషయములయందు మనస్సునకు జ్ఞానమును కలిగించునగుటచే-మనోమయుఁడెందియుండునని చెప్పఁబడినది.

మనోమయుఁగూర్చి—దిగవ శ్లోకము "యతో వాచో నివర్తంతే ఇత్యాదికము-ఉదాహరింపఁబడినది.

## చతుర్థానువాకమున

అనుపాసకుని వాక్కులు మనస్సుతో గూడ బ్రహ్మానందమును కనుగొనఁజాలవు. శివోపాసనసంస్కృతమైన మనస్సుతో బ్రహ్మానంద

మును గుర్తించు మహాపురుషుఁడు దేనినుండియైనను ఎచ్చోటనైనను భయపడువాడు కాడు.

మనోమయునికన్న వేరైనవాడు-విజ్ఞానమయుఁడు. విజ్ఞానమయునకు శ్రద్ధయే శిరస్సు, ఋతము-దక్షిణభాగము, సత్యము వామభాగము, ధ్యానయోగము-ఆత్మ, ధ్యానయోగమును ఘటింపఁజేయు సామర్థ్యమనఁదగు మహస్సు-ఆధారంబునగును. విజ్ఞానమయుఁగూర్చి చెగువ శ్లోకము "విజ్ఞానం యజ్ఞం తనుతే" ఇత్యాదికము-ఉదాహరింపబడినది.

## పంచమానువాకమున-

విజ్ఞానం యజ్ఞం తనుతే కర్మాణి తనుతేఽపిచ" విజ్ఞానం అనఁగా విజ్ఞాతయగు జీవాత్మ, . యజ్ఞం = యజ్ఞాది వైదికకర్మజాతమును, కర్మాణి = లౌకికకర్మలను. తనుతే = చేయువాడు.

సాత్త్వికులందరు జీవాత్మను ప్రధానమునకన్న జ్యేష్ఠునిగా భావింతురు.

ప్రకృతికంటె వేరని ఉపాసింతురని భావము. అవ్విధము ఉపాసించుటను అంత్యకాలమున మరువనిచో-ప్రారబ్ధశరీమునందు గల పాపముల నన్నిటిని పరిహరింపఁజెసికొని-శరీరవియోగానంతరము శివసముడై సత్కామితముల నన్నిటి ననుభవింపఁగలుఁగును.

అవగతపాపుఁడై నిజరూపము నావిష్కరింపఁజేసికొనినట్టి ముక్తాత్మను బ్రహ్మముగా భావింపనగును. అనఁగా-బ్రహ్మసదృశునినిగా భావింపవలెనని అర్థము.

విజ్ఞానమయునికన్న వేరైనవాడు ఆనందమయుఁడైన పరమాత్మ; ఆనందమయుఁడనఁగా- ఆనందము నిండు గల ఆనందప్రచురుఁడు, ఆనందస్వరూపుఁడై ఆనందము గుణముగా గలవాడు.

ఆనందమయునకు-ప్రియము శిరస్సు, మోదము దక్షిణభాగము ప్రమోదము వామభాగము, ఆనందము ఆత్మ, ప్రణవము ఆధారంబు నగును.

ఆనందమయుఁడైన పరమాత్మఁ గూర్చి దిగువ శ్లోకము ఉదాహరింపఁబడినది.

## షష్ఠానువాకమున-

బ్రహ్మము లేదని భావించువాడు- "అహమస్మి" "నేను ఉన్నాను" అని లోనుండి స్ఫురించుచున్నను-అట్టి స్ఫురణము ఎల్లకాలము లేనివాడగును- అందువలన అట్టి నాస్తికుఁడు పశుతుల్యుఁడై స్వర్గాది లోకములయందుగాని పరమపదమునందు గాని నిలకడ లేనివాడగును.

బ్రహ్మము (పరమాత్మ)కలదని భావించువానిని-కాలక్రమమున స్వర్గాదులయందు ప్రతిష్ఠ గలవానిగాను ఈ లోకమున సంపూర్ణస్థితి గలవానిగాను విద్వాంసులు చెప్పుదురు. బ్రహ్మోపాసకుఁడు పరమ పదముఁజేరి ఎట్లుండును? మరియు కామితముల నన్నిటి ననుభవించునా? అనునవి ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు సమాధానముఁ జెప్పఁదలచి-మొదట బ్రహ్మము ఎట్టిదో నిరూపింపఁబడుచున్నయది.

"సోఽకామయత బహు స్యాం ప్రజాయేయేతి"

అన్నమయాదికోశాంతరుఁడు ఆనందమయుఁడు నగు పరమాత్మ అధికముగా విస్తరింతునని సంకల్పించెను. పరమేశ్వరుని బహుభవనము-బౌద్ధులు చెప్పెడు ఆభాసమాత్రము కానిదై-"బహ్వీవ" "అనేకమువలె" అని గాక "బహు" అని యుండుటచే-వాస్తవంబగునని తేటపడుచున్నయది

నామరూపవిభాగార్హమగుటయే-సూక్ష్మము స్థూలమగుట-యను అర్థము గలదై బహుభవనమగుచున్నది.

ఈ లోకమున గలదంతయు పరమేశ్వరుని బహుభవనములో చేరినదేను, బ్రహ్మము బాగుగా విచారించి ప్రపంచమును నిర్మించి యందు ప్రవేశించెను. తత్పూర్వము సూక్ష్మజగద్వ్యాపకుఁడై-సృష్ట్య నంతరము స్థూలజగత్తున చొరఁబడెనని భావము.

బ్రహ్మప్రవేశానంతరము జగత్తు-చేతనము అచేతనము అనునవి కలది కాగా-చేతనునకు అచేతనము ఆధారమయ్యెను. ఎల్లకాలము ఏకరూపముగనుండుటచే చేతనము సత్యమైనది. వికారాస్పదమగుటఁ జేసి అచేతనము అనృతమని చెప్పఁబడును. చేతనాచేతనములలో బ్రహ్మము ప్రవేశించినను చేతనాచేతనములఁ జెందిన వికారములకు లోను కాదు.

బ్రహ్మమును యథార్థముగ గుర్తించు జ్ఞానులు-ఆకాశాది పంచ మహాభూతములు, దేవమానవాది ప్రాణిజాతంబు-బ్రహ్మవ్యాప్తము లగుటచే-సత్యములనియు, శాస్త్రదృష్టిచే సమస్తము బ్రహ్మంబేననియు నిరూపించుచున్నవారు.

బ్రహ్మమే అనేకవిధముల విభక్తమైనది అను నర్థముఁ గూర్చి దిగువ "అసద్వా ఇద మగ్ర ఆసీత్" ఇత్యాదికమగు శ్లోకము ఉదాహ రింపఁబడినది.

## సప్తమానువాకమున-

అసత్కార్యవాదమును నిరాకరించి-సత్కార్యవాదమును నిరూ పించుటను ఇందు గాననగును

అసత్ = నామరూపవిభాగము లేనట్టి జగత్తు,
సత్ = నామరూపవిభాగము గల ప్రపంచము.

ఈ దృశ్యమాన ప్రపంచము-సృష్టికి పూర్వము అసత్తుగా నుండెను. సృష్టిప్రారంభమున సత్తుగా పరిణమించినది. బ్రహ్మమే అసత్తుగా సత్తుగా నుండుట-సుకృతమనఁబడును. ఏకైకకర్తృతమగుటచే అనాయాసముగ సిద్ధించుటఁజేసి సుకృతమైనది. పరమేశ్వరుఁడు— జగత్సృష్ట్యాదులఁ జేయుచున్నను ఆనందమయుఁడుగానే ఉండును. శివోపాసకుఁడు ఆనందమయుఁజేరియే ఆనందము గలవాడగును.

ఈ హృదయములో నుండు చిదాకాశము ఆనందమయుని నివాసము కానిచో ఎవఁడు ఐహికసుఖములకై జీవింపఁగలుఁగును? ఎవఁడు స్వర్గాదిసుఖములననుభవింపఁ గలుగును? ఈ ఉపాసకుఁడు ప్రాకృతచక్షురగోచరుఁడు, ప్రాకృతశరీరరహితుఁడు, నామజాత్యాదులు లేనివాడు, నిరాధారుఁడు నగు పరమేశ్వరునియందు సంపూర్ణనిష్ఠగలవాడగుచో సంసారభయము లేనివాడగును. ఒకవేళ సంపూర్ణనిష్ఠకు భంగము కలుగునేని సంసారభయము గలవాడగును.

"యన్ముహూర్తం క్షణం వాఽపి-మహాదేవో న చింత్యతే,
సా హాని స్తన్మహచ్ఛిద్రం-సా భ్రాంతిః సాచ విక్రియా"

"ప్రతిదినము ముహూర్తకాలము గాని క్షణకాలము గాని పరమేశ్వరుని ధ్యానింపకుండుటయే-హాని, మహాఛిద్రము, భ్రాంతి, వికారంబునగు" అను అభియుక్తసూక్తి-ఇందుకు ప్రామాణికమగుచున్నయది. ఆనందమయుఁ గూర్చి దిగువ "భీషాఽస్మాద్వాతఃపవతే" ఇత్యాది శ్లోకము ఉదాహరింపబడినది.

## అష్టమానువాకమున-

ఆనందమయుఁడగు సదాశివునివలన నైన భయముతో వాయువు వీచును. ఆనందమయునకు వెఱచియే సూర్యుడు_సకాలమున ఆకాశమున నుదయించును. ఆనందమయునకు భయపడి అగ్ని దేవేంద్రుఁడును తమ కర్తవ్యములను నిర్వహింతురు. ఐదవదగు మృత్యుదేవత ఆనందమయుని భీతివలన తొట్రుపాటులేనిదై తన కర్తవ్యమునకై పరుగిడును.

ఇది_ఆనందమయుని వైభవము. ఇఁక ఆనందమయుని ఆనందము ఎట్టిదో దిగువ నిరూపింపఁబడుచున్నది. మొదట మనుష్యానందము నిర్దేశింపఁబడుచున్నయది. యువకుఁడు యువకులకు బుద్ధిఁగఱపు ప్రజ్ఞగలవాడు, నిరోగి, బలిష్ఠశరీరుఁడు మానసిక స్థిమితము గలవాడు, విత్తపూర్ణమైన భూమిమొత్తమునకు ప్రభువగు చక్రవర్తియు నగునేని-ఇట్టి యువకుని ఆనందము_మనుష్యానందమగును. అట్టి మనుష్యానందమునుగూడ_అకామహతుఁడైన శ్రోత్రియుఁడు-జీవితకాలమున చవిఁజూచును.

మనుష్యానందమునకన్న నూరురెట్లు అధిక్యము గల ఆనందము తపోబలముచే దైవశక్తిని సంపాదించిన మనుష్యగంధర్వులదగును. ఇదియు శ్రోత్రియుని అనుభవములో చేరును. మనుష్యగంధర్వానందమునకన్న నూరురెట్లు ఆధిక్యముగల ఆనందము దేవగంధర్వులదగును. దీనినిగూడ శ్రోత్రియుఁడు తన జీవితములో రుచిఁజూచును.

శ్రౌతస్మార్తకర్మల నాచరించి స్వర్గమున దేవతలగువారు ఆజానజుఁలనఁబడుదురు. ఆజానజుల ఆనందము దేవగంధర్వా

నందముకన్న నూరురెట్లు మించినదై ఆకామహతుఁడైన శ్రోత్రియుని అనుభవములో చేరును.

ఆ జానజుల ఆనందమునకన్న-స్వర్గదేవతల ఆనందము నూరు రెట్లు మించినదై -శ్రోత్రియానుభవపాత్రమగును. దేవతల ఆనంద మునకంటె ఇంద్రుని ఆనందము, ఇంద్రానందమున కన్న బృహ స్పత్యానందము, బృహస్పత్యానందనమునకంటె చతుర్ముఖ బ్రహ్మానందము నూరేసి రెట్లు మించినవై -శ్రోత్రియని శివధ్యానము నందు అనుభవమునకు వచ్చును.

ఇఁక బ్రహ్మ (శివా) నందము-చతుర్ముఖ బ్రహ్మానందమున కంటె నూరురెట్లు మించినదై ఏకవిధముగా నుండునది.

ఇఁట 'ఏకః" అనుదానికి "నిరతిశయము'' అనునర్థముఁ జెప్ప వలెను. దేనికంటె గొప్పది లేదో అది నిరతిశయ మనఁబడును. మనుష్యానందము మొదలుకొని-చతుర్ముఖ బ్రహ్మానందము వరకు ఎనిమిది ఆనందములఁ జెప్పి-తొమ్మిదవ ఆనందము-తొమ్మిదివందల రెట్లు అధికమగునని చెప్పునెడ-బ్రహ్మానందము-నిరవధికము (అవధి లేనిది) కాదు గాన ''ఏకః'' అనుపదము ఉపయోగింపఁబడినదని తెలియవలెను.

షష్ఠానువాకమున ''విద్వా నముం లోకం ప్రేత్య కశ్చన సమ శ్నుతే" ఇత్యాదిని గల ప్రశ్నలకు సమాధానము ఇఁట చెప్పఁబడినది.

సూర్యునిలో నుండు సదాశివుఁడు పురుషుని హృదయగుహలో నివసించు పరమాత్మ-ఒకఁడేను.

ఇట్టి శివుఁ జెందువాడు-ఈ లోకమునుండి బయలుదేరి-అన్న మయకోశాధిష్ఠాతయగు సద్యోజాతబ్రహ్మముఁజేరును. అటుపిమ్మట

ప్రాణమయకోశాధిష్ఠాతయగు వామదేవుని సమీపించును. ఆ తరువాత మనోమయకోశాధిష్ఠాతయగు అఘోరు నాశ్రయించును. తదనంతరము విజ్ఞానమయకోశాధిష్ఠాతయగు తత్పురుషు నవలంబించును. అటు పిమ్మట—ఆనందమయుఁడగు ఈశాను (సదాశివు)నిఁ జేరును. ఆనందమయుఁడగు ఈశాను (సదాశివు)నిఁ జేరును. ఆనందమయుఁడైనట్టి, సద్యోజాతాదిపంచబ్రహ్మలయొక్క సమష్టిస్వరూపుడైనట్టి సదాశివునకు "బ్రహ్మపుచ్ఛం ప్రతిష్ఠా" అనుచో గల బ్రహ్మశబ్దమునకు "శివుఁడు" అను నర్థముఁ జెప్పవలెననియు, శివుఁడు-సదాశివునకు ఆధారమనియు శ్రీ నీలకంఠ భగవత్పాదులు-తమ బ్రహ్మసూత్ర భాష్యమున నిర్వచించిరి.

ఇట్టి శివుఁగూర్చి దిగువ "యతో వాచో నివర్తంతే" ఇత్యాదికమగు శ్లోకము ఉదాహరింపఁబడినది.

## నవమానువాకమున—

"యతో వాచో నివర్తంతే-అప్రాప్య మనసా సహ,
ఆనందం బ్రహ్మణో విద్వాన్-న బిభేతి కుతశ్చన"

ఇత్యాది

అనుపాసకుని వాక్కులు మనస్సుతో సహ బ్రహ్మానందమును కనుగొనలేనివై మరలివచ్చును. ఉపాసకుఁడు—వేదశాస్త్ర ఆచార్యోపదేశ సంస్కృతములైన వాక్కులతో, శివధ్యాననిమగ్నమైన మనస్సుతోడను బ్రహ్మానందమును గుర్తించినవాడై దేనివలనను భయపడువాడు కాడు.

ఉపాసకుని నిర్భయస్థితి ఎట్టిదనఁగా?

"నేను పుణ్యము నాచరింపలేదు. పాపము నొనర్చితిని" ఇత్యాది మనోవ్యథలు-శివోపాసనసిద్ధుని బాధింపవు. పుణ్యము స్వప్రయోజనము, పాపము అనర్థప్రదము" అని భావింపనివాడై తనను రక్షించుకొనును.

ఇట్లు ఎవఁడు తెలిసికొనునో వాడు ముక్తుఁడగును.

ఇయ్యది-తైత్తిరీయోపనిషత్తుఁ జెందిన ఆనందవల్లి.

---

## జీవాత్మ-జాగ్రద్దశనుండి సుషుప్తి (గాఢనిద్ర)వరకు వెళ్ళునట్టి విధానము

ఇదే ఉపనిషత్తున.జీవాత్మ-అన్నమయకోశమనఁదగు స్థూలశరీరమునుండి ప్రాణమయకోశమగు సూక్ష్మశరీరముఁజెంది స్వప్నముల గాంచినవాడై మనోమయకోశమగు హృదయమునఁ ప్రవేశించి విజ్ఞానమయకోశమునందు విశ్రాంతిఁజెంది ఆనందమయకోశమున సదాశివలింగముతో నేకీభవించి సుషుప్తిఁ(గాఢనిద్రఁ)జెందును. ఇట్లు ఐదుకోశములలో సంచరించినను సదాశివుని గుర్తింపఁజాలనందున-స్థూలశరీరములోనికి వచ్చేసి మేలుకొని-ప్రారబ్ధ గత సుఖదుఃఖముల ననుభవించుచుండును. శివోపాసకుఁడు ఇట్టి గమనాగమనములను గుర్తించినచో ప్రారబ్ధాంతమున ముక్తుఁడగునని-నిర్వచింపఁబడినది.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# తైత్తిరీయోపనిషత్తు

## భృగువల్లి

"సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై । తేజస్వి నా వధీత మస్తు, మా విద్విషావహై" ఓం శాంతిః శాంతిః శాంతిః.

"భృగుర్వై వారుణిః, వరుణం పితర ముపససార । అధీహి భగవో బ్రహ్మేతి" ఇతి ప్రారంభః.

వరుణదేవుని కుమారుఁడైన భృగువు-తండ్రియగు వరుణుని సమీపించి- భగవానుడా! బ్రహ్మమును గురించి ఉపదేశింపుమని ప్రశ్నించెను.

భృగువునకు వరుణుఁడు-అన్నము ప్రాణము మనస్సు విజ్ఞానము అనునవి బ్రహ్మలక్షణము గలవని "యతో వా ఇమానిభూతాని జాయంతే-యేన జాతాని జీవంతి-యత్ ప్రయంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ! తత్ బ్రహ్మేతి" "దేనివలన నీ ప్రాణులు జన్మించునో, జన్మించిన ప్రాణులు జీవించుచున్నవో, ప్రళయమున దేని నాశ్రయించునో, మోక్షమున దేనిని పొందునో, దానిని తెలిసికొనుము!

అద్ది బ్రహ్మంబగు" ఈ వాక్యముతో సందిగ్ధముగా చెప్పెను. అంత భృగువు-వరుణోక్తము విశదము కానందున-తపస్సు అనఁగా శివ ధ్యానము నొనర్చి-

## ఇది-ప్రథమానువాకము

అన్నము బ్రహ్మంబని తెలిసికొనెను. ఎందుకనఁనా? అన్నము వలన ప్రాణులు జన్మించుటయు జీవించుటయు చివరన అన్నము (పృథివి) నాశ్రయించి అందు లీనమగుటయు ప్రసిద్ధములు గదా! అవ్విధము అన్నము బ్రహ్మంబని భావించియు తృప్తిఁజెందనివాడై భృగువు వరుణుని సమీపించి బ్రహ్మముఁ గూర్చి ఉపదేశింపుమని మరల ప్రశ్నించెను.

తపస్సు నొనర్చి బ్రహ్మమును గుర్తింపుమని వరుణుఁడు ఆదేశింపగా-భృగువు తపించి-

## ఇది-ద్వితీయానువాకము

ప్రాణమువలననే ఈ ప్రాణులన్నియు జన్మించుటయు, జీవించుటయు, చివరన ప్రాణముతో ఏకీభవించుటయు, అను బ్రహ్మలక్షణములు కలవు గాన-ప్రాణమును బ్రహ్మముగా భావించియు మనస్సు కుదుటపడకుండుటచే-మరల-పితయగు వరుణునిఁజేరి "భగవానుఁడా! బ్రహ్మముఁ గూర్చి యాదేశింపుమని ప్రార్థించెను.

తపస్సుచే బ్రహ్మమును గుర్తింపుమని వరుణుఁడు నిర్వచింపగా భృగువు తపించి-

## ఇది-తృతీయానువాకము

మనస్సునందు బ్రహ్మలక్షణములు పొడగట్టుటచే-మనస్సును

బ్రహ్మముగా భావించియు-స్థిరపడనివాడై మరల వరుణుని ప్రశ్నింపగా-తపింపుమని-వరుణుని యుపదేశముఁబొంది తపించి-

## ఇది-చతుర్థానువాకము

జీవాత్మద్వారా ప్రాణులు జన్మించుట మొదలగు బ్రహ్మలక్షణములు గోచరించుటఁజేసి-జీవాత్మనే బ్రహ్మముగా భావించి కొంత తడవునకు జీవాత్మ-బ్రహ్మము కాదని గుర్తించి వరుణుని దరిఁజేరినవాడై బ్రహ్మోపదేశమును చేయుమని ప్రార్థింపగా-వరుణుఁడు తపించుమని-ఆజ్ఞాపింప-భృగువు తపించి-

## ఇది-పంచమానువాకము

అన్న ప్రాణ మనో విజ్ఞానములకు మూలము, ఆనందమయుఁడు నగు పరమాత్మవలననే-ప్రాణులు జన్మించుటయు, జీవించుటయు, అంత్యకాలమున ఆనందమయు నాశ్రయించి ఏకీభవించుటయు వాస్తవములుగ కలవని గుర్తించి-ఆనందము బ్రహ్మంబని భావింపగా-భృగువునకు-పరనిర్వృతి కలుగుటచే-మరల వరుణు నాశ్రయింప లేదు.

భృగువునకు సంబంధించిన ఈ వారుణీవిద్య-పరమాకాశ మనఁదగు ఆనందమయుడైన పరమాత్మయందే నిలచియున్నది. ఇట్లు గుర్తించు మహాపురుషుఁడు ఆనందమయుని చెంతఁజేరి-మరలిరాడు.

అన్నాదిక్రమముగ బ్రహ్మమును భావించువాడు-అన్నసమృద్ధి గలవాడై అన్నము ననుభవించు సామర్థ్యము గలవాడగును. వ్యాధి రహితుఁడై ప్రదీప్తజఠరాగ్ని గలవాడగు నని భావము. సంతానముచే పశువులచేతను బ్రహ్మవర్చస్సుతోడను గొప్ప వాడగును. కీర్తి చేతను శ్రేష్ఠుఁడగును.

## ఇది-షష్ఠానువాకము

ముందు ఉంచఁబడిన అన్న (ఆహార)మును నిందింపఁగూడదు. ఎందుకనఁగా? అన్నము-బ్రహ్మముగ నుపాసించువానికి-మొదటి ఆధారము. ప్రాణము అన్నము కాగా—శరీరము ప్రాణరూపమగు అన్నము ననుభవించును. అందువలన ప్రాణము శరీరము నీ రెండు ఒకదానిపై మరియొకటి-ఆధారపడియున్నవని తెలియవలెను. ఇట్లు గుర్తించువాడు-అన్నసమృద్ధి గలవాడై అన్నమును జీర్ణింపఁజేసికొనఁగలుఁగును. సంతానముచే పశువులచేతను అధీతవేదమువలననైన వర్చస్సుతోడను గొప్పవాడగును.

## ఇది-సప్తమానువాకము

పాత్రయందు ఎదురుగాపెట్టఁబడిన శుద్ధఆహారము-రుచికరము కాకున్నను నిరాకరింపఁగూడదు- ఇది-ప్రాణ శరీరములను అన్నముగా అన్నాదునిగాను భావిందువానికి వ్రతమగును. ఉదకము అన్నము కాగా—అన్నమును భక్షించునది-జ్యోతిస్సు(అగ్ని)యగును. ఉదకములను జ్యోతిస్సు ఆశ్రయించునది తథైవ జ్యోతిస్సునందు ఉదకములు ఆధారపడియున్నవి ఇట్లు భావించువాడు-అన్నవంతుఁడై అన్నాదుఁడగుటయే గాక-ప్రజాపశుబ్రహ్మవర్చఃకీర్తులతో గొప్పవాడగును.

## ఇది-అష్టమానువాకము

అన్నమును శ్రేష్ఠముగ భావించుట-ఉదకాగ్నులను అన్నఅన్నాదులుగ గుర్తించువానికి వ్రతమగును.

పృథివి—అన్నము, ఆకాశము అన్నాదము, పృథివియందు

ఆకాశము, ఆకాశమునందు పృథివి ప్రతిష్ఠితములగునవి. ఇట్లు భావించువాడు—అన్నసమృద్ధి గలవాడై అన్నమును జీర్ణింపఁజేసికొన నర్హుఁడు, ప్రజాపశు బ్రహ్మవర్చః కీర్తులతో శ్రేష్ఠుఁడునగును.

## ఇది-నవమానువాకము

దశమానువాకమున ఆరు వాక్యములు గలవు.

పృథివి నన్నముగా ఆకాశము నన్నాదముగ భావించువానికి—దిగువ చెప్పఁబడినది-వ్రతమగును.

తన ఇంటికి వచ్చినవానిని—నివసించుటకై-నిరాకరింపఁగూడదు. మరియు బదులుచెప్పక-భోజనమునిడవలెను. ఇట్టి అతిధికొరకు—ఏదేనొక విధముగ ఆహారము నొనఁగూర్పవలెను. గృహస్థుఁడు స్వగృహమున సిద్ధపఱచిన ఆహారము-అతిథికొరకే నని భావింపవలెను. భూమియందు నిష్పన్నమగు ఆహారమంతయు అతిథ్యభ్యాగతుల కొరకే నని భావించినయెడల-నవ్వారిని ఆదరించుటలో బాధయుండదని భావము.

## ఇది-మొదటివాక్యము

తన ఇంటికి వచ్చిన అతిథులను అన్నదానాదులతో సత్కరింపవలెనని ఆవశ్యము గుర్తింపవలెను.

శరీర ప్రాణ జల తేజః పృథివ్యాకాశములు ఉపాసింపఁదగినవని వక్కాణించి-ఇఁట-శరీరానుబంధము గల వాగాదులు, జలానుబంధము గల వర్షము, తేజోనుబంధము గల విద్యుదాదులు, పృథివ్యనుబంధములగు పశ్వాదులు ఆకాశమున్ను ఉపాస్యములుగ నిర్దేశింపఁబడినవి. ఎట్లనఁగా?

వాక్కునందు క్షేమమును, ప్రాణాపానములయందు యోగ క్షేమములను, హస్తములందు క్రియను, పాదములయందు గమనమును, ఉపస్థ గుదములయందు (పాయువునందు) విసర్జనమును భావించి పాటించుట మానవసంబంధమైన ఉపాసనంబగును.

యజ్ఞసాధనములగు పశువులయందు కీర్తి గలదనియు, వర్షమునందు తృప్తి గలదనియు, విద్యుత్తు బలప్రదమనియు, నక్షత్రములయందు జ్యోతిస్సు గలదనియు ఉపస్థమునందు సంతానము త్యాగము ఆనందమున్ను కలవనియు, సమస్తంబు ఆకాశమునందు కలదనియు భావించుట దైవిక ఉపాసనంబగును.

ఆకాశము సమస్తమునకు ఆధారమని భావించువాడు–శాశ్వత ప్రతిష్ఠ గలవాడగును.

ఆకాశము మహస్సని భావించువాడు–గొప్పవాడగును. ఆకాశము మననసాధనగుణవిశిష్టమని భావించు వ్యక్తి– సర్వత్ర గౌరవింపఁబడును.

"తన్నమ ఇత్యుపాసీత"

ఆకాశశబ్దవాచ్యమగు హృదయగుహాగతమైన చిదాకాశమునందు నివసించుచు చిదాకాశముతో నేకీభవించు శివునకు నమస్కారము అని యుపాసింపవలెను. అనఁగా "ఓం నమఃశివాయ" అను మహామంత్రమును జపించుచు "శివోఽహం" అని శివుని ధ్యానింపవలెను. ఇట్లు జపించుచు ధ్యానించువానికి–కోరికలన్నియు నమ్రములై ముందునకు వచ్చును.

చిదాకాశము బ్రహ్మంబని యుపాసింపవలెను. అట్టివానికి బ్రహ్మము సన్నిహితంబై ప్రకాశించును. ఆకాశము–సంహారసాధనం

బగు వాయువని యుపాసించువానిని—ద్వేషించువారు, అప్రియులైన పాలివారు మరణింతురు. అనఁగా ఇట్టివానికి శత్రుజయము సంసిద్ధ మగునని భావము.

అన్నమయాది కోశాధిష్ఠాతలకంటె విలక్షణుఁడు ఆనంద మయుఁడు సూర్యమండలాంతర్వర్తియు నగు పరమేశ్వరుని-జప ధ్యానాదులతో సాక్షాత్కరింపఁజేసికొనవలెనని వివేకము.

## ఇవి—రెండవ మూడవ నాలుగవ వాక్యములు

ఇవ్విధము భావించువాడు-అవసానకాలమున ఈ లోకమునుండి బయలుదేరి-అన్నమయాధిష్ఠాతను, ప్రాణమయాధిష్ఠాతను,మనోమయా ధిష్ఠాతను చేరినవాడై ఆనందమయాధిష్ఠాతయగు పరశివు నాశ్ర యించినతఱి-ఈ లోకములన్నిటియందు ఇష్టమైన కామ్యము నను భవించుచు స్వేచ్ఛారూపములతో విహరించును- సామగానముఁ జేయును-

## ఇది-ఐదవవాక్యము

ఆవిర్భూత స్వరూపుడైన ముక్తాత్మ-ఇట్లు భావించును. అన్నము నేను, అన్నాదుడను నేను, స్వర్గాదినిర్మాణము నేను, మొదట పుట్టిన బ్రహ్మదేవుఁడు నేనే, మోక్షమునకు ఆశ్రయము—నేను, దేవతలందరి కంటె ముందున్నవాడను నేనే, నన్ను గురించి ఎవఁడు ఉపకరించునో ఆ యుపకారము గూడా-నేనే, ప్రళయకాలమున ఈ బ్రహ్మాండ మును సంహరించుతఱి సాక్షిగా నుండువాడను నేనే, ఇట్లు శివో పాసనమున భావించువాడు సువర్ణజ్యోతివలె ప్రకాశించు దివ్యరూపము గలవాడగును. ఇట్లు భార్గవీవిద్య-ముగిసినది

## ఇది-ఆరవవాక్యము, దశమానువాకమున్ను,

## తైత్తిరీయోపనిషత్తు-సమాప్తము.

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# ఐతరేయోపనిషత్తు

శ్రీ నీలకంఠీయ భాష్యమునకు, శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రీయ సంస్కృతవ్యాఖ్యానమునకు-శ్రీ నిర్మల శంకర శాస్త్రీయమగు

## శివతత్త్వప్రభాఽఽంధ్రీకరణము

ఈ యుపనిషత్తునందు మూడు అధ్యాయములు, ప్రథమాధ్యాయమునందు మూడు ఖండములు గలవు.

### ప్రథమాధ్యాయగత-ప్రథమఖండమున

సృష్టికి మున్ను పరమేశ్వరుఁడు-సూక్ష్మచిదచిద్విశిష్టుడై ఒకడే ఉండెను. పరమేశ్వరునకు భిన్నమైన నామరూపవిభాగార్హమగునది ఏదియు లేకుండెను.

ఇట్టి పరమాత్మ-సృష్టికాలమున లోకములను పుట్టింతునని సంకల్పించెను. సంకల్పమాత్రమున లోకములు సంసిద్ధములయ్యెను. సర్వజ్ఞుఁడు సర్వశక్తి సంపన్నుఁడు సర్వవిధ అనుకూల్యవంతుఁడు నగు శివుని సంకల్పము-వెనువెంటనే ఫలించును గదా!

అంభఃశబ్దితమగు ద్యులోకము, ద్యులోకముపై లోకములు, మరియు అంతరిక్షము, అంతరిక్షమందు ప్రకాశించు సూర్యాదికిరణములు, మరణధర్మము గల భూలోకము క్రిందనుండు పాతాళములు ఆవిర్భవించినవి.

సృజింపఁబడిన లోకములకు లోకపాలురను పుట్టించవలెనని బ్రహ్మము సంకల్పించి-వెనువెంటనే-పంచీకృతములైన పృథివ్యాది మహాభూతములనుండి పురుషుని పుట్టించి పురుషునందు తన యంశమగు జీవాత్మను ప్రవేశింపఁజేసి పురుషుని పెంపొందించెను. జీవాత్మ ప్రవేశము లేనిచో శరీరము క్షీణించును. అట్టి జీవాత్మసమష్టిరూపుఁడగు పురుషుఁడు-హిరణ్యగర్భుఁ (బ్రహ్మదేవుఁ) డగును.

అట్టి పురుషుని-పరమాత్మ తన సంకల్పము ననుసరించి లోకపాలాది నిర్మాణకారణముఁగ నానర్చెను. పక్షి శిశువు బయటపడుతఱి-గ్రుడ్డు పగిలినట్లు-పురుషుని నోరు తెరువఁబడెను. ముఖము నుండి వాక్కు, వాక్కునుండి అగ్ని, ముక్కురంధ్రములనుండి ప్రాణము, ప్రాణమునుండి వాయువు, కనులనుండి నేత్రగోళము, నేత్రగోళమునుండి ఆదిత్యుఁడు, చెవులనుండి శ్రోత్రము, శ్రోత్రము నుండి దిశలు, చర్మనుండి వెంట్రుకలు, వెంట్రుకలనుండ ఓషధివనస్పతులు, హృదయమునుండి మనస్సు, మనస్సునుండి చంద్రుఁడు, నాభినుండి అపానము, అపానమునుండి మృత్యువు, (యముఁడు) శిశ్నమునుండి రేతస్సు, రేతస్సునుండి ఉదకాభిమానియగు దేవతయుద్భవించిరి.

ఇట్లు లోకములయొక్కయు, లోకపాలురయొక్కయు సృష్టిని నిరూపింపఁబడినది.

## ఇది-ప్రథమాధ్యాయగత ప్రథమఖండము

### ద్వితీయఖండమున-

అగ్న్యాది లోకపాలురు—జన్మించి-పురుషాధిష్ఠితమగు సంసార సముద్రమునందు నిమగ్నులైరి. పురుషుఁడు-ఆకలిదప్పులు గల వాడు కాగా-లోకపాలురుగూడా ఆకలిదప్పులచే బాధపడుచు "మాకు నివాసము నేర్పరిచినచో అందు నిలకడఁజెంది ఆహారపానీయములను స్వీకరింతు" మని పరమేశ్వరుని ప్రార్థించిరి.

అంత పరమేశ్వరుఁడు ఆవురూపము గల పిండమును వారి ముందుంచెను. ఇది మాకు చాలదని లోకపాలురు నుడువగా—వారి కొరకు అశ్వ (గుఱ్ఱ)మును ముందుంచెను. అశ్వమునకు వివేకము ఉండదుగాన—ఇదియు వలదనిరి.

ఆ పిదప పరమేశ్వరుఁడు పురుషుని చూపగా-లోకపాలురు సంతోషించి—బాగుబాగు అని పలికిరి. గో అశ్వాదులు-తిర్యక్ జంతువు లగుటచే—పురుషాశ్రయము సమంజసంబని భావించిరి. ఇప్పటికిని-పురుషజన్మతోడనే సుకృతములను సాధించుటను చూచుచున్నాము గదా!

పరమేశ్వరాజ్ఞననుసరించి- వాక్కు- నధిష్ఠించి ముఖమునందు, వాయువు ప్రాణరూపమున నాసిక (ముక్కు) యందును, సూర్యుఁడు-నేత్రగోళమై కనులయందును దిశలు- శ్రోత్రమై చెవులలోను, ఓషధివనస్పతులు వెంట్రుకలై చర్మయందును, చంద్రుఁడు- మనో రూపమున హృదయమునందు, మృత్యువు అపానమై నాభియందును, ఉదకములు రేతస్సుగా శిశ్నమునందును, ప్రవేశించిరి. (నవి)

మాకు ఆహారపానీయముల నేర్పరచుమని అగ్నివాయువులు-ఈశ్వరుని ప్రార్థింపగా- దేవతలకు మానవులు సమర్పించు హవిస్సులలో మీకు భాగముండునని పరమేశ్వరుఁడు వక్కాణించెను.

ఇది ప్రథమాధ్యాయగత-ద్వితీయ ఖండము

## తృతీయ ఖండమున-

లోకములకు లోకపాలురకును ఆహారమును సృజింతునని పరమేశ్వరుఁడు సంకల్పించి- ఆవిరితో ఉదకముల నుడికించి గట్టిపఱచియు- ఆహారముగ పరిణమింపఁజేసెను. అయ్యది-మానవులు మార్జారమూషకాదులును స్వీకరింపఁదగియుండెను. కాని అన్నము మానవాదులఁ జూచి భయపడెను.

వాక్కు-, ఘ్రాణము, నేత్రము, శ్రోత్రము, త్వక్కు-, (చర్మము) మనస్సు, శిశ్నము, అనువానితో అన్నము నాస్వాదించుటకు మానవాదులు చేసిన ప్రయత్నము ఫలింపలేదు. ప్రాణవృత్తి విశేషమగు అపానము- ముఖముద్వారా గ్రహింపగా- అన్నము సర్వేంద్రియ పరిపోషకమయ్యెను.

అందువలన-అపానము - అన్నవాయువుగ ప్రసిద్ధమైనదనియు, ప్రాణము అపానము ఒకటేయగుటఁజేసి- అన్నము లేనిచో ప్రాణము నిలువదనియు గుర్తింపవలెను.

ఇవ్విధము పరమేశ్వరుఁడు- ఇంద్రియములతో కూడిన శరీరము గల ప్రాణిజాతమును పుట్టించి- ఈ ప్రాణులు- "నేను లేనిది పూర్ణస్ఫూర్తిఁ జెందఁజాలవని" ఆలోచించియు ఏ ఇంద్రియ ద్వారమున నేను ప్రవేశింపవలెను? అని కొంత తడవు దిగువవిధము విచారించెను.

వాక్కు మాటలాడుచుండును, ప్రాణవాయువు జీవనకర్త యగును. కన్ను చూచుచుండును. చెవి వినుచుండును. త్వక్కు తాకుచుండును. మనస్సు సంకల్ప వికల్పములఁ జేయును. అపానము క్రిందికి ప్రసరించును. శిశ్నము విసర్జించుచుండును. గాన వీని ద్వారా శరీరమునఁ బ్రవేశింపరాదు. అందువలన వాగాది విలక్షణుఁడైన జీవాత్మ నధిష్ఠించి ఇందు ప్రవేశము నొనర్తును.

పరమేశ్వరుఁడు ఇట్లు విచారించి-పిండాత్మక శరీరసీమయగు శిరస్సును భేదించి- సుషుమ్నానాడి ద్వారా జీవాత్మను శరీరమునఁ బ్రవేశింపఁజేసి- వెనువెంటనే తాను చొఱఁబడినవాడు. శిరో ద్వారము- విదృతి యనియు, ఆనందమయుఁడైన పరమాత్మఁ జెందించునదగుటచే నాందనమనియు వ్యవహరింపఁబడును. ఇతర ద్వారములు- దుఃఖజనకములగు వాగాదులచే ప్రవేశింపఁబడుటచే దుఃఖమయములగునవి.

జీవాత్మ ననుసరించి దేహముఁజెందిన పరమాత్మ-జీవుని జాగ్రదవస్థయందు నేత్రమున, స్వప్నావస్థయందు కంఠమున, సుషుప్తిలో హృదయాకాశమున నివసించును. అనఁగా-జీవాత్మ అనుభవించు సుఖ దుఃఖములకు తాను సాక్షియై ఉండునని తెలియవలెను.

ఇట్లు జీవాత్మద్వారా శరీరముఁబ్రవేశించిన పరమాత్మ- మానవాది శరీరేంద్రియములు తనకు ఉపయోగించునవిగ - అనఁగా- స్వయము నారాధింప నర్హములు కావలెనని నిశ్చయించెను. నేను వ్యాపించిన జగత్తున నాకంటె నితరుఁడెవఁడు ప్రవర్తింపఁగలుగునని భావించెను.

శరీరగతములగు వాగాదీంద్రియములను అవ్వాని నధిష్ఠించిన

జీవాత్మను పరమాత్మ గమనించి- ఈ జీవాత్మద్వారా-భాషణ దర్శన శ్రవణ స్పర్శాదులను నేనే చేయుచున్నానని భావించెను.

"కర్తా భోక్తా మహేశ్వరః" అను సుభాషితము ఇఁట నిదర్శన మగుచున్నయది.

ఎందువలన చరాచరము నంతర్యామిగ ప్రవేశించి సమస్తము- నవలోకించునో, అందువలన పరమేశ్వరుఁడు-ఇంద్రుఁడని-పరోక్షముగ నిర్దేశింపఁబడుచున్నవాడు. "పరోక్షప్రియా ఇవ హి దేవాః" అను వాక్యము- పరమేశ్వరాద్యమరులు- పరోక్షము (చాటు)న కీర్తింపఁబడినచో మానవులకు ప్రియులగుదురు" అని నిర్ధారించినది.

తృతీయఖండముతో ప్రథమాధ్యాయము సమాప్తము.

## ద్వితీయాధ్యాయము-

ప్రథమాధ్యాయమునందు - పరమాత్మ - సమష్టిపురుషుఁడు మొదలుకొని దేవాది వ్యష్టి పురుషులవరకు ఈ జగత్తును పుట్టించి అందు ప్రవేశించినవాడని చెప్పఁబడినది.

ఇఁక నీ యధ్యాయమున- పరమేశ్వరు నుపాసింపనివారికి- దుఃఖభూయిష్ఠమగు జన్మపరంపర తప్పదనియు, పరమేశ్వరుని పూజా జప ధ్యానముల నారాధించువారికి- శివసాయుజ్యము- సంఘటిత మగుననియు నిరూపింపఁబడుచున్నయది.

కర్మగతిచే ఈ లోకమునుండి పరలోకములకు, పరలోకముల నుండి భూలోకమునకు గమనాగమనములఁ జేయు పురుషుఁడు- మొదట గర్భమగును- గర్భమునకు కారణము రేతస్సగునది.

జీవాత్మ- భుక్తశేషమగు కర్మతో పరలోకమునుండి యీ

లోకమునకు వర్షము మొదలగువాని ద్వారా అన్నమును సంక్రమించి- భుక్తాన్నపరిణతమగు రేతస్సుఁగలిసి- కాబోవుజన్మనారంభించు గర్భమునందు నివసించును.

అట్టి రేతస్సు - సర్వవిధములైన అన్నరసములయొక్క- సారాంశముగ పరిగణింపఁబడుచున్నది. జీవాత్మ- శరీరమునందే గర్భమున రేతస్సుద్వారా ప్రవేశించును. స్త్రీ యోనియందు విడువఁబడిన రేతస్సు- తనను మరల పుట్టించును. ఈ రేతఃసేకమే ప్రథమ జన్మయనఁబడుఁగును.

యోని యందు విడువఁబడిన రేతస్సు గర్భమై- స్త్రీ శరీరమునకు భిన్నము గానిదై- కడుపులో కలిసియుండుటఁజేసి- స్త్రీని బాధింపనిదగును. భర్త- తన కడుపులో నివసించుచున్నాడని- భార్య భావించును. అందువలననే- తన గర్భమును సముచితాన్నరసములతో పోషించుకొనునని- తెలియవలెను.

ఇట్లు గర్భమును పోషించు భార్యను భర్త- కాపాడవలెను. పిమ్మట- జనకుఁడు— కుమారుఁడు జన్మించినంతనే జాతకర్మాది సంస్కారములతో అధికము సంతృప్తిఁ జెందించును.

జనకుఁరు కుమారు నభినందించుటలో- తనను తానే అభినందించుట- ఇమిడియున్నది. తానే భార్యయందు కుమారుఁడై జన్మించుననుట. పరమార్థమగునని గుర్తింపవలెను.

లోకములు ప్రాణులతో ఎడతెగక నుండుటకు ఈ పుత్ర జననము ఉపయుక్తంబగునది. ఇట్లే పుత్రులు పౌత్రులను పౌత్రులు ప్రపౌత్రులను కనుట- సృష్టిక్రమమును కొనసాగించునదగుచున్న యది తల్లిగర్భమునుండి విడిబడుట- రెండవజన్మయగును.

సహింపరాని దుఃఖములకు నిలయములగు గర్భజన్మలు దిగువ విధము నిరూపింపఁ బడుచున్నవి. ఎట్లనఁగా ? ప్రథమ గర్భమగు రేతస్సు- మలమయసారమై అస్పృశ్యంబునని తేటపఱచి- మల సారమగు రేతస్సు- పురుషుని శరీరమందు ఉండుననియు, ఆ తరువాత మలమూత్రమయమగు స్త్రీ శరీరమున- శుక్లశోణిత మేళన రూపమైన గర్భముగ నుండుననియు, ఆ పిదప స్త్రీ యోనినుండి అతికష్టముగ బయలుపడుననియు విశదీకరింపఁబడినది.

ఇవ్విధము గుర్తించువాని మనస్సు ఎట్లు ఊఱటఁజెందును ? అనఁగా- జననము అతిదుఃసహంబని- జన్మరాహిత్యమునకై పాటు పడవలెనని- భావము.

కుమారుఁడు జన్మించి పెంపొందినవాడై తండ్రి చేయగా మిగిలిన క్లేశకరములైన పనుల నొనర్పవలసియుండును. మరియు జన్మించిన కుమారుఁడు- విహితములైన పుణ్యకర్మలఁ జేయుటకు జనకుని స్థానము నాక్రమించును.

జనకునిచే నిర్దేశింపఁబడిన కర్తవ్యములను నిర్వహించిన కుమారుఁడు- పెద్దవాడై (ముదుసలియై) మరణించి రెండవ మాన వాది శరీరమునఁ బ్రవేశించును. ఇది- మూడవజన్మ యగును.

ఇవ్విధము శివునుపాసింపనివానికి- జన్మచక్రమునందు పరిభ్ర మించుటతో అనర్థశతాకులము అశుభైకాస్పదము నగు దుఃస్థితి సంభవించునని- వైరాగ్యమునకై చెప్పఁబడినది.

ఇప్పుడీ వాక్యమున- శివోపాసనమునందు ప్రవర్తించుటకై శివోపాసనముచే విముక్తిఁ దెలుపుచు శ్రుతి- ఆత్మనిష్ఠుఁడైన మహర్షి యొక్క- వచనము ననువదించినది. ఎట్లనఁగా ?

"నేను గర్భమునందుండియే అగ్న్యాది దేవతలయొక్క జన్మలను, గవాదిప్రాణుల నవ్వారి అన్నాదిఓషధుల ఉత్పత్తిని, మరియు జీవాత్మకు సంభవించు లోకపాలాది జన్మల నన్నిటిని గుర్తించితిని. ఇట్టి విజ్ఞానము కలుగుటకు మున్ను- లోహమయ శృంఖలముల వలె నభేద్యములు అనేక భోగోపకరణ సంపన్నములు నగు దేహములు- వానినుండి విడిబడకుండునట్లు నన్ను నిర్బంధించినవి. అనంతరము శివానుగ్రహమువలన శివోపాసనమనఁదగు లింగ ధారణదీక్షా పురస్సరముగ విజ్ఞానము సంభవించినందున- డేగపక్షి- వేగముగ పరుగెత్తినట్లు- లోహమయ శృంఖలములనఁదగు దేవాది శరీరముల నిర్బంధమునుండి బయటపడితిని" వామదేవుఁడను ఋషి- గర్భమునందుండియే ఇట్లు నిర్వచించెను.

"స ఏవం విద్వానస్మా చ్ఛరీరభేదా దూర్ధ్వం
ఉత్క్రమ్యాముష్మిన్ స్వర్గే లోకే సర్వాన్ కామా
నాప్త్వాఽ మృతః సమభవత్"

ఇట్లు వామదేవుని వచనము ననువదించి- శ్రుతి- స్వయం- దిగువవిధము నిర్వచించినది.

"ఆ వామదేవుఁడు- ఇట్లు లోక లోకపాలాది సృష్టిని, మరియు సృష్టిఁజేయు పరమాత్మను సాక్షాత్కరింపఁజేసికొని- ప్రారబ్ధ శరీరవియోగానంతరము అర్చిరాదిగతిని నిష్క్రమించియు దుఃఖము బొత్తుగా లేనిది, అప్రాకృతంబు నగు శివలోకముఁ జేరినవాడై పరమేశ్వరునితో గూడ సర్వకామావాప్తి యనఁదగు శివానందము ననుభవించుచు పునరావృత్తి రహితుఁడునై యుండెను."

ద్వితీయాధ్యాయము సమాప్తము.

## తృతీయాధ్యాయము-

దేవ మనుష్యాదులను పుట్టించువాఁడు, దేవ మనుష్యాది సంపన్న మగు ప్రపంచమున జీవాత్మ ద్వారా ప్రవేశించినవాఁడును పరమేశ్వరుఁడేను, అట్టివాని నుపాసించి గుర్తింపని వారికి— గర్భ జన్మాది క్లేశము సంభవించును. శివు నుపాసించి దర్శించువారికి— జన్మ రాహిత్య మొదవును అని ద్వితీయాధ్యాయమున నిర్వచింపఁబడినది.

ఇఁక నీ యధ్యాయమున-

పరమాత్మ నుపాసించుటకంటె నితరము శ్రేయస్కరము కాదని. శాస్త్రాచార్యోపదేశముచే గుర్తించినవారు- పరమాత్మ ఎట్టివాడు ? ఈ శరీరమున ప్రాణము, చక్షురాదికము, వీనిని గమనించు విజ్ఞానమయుఁడగు జీవాత్మయు ఉన్నవారు- వీరిలో పరమాత్మ యెవరని తమలో తాము చర్చించి—మేము ఎవరిని "సోఽహం" అని ఉపాసించుచున్నామో ఆతఁడే పరమాత్మ ఐ యుండవలెనని నిశ్చయించుకొనిరి.

మరియు నిట్లు భావించిరి—

"ఎవఁడు చూచుచున్నాడో, వినుచున్నాడో, గంధముల నాఘ్రాణించుచున్నాడో, అట్టి ద్రష్ట, శ్రోత, ఆఘ్రాతయగు విజ్ఞానమయుఁడైన జీవాత్మ- పరతంత్రుఁడై స్వతంత్రముగ దర్శనాదులను చేయఁజాలఁడు. జీవాత్మను ప్రేరేపించి దర్శనాదులను చేయించువాఁడు మరియొకఁడు ఉండవలెను."

హృదయము నాశ్రయించి జీవాత్మ-దర్శనాదులఁజేయును గాన ఇఁట జీవాత్మభిన్న మైనది-హృదయమై ఉండవలెనను ఆ శంకకు సమాధానమేమనఁగా?

చక్షురాదులవలె హృదయము. దర్శనాదులకై జీవాత్మకు ద్వార మగును-పరమాత్మ-చేరువలేవిచో-హృదయాదులు జడములై స్వయం ప్రవర్తింపఁజాలవు. క్షేత్రజ్ఞుడైన జీవుని వెంటాడువాడు సర్వజ్ఞుఁడు సర్వస్వతంత్రుఁడునగు పరమాత్మవలననే దర్శనాదులు ఘటించును. అందువలన మనఃసమన్వితమగు హృదయము, చక్షురాది ఇంద్రియములును పరమాత్మయే నని గ్రహింపవలెను.

తెలివి, ఆదేశము, విశేషజ్ఞానము, శాస్త్రజన్యజ్ఞానము, గ్రంథార్థమును నిర్ణయించు నైపుణ్యము (మేధ)ఇంద్రియార్థజ్ఞానము, ధైర్యము మననము, మననసామర్థ్యము, దుఃఖము, స్మృతి, సంకల్పము, ఉపాసన, జీవింపఁజేయు చైతన్యము, ఇంద్రియసుఖాపేక్ష, పరవశత్వముచే జ్ఞానసంకోచము, ఇవన్నియు జ్ఞానపరిపూర్ణుఁడైన పరమాత్మ యొక్క గుణ(శేష)ములగునట్టివి.

ఈయుపనిషత్ ప్రారంభమున "ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్" "పరమాత్మ ప్రపంచము పృథక్సిద్ధములు కావనియు, పరమేశ్వరుఁడే సృష్టికాలమున ప్రపంచముగ పరిణమించెననియు, చెప్పఁబడినది. అద్దాని నిఁట శ్రుతి వివరించుచున్నది.

బ్రహ్మదేవుఁడు, దేవేంద్రుఁడు, ప్రజాపతి, దేవతలందరు, పంచ మహాభూతములు, (పృథివి, వాయువు, ఆకాశము, ఉదకములు, అగ్ని), యోనిజములు అయోనిజములు నగు క్షుద్రప్రాణులు, (బ్రహ్మాది దేవదృష్టితో పరిశీలించినచో మానవజన్మ-మశకమువలె-క్షుద్రంబగునది). అండజములు, జరాయుజములు నివి-యోనిజము లనఁబడును-స్వేదజములు ఉద్భిజ్జములును అయోనిజములగునవి.)

సర్వవిధబీజములనుండి జన్మించిన పురుషులు, గజములు,

అశ్వములు పక్ష్యాదులు నీ పరమేశ్వరుఁడేను. తరుగుల్మాది—స్థావరము లును పరమాత్మయేను ప్రజ్ఞానపరిపూర్ణుఁడైన పరమాత్మప్రపంచము నధిష్ఠించియుండుకతన జగత్కర్తయు ఈశ్వరుఁడే నని నిర్వచింపఁ బడినది.

ప్రపంచము జన్మస్థితిలయములఁ జెందుతఱి—పరమేశ్వరు నాశ్రయించియే యుండును. జీవాత్మలందరికి—సర్వార్థప్రకాశనము నుహాదేవునివలననే జరుగుచుండును.

సర్వాత్మాధారమగు బ్రహ్మము-జ్ఞానమయమైనదను నంశమును "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను శ్రుత్యంతరవాక్యము సమ ర్థించుచున్నయది. స్వయంప్రకాశమానుఁడగు పరమాత్మయొక్క స్వరూపము—జ్ఞానమనుటయే సమంజసమగును.

జ్ఞానస్వరూపుఁడు పరమాత్మ అని చెప్పినంతమాత్రమున—సత్త్వమునకు ఆనందమునకును పరమాత్మలో తావు లేదని భావింప రాదు-సర్వజ్ఞుఁడగుటచే జ్ఞానమయుఁడని నిర్దేశము.

పూర్వము ప్రశంసింపఁబడిన వామదేవర్షి-పరమాత్మతో ఏకీ భవించి-ఈ లోకమునుండి పరమపదముఁజేరి-ఆవిర్భూత నిజస్వరూ పుఁడై బ్రహ్మముఁడగు సకలకామావాప్తిరూపమగు నిరతిశయానం దము ననుభవించుచు జరామరణరహితుఁడయ్యెను.

ఐతరేయోపనిషత్తు

సమాప్తము.

శ్రీ మహాగణాధిపతయే నమః
శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# శ్వేతాశ్వతరోపనిషత్తు

## శివతత్త్వ ప్రభాఽఽఽంధ్రీకరణము

ఈ ఉపనిషత్తును శ్వేతాశ్వతమహర్షి-బ్రహ్మవిదుల పరామర్శతో ప్రారంభించెను. ఇందు 110 వాక్యములు 6 అధ్యాయములు గలవు.

### ప్రథమాధ్యాయమునందు-మొదటివాక్యమున-

బ్రహ్మవిచారపరులగు మహర్షులు-ప్రత్యక్షముగ గోచరించు నీ జగత్తునకు కారణముగ ప్రతిపాదింపఁబడు శివాఖ్యమగు బ్రహ్మము ఎట్టిది? అథవా జగత్తునకు బ్రహ్మము-నిమిత్త కారణమా? ఉపాదాన కారణమా? నిమిత్తోపాదానోభయకారణమా? దేవమానవాది శరీర ధారులు-దేనినుండి జన్మించిరి? దేనినాశ్రయించి జీవించుచున్నారు? దేనియందు ఆధారపడియున్నాము? ఎవనిచే సుఖముల ననుభ వింపఁజేయు వ్యవస్థ-ఏర్పాటు చేయఁబడినది?

### రెండవవాక్యమున-

"సర్వాధారః కాలః" అను న్యాయము ననుసరించి జగత్కార ణము కాలమా? పాంచభౌతికములగు పదార్థములా? పూర్వాపూర్వ

కృతమగు కర్మయా? ఆకస్మికముగ నేర్పడుటయా? పంచమహా భూతములా? పురుషుఁడా? ఈ యన్నిటి కలయికయా? ఇట్లు విచారించి వీనిలో ఆత్మభావము లేమిని ఇయ్యవి జగత్కారణములు కావనియు, జీవాత్మ-పరతంత్రుఁడై సుఖదుఃఖభోక్త యగుటచే జగత్కర్త కాదనియు నిశ్చయించుకొనిరి.

మూడవ వాక్యము-

"తే ధ్యానయోగానుగతా అపశ్యన్-దేవాత్మశక్తిం
స్వగుణై ర్నిగూఢాం,
యః కారణాని నిఖిలాని తాని-కాలాత్మయుక్తా న్యధి
తిష్ఠత్యేకః"

బ్రహ్మవిచారపరులగు మహర్షులు—లోలోన పలుతెఱఁగుల విచారించినను జగత్కారణమెద్దియో కనుగొనఁజాలనివారై-చిత్తైకాగ్ర్యము అను శివధ్యానయోగము నవలంబించి-గుణములు తనలో దాగియున్నట్టి పరమేశ్వరుని స్వరూపమగు చిచ్ఛక్తిని జగత్కారణముగ కనిపెట్టిరి. శక్తికి శక్తిమంతుఁడైన శివునకు పృథక్భావము(భేదము) లేనందున శివునకును జగత్కారణత్వము సంఘటించునది.

శివుఁడు— కాలము జీవాత్మ మొదలగు తాత్కాలిక జగత్కారణములను ఒకడే అధిష్ఠించియుండుటఁజేసి-శివుఁడే జగన్నిమిత్తోపాదానకారణ మగువాడని నిశ్చయించుకొనిరి.

చిచ్ఛక్తియే ప్రకృతిగా పరిణమించినదై సత్త్వరజస్తమో గుణములను బయలుపఱచి జగత్తును నిర్మించునని "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతి-వక్కాణించుటచే-ప్రకృతి యనఁబడు చిచ్ఛక్తి

జగదుపాదానకారణమనియు, "మాయినం తు మహేశ్వరం" అనుచో మహేశ్వరుఁడు-జగన్నిమిత్తకారణమనియు ఇందు విదితమైనది. శక్తి శివులు ఒకటే నగుటచే చిచ్ఛక్తిఁదగు ఉపాదానకారణత్వము శివునకు సంక్రమించునని తెలియవలెను.

4 వ వాక్యమున-

ఇఁట పరమాత్మ-శకటచక్రము (బండి గీర) వలెనున్నాఁడని జిజ్ఞాసువులు సులభముగా తెలిసికొనవలెనని యుద్దేశించి-శ్వేతాశ్వతర మహర్షి దిగువవిధము వివరించుచున్నవారు.

చక్రమునకు ఒకే మధ్యభాగమున్నట్లు-మాయా ప్రకృతి అవిద్య యను శబ్దములతో చెప్పఁబడు శక్తి-సంసారచక్రమునకు ఆధారముగ నుండును. అట్టి, సత్త్వరజస్తమోగుణములతో కూడినట్టి, పంచభూతములు ఏకాదశేంద్రియములు అను పదునారు చివరగా గలిగినట్టి తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము, అనువాని భేదములు-గీరియొక్క ఆకులుగా గలిగినట్టి. ఎదురుఆకులఁ బోలిన బంధములు ఇరువది గలిగినట్టి, ఆరు అష్టకములతో కూడినట్టి, నానారూపమగు కామము పాశముగా గలిగినట్టి, ధర్మ అధర్మ జ్ఞానములనఁబడు మూడు త్రోవలు గలిగినట్టి, పుణ్యపాపములఁజెందిన మోహము, ఆత్మలుకాని దేహేంద్రియ మనోబుద్ధి జాత్యాదులయందు ఆత్మలు అను అభిమానము, ఈ రెంటికి నిమిత్తమగు మోహము గలిగినట్టి సంసారచక్రమున భ్రమించువారు-కథంచిత్-పరశివాఖ్యబ్రహ్మమును గుర్తింపవలెనని ఇందు విదితమైనది.

అష్టప్రకృతులయందు ఆత్మభావనలు తమస్సుయొక్క భేదములు, అణిమాదిశక్తులు-మోహగతములైన భేదములగునవి. శబ్దాది

పంచవిషయములపై దృష్ట అదృష్టములగు అంశములయందును అభినివేశము మహామోహమనఁబడును. పూర్వోక్తములైన దశవిధాంశముల విషయమై అష్టైశ్వర్యములతో ప్రయత్నించువానికి-అవి సిద్ధింపకుండునెడ-సంభవించు క్రోధము-తామిస్రమనఁబడును.

అష్టవిధ ఐశ్వర్యములు పది విషయములు అనుభవింపఁబడుచుండగా-అర్ధమున-మృత్యువుఁ జెందుతఱి కలుగు శోకము-అంధతామిస్రమనఁబడును.

1. భూజలాగ్ని వాయ్వాకాశమనోబుద్ధ్యహంకారములు-అష్టప్రకృతులు.
2. త్వక్ చర్మమాంస రుధిర మేదోఽస్థిమజ్జాశుక్రములు-అష్టధాతువులు.
3. అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వము అనునవి............అష్టఐశ్వర్యములు.
4. ధర్మ జ్ఞాన వైరాగ్య ఐశ్వర్య అధర్మ అజ్ఞాన అవైరాగ్య అనైశ్వర్యములు.......................అష్టభావములు.
5. బ్రహ్మ ప్రజాపతి దేవ గంధర్వ యక్ష రాక్షస పితృ పిశాచములు-అష్టదేవజాతులు.
6. దయ క్షమ అనసూయ శౌచము అనాయాసము మంగళాకాంక్ష అకార్పణ్యము అస్పృహ యనునవి-అష్ట ఆత్మగుణములు.

చక్రాకారముగ నిరూపింపఁబడిన బ్రహ్మము-నదీరూపముగ ఐదవ వాక్యమున-ప్రతిపాదింపఁబడుచున్నది.

నేత్రము మొదలగు ఐదు జ్ఞానేంద్రియములు-ఉదకముగా గల

దియు, పృథివ్యాది పంచమహాభూతములు అను కారణములతో భయంకరము సుందరంబు నగునదియు, పంచకర్మేంద్రియములు తరంగములుగా గలదియు, చక్షురాదీంద్రియజ్ఞానములయొక్క కారణమగు మనస్సు మూలముగా గలదియు, ఐదు శబ్దాదివిషయములు ఆవర్తము (సుడు)లుగా గలదియు, గర్భజన్మజరావ్యాధి మరణములు అను ఐదు దుఃఖములు ప్రవాహవేగముగా గలదియు, అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశములు అను ఐదు పర్వములుగా గలదియు నగు నదీరూపమున నుండు బ్రహ్మమును ధ్యానయోగమున స్థూలముగ నుపాసింతుము.

సర్వవ్యాపకము, సర్వాత్మకము, అమూర్తంబు నగు పరశివ బ్రహ్మమును చక్రాకారముగాను నదీరూపముగాను సుఖముగా తెలియుటకు నిరూపించి—ఇట్టి బ్రహ్మచక్రమునందు జీవాత్మ-పరిభ్రమించుచు సుఖదుఃఖాదికము నెందుకు అనుభవించును? బ్రహ్మచక్రమునుండి ఎట్లు విడిబడును? అను ప్రశ్నలకు ఆరవ వాక్యమున దిగువవిధము సమాధానము చెప్పఁబడినది.

చరాచరప్రాణులను సంపూర్ణముగా జీవింపఁజేయునట్టి సమస్త ప్రాణులను లయింపఁజేయునట్టి, గొప్పదైన బ్రహ్మమనెడు చక్రమునందు జీవాత్మ—జననమరణాదులతో తిరుగుచుండును. ఎప్పుడైతే తనను ప్రేరేపించు పరమాత్మ-తనకంటె వేరు కలదని భావించునో, అప్పుడు పరమాత్మచే అనుగ్రహింపఁబడినవాడై ముక్తుండగును.

"పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా-జుష్టస్తతస్తేనామృతత్వమేతి" అను ఆరవ వాక్యముఁదగు ఉత్తరార్ధము పై విషయమును విశదపఱచినది.

7 వ వాక్యమున-

ఇవ్విధము పరశివబ్రహ్మము నిరూపింపఁబడినది. అట్టి బ్రహ్మము నందు భోక్త, భోగ్యము, ప్రేరిత, అను మూడు ఆధారపడియున్నవి. ఇదియే సర్వాధారమగు అక్షరతత్త్వము. బ్రహ్మమునందు గల భోక్తృ భోగ్యప్రేరితృ భేదమును బ్రహ్మవిదులు గుర్తించి-జన్మజరా మరణములనుండి విముక్తులై శివసాయుజ్య (శివసమత్వ)మును పొందినవారు.

8 వ వాక్యమున-

మహత్తత్త్వము మొదలుకొని పృథివివరకు గల తత్త్వములు-వ్యక్తములనఁబడును. మూలకారణమగు ప్రకృతి-అవ్యక్తమనఁబడుఁ గును. ప్రకృతి-తత్త్వములతో కూడి ప్రపంచమును పుట్టించును. ప్రపంచమున చొఱఁబడిన జీవాత్మ అక్షరుఁడు కాగా-ప్రకృతి క్షర మనఁదగును. వ్యక్తము అవ్యక్తము నగు విశ్వమును ఈశ్వరుఁడు భరించు (పోషించు)ను.

ఇందుకు గీతాప్రమాణము-

శ్లో॥ క్షరః సర్వాణి భూతాని-కూటస్థోఽక్షర ఉచ్యతే ।
ఉత్తమః పురుషస్త్వన్యః-పరమాత్మేత్యుదాహృతః ॥

పంచమహాభూతాదులు క్షరములు కాగా-శరీరములో నున్నట్టి జీవాత్మ-అక్షరుఁడనఁబడుఁగును. క్షరాక్షరులకంటె వేరైన ఉత్తమ పురుషుఁడు-పరమాత్మయని ఉదాహరింపఁబడును.

జీవేశ్వరులు చేతనత్వమున సమానులైనను ఈశ్వరుఁడు స్వతంత్రుఁడగుటచే నియామకుఁడగుననియు, జీవుఁడు పరతంత్రుఁ

దగుటఁజేసి—ఈశ్వరునిచే నియమింపఁబడి- కర్మఫలము ననుభవించువాడగుననియు విదితము కాగా-పూర్వపుణ్యబలమున నీ జన్మయందు శాంభవదీక్షఁబరిగ్రహించి-ఇష్టప్రాణభావలింగాత్మకుఁడగు శివు నుపాసించినచో-ఆణవ మాయిక కార్మిక పాశములతో విడిబడి-శివసాయుజ్యము నొందునని - ఇందు విశదమైనది.

శిరస్సునందు భావలింగముగ, హృదయమున ప్రాణలింగముగ, భ్రూమధ్యలో ఇష్టలింగముగ ప్రకాశించు శివుని శాంభవదీక్షితుఁడు ధ్యాన జప పూజనములతో ఆరాధించుట-శివోపాసనమనఁబడును. గురూపదిష్టమైన ప్రణవసహిత శివపంచాక్షరీ మహామంత్రమును నిరంతరము మానసికముగా జపించుటచే అంతఃకరణము ప్రసన్నమై విశ్వమును ఆత్మీయముగా ప్రేమించు సామర్థ్యము కలుగును. జీవుఁడు అంగమనియు, శివుఁడు లింగమనియు, అంగలింగసామరస్యమే శాంభవదీక్ష యనియు, వేధామన్త్రక్రియాత్మకమగు శాంభవదీక్షచే ద్విజుఁడు—సంస్కరింపఁబడినవాడై నిర్మలుఁడునై-శివధ్యానము వలన శివానుగ్రహపాత్రుడై భావలింగముతో ఏకీభవించి శివానందము ననుభవింపఁగలుగునని వివేకము.

9 వ వాక్యమున-

జీవేశ్వరులు ప్రకృతియు జన్మలేనివై నిత్యములగునవి. ప్రకృతి—భోక్తయగు జీవునితో భోగ్యములగు శబ్దాదివిషయముల తోడను నిండియుండును. జీవేశ్వరులలో జీవుఁడు-పరతంత్రుడుగాను ఈశ్వరుఁడు-ప్రకృతిపురుషులను శాసించు స్వతంత్రుఁడుగాను పేర్కొనఁబడుదురు. పరమాత్మ-సర్వవ్యాపకుఁడు, విశ్వరూపుఁడగు విభువు, పుణ్యపాపములఁ జేయనివాడగుటచే కర్మఫలభోక్త కాడనియు ప్రకృతిని జీవుని ఈశ్వరు నీవిధముగా వేరువేరని భావించు

మహాపురుషుఁడు-ప్రారబ్ధాంతమున-ఆనందమయుఁడైన పరమశివుని పొందఁగలుఁగు ననియు తెలియవలెను.

## 10 వ వాక్యమున-

"క్షరం ప్రధాన మమృతాక్షరం హరః-క్షరాత్మానా
వీశతే దేవ ఏకః, తస్యాభిధ్యానాత్ యోజనాత్ తత్త్వ
భావాత్-భూయశ్చాంతే విశ్వమాయానివృత్తిః"

పదార్థము. ప్రధానం = ప్రకృతి, క్షరం = వికారములతో మార్పుఁజెందునది, మలపాశమును హరించుటచే హరుఁడని చెప్పఁబడునట్టి, భావప్రాణఇష్ట లింగరూపములు గలయట్టి పరమేశ్వరుఁడు అమృతాక్షరం = అమృతుఁడు అక్షరుఁడు నగును. ఇట్టి పరమేశ్వరుఁడొకఁడే-క్షరాత్మానౌ = ప్రకృతి పురుషులను, ఈశతే = శాసించుచున్నవాఁడు.

అమృతుఁడనఁగా-జరామరణాదులు లేని మృత్యుంజయుఁడు,
అక్షరుఁడనఁగా-వినాశము లేనివాఁడు,

తస్య = సూక్ష్మశరీర గతమైన హృదయమునందు ప్రకాశించునట్టి అంగుష్ఠమాత్రుఁడైన, ప్రాణలింగమునగు, చిన్మయుఁడునైన పరమేశ్వరునియొక్క, అభిధ్యానాత్ = నిరంతరము చింతించుటవలన, యోజనాత్ = భ్రూమధ్యయందు ఇష్టలింగరూపముతో ఆనందమయుఁడైన పరమాత్మను నిత్యము సంబంధించియుండుటకై స్థూలదేహమునందు యావజ్జీవము అర్చనార్థము ధరించుటవలన; తత్త్వభావాత్ = శిరస్సున సహస్రారకమలమునందు అనాయాసముగ విహరించు భావలింగమనఁదగు పరమాత్మతో సమరసభావముఁజెందుట వలనను; విశ్వమాయానివృత్తిః = సమస్తమును వ్యాపించునట్టి,

సత్త్వరజస్తమోగుణాత్మికయగు, బ్రహ్మము నాశ్రయించునట్టి, జీవాత్మను మోహింపజేయు మాయాశక్తి-బొత్తుగా-తొలఁగును.

"మం శివం పరమం బ్రహ్మ-అయతీతి స్వభావతః,
మాయేతి ప్రోచ్యతే లోకే-బ్రహ్మనిష్ఠా సనాతనీ"
శివాగమము.

"మం = పరమశివ బ్రహ్మమును, స్వభావతః అయతీతి = సహజముగా పొందియుండునది గాన-లోకమునందు-మాయ అని చెప్పఁబడుచున్నది. అయ్యది బ్రహ్మమునందు నిష్ఠ గలదై-నిత్యురాలగునది"

"అనన్యా శ్చింతయంతో మాం-యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం-యోగక్షేమం వహామ్యహమ్"
భగవద్గీత.

ఇఁట నిత్యాభియుక్తులనఁగా-నిత్యాభియోగ (నిరంతరసంబంధ)ము గలవారను అర్థము వ్యక్తమగును. ఇట్టి నిరంతర సంబంధము-శివలింగధారణము వలన సిద్ధించునది.

ఒక పర్యాయము ఉపాసించినంతమాత్రమున శివసాయుజ్యము లభింపదు గాన నీ వాక్యమున "భూయః" అను పదము-పునఃపునః నిత్యము శివు నుపాసింపవలెనని తెలుపుచున్నయది.

## 11 వ వాక్యమున-

10 వ వాక్యమున చెప్పఁబడినట్లు అమృతాక్షరుఁడు, దివ్యప్రకాశుఁడు. లీలార్థము జగద్వ్యాపారముఁజేయువాఁడు, పరశివ బ్రహ్మంబు నగు శివలింగమును ధ్యానించినచో-బంధహేతువులగు

అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశములనఁబడు పంచక్లేశములు పూర్తిగా నశించును.

ఇట్లు మలపాశరూపములగు క్లేశములు క్షీణించుటతో-జనన మరణాత్మక సంసారచక్రభ్రమణము-నివారించును. సంసార చక్రభ్రమణ నివృత్తి వలన ఏమగుననఁగా?

ఇష్టప్రాణభావలింగాత్మకుఁడగు పరమేశ్వరుని నిరంతరము ధ్యానించుటవలన- ఏతచ్ఛరీరవియోగసమనంతరమే దివ్యశరీరము నందు 10 వ వాక్యమున మూడవదిగా ప్రోక్తమగు తత్త్వభావము అనఁగా విశ్వైశ్వర్యము (శివస్వరూపము) లభించును.

ఇందుకు ఋగ్వేదమంత్రము ప్రోద్బలకముగ గమనార్హము.

"పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే-ప్రభుర్గాత్రాణి
పర్యేషి విశ్వతః, అతప్తతనూ ర్న తదామోఽశ్నుతే"

అర్థము-బ్రహ్మణస్పతే=చతుర్ముఖబ్రహ్మాధిపతీ! తే=నీయొక్క, స్వరూపము వితతం= విస్తృతము. పవిత్రంబునగు శివలింగమగును. ప్రభుః= సర్వరక్షణసమర్థుఁడవైన నీవు, గాత్రాణి = స్థూల సూక్ష్మకారణశరీరములను, విశ్వతః పర్యేషి= ఇష్టప్రాణభావలింగ రూపమున అంతట వ్యాపించియుందువు.

అతప్తతనుః= శాంభవదీక్షచే తపించిన శరీరము లేనివాడు, (దీక్షారహితుఁడు) ఆమః= అపక్వశరీరుఁడై, తత్= లింగస్వరూపమును నాశ్నుతే=ఆనందానుభవరూపమున పొందఁజాలడు. శాంభవ దీక్షితుఁడు-ఇష్టప్రాణభావలింగస్వరూపుఁడగు శివు నుపాసించినచో ప్రారబ్ధాంతమున అర్చిరాదిమార్గమున పరమపదముఁజేరి కేవల శివ స్వరూపుఁడై కామ్యసమష్టియగు శివానందము ననుభవించును.

## 12 వ వాక్యమున

జీవాత్మలో నున్నట్టి ఈ పరశివాఖ్య బ్రహ్మమే-నిత్యము ఉపాసింపఁదగినది. ఎందుకనఁగా? ఈ శివునికంటె వేరైనది తెలియఁదగినది ఏదియు లేదు.

తమ హృదయములో గల జీవాత్మయందు నివసించువానిగ పరమాత్మను శివయోగులు గాంచుచుందురు.

"శివమాత్మని పశ్యంతి-ప్రతిమాసు న యోగినః" శివధర్మోత్తరము. తమ హృదయమందు ప్రాణరూపమున విరాజమానుడైన సదాశివుని గాంచుచు శివాభిన్నమగు శివానందమును శివయోగులు అనుభవింతురు. శివలింగాదులను పూజించిన ఫలము-శివయోగులకు అంతః శివదర్శనముననే లభించుటఁజేసి "ప్రతిమాసు న యోగినః" అను సూక్తి-నిర్వచింపఁబడినది. బీజమునందు అంకురము వలె-ఆత్మలో శివుఁడు దాగియుండును.

"బీజే యథాంకురః సిద్ధ-స్తథాఽఽత్మని శివః స్థితః" సిద్ధాంతశిఖామణి. శివుని గుర్తించినచో సమస్తచరాచరము తెలియునని "ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" అను శ్రుతివాక్యము ధృవపఱచినది.

"యత్ జ్ఞాత్వా నేహ భూయోఽన్యత్-జ్ఞాతవ్యమవశిష్యతే" అను భగవద్గీతావచనము ఇదే విషయమును సమర్థించినది.

ఎట్లు తెలిసికొనవలె ననఁగా?

భోక్త యగు జీవాత్మ, భోగ్యమగు అచేతనప్రకృతి, ప్రేరేపించు ఈశ్వరుఁడు నీ ముప్పిధంబును బ్రహ్మంబని భావింపవలెనని బ్రహ్మవిదులు బాగుగా నిరూపించియున్నవారు.

బ్రహ్మమొకటే-భోక్తృ భోగ్యప్రేరయితృరూపముననుండునని

భావము "విశ్వం భూతంభువనం చిత్రం-బహుధాజాతం జాయమానం చయత్, సర్వోహ్యేషరుద్రః" "భూతము భవిష్యత్తు వర్తమానము విచిత్రము బహుభంగిమలచే ఆవిర్భవించునదియు నగు ప్రపంచము సమస్తమున్ను పరమేశ్వరుఁడేను" అని "సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇత్యాదిశ్రుతులు నిర్ధారించినవి.

## 13 వ వాక్యమున-

వహ్నియోనియగు అరణిఁజెందిన అగ్నియొక్క రూపము-మథనమునకు మున్ను కనుపడదు. కాని రెండు కఱ్ఱల ఒరిపిడితో ఆవిర్భవించు వేడి నశింపదు. అట్టి అగ్ని-జన్మస్థానమగు అరణి యందు ఆవిర్భవించి నేత్రగోచరమగును.

మథనమునకంటె పూర్వము అగ్ని గోచరింపకుండుట, మథనా నంతరము అగ్ని లభించుటయు ఈ రెంటివలె-దేహమునందు గల జీవాత్మపరమాత్మలు-ప్రణవముతో-లేక-ప్రణవసహిత శివపంచాక్షర మహామంత్రముతో గ్రహింపఁబడుదురు. మరియు పరమాత్మ సాక్షాత్క రించువరకు ప్రణవసహిత పంచాక్షరమును మానసికధ్యానరూపముగ జపింపవలసియుండును.

ఇఁట ఉభయశబ్దమును అగ్నిపరముగా, జీవేశ్వరపరముగాను వ్యాఖ్యానింపవలెను.

## 14 వ వాక్యము

"స్వదేహ మరణిం కృత్వా-ప్రణవం చోత్తరారణిం,
ధ్యాననిర్మథనాభ్యాసాత్-దేవం పశ్యే న్నిగూఢవత్"

తన శరీరమును శరీరగతమైన హృదయమును జీవాత్మనైనను

క్రింది కఱ్ఱగా జేసి-సూక్ష్మపంచాక్షర మనఁదగు ప్రణవమును పై కఱ్ఱగా అమర్చియు-ధ్యానమను మథనమును ప్రతిదినము గావించుట వలన కఱ్ఱయందు వహ్నినివలె హృదయాదులలో దాగియున్న పరమ శివుని చూడఁగలుగును.

ఇట్లు పరమశివుని దర్శనమగువరకు ప్రతిదినము నియమిత సమయమున ప్రణవానుసంధానమును ప్రణవసహితశివపంచాక్షర్యను సంధానమునైన నభ్యసింపవలెనని ఇఁట విదితమైనది.

## 15 వ వాక్యమున-

నువ్వులను గానుగలో రుబ్బుటచే నూనె లభించునట్లు పెరుగును మథించుట వలన నెయ్యి దొరుకునట్లు, నదులలో కొంచెము త్రవ్వుటచే ఉదకము ప్రాప్తమగునట్లు, అరణులయందు మథనముచే అగ్ని గోచరమగునట్లు పరమేశ్వరుఁడు జీవాత్మలో-లేక-హృదయమున సమస్తప్రాణిహితవచనరూపమైన సత్యముతో, చిత్తైకాగ్రత యనఁదగు తపస్సుతోడను నిరంతరము భావించుటఁజేసి సాక్షాత్కరించును.

"మనసశ్చేంద్రియాణాం చైకాగ్ర్యం పరమం తపః అభియుక్త సూక్తి. "మనస్సు ఇంద్రియములును స్వాధీనములై పరమేశ్వరుని యందే నిష్ఠఁగలిగియుండుట శ్రేష్ఠమైన తపస్సనఁబడును".

## 16 వ వాక్యమున-

"సర్వవ్యాపిన మాత్మానం-క్షీరే సర్పిరివార్పితమ్,
ఆత్మవిద్యాతపోమూలం-తద్బ్రహ్మోపనిషత్పరమ్,
తద్బ్రహ్మోపనిషత్పరమ్"

పాలలో దాగియున్న నెయ్యివలె-చరాచరమును రహస్యముగా వ్యాపించినదియు, అధ్యాత్మవిద్యకు తపస్సునకు మూలంబునగు పర శివబ్రహ్మము-ఉపనిషత్తులయందు అన్వేషింపఁదగినదై సర్వోత్తమ మగునది.

"సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా" "పరమాత్మ-సత్యతపస్సు లతో లభించు" నని శ్రుత్యంతరము సమర్థించినది.

"తద్బ్రహ్మోపనిషత్ పరమ్" అను దానిని రెండు పర్యాయ ములు చెప్పుట అధ్యాయపరిసమాప్తిని సూచించును.

ఇయ్యది-ప్రథమాధ్యాయము.

## అథ ద్వితీయాధ్యాయః

ప్రథమాధ్యాయమున "స్వదేహ మరణిం కృత్వా" ఇత్యాదిని ధ్యానమే శివసాక్షాత్కార సాధనమనియు, ధ్యానమునఁగా-తైలధార వలె నవిచ్ఛిన్న స్మృతి సంతానమనియు నిరూపించి-ధ్యానము చిత్తై కాగ్రత లేనిది సంభవింపనిదగుటచే-చిత్తైకాగ్ర్యమునకు వలయు యోగము ఇట నుల్లేఖింపఁబడుచున్నయది.

అటులే పరమాత్మ-సర్వసాక్షి సర్వకారణుఁడునని నిరూపింపఁ బడినది.

1 వ వాక్యమున-

యోగమునందు ప్రవర్తించువాడు-మొదట మనస్సును మనో వృత్తులను నియమించి శివతత్త్వమును ప్రతిపాదించు మహామంత్ర మును స్మరించుటకు నిత్యము ప్రయత్నింపవలెను. అట్టి బుద్ధిని

కలుగఁజేయు ఇష్టలింగస్వరూపుఁడైన స్వప్రకాశుఁడునగు పరమేశ్వరుఁడు-తన మహాప్రకాశము స్వాంశమగు జీవాత్మయందు స్థిరపడుటకై పార్థివశరీరమందలి మనస్సు నభిముఖముఁ జేయుగాక! అని పరమేశ్వరుని ప్రార్థింపవలెను.

ధ్యానము నభ్యసించు మహాపురుషుని శరీరమందలి హృదయమున-స్వప్రకాశమును నెలకొలుపనెంచి సర్వవ్యాపకుఁడైన సదాశివుఁడు మనస్సును ధ్యానానుకూలముగ మార్చుననియు, శివధ్యానమునందు ప్రవర్తించు జీవాత్మకు శివుఁడు సహకరించుననియు సారాంశము.

## ద్వితీయవాక్యమున-

సర్వకారణుఁడైన పరమశివుని ధ్యానించుట అను యజ్ఞము విషయమై పరశివునందు లగ్నము చేయఁబడిన మనస్సుతో ధ్యానించుటే గాక—ఆరాధించుట విషయమై గూడ స్వర్గ (మోక్ష)ప్రాప్తికై ప్రయత్నింతుముగాక! మోక్షమే నిరుపాధికమగుటచే—ఇఁట—స్వర్గ శబ్దమునకు మోక్షమను నిర్వచనము-సమంజసమైనది.

రెండవ వాక్యమునందు నిరూపింపఁబడిన పరశివుఁడు-చక్షురాది జ్ఞానేంద్రియములను మనస్సుతో మేళవించి-పూర్ణసుఖరూపమైన స్వకీయ పరమప్రకాశమును ప్రకటింపఁగలుగునట్టి ఇంద్రియములను మనస్సువైపు ప్రేరేపించునని వివేకము.

## తృతీయవాక్యమున-

ఇట్లు పరమేశ్వరుఁడు ఇంద్రియములను మఱల్చి-కాలక్రమ

ముగ స్వసాక్షాత్కారము అను సమీచీనజ్ఞానమును కలుగఁజేయు వరమపద ప్రాప్తిని సంఘటింపజేయునని సారాంశము.

జీవాత్మ-తనలోనున్నట్టి దివ్యజ్యోతిఃస్వరూపుడైన పరమేశ్వరు నీశ్వరానుగ్రహమువలననే సందర్శింపఁగలుగునని ఇఁట విదిత మైనది.

## నాలుగవ వాక్యమున—

పరశివబ్రహ్మమును దర్శించుటకై పట్టుదల గల (లింగధారులు అలింగధారులు) నగు బ్రాహ్మణులు-పరశివబ్రహ్మమునందు మనస్సును నెలకొలిపి-సాధనములగు ఇంద్రియములను పరమాత్మ యందు నిలుపుదురు. మరియు విశేషించి సమస్తమును వ్యాపించునట్టి, గొప్పవాడైన, సర్వజ్ఞుఁడైన, మహదేవునిఁ గూర్చి-అంతర్బహిస్సు లందు నుతించుట-శివదిదృక్షువులచే ఆవశ్యము చేయఁదగినది.

యజ్ఞయాగాది సమస్త పుణ్యకర్మలను పరమాత్మ-జీవాత్మ నుద్ధరింపఁజేయుటకై పోషించుచున్నవాడు. భక్తుని చేష్టితముల నన్నిటి నతవుఁడే ప్రవర్తింపఁజేయునని సారాంశము.

## ఐదవ వాక్యమున-

"యుజే వాం బ్రహ్మ పూర్వ్యం-నమోభిః పిశ్లోక ఏతు
పథ్యేవ సూరేః,
శృణ్వంతు విశ్వే అమృతస్య పుత్రా-ఆ యే ధామాని
దివ్యాని తస్థుః"

చేతనాచేతనములకు మున్ను-లీలార్థము ఆవిర్భవించినబ్రహ్మము శక్తిశివుల సమరసీభూతమగు శక్తివిశిష్ట శివలింగముగా నమస్కా-

రములతో అనుసంధించుచున్నాను. (నమస్కరించుచున్నానని విశదార్థము) ఇట్లు నమస్కరించుచున్నట్టి నాకు బ్రహ్మపదమార్గమునందు–బ్రహ్మప్రాప్తునకు వలె–వివిధమైన–కీర్తి–(విజయము)చేకూరుగాక! (నాకు బ్రహ్మప్రాప్తి యగుగాక అని అర్థము.) ఈ నా స్తోత్రములను పరమేశ్వరుని కుమారులగు గణేశ కుమార వీరభద్రాదులు మహాకైలాసమున దివ్యభవనములయందు నివసించువారై వినెదరుగాక! మరియు ముక్తపురుషులందరు ఆలకింతురు గాక!

"సర్వే జనాః సుఖినో భవంతు" అను న్యాయము ననుసరించి శివభక్తులందరు-శివమహిమశ్రవణముతో-చిత్తశుద్ధిగలవారై-శివధ్యాన ఆరాధనార్హత గలవారునై ముక్తులగుదురుగాక! అని ఇందు ఆశంసింపఁబడినది.

## ఆరవ వాక్యమున-

అగ్నియాధారమగు ప్రాణవాయుసహకృతమైన ఉమాశక్తితో కూడియుండు పరశివుఁడు సర్వశ్రేష్ఠుఁడుగా గల వైదికకర్మయందు ముముక్షువునకు అభిరుచి కలుగును.

వేధామంత్రక్రియారూపమగు శాంభవదీక్షయందు–శివపంచాక్షరీహవనాత్మకమగు అగ్నికార్యము, ముఖోచ్చారణరూప ప్రాణవాయుకార్యమగు శివమంత్ర స్వీకారము, క్రియారూపమైన ఇష్టలింగధారణపూర్వక శివారాధనమునందు శక్తివిశిష్ట శివుఁడు భాసించుటయు ఇందు గమనార్హములగుచున్నవి.

## ఏడవ వాక్యమున-

జీవాత్మ–సర్వకారణుఁడగు శివుని అనుగ్రహమువలన-సమస్త

మునకంటె ముందున్నట్టి పరశివబ్రహ్మమును పొందఁజాలును. బ్రహ్మము మూర్త(సాకార)ము అమూర్త(నిరాకార)మునై యున్నది. బ్రహ్మప్రాప్తి కారణమగు సమాధిరూపమైన నిష్ఠను సాధింపవలెను. నిత్యనైమిత్తిక కర్మనంతయు శివారాధనబుద్ధి నాచరింపవలెను. శివసాయుజ్యకాంక్షతో పుణ్యకర్మల నాచరించు పురుషుని కర్మలు బంధింపవు. శివార్పణము లేని కర్మాచరణము—జనన జరా మరణాద్యాత్మక సంసార సముద్రములో పడవేయును.

## ఎనిమిదవ వాక్యమున-

యోగాభ్యాసవిధానము-చిత్తశుద్ధికై-దిగువవిధము నిరూపింపఁబడుచున్నయది.

రొమ్ము (ఉరస్సు) మెడ (కంఠము) తలకాయ (శిరస్సు) అను మూడిటి నెత్తుగా నమర్చి-శరీరమును నిటారుగా నిలిపియు. హృదయమున-మనస్సుతో ఇంద్రియములను స్థిరపఱచినవాడై యోగమార్గరహస్యమును గురువుకడ గుర్తెరిగి-భయంకరములైన జన్మజరామరణములు అను ప్రవాహములను—ప్రణవఘటిత శివపంచాక్షర మహామంత్రానుసంధానము అను నావ (తెప్ప)తో అతిక్రమింప (దాట)వలెను.

## తొమ్మిదవ వాక్యమున-

యుక్తాహార విహారాది సమీచీనప్రవర్తనము గలవాడై ప్రాణవాయువును మిక్కిలి నిరోధించియు-ప్రాణవాయువు బలహీనముకాగా ముక్కుతోనే శ్వాసమును విడుచుచు ఉచ్ఛ్వాసమును పీల్చుచుండవలెను. నోరు తెఱచి గాలిని విడువకూడదు. లోనికి-పీల్చరాదు.

ఇవ్విధము ప్రాణాయామము నొనర్చు యోగిపురుషుఁడు-చెడు గుఱ్ఱములతో రథము భ్రష్టమగునట్లు-ఇంద్రియములు మనస్సును కదలింపకుండుటకు జాగరూకుఁడై తన యంతఃకరణమును యోగానుకూలము నొనర్చుకొనవలెను.

## పదవ వాక్యమున-

ఎత్తుపంతలు లేనిది, పరిశుభ్రము, చిన్నచిన్న రాళ్ళు అగ్ని తాపము ఇసుక లేనిదియు, కలహాదిధ్వని చెరువు మొదలగు జలాశయముల సన్నిధి, జనము నివసించు స్థలము చేరువ-మొదలగునవి లేనిదియు, మనస్సునకు ఇష్టమైనను నేత్రములకు రమణీయదృశ్యములు కనుపడుటవలన నగు చక్షుఃపీడనము లేనిదియునగు స్థలమునందు గాలిఎక్కువ లేనట్టి ఆశ్రయింపనలవియగునట్టి పర్వత గుహవంటి ఏకాంతస్థలమున మిక్కిలిపట్టుదలతో పరమేశ్వరునందు చిత్తమును నిలిపి-పరశివుని ధ్యానింపవలెను.

## 11 వ వాక్యమున-

యోగము సభ్యసించు పురుషునకు అంతఃకరణమున హిమకణవర్ణము (తెలుపు) ధూమవర్ణము (పొగరంగు) సూర్యకాంతి, (పింగళవర్ణము) వాయువు, అగ్నిజ్వాల (ఎఱుపు) ఖద్యోతకాంతి, (ఆకాశమున అగ్నికణము వలె చీకటిలో కనుపడు కీటము) మెఱుపు వన్నె, స్ఫటికకాంతి, చంద్రకాంతి, అను తొమ్మిది వన్నెలు గోచరించుచు పరమాత్మ ప్రకాశమునకు ముందు సూచనలగుచున్నవి.

## 12 వ వాక్యమున-

ఇట్లు యోగసమాధి నుండువానియొక్క యోగసిద్ధి సూచక

ములఁ జెప్పి ఇందు—అవ్యుత్థితము వ్యుత్థితము అను దశలయందు కలుగు సిద్ధులను మహర్షి-దిగువవిధము నిరూపించెను.

యోగాభ్యాసమును సాధించువాఁడు-పాంచభౌతికమైన స్థూల దేహమును అంతఃకరణచతుష్టయమును శివమయముగా నవలోకించును శరీరము శివమయముగా భాసించుటయే అవ్యుత్థితదశ యనఁబడును. అంతఃకరణముయొక్క ప్రభావముతో నేర్పడు బాహ్య ప్రపంచము-శివునియొక్క పరిణామముగా భావించును. ఇయ్యది—వ్యుత్థితదశ యనఁబడును అవ్యుత్థితదశయందు శరీరము శివమయముగా అనుభవింపఁబడును. వ్యుత్థితదశయందైతేనో బాహ్యసన్నివేశమంతయు శివస్వరూపముగా ద్యోతకమగును.

పృథివి ఉదకము తేజస్సు వాయువు ఆకాశము అను పంచ మహాభూతములయొక్క గుణములగు గంధాదులు యోగగుణములుగా ప్రవర్తించుతఱి-పాంచభౌతిక ప్రపంచము-యోగికి-శివమయముగా భాసించును—అనఁగా? శబ్ద స్పర్శ రూప రస గంధములు—యోగియందు స్వతఃసిద్ధములు కాగా శబ్దాద్యాశ్రయములగు ఆకాశాదులకు ప్రాధాన్యము ఉండదని భావము. ప్రపంచమంతయు తనలోనున్నట్లు యోగి అనుభవించును. యోగిపురుషుఁడు తనలో చూచుదానినే-బాహ్యమున గాంచుచుండును. యోగసిద్ధునకు వ్యాధిగాని, వృద్ధత్వ (ముదుసలి తన)ము గాని, అపమృత్యువు గాని ఉండజాలవు. ఎందుకనఁగా? యోగిశరీరము—యోగప్రభావమువలన దివ్యముగా పరిణమించును.

## 13 వ వాక్యమున-

యోగము నభ్యసించుట పెంపొందు తఱి—శరీరము బరువు

లేకుండుటయు, ఆరోగ్యము, ఇంద్రియవిషయములయందు ఆసక్తి లేకుంటయు, శరీరకాంతి మెఱుగువడుటయు, కంఠస్వరము సుశ్రావ్య మగుటయు, శరీరగంధము (వాసన) మనోహరమగుటయు, మూత్ర పురీషములు స్వల్పములగుటయు, ఇయ్యవి- యోగియొక్క- మొదటి లక్షణములని తెలియవలెను.

## 14 వ వాక్యమున-

మట్టిపూతగల సువర్ణరజతాది నిర్మితవిగ్రహము మలినమై శుద్ధి చేయఁబడిన పిదప ఎట్లు ప్రకాశించునో, అట్లు ఒకానొకనికి యోగ ముచే శుద్ధమైన ఆత్మస్వరూపము గోచరించును. అట్టి తఱి జీవాత్మ తనను తాను చూచుటచే-సంసారక్లేశములు లేనివాడగును. ఆత్మ స్వరూపము-అనాదికర్మవాసనలవలన మఱుఁగు పడినందున జీవునకు సంసారదశయందు దుఃఖములు సంభవించును. అట్టి ఆత్మస్వరూ పమే యోగదశయందు నిజరూపముతో ప్రకాశించుటఁజేసి-సంసార దుఃఖములు మటుమాయమగును. అందువలన జీవాత్మ-శివానందము ననుభవింప నర్హుఁడగును.

## 15 వ వాక్యమున-

యోగనిష్ఠఁ గలవాడు-దీపమువంటి ఆత్మలో ఈ శరీరమునందు శివస్వరూపము నెప్పుడవలోకించునో, అప్పుడు కృతార్థుఁడగును. శివస్వరూపమెట్టిదనఁగా-జన్మలేనిది, నిత్యము, నాశరహితము, పృథి వ్యాదితత్త్వముల సంబంధము లేనిదియు నగు శివస్వరూపముఁ గాంచినవాడై సంసారపాశములన్నిటిని దూర మొనర్చుకొనఁ గలుఁగును.

స్థూల సూక్ష్మ కారణశరీరములలో ఇష్ట ప్రాణ భావలింగ రూప

మున శివుఁడు నివసించునని-శాంభవదీక్షితుఁడు భావించుచు-యోగ సాధనచే సూక్ష్మశరీరమునందు ప్రాణలింగమును, కారణశరీరమున భావలింగమును దర్శింపఁగలుగును. భావలింగసాక్షాత్కారముతో సంసారదుఃఖములన్నియు పటాపంచలగునని-ఇఁట-విశదమైనది.

## 16 వ వాక్యము-

"ఏష హి దేవః ప్రదిశోఽను సర్వాః-పూర్వో హి జాతః స ఉ గర్భే అంతః । స ఏవ జాతః స జనిష్యమాణః ప్రత్యఙ్ జనాంస్తిష్ఠతి విశ్వతోముఖః"

పదార్థము- ఏష హి దేవః = ఈ పరమేశ్వరుఁడే, సర్వాః = అష్టవిధములుగా సమస్తములైన, ప్రదిశః = దిశలగువాడు; స ఉ = పరమేశ్వరుఁడే, పూర్వః = మొదటివాడైన హిరణ్యగర్భుఁడుగా; జాతః = జన్మించినవాడు, గర్భే అంతః = గర్భములోనుండువాడు, స ఉ = పరమేశ్వరుఁడేను.

"బీజం మాం సర్వభూతానాం_విద్ధి పార్థ సనాతనమ్"

"పార్థా! సమస్త ప్రాణులకు బీజము.పరమేశ్వరుఁడని తెలియుము!" అను గీతావచనము-ఇందుకు ప్రోద్బలకము.

జాతః = గర్భమునుండి జన్మించిన శిశువు, స ఏవ = పరమేశ్వరుఁడేను, జనిష్యమాణః = జన్మింపనున్నట్టి ప్రాణి, సః = పరమేశ్వరుఁడేను, ఇందువలన పరమేశ్వరుఁడు విశ్వతోముఖః = సమస్తము నవలోకించువాడై, జనాన్ = చేతనులైన జీవులను, ప్రత్యఙ్ తిష్ఠతి = జీవాంతర్గతత్వరూపమున వ్యాపించియుండును.

తన యంశమగు జీవాత్మను వెంటాడుచు గర్భరూపమున శిశు

రూపమున సృష్టికర్తృరూపమున పరమేశ్వరుఁడు నుండునని ఇఁట విశదమైనది.

## 17 వ వాక్యము-

"యో దేవో అగ్నౌ, యో అప్సు యో విశ్వం భువన మావివేశ । య ఓషధీషు, యో వనస్పతిషు, తస్మై దేవాయ నమోనమః"

భావగర్భిత పదార్థము=మహాప్రకాశస్వరూపుఁడైన, యో దేవః =ఏ దేవుఁడు, అగ్నౌ = అగ్నియందు వేడిగా నుండునో, యో అప్సు= ఏ దేవుఁడు ఉదకములలో శైత్య (చల్లదనము) రూపమున నుండునో. య ఓషధీషు= ఏ దేవుఁడు వరిధాన్యము మొదలగు ఓషధులయందు రోగవిరోధకస్వరూపముతో నుండునో, యో వనస్పతిషు= ఏ దేవుఁడు వట అశ్వత్థాది వృక్షములయందు సర్వజీవ సుఖప్రదరూపముతో నుండునో, యో విశ్వం భువన మావివేశ = ఏ దేవుఁడు సమస్తలోకమును వ్యాపించియుండునో, తస్మై = అట్టి, దేవాయ = మహాదేవునికై, నమో నమః = నమస్కారము, పరశివుని యందలి ఆదరమును, అధ్యాయపరిసమాప్తిని, "నమో నమ" అను ద్విరుక్తి-సూచించును.

"యో రుద్రో అగ్నౌ య ఓషధీషు యో రుద్రో విశ్వా భువనా వివేశ । తస్మై రుద్రాయ నమో అస్తు"అను శ్రుతి పై విషయమును సమర్థించినది.

భూజలాగ్నివాయ్వాకాశాది ప్రపంచమున-గంధ రస రూప స్పర్శ శబ్దాదులుగ శివుఁడు ఉండువాడని సారాంశము.

ఇయ్యది ద్వితీయాధ్యాయము

## అథ తృతీయాధ్యాయః

1 వ వాక్యము-

"య ఏకోః జాలవా నీశత ఈశనీభిః-సర్వాన్ లోకా నీశత ఈశనీభి। స ఏవైక ఉద్భవే సంభవే చ-య ఏత ద్విదు రమృతా స్తే భవంతి"

పదార్థము-యః = ఏ, ఏకః = ఒకడే పరమాత్మ, జాలవాన్ = = జగత్తునకు ఉపాదానమగు సత్త్వరజస్తమోగుణత్రయాత్మకమైన మాయాజాలము గలవాడై, ఈశనీభిః = తన అసాధారణశక్తులతో, ప్రపంచమునంతయు నిర్మించుటకు ఈశతే = సమర్థుఁడగునో, మరియు సర్వాన్ లోకాన్ = ప్రాణులనందరిని, ఈశనీభిః = ఇచ్ఛా, జ్ఞానక్రియాది స్వ అసాధారణశక్తులతో, ఈశతే = శాసించునో, స ఏకఏవ = అట్టి పరమాత్మయొకఁడే, ఉద్భవే = లీలారూపములు కలిగియుండుటయందు, సంభవే చ = మహాస్సృష్ట్యాదిని జ్యోతిర్లింగముగ సాక్షాత్కరించుటయందును, ఈశతే = సంసిద్ధుఁడగువాడు.

యే = ఎవరు, అంతరాత్మయందు భావలింగమును "శివోఽహం" భావనతో ధ్యానించుచు, ఏతత్ = ఇవ్విషయమును, విదుః = గుర్తింతురో, తే = వారు, అమృతా భవంతి = ముక్తులగుదురు.

పరమేశ్వరుఁడు సర్వాంతర్యామి, సర్వనియామకుఁడునై తన మాయాజాలముతో జగత్తుగ పరిణమించుననియు, మహాస్సృష్ట్యాదిని బ్రహ్మ విష్ణువులకు జ్యోతిర్లింగముగ సాక్షాత్కరించి-రుద్ర మహేశ్వర సదాశివాది లీలారూపములతో ప్రపంచము నధిష్ఠించుననియు, ఇఁట విదితమైనది.

2 వ వాక్యము-

"ఏకో హి రుద్రో న ద్వితీయాయ తస్థుః-ఇమాన్ లోకానీశత ఈశనీభిః । ప్రత్యఙ్ జనాంస్తిష్ఠతి సంచుకోపాంతకాలే సంసృజ్య విశ్వా భువనాని గోపాః"

"రుదం = సంసారదుఃఖం జననమరణాద్యాత్మకం, ద్రావయతీతి రుద్రః" అను వ్యుత్పత్తిచే-రుద్రుఁడే సంసారవైద్యుడు, మోక్షదాతయునై నానాలీలారూపములు గలవాడైనను తత్త్వదృష్టితో ఒకఁడేనని తేటపడుచున్నయది.

అట్టి రుద్రుఁడొకఁడే జగత్కర్తయని బ్రహ్మవిదులు భావించి రెండవ వస్తువునకై నిరీక్షింపకుండిరి. "సర్వోహ్యేష రుద్రః" ఇత్యాది శ్రుతివాక్యములు ఈ విషయమునే సమర్థించినవి. ఆకలిఁగొన్నవాడు ఆదరముతో లభించు ఆహారమును విడనాడి అన్నాద్యాహారము నన్వేషింప నుద్యుక్తుఁడు కాడు గదా!

కావున-శివోపాసకులు శివు (శివానందము) ననుభవించి సంతృప్తులై మరియొకవస్తువు నపేక్షింపరని-తెలియవలెను. అట్టి రుద్రుఁడే తన అసమానశక్తులతో ఈ ప్రాణులను శాసించువాడు-ప్రాణులనంతర్యామిగ నుండువాడు మరియు సమస్తలోకములను చతుర్ముఖబ్రహ్మరూపముతో పుట్టించి-విష్ణురూపమున కాపాడుచు, ప్రళయకాలమున తన నిరాకారజ్యోతిః స్వరూపముగ చేతనాచేతనములకు నిష్పక్షపాతముగ ఆశ్రయము నొసఁగువాడు రుద్రుఁడే నని ఈ ద్వితీయ వాక్యముఁదగు భావార్థము.

3 వ వాక్యమున-

పరమాత్మయగు సదాశివుఁడు-ప్రపంచమంతట నేత్రములు,

ముఖములు భుజములు పాదములు గలవాడై-నేత్రరూపములగు బాహువులతో భూమ్యాకాశమయములగు పదునాలుగు లోకములను తానొకఁడే-సృష్టి ననుసంధించును.

లోకముల నన్నిటిని నిర్మించియు పరమేశ్వరుఁడు-ఆత్మారాముఁడై జగద్గతములైన సుఖదుఃఖముల నంటకుండునని ఇఁట విదితమైనది.

4 వ వాక్యము–

"యో దేవానాం ప్రభవ శ్చోద్భవశ్చ-విశ్వాధికో రుద్రో మహర్షిః ।
హిరణ్యగర్భం జనయామాస పూర్వం-స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు ॥"

సంసారదుఃఖ నాశకుఁడు సర్వజ్ఞుఁడునగు ఏ దేవుఁడు ఇంద్రాది దేవతలను పుట్టించి యవ్వారికి స్వర్గాది దివ్యలోకనివాసాది వైభవము నొసఁగూర్చుటయే గాక మహాసృష్టి ప్రారంభమున హిరణ్యగర్భు (చతుర్ముఖ బ్రహ్మదేవు) నావిర్భవింపఁజేయునో, అట్టి పరమేశ్వరుడు మమ్ము శుభప్రదమైన బుద్ధితో ననుసంధింపఁజేయుగాక!

శుభము నొసఁగు బుద్ధి యనఁగా-ఉపనీతుఁడై వేద వేదాంగముల నభ్యసించి కల్యాణదేశికునుండి లింగధారణప్రధానమగు శాంభవ దీక్షఁబరిగ్రహించి భస్మరుద్రాక్షధారియై శివషడక్షరమంత్రమును జపించుచు ఆజన్మాంతము సంధ్యావందనాది నిత్యకర్మలనాచరించుచు ఇష్టప్రాణభావలింగముల నారాధించుట యగును. అట్టి బుద్ధిని కలిగించువాడు శివుఁడేనని వివేకము.

ఇట్లు నిరాకారుఁడగు పరమేశ్వరుని ప్రార్థించి-సాకారుఁడగు

శివుని-శ్వేతాశ్వతరమహర్షి-దిగువ రెండు మంత్రములతో ప్రార్థించు చున్నవారు.

## 5 వ వాక్యము-

"యా తే రుద్ర శివా తనూ-రఘోరాఽపాపకాశినీ,
తయా న స్తనువా శంతమయా-గిరిశంతాభిచాకశీహి"

పదార్థము-హే రుద్ర! తే=నీయొక్క, యా=ఏమూర్తి. అఘోరా భయంకరము కానిది, అపాపకాశినీ=శాంభవదీక్షచే పాపములను పోగొట్టుకొనినవారియందు ఇష్టలింగరూపమున ప్రకాశించునో, తయా=అట్టి, శంతమయా=అతిసుఖరూపమగు, తనువా=దివ్య శరీరముచే, గిరిశంత=కైలాసగిరి యందుండియు భక్తులకు సుఖ మును కలుగఁజేయు పరమేశ్వరా! నః=మమ్ము, అభిచాకశీహి= బాగుగా నిరీక్షింపుము.

నీ భయంకరమగు కాలరుద్రరూపమున మమ్ము నవలోకింపక సర్వహితావహమగు శివరూపముతో అనుగ్రహింపుమని సారాంశము. పరమేశ్వరునకు-ఘోరము శివము నను రెండు రూపములుండునని ఇఁట విదితమైనది.

## 6 వ వాక్యము-

"యామిషుం గిరిశంత హస్తే-బిభర్ష్యస్తవే,
శివాం గిరిత్ర తాం-కురు మాహిꣳసీః పురుషం జగత్"

పదార్థము-హే గిరిశంత=(గిరౌ స్థిత్వా, శం=సుఖం, తన్వన్) కైలాసగిరియందు నివసించుచు భక్తులకు సుఖమును కలుగఁజేయువాడా! అస్తవే=భక్తులు కానట్టి దుర్మార్గులపై ప్రయో

గించుటకు, యాం = ఏ, ఇషుం = బాణమును, హస్తే బిభర్షి = చేతి యందు పట్టుకొనినావో, హే గిరిత్ర = (గిరౌ స్థిత్వా త్రాణనం కుర్వన్) కైలాసగిరిపై మహోన్నత శిఖరమున నుండియు, ప్రమథ గణములను సాలోక్యముక్తులను రక్షించువాడా! తాం ఇషం = అట్టి బాణమును, శివాం = శుభప్రదముగా, కురు = చేయుము! పురుషం = జగత్ = చేతనము నచేతనమును, మా హింసీః = హింసింపకుము!

శంకరా! నీ క్రూరశక్తిని భక్తులమగు మాయందు ఉపయోగింపక వాత్సల్యపూర్ణమగు చూపుతో రక్షింపుమనియు, శివభక్తిరహితులైన పాపాత్ములను శిక్షింపుమనియు, నిన్నాశ్రయించువారికి ఎట్టి భయము లేదనియు ఈ షష్ఠవాక్యమున విదితమైనది.

7 వ వాక్యమున-

చేతనవర్గమునకన్న శ్రేష్ఠుఁడు, చతుర్ముఖునకు జనకుఁడు, సర్వవ్యాపకుఁడగుటచే గొప్పవాడు, ప్రాణులందరి ప్రతిశరీరమున రహస్యముగ నుండువాడు, విశ్వమునంతటి నాక్రమించువాడు నగు పరమేశ్వరుని దర్శించిన శివోపాసకులు ముక్తులగుదురు.

చతుర్ముఖబ్రహ్మ-జగత్సృష్టికర్తయైన నాతనిని పుట్టించువాడు పరమేశ్వరుఁడే ననియు, మానవాదుల హృదయములలో గల జీవాత్మలయందు అతిసూక్ష్మ దివ్యతేజస్సు (భావలింగము)గ నుండు ననియు, శాంభవదీక్షచే శివునుపాసించినచో శివదర్శనము ప్రారబ్ధాంతమున సంభవించుననియు సప్తమవాక్యసారాంశము.

8 వ వాక్యము-

"వేదాహ మేతం పురుషం మహాంతం-ఆదిత్యవర్ణం

తమసః పరస్తాత్ । తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి-నాన్యః పంథా విద్యతేఽయనాయ"

శివజ్ఞానమునకన్న వేరైన ఉపాయమెద్దియు లేదని శ్వేతాశ్వతర మహర్షి-తన యనుభవముతో పై అష్టమవాక్యమున నిరూపించెను.

"నేను ఈవరకు వర్ణింపఁబడిన గొప్పవాడు, సంపూర్ణుఁడు, సూర్యకోటిసమకాంతి గలవాడు (లేక) స్వప్రకాశుఁడు, సత్త్వరజస్తమో గుణభరితయగు ప్రకృతిని (తమస్సును) మించినవాడు నగు నీ సదాశివుని గుర్తెరిగియున్నాను.

నావలె ఇతరుఁడు గూడ అట్టి పరమేశ్వరునే కనుగొని-సంసార ప్రాప్తిని (మృత్యువును) అతిక్రమింపఁగలుగును. జీవాత్మలందరు ఏనాటికైనను పరమాత్మనుపాసించి దర్శించినచో సంసారబంధము నుండి విడిబడుదురని భావము. మోక్షమునకై శివదర్శనమునుమించిన సాధనము మరియొకటి లేదు.

ఇయ్యది-అష్టమవాక్య సారాంశము.

## 9 వ వాక్యమున-

పరశివబ్రహ్మమునకంటె శ్రేష్ఠమైనది-మరియొకటి ఏదియు లేదు. పరశివలింగమనఁదగు బ్రహ్మమునకన్న సూక్ష్మమైనది స్థూలమైనదియు లేదు. దివ్యాంతరిక్షమునందు నిశ్చలమైన వృక్షమువలె-తనతో సమానుఁడు రెండవవాడు లేనివాడై-స్థిరపడియున్నవాడు. అట్టి పరమపురుషునిచే విశ్వమంతయు వ్యాపింపఁబడినది.

బ్రహ్మాండములోని చరాచరప్రాణులు-పరశివునుండియే జన్మించుచు పరశివునాశ్రయించియే జీవించుచు పరశివునందే దాగియుందురు

గాన జన్మస్థితిలయములయందు పరశివుఁడే విశ్రాంతిస్థానమగుచున్న వాడు.

ఇట్లు సర్వాధారమగుటచే పరశివుడు_లింగమని వ్యవహరింపఁబడును "లింగమధ్యే జగత్సర్వం-లింగా దన్య న్న విద్యతే" అను సిద్ధాంతశిఖామణి వచనముఁబట్టి-సర్వాధారము శివుఁడేనని తేటపడుచున్నయది. ఐనను పరమాత్మ సర్వనియామకుడుగా సమస్తము నందంతర్యామిగ నుండుటచే పరమాత్మకంటె శ్రేష్ఠమైనది ఏదియు లేదనియు, పరమాత్మ బ్రహ్మాండమున సాకారుఁడుగాను చిదాకాశమునందు నిరాకారుఁడుగాను విరాజిల్లుననియు వివేకము.

## 10 వ వాక్యమున-

జగత్తును మించినదియు సర్వకారణము సాక్షిరూపము పరంజ్యోతిః స్వరూపము ప్రాకృతరూపరహితము నిర్మలంబు ఇష్టప్రాణభావలింగాత్మకము నగు పరశివబ్రహ్మము నుపాసించువారు-అమృతు (ముక్తు)లగుదురు. శివు నుపాసింపనివారు-జనన జరామరణాద్యాత్మకమగు సంసారదుఃఖము నే అనుభవించుచుందురు.

## 11 వ వాక్యమున-

శివుఁడు జీవులందరిలో ముఖము, శిరస్సు, కంఠముగ నుండువాడు, "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖః" ఇత్యాదిని నిరూపింపఁబడిన విశ్వవ్యాపకత్వము నీ వాక్యమున మరియొక విధముగా వివరించుట కలదు. ప్రాణులందరిలో శివుఁడే ముఖ శిరః కంఠాదిరూపమున పరిణమించి విరాజిల్లుచున్నవాడనియు సమస్తప్రాణుల శరీరములలో అవయవముల నన్నిటిని సకలేంద్రియములను నిర్మించి యవ్వాని రూపమున పరిణమించి అట్టి శరీరములలో జీవాత్మ నను

సరించి శివుఁడు ప్రవేశించి ప్రాణులందరి హృదయగుహలలో విశ్ర మించు ప్రాణలింగస్వరూఁడనియు, అందువలననే సమస్తమును వ్యాపించి- సర్వగతుఁడుగ- పేర్కొనఁబడుననియు ఇఁట విదిత మైనది.

## 12 వ వాక్యము-

"మహాన్ ప్రభుర్వై పురుషః-సత్త్వస్యైష ప్రవర్తకః,
సునిర్మలామిమాం శాంతిం- ఈశానో జ్యోతి రవ్యయః"

పదార్థము—మహాన్ ప్రభుః = లోకములన్నిటియొక్క గొప్ప దొరయగు ఏష పురుషః= ఈ పరమశివుఁడు, సత్త్వస్యప్రవర్తకః= సత్త్వగుణప్రతిబంధకమగు తమోగుణమును తొలగించి సత్త్వగుణ మును వికసింపఁజేయువాడు.

జగత్సంహారకుఁడు త్రిమూర్త్యంతర్గతుఁడునగు కాలరుద్రుఁడు- పరశివునియొక్క ఘోరమైన రూపముగ పరిగణింపఁబడును. సర్వ మంగళకరుఁడైన పరమాత్మయొక్క అఘోరరూపము-శివపదముచే చెప్పఁబడును. సర్వకారణుఁడైన పరమశివుఁడే సాక్షాత్తు-సత్త్వ గుణమును ప్రవర్తింపఁజేయువాడు. ఇందువలన తేటపడునదేమనఁగా? కాలరుద్రుఁడు-తమోగుణము నిండు గలవాడని కొన్ని పురాణముల యందు గల విషయము-కల్పితము అసాధువునని "సత్త్వస్య ప్రవ ర్తకః" అను నిందలివాక్యమువలన విశదమగుచున్నయది.

పరమశివుని ఘోరరూపమగు కాలరుద్రునియందు-జ్ఞానక్రియా సమన్వయ దృష్టియున్నందున తమోలేశముగూడ నుండఁజాలదు.

13 వ వాక్యమున-

పరమాత్మ సర్వవ్యాపకుఁడైన నుపాసకుల ననుగ్రహించుటకై నవ్వారి హృదయగుహయందు నివసించుచున్నందున అంగుష్ఠమాత్రు (బొటనవ్రేలంత) డగుచున్నవాడు. నిర్మలమైన బుద్ధితో శుద్ధమైన మనస్సుతోడను పరమాత్మ నుపాసించి దర్శింపవచ్చును. ఇట్టి పరశివబ్రహ్మము నాత్మలో నవలోకించు పుణ్యాత్ములు-మృత్యుపాశము నుండి విడిబడి—నిత్యసుఖానుభవముతో శాశ్వతకాలము తృప్తిఁజెందు చుందురు.

14 వ వాక్యము-

"సహస్రశీర్షా పురుషః-సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వాఽత్యతిష్ఠద్దశాంగుళమ్"

పదార్థము-"పురుషో వై రుద్రః" అను శ్రుతి ననుసరించి పురుషః = పరమ శివుఁడు, సహస్రశీర్షా = అనంతశిరస్సులు గలవాడు, సహస్రాక్షః = అనంతనేత్రములు కలవాడు, సహస్రపాత్ = అసంఖాతములైన పాదములు కలవాడునై, భూమిః = భూమి మొదలగు జగత్తును, విశ్వతః = అంతట, వృత్వా = వ్యాపించి, (ఆవరించి) దశాంగుళం = పది అంగుళముల (వ్రేళ్ళ) పరిమితిగా, అత్యతిష్ఠత్ = అతిక్రమించి యున్నవాడు.

సర్వాంతర్యామిగా సర్వవ్యాపకుఁడైన సదాశివుని-శాంభవదీక్షచే చిత్తశుద్ధిని సంపాదించుకొనిన సాధకులు మాత్రము- దర్శించి శివానందము ననుభవింపఁగలుఁగుదురని భావము.

15 వ వాక్యమున-

"పురుష ఏవేదం సర్వం-యద్భూతం యచ్చ భవ్యం,
ఉతామృతత్వస్యేశానః-యదన్నే నాతిరోహతి"

పదార్థము-యత్ = ఏద్ది, భూతం = గడచినదో, యచ్చ = ఏదైతే, భవ్యం = కానున్నదో, (భూతభవ్యశబ్దములచే తన్మధ్యవర్తి యగు వర్తమానము ప్రోక్తమైనట్లేను) ఇదం = ఈ, సర్వం = చేతనా చేతన సమ్మిశ్రమగు ప్రపంచమంతయు, పురుషఏవ = పురుషశబ్ద వాచ్యుఁడగు శివునిచే అధిష్ఠింపఁబడినదేను, ఉత = మరియు, అమృతత్వస్య = మోక్షమునకు, ఈశానః = ప్రభువగువాడు. యత్ = ఏ పరమాత్మ, అన్నేన = అన్నమువలె అనుభవింపఁదగిన భోగ్యవస్తు జాతముచే, అతిరోహతి = అందరానట్టి మహిమతో జగత్తు నతిక్రమించి యుండువాడు.

అచేతనత్వాత్ పృథివ్యాదే-రజ్ఞత్వాదాత్మన స్తథా,
సర్వజ్ఞస్య మహేశస్య-నైకరూపత్వ మిష్యతే"

"పృథివ్యాది ప్రపంచము జడమగుటవలన, జీవాత్మ-అల్పజ్ఞుఁ డగుటఁజేసియు, సర్వజ్ఞుఁడైన మహేశ్వరునితో ఏకరూపత్వము చేతనాచేతనములకు ఘటింపఁజాలదు. అని రేణుకాచార్యుల ప్రవచనము.

"శివ ఏవ జగత్సర్వం-శివఏవాహ మిత్యపి,
భావయన్ పరమో యోగీ-నిత్యానందం సమశ్నుతే"
(సిద్ధాంతశిఖామణి)

"శివుఁడే సమస్తజగత్తుగా పరిణమించుటచే ప్రపంచమంతయు

శివస్వరూపమనియు, శివుఁడే నేను అనియు భావించు ఆరాధ్యశివ యోగి పురుషుఁడు-నిత్యానందము ననుభవింపఁగలుఁగును."

ప్రపంచము శరీరముకాగా-శరీరి పరమేశ్వరుఁడగును. పుష్ప ఫలాదులు వృక్షమందుభాగమై వేరుగా నుండునట్లు-జగత్తు-పరమేశ్వ రుని విభూతిలో భాగమై పరమేశ్వరునితో అవినాభావము గలదిగ నుండువని విదితమైనది.

## 16 వ వాక్యమున-

పరశివబ్రహ్మము-అంతట-హస్తములు పాదములు నేత్రములు శిరస్సులు ముఖములు కర్ణములును గలదై ప్రపంచము నంతటి నధిష్ఠించియుండు నని శివయోగి ధ్యానింపవలెను.

## 17 వ వాక్యమున-

పరశివబ్రహ్మము నేత్రములు మొదలగు ఇంద్రియములన్నిటిఁ బగు గుణములైన రూపాదులతో అంతట ప్రకాశించునదై ఇంద్రియ గుణానుభవము జీవాత్మద్వారా కలదైనను వస్తుతః ఇంద్రియసుఖ భోగమునందు ఆసక్తిలేనిదై చరాచరప్రభువుగా జగత్తును శాసించు నదియునై ప్రాణులందరిని రక్షించునదగును.

## 18 వ వాక్యమున-

నేత్రద్వయము, శ్రోత్ర(చెవుల) ద్వయము, నాసా (ముక్కుల) ద్వయము, ముఖము, పాయూపస్థ (మలమూత్రవిసర్జన)ములు అను తొమ్మిది ద్వారములు గల శరీరమునందు జీవాత్మ-బాహ్యసుఖ లోలుఁడై ఊఁగిసలాడుచుండును. ఇట్టి జీవాత్మయే శివోపాసనచే తన

కించిజ్ఞత్వమును పోగొట్టుకొని-ప్రారబ్ధాంతమున ముక్తుడై శివసముఁడునై చరాచర జగత్తును వశపఱచుకొనఁగలుగునని-అష్టాదశ వాక్యమునందుశ్వేతాశ్వతరమహర్షి.జీవాత్మ శివాంశమగుటచే ఏనాటికైనను శివుఁడగునని- నిరూపించెను.

## 19 వ వాక్యమున-

పరశివబ్రహ్మము హస్తములు లేకున్నను స్వీకరించును. పాదములు లేకున్నను నడచును. నేత్రములులేకున్నను చూచును. చెవులు లేకున్నను వినును. ప్రపంచమున తెలిసికొనఁదగిన దానినంతయు గుర్తెరుఁగును. పరమాత్మను కనుఁగొనువాడు ఎవఁడును లేడు.

పరమేశ్వరుఁడు సర్వసమర్థుఁడగుటచే పాణిపాదనేత్ర కర్ణాది ఇంద్రియముల నధిష్ఠించు దేవతల సహకారములేకయే గ్రహణగమన దర్శన శ్రవణాదుల నొనర్పఁగలుగుననియు, భక్తుల ఆర్తనాదముల నెంతో దూరమునుండి ఆలకించి యవ్వారిని రక్షించుననియ, మానవాదులయొక్క సుకృత దుష్కృతములను దివ్యదృష్టితో కనుగొని పుణ్యపాపఫలముల ననుభవింపఁజేయుననియు, భక్తులు సమర్పించు పుష్పఫలాదులను దూరమునుండియే స్వీకరించుననియు, భక్తుల ప్రార్థనలను గమనించుటకు వడిగా నడిచివచ్చుననియు, ఇట్టి వివిధ రూపమైన శివానుగ్రహము లభించుటకు శాంభవదీక్షఁబరిగ్రహించి సమీపవర్తిగా ఇష్టలింగమును నామకరతలము నారాధింపవలెననియు వివేకము.

## 20 వ వాక్యము-

"అణో రణీయాన్ మహతో మహీయా-నాత్మా గుహాయాం

నిహితోఽస్య జంతోః । తమక్రతుం పశ్యతి వీతశోకో ధాతుః
ప్రసాదా న్మహిమాన మీశమ్"

పదార్థము- అణోరణీయాన్ = కేశాగ్రశతతమభాగమును శత విభాగముల నొనర్చినచో ఎంతయుండునో అంతటి అణువగు జీవాత్మ కంటె నణువు, మహతః- మేరుపర్వతాది గొప్ప వస్తువులకన్న, మహీయాన్ = గొప్పవాడునగు, ఆత్మా-భావలింగస్వరూపుఁడైన పరమాత్మ, అస్య = ఈ, జంతోః = ప్రాణియొక్క, గుహాయాం = గుహ వంటి హృదయాకాశమునందు, నిహితః = దాగియుండుటకు ప్రవేశించెను.

అక్రతుం = కర్మసంబంధము (లేక) కర్మఫలానుభవము లేనట్టి (లేక) ఇంద్రియసుఖభోగార్థక సంకల్పరహితుఁడైనట్టి, మహిమానం = గొప్ప మహిమ గలిగినట్టియు తం ఈశం = పరమేశ్వరుని, ధాతుః = సర్వసృష్టికర్త యగు శివునియొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, వీతశోకః = సంసారదుఃఖము లేనివాడై, పశ్యతి = చూడఁ గలుఁగును.

"సంసారమోక్షస్థితిబంధహేతుః" "సంసారబంధమునకు, ప్రళయమున దాగియుండుటకు, మోక్షమునకును కారణము శివుఁడే" నను శ్రుతివాక్యము పై విషయమునే సమర్థించినది.

## 21 వ వాక్యమున-

ఇట్టి పరమేశ్వరుని దర్శనము-వాని యనుగ్రహమువలననే ఘటించునని స్వానుభవరూపమున మహర్షి నిరూపించుచున్నవాడు.

జరామరణరహితుఁడు, పురాతనుఁడు, సర్వాంతర్యామి, విభువగు

టచే సర్వగతుఁడు నగు పరమాత్మను నేను-గుర్తించి పరిపూర్ణతత్త్వై ఉపాసించుచున్నాను.

పరమాత్మ ఉత్పత్త్యాదులు లేనివాడని బ్రహ్మవిదులు గుర్తించి శాశ్వతునిగా చెప్పుచున్నవారు.

నేనే గాక ఎందరో మహానుభావులు పరమేశ్వరసాక్షాత్కారముతో శివసాయుజ్యము నొందినారని. శ్వేతాశ్వతరుడు-తన నిగర్వతను వ్యవహరించుట-ఇందు పరమార్థము.

ఇయ్యది-తృతీయాధ్యాయము.

## అథ చతుర్థాధ్యాయః

మొదటి వాక్యమున-

శివానుగ్రహమువలననే శివసాక్షాత్కారము సంభవించునని తృతీయాధ్యాయమున నిరూపింపఁబడిగది. శివానుగ్రహము-స్తోత్ర ప్రార్థనాదికముతో లభించునని-ఈ అధ్యాయమున మొదటివాక్యము నందు మహర్షి-ఉపదేశించుచున్నవారు.

రూపజాత్యాదులు లేనట్టి, తనతో సమానుఁడైన రెండవవాఁడు లేనట్టి పరమాత్మ-తనలోని విచిత్ర అనంతశక్తులయొక్క ప్రభావము వలన-అనేకవిధములు రూపజాత్యాదివిశిష్టములు నగు వస్తువులను-స్వార్థరహితముగా సృజించి-ప్రళయకాలమున విశ్వమును తనలో దాచి కాపాడును. (సృష్టి సంహారములను పేర్కొనుటలో స్థిత్యాదులు గూడ శివుఁడే చేయుట-చేరినదని తెలియవలెను.)

క్రీడావిహారముగ సృష్టిస్థితిలయములఁజేయు శివుఁడు-మమ్ము-

తనను పొందుటకనువైన బుద్ధిని (ఉపనీతుఁడై పాశుపతదీక్షతో శివలింగమును నిరంతరము ధరించి యుపాసించు ఏకాగ్రతను)కలిగించి అట్టి బుద్ధితో- సర్వదా అనుసంధింపఁజేయుగాక!

రెండవ వాక్యమున-

పరశివబ్రహ్మస్వరూపమే- అగ్ని, ఆదిత్యుఁడు, వాయువు, చంద్రుఁడు, పరిశుభ్రమైన వస్తువు, ఉదకమునై చతుర్ముఖబ్రహ్మగా, ప్రజాపతి (విరాడ్రూపుఁడు) గాను పరిగణింపఁబడుచున్నయది.

పరమాత్మ-నిరాకారుఁడైనను భక్తుల ననుగ్రహించుటకై ఆకారములను పరిగ్రహించి-నిరాకారుఁడు సాకారుఁడునని పేర్కొనఁబడును. ఆకాశాది పంచతత్త్వాత్మకమగు ప్రపంచమంతయు- సర్వకారణుఁడైన పరమేశ్వరునియొక్క అచేతనరూపము కాగా-బ్రహ్మేంద్రాదులు దివ్యస్వరూపాంశములగును. కైలాసవాసియగు పార్వతీపతి పరమశివుని ప్రతికృతి యనఁదగిన పూర్ణమైనదివ్యరూపముగువాడు. గట్టిపడిన ఘృతము-భోజనసౌకర్యార్థము ద్రవమగునట్లు నిరాకారుఁడైన పరమశివుఁడు (జ్యోతిర్లింగము) లీలార్థము దివ్యరూపము గలవాడగును. పరశివునకు రుద్రునకు భేదమును పాటింపరాదు. భక్తులు- సాకారశివు నారాధింతురు. ముక్తులు-నిరాకార శివుని నిరతిశయానందము ననుభవింతురు. భక్తుఁడు సాకార శివుని ఇష్టలింగము నర్చించి శివానుగ్రహముఁబడసియు సంసారబంధ నిర్ముక్తుఁడగును. వస్తుతః జీవాత్మ నిరాకారుఁడైనను సాకారశివు నారాధింప-శివానుగ్రహమువలన శరీరేంద్రియాద్యాకారము గలవాడగును. అని ఇందు సూచితమైనది.

మూడవ వాక్యమున-

దేవా! విశ్వవ్యాపకుఁడవైన నీవే స్త్రీరూపము పురుషరూపంబు

గలవాడవగుదువు! నీవే కుమారుఁడవు కుమారియు నగుదువు! నీవే ముదుసలివై కఱ్ఱఁబట్టుకొని నడచువాడవు! జగత్తునంతట-విచిత్రము లైన జన్మలతో విరాజిల్లువాడవు!

ఇట్లు ముముక్షువులందరు భావింపవలెనని సారాంశము.

## 4 వ వాక్యమున-

పరమేశ్వరా! భ్రమరము(తుమ్మెద) శుకము (చిలుక) మేఘము ఋతువులు సముద్రములు నీవేను, నీవు ఆకాశమువలె విభువగుటచే ఆద్యంతములు లేనివాడవై యున్నావు. లోకములన్నియు నీవలన ఏర్పడును గాన నీ ఆద్యంతముల నెవరును కనుగొనఁజాలరని భావము. (ఇఁట నీలపతంగశబ్దమునకు భ్రమరమనియు. హరితో లోహితాక్షః అనుచో శుకమనియు, తటిద్గర్భశబ్దమునకు మేఘ మనియు అర్థములు.)

స్త్రీ పురుషరూపములే గాక భ్రమర శుక మేఘాది సమస్తరూప ములు నీవే నని వివేకము.

## 5 వ వాక్యము-

"అజామేకాం లోహితశుక్ల కృష్ణాం-బహ్వీః ప్రజాఃసృజ మానాం సరూపాః । అజో హ్యేకో జుషమాణో౽నుశేతే-జహా త్యేనాం భుక్తభోగా మజో౽న్యః"

చేతనాచేతనవర్గము-పరశివుఁడే ఉపాదానముగా-శివాత్మకమగు నెడ-చరాచరప్రపంచమున గల వస్తువుల తారతమ్యము, మరియు బంధమోక్షాది వ్యవస్థ యెట్లు సిద్ధించునను ఆశంకకు-సమాధానము పై వాక్యము.

పదార్థము-లోహిత = ఎఱ్ఱనైన రజోగుణము, శుక్ల = తెల్లనైన సత్త్వగుణము, కృష్ణ=నల్లనైన తమోగుణంబు గలయట్టి, సరూపాః బహ్వీః ప్రజాఃసృజమానాం=సత్త్వరజస్తమోగుణములకుఁదగు ధవళ రక్త నీలవర్ణగుణములతో కూడిన రూపములు గల అనేకప్రాణు లను పుట్టించునట్టి, ఏకాం అజాం= వికారములు గలదైనను ఏక రూపముతో నిత్యమైన ప్రకృతిని, ఏకో హి అజః = సంసారపాశ బద్ధుఁడైన ఒక చేతనుఁడు, జుషమాణః=ప్రేమించువాడై, (ప్రకృతి నాశ్రయించి ప్రవర్తించువాడని భావము) అనుశేతే=అనుభవించును, అన్యః అజః= అనేకజన్మలయందు ప్రకృతిభోగముల ననుభవించు టలో విసుఁగుఁజెందిన విరక్తుఁడై భోగేచ్ఛారహితుఁడునైన జీవాత్మ-ముముక్షువై, భుక్తభోగాం= ఇంద్రియవిషయభోగముల ననుభ వింపఁజేసినట్టి, ఏనాం= ఈ ప్రకృతిని, జహాతి= విడచును.

ప్రకృతిపురుష వివేకముగల మహానుభావులు-ప్రకృతిభోగములు శాశ్వతములు కావని గుర్తించి-శరీరధారులగుటచే శరీరపోషణాద్య ర్థము వలయు ఆహారపానీయాదులను శివప్రసాదములుగ ననుభ వించినచో- అట్టివారు సంసారబద్ధులు కారనియు తమనింద్రియసుఖ ములఁదెస ఆకర్షించు ప్రకృతికి లోను గారనియు, జగత్తుఁజెందిన నానాత్వము ప్రకృతికృతమనియు, సత్త్వరజస్తమో గుణసంబంధ మున నేర్పడు తారతమ్యము ఈశ్వరకృత్యముగానిదై పూర్వాపూర్వ కృత కర్మననుసరించి సంభవించుననియు, ఇట్టి భోగలాలసత్వము-శాంభవదీక్షఁబరిగ్రహించి ఇష్టప్రాణభావలింగముల నారాధించు ముముక్షుశైవులకు తగ్గుననియు ఈ ఐదవ వాక్యమున విదితమైనది.

6 వ వాక్యము-

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా-సమానం వృక్షం
పరిష్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభి
చాకశీతి"

పదార్థము-సయుజా=ఎల్లకాలము కూడియుండునట్టి, సఖాయౌ = పరస్పరము మిత్రులైనట్టి, ద్వాసుపర్ణా=జీవేశ్వరులు అను రెండు పక్షులు, సమానం వృక్షం=వృక్షమువంటి ఒకే శరీరమును, పరిష్వజాతే = ఆలింగనముఁజేసికొనినవారి వలె ఆశ్రయించినవి. తయోః= ఆ రెండు పక్షులలో, అన్యః = జీవాత్మ, స్వాదు = రుచికరముగా భావింపఁబడు, పిప్పలం = చెట్టుపండువంటి కర్మఫలమును, అత్తి = అనుభవించును.

అన్యః = జీవభిన్నుఁడైన పరమాత్మ, అనశ్నన్=కర్మఫలము ననుభవింపనివాడై జీవక్రియమాణ సుకృత దుష్కృతముల నవలోకించుచు సాక్షిమాత్రుడునై అభిచాకశీతి = ప్రకాశించును.

పరమాత్మ-జీవాత్మతో సహ శరీరమునఁ బ్రవేశించినను కర్మ ఫలానుభవము లేనివాడై జీవాత్మను వెంటాడునని భావము.

ద్వా, సువర్ణా, సయుజా, సఖాయా అనునవి-ద్వివచనములుగా నిట ఛాందసప్రయోగము గలవని గుర్తింపవలెను.

7 వ వాక్యము-

"సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి
ముహ్యమానః।

జుష్టం యదా పశ్యత్యన్యమీశ మస్య మహిమానమితి
వీతశోకః"

పదార్థము-సమానే వృక్షే=శరీరము అను ఒకే వృక్షమునందు, పురుషః = జీవాత్మ, నిమగ్నః = కర్మఫలభోగమునందు ఆసక్తిగలవాడై, అనీశయా = కర్మపరవశత్వమువలన నేర్పడు అసమర్థతతో, ముహ్యమానః = స్వరూపమును విస్మరించి కృత్యాకృత్య వివేకము లేనివాడై శోచతి = దుఃఖము ననుభవించుచున్నవాడు.

ఇట్టి దుఃఖమునుండి విడుదల ఎట్లనఁగా?

జుష్టం=ఫలాపేక్షారహితసుకృతముతో శాంభవదీక్షాప్రయుక్తమగు ఇష్టలింగార్చనతోడను ప్రసన్నుఁడగు, అన్యం ఈశం = తనకంటె వేరైన పరశివుని, యదా = ఎప్పుడు, పశ్యతి = హృదయమునందు దర్శించునో, (తదా = అప్పుఁడు) అస్య = ఈ పరశివుని యొక్క, మహిమానం = ఆనంద భోగాదిరూపమగు మహిమను, వీతశోకః = దుఃఖము లేనివాడై, ఇతి = (ఏతి) పొందును

హృదయములో పరమాకాశముగ ప్రకాశించు శక్తితో కూడిన శివుని అర్చన ప్రార్థన ధ్యానరూపమగు భక్తితో ప్రసన్నుఁ జేసికొనుటకు-కల్యాణదేశికుని యుపదేశము నొందినవాడై-శరీరమునందు బ్రహ్మాండమునందు ఈ రెంటి నతిక్రమించిన మహాకైలాసమునందును విరాజిల్లునట్టి పరమశివుని యనుగ్రహము-నిదానమగుననియు శివసాక్షాత్కారముచే సంసారసుఖమిశ్రిత దుఃఖములన్నియు సమసిపోవుననియు, జీవపరమాత్మలు ఒకే శరీరమునందున్నను కర్మపరవశత్వము జీవునకుండుననియు, పరమాత్మకు జీవకృతకర్మసాక్షిగా సర్వస్వాతంత్ర్యముండుననియు ఈ ఏడవ వాక్యముఁదగు సారాంశము.

## 8 వ వాక్యమున-

వేద వేదాంతవేద్యుఁడు, నాశరహితుఁడు, పరమాకాశస్వరూపుఁడు నగు పరమాత్మను దేవమానవాది ప్రాణులందరు ఆశ్రయించియున్నవారు. అంతరాత్మయగు పరమేశ్వరు నుపాసించి గురైరుగనిచో వేదాధ్యయనము వ్యర్థమగును.

పరమేశ్వరు నంతరాత్మగా భావించి హృదయమున చిదాకాశమునందు-అథవా ఇష్టలింగమునందు_భావలింగమగు పరమాత్మను ధ్యానమున దర్శించువారు కృతకృత్యులై పరమపదమునందు స్థిరముగ నివసింతురు. ఇట్టివారు మరణమును పరమపదద్వారముగ ప్రేమింతురు గాన వీరికి మరణభయముండఁజాలదు మరణమునందు సంతృప్తిఁజెందుచు ఆత్మవిశ్వాసముతో సంతోషింతురు. ఇతరులైతేనో మరణభయముతో ఇంద్రియసుఖము ననుభవించుచు తస్కరులవలె నీ లోకముననే నివసింపఁగోరుదురు. జీవనమును శివప్రసాదముగ కొనసాగించుచు మృత్యువును ప్రియాతిథిగ సత్కరించుట-శివయోగుల స్వభావమగును. నిర్మల జీవనార్థము ఈ శరీరమును శివుఁడను గ్రహించి-జీవుని కల్యాణముకొరకు అంతరాత్మగా నుండునని ఇట విదితమైనది.

## 9 వ వాక్యమున-

గాయత్రి మొదలగు ఛందస్సులు, వైశ్వదేవాదియజ్ఞములు, జ్యోతిష్టోమాదియాగములు, చాంద్రాయణాదివ్రతములు, భూతభవిష్యత్ వర్తమానములు అనువానిని వేదములు ప్రతిపాదించినవి. మాయ నధిష్ఠించు మహేశ్వరుఁడు_సత్త్వరజస్తమోగుణాత్మికయగు మాయ ద్వారా ఈ ప్రపంచమును పుట్టింపగా-అట్టి విశ్వమునందు-త్రాడుచే

కట్టఁబడిన పశువువలె-చిచ్ఛక్తి సంకోచరూపయగు మాయయొక్క-సంసారపాశముచే జీవాత్మ బంధింపఁబడినవాడై ప్రవర్తించును. అని శ్వేతాశ్వతరమహర్షి-ఇట-నిరూపించెను.

10 వ వాక్యము-

"మాయాం తు ప్రకృతిం విద్యాత్-మాయినం తు
మహేశ్వరమ్,
తస్యావయవభూతైస్తు-వ్యాప్తం సర్వమిదం జగత్"

మాయాం=ఆదిశక్తిని, ప్రకృతిం-చిత్రవిచిత్రకారిణి, జీవులను మోహింపఁజేయునది. పరమేశ్వరుని వినోదమునకై అతనినుండి విడిబడి జగత్తుగ పరిణమించియు ప్రళయమున పరమేశ్వరు నాశ్రయించునదియు, అద్భుతరచనయందు నైపుణ్యము గలదియు నగు ప్రకృతిగా గుర్తింపవలెను.

శ్లో॥ మం శివం పరమం బ్రహ్మ-ఆయతీతి స్వభావతః।
మాయేతి ప్రోచ్యతే లోకే-బ్రహ్మనిష్ఠా సనాతనీ॥

పరబ్రహ్మమగు శివుని సహజముగా పొందునదియు, పరశివునందు నిలుకడ గలదియు, నిత్యయునగు శక్తి-మాయయనఁబడును. అభియుక్తసూక్తి.

"మం ఆయతీతి=మాయా" అని వ్యుత్పత్తి.

మహేశ్వరుని-మాయాస్వామియగు పరమేశ్వరునిగా-తెలియవలెను. మహేశ్వరునందు భక్తి గలవారు-మాహేశ్వరులనఁబడుదురు. మహేశ్వరుఁడనుగ్రహించునెడ-మాయాశక్తి-తన వక్రదృష్టిని ప్రసరింపఁజేయనిదై మహేశ్వరుని ఆజ్ఞకు-దాసివలె-లోబడినదై శివ

భక్తునియందు గల అసురీసంపత్తును తొలగించి దైవీసంపత్తు నొనఁగూర్చును. ఇట్టి మాయను సాధనముగా పరిగ్రహించియే పరమాత్మ జగత్కార్యము ననాయాసముగ కొనసాగించును.

అట్టి పరశివుని అంశములగు బ్రహ్మవిష్ణురుద్రులచే జగత్తు వ్యాపింపఁబడినది. ఈ త్రిమూర్తులే జీవనాధారమును కల్పించుచు కాపాడుచును జీవాత్మలు ప్రతిజన్మయందు గావించు దేహవియోగము అను సంహారముఁ జేయుచున్నవారు-

త్రిమూర్త్యాది సమస్త ప్రపంచము-పరశివుని ఒకానొక అంశమగునని "యస్యైకశక్తిశకలే సకలః సమాప్తః" అను అభియుక్తోక్తి నిరూపించినది.

అర్థము-పరమాత్మయొక్క ఏకైకమాయాశక్తియొక్క లేశము నందే సమస్తప్రపంచము సమాప్తమగును.

అని యీ దశమవాక్యము ఘోషించినది.

## 11 వ వాక్యమున-

ప్రపంచమున గల వస్తువులన్నిటియొక్క ఉత్పత్తిస్థానములగు ఉపాదానముల నధిష్ఠించి యంతరాత్మగ నుండువాడు, ప్రళయకాలమున చరాచరజీవాత్మలకు తనలో ఆశ్రయమునొసగువాడు, సమస్తమును శాసించువాడు, దేవమానవాదులచే నుతింపఁబడువాడు, భక్తుల యొక్క ఐహిక ఆముష్మిక సదభీష్టముల నీడేర్చువాడు నగు మహాదేవుని-శాంభవదీక్షతో ఇష్ట ప్రాణలింగముల నుపాసించి భావలింగముగ తన హృదయాకాశమున-నిర్మలమైన మనస్సు అనెడు దివ్యనేత్రముతో జీవాత్మ దర్శించి-జన్మజరావ్యాధి మరణాదులు లేనట్టి అత్యంతశాంతిరూపమైన ముక్తి నొందువాడగును.

## 12 వ వాక్యము-

"యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ-విశ్వాధికో రుద్రో మహర్షిః,
హిరణ్యగర్భం పశ్యత జాయమానం-స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు"

తృతీయాధ్యాయమున గల చతుర్థవాక్యమునందును ఈవాక్యమునందును ఇంచుమించు ఒకే అర్థము కలదు. "జనయామాస""పశ్యత" అను పదములే భిన్నములు అని తెలియవలెను

ఇంద్రాదిదేవతలను పుట్టించి స్వర్గాధిపత్యాదివైభవముల నొనఁగూర్చువాడు, విశ్వాధికుఁడు, సర్వజ్ఞుఁడు నగు రుద్రుఁడు-సృష్టిప్రారంభమున జన్మించు బ్రహ్మదేవుని-వేదవేదార్థముల పరిజ్ఞానముఁ గలుగఁగఁజేయు అనుగ్రహదృష్టితో-గాంచెను. అట్టి పరమశివుఁడు మమ్ము-శుభమయమగు బుద్ధితో ననుసంధింపఁజేయుగాక!

అని పదార్థము భావార్థంబును 12 వ వాక్యమున విదితమైనది.

## 13 వ వాక్యమున-

చతుర్ముఖాద్యమరుల ప్రభువు, పధునాలుగు లోకములకు ఆధారము, ద్విపాత్ (మానవ) చతుష్పాత్ (గవాదులు) నగు పశువులను నియమించువాడు, ఆనందమయుఁడు, ఇష్టప్రాణభావలింగస్వరూపుడు నగు మహాదేవుని కొరకు పూజాసాధనములగు హవిస్సు మొదలగు వానిని సమర్పించుచు ఉపచరింతుము గాక!

నాలుగు కాళ్ళుగల పశువులకంటె మానవులు శ్రేష్ఠులైనను సంసారపాశబద్ధులగుటచే- ద్విపాత్ పశువులనఁ బిలుఁగుదురు.

ఈవాక్యమున- మహేశ్వరుఁడు పశుపతియగునని స్పష్టమైనది. హవి రాది సమర్పణమున- ఇష్టలింగమునకు రూపము, ప్రాణలింగమునకు రుచి, భావలింగమునకు తృప్తి నివేదింపఁబడుట-ఇమిడియున్నది.

"కస్మై = కం అనఁగా దివ్యసుఖ (ఆనంద)ము గలయట్టి" అని యర్థము.

## 14 వ వాక్యము-

"సూక్ష్మాతిసూక్ష్మం కలిలస్య మధ్యే- విశ్వస్య స్రష్టార మనేక రూపఁ। విశ్వస్యైకం పరివేష్టితారం- జ్ఞాత్వా శివం శాంతి మత్యంత మేతి"

సూక్ష్మమునకంటె మిక్కిలి సూక్ష్ముఁడు, కారణకార్యదశల మధ్య నుండు వాఁడు, జగత్తును నిర్మించువాఁడు, కారణకార్యములు అవ్వాని ననుసంధించు మధ్యస్థితి మొదలగు అనేక రూపములు గలవాఁడు, విశ్వమును వ్యాపించువాఁడు, తనతో సమానుఁడైన రెండవ వాఁడు లేనివాఁడు నగు శివు నుపాసించుచు దర్శించినచో- పునరావృత్తి రహితము, మోక్షరూపము, అత్యంత దుఃఖనివృత్తి రూపంబు నగు శాంతిని పొందఁగలుఁగును.

బ్రాహ్మణాది ఉత్తముఁడు- శాంభవదీక్షితుఁడై నిత్యము ఇష్ట ప్రాణ భావలింగముల నుపాసించుచు శివానుగ్రహపాత్రుఁడై ముక్తుఁ డగునని సారాంశము.

## 15 వ వాక్యమున-

ఆ యా సమయములయందు జగత్తును రక్షించువాఁడు, విశ్వ నాథుఁడు, సమస్తప్రాణుల హృదయములలో దాగియుండువాఁడు,

సనకసనందనాది బ్రహ్మర్షులకు, విష్ణుబ్రహ్మాది దేవతలకును ఆశ్రయమునగు పరమేశ్వరుని పూజాజపధ్యానములతో ప్రసన్నునొనర్చుకొని దర్శించినచో-మృత్యుపాశములగు అజ్ఞాన తమోరూపాదులను ఛేదింపఁగలుఁగును.

శివుఁడు— జగత్కారణావస్థను జగత్కార్యావస్థను పొందువాడైనను కార్యదశ— కారణదశను పొందువరకు గల మధ్య (స్థితి) కాలమునఁగూడ జగద్రక్షకుఁడగుననియు, విష్ణుబ్రహ్మాద్యాశ్రయత్వము, విశ్వాధిపత్యము, సర్వభూతగుహాశయత్వము ఇత్యాది మహామహిమలు గలవాడగుటచే సవిశేషుఁడగుననియు, సవిశేష బ్రహ్మజ్ఞానమే- ముక్తిహేతువని ఇఁట విదితమగుటఁజేసి- నిర్విశేష బ్రహ్మవాదము నిరర్థకంబగునని తెలియవలెను.

16 వ వాక్యము-

"ఘృతాత్పరం మండమివాతిసూక్ష్మం- జ్ఞాత్వా శివం సర్వభూతేషు గూఢం । విశ్వస్యైకం పరివేష్టితారం- జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"

"నెయ్యిలోని తేటవలె అతిసూక్ష్మమైన స్వరూపము గలిగి ప్రాణులందరిలో రహస్యముగా నుండునట్టి, సర్వవ్యాపకుఁడైన మహాదేవుఁడగు శివుని సాధకుఁడు సాక్షాత్కరింపఁజేసికొనినచో ఆణవ మాయిక కార్మికములనఁబడు మలపాశములనుండి విడిబడఁగలుఁగును' అని విశదపఱచినది.

పరమేశ్వరుఁడు— అనుపాసకులకు తెలియనలవిఁగానివాడైనను ఉపాసకులు పూజా జప స్తోత్ర ధ్యానముల నేకాగ్రముగ నాచరించి పరమేశ్వరుని తెలిసికొనఁగలుఁగుదురనుట— ఇందు పరమార్థము.

## 17 వ వాక్యమున-

విశ్వముయొక్క సృష్టి స్థితిలయములు అను కర్మల నవలీలగఁ జేయువాఁడు, చెప్పనలవిగాని గొప్ప మహిమ గలవాఁడు నగు శివుఁడు (పరమాత్మ) జనులందరి హృదయములలో ప్రవేశించి జీవాత్మలకు సన్నిహితుఁడైనవాఁడు. సాధకుఁడైన శైవుఁడు- ఇంద్రియవిషయములకు లోనుగానట్టి మనస్సుతో ఏకాగ్రమగు బుద్ధితోడను ప్రకాశింపఁ జేయఁబడిన శివుని దర్శింపఁగలుఁగును.

ఇట్టి ఈ విషయమును గుర్తించువారు- తమ హృదయములోనే శివుఁడున్నవాడని నిర్ధారించుకొని- ఇష్టలింగము నారాధించుచు ప్రాణలింగమునందు నిష్ఠ గలవారై "శివోఽహం" ధ్యానముతో భావలింగ స్వరూపుడై లోలోన ఉన్నట్టి పరమశివుని దర్శించినచో మూర్ధన్యనాడిద్వారా ఈ శరీరమునుండి నిష్క్రమించి పరంజ్యోతియగు పరమేశ్వరుని సమీపించి ఆవిర్భూతనిజరూపులై ముక్తులు కాగలుగుదురని ఇందు విదితమైనది.

## 18 వ వాక్యము-

సర్వజగత్కారణమగు పరమేశ్వరుఁడు- జగదాదికాలమునందు విరాజిల్లువాడగుటచే- సనాతనుఁడు నిర్వికారుఁడు నగునని దిగువన 18వ వాక్యము స్పష్టపఱచినది.

"యదా తమ స్తన్న దివా న రాత్రి- ర్నసన్నచాసత్ శివఏవ కేవలః। తదక్షరం తత్సవితుర్వరేణ్యం- ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతా పురాణీ"

పదార్థము- యదా = ఏ కాలమునందు, తత్ = అనిర్వచ

నీయమైన తమః = తమస్సు; (మహాప్రళయమున జీవాత్మలు గాఢ సుషుప్తిఁజెంది పరమేశ్వరునందు విశ్రమించుట తమస్సనఁబడును.) మహాప్రళయము ముగిసిన తరువాతనే సృష్టి-చేయఁబడును గాన నట్టి తమస్సులో సూర్యచంద్రాదులుండరు గాన పగలు, రాత్రియు లేకుండెను. సత్ = నామరూపవిభాగార్హమైన స్థితి, అసత్ = నామరూపవిభాగానర్హమగు వ్యవస్థయు, న = లేకుండెను. కేవలః = రెండవవస్తువు వేరుగా లేనట్టి, శివఏవ = శివుడే నుండెను. తత్ = అట్టి శివ స్వరూపమే, అక్షరం = వినాశరహితము, సవితుః = సూర్యాదులకన్న, వరేణ్యం = శ్రేష్ఠంబునగు- తస్మాత్ = అట్టి శివునినుండి, పురాణీ = శివునిలోదాగినదై ప్రాక్తనయగు. ప్రజ్ఞా = ఇచ్ఛా జ్ఞాన క్రియాత్మికయు నగు శక్తి-ప్రసృతా = ఆవిర్భవించి బయలుపడినది.

మహాప్రళయమున సచ్చిదానందమయుఁడగు శివుఁడు-సూర్య చంద్రాది చేతనులను సమస్త అచేతనములను తనలో నిమిడ్చుకొని స్వయం ప్రకాశమానుఁడై తమస్సునందు రాణించువాడని ఇందు నిరూపించుటచే శివుఁడే పరబ్రహ్మంబని తేటపడుచున్నయది.

అందువలననే "కోటిసూర్యప్రతీకాశం- చంద్రకోటి సమప్రభమ్" అని సిద్ధాంత శిఖామణియందు రేణుకాచార్యులు- శివుని ప్రశంసించెను.

"యథా చంద్రే స్థిరా జ్యోత్స్నా- విశ్వవస్తుప్రకాశినీ,
తథా శక్తి ర్విమర్శాఖ్యా- ప్రకాశే బ్రహ్మణి స్థిరా"

"చంద్రునియందు స్థిరవసతి గల వెన్నెల- విశ్వవస్తువులను ప్రకాశింపఁజేయునట్లు- శివునందు స్థిరమైన జ్ఞానశక్తి- సృష్టికాల కాలమున జగత్తును ప్రకాశింపఁజేయును" అని సిద్ధాంతశిఖామణి నిర్వచించినది. ఇవ్విధము పరమాత్మయధీనురాలైన శక్తి-స్థిరము

నిత్యంబు నగునని నిరూపించుటచే-శక్తిరహిత నిర్విశేష బ్రహ్మము జగత్కారణము కాజాలదని విశదమైనది.

మొదటి సంసారవైద్యుఁడు శివుఁడేనని "ప్రథమో దైవ్యోభిషక్" అను రుద్రాధ్యాయవాక్యములో కలదు.

## 19 వ వాక్యమున-

పరమాత్మయొక్క పైభాగమును గాని క్రింది భాగమునుగాని మధ్య భాగమును గాని ఎవఁడుగూడా కనుగొనలేడు. అందువలన పరమేశ్వరునితో సమానమగు రెండవ వస్తువు లేదనియు, పరశివుని పేరు గొప్పకీర్తి యనియు తేటపడుచున్నయది. "పురుష ఏవేదం సర్వమ్" "పురుషుఁడనఁబఱఁగు పరశివుఁడే ఈ సమస్త ప్రపంచము" "ఏతావానస్య మహిమా" పరమేశ్వరుని మహిమ-ఈ ప్రపంచప్రఖ్యాతిగలది ఎందుకనఁగా? "పాదోఽస్య విశ్వా భూతాని, త్రిపాదస్యామృతందిని" "పరమేశ్వరుని మహిమ చరాచరసమస్తప్రాణులు-ఒక భాగముకాగా దివ్యాంతరిక్షమునందు మూడు భాగములు కలదు.

ఇట్టి మహామహిమ గలవాడగు, గొప్ప వైభవముతో విరాజిల్లునట్టి పరమేశ్వరుని ప్రాణులు ప్రత్యక్షముగ చూడఁజాలకున్నను లోకవేదములయందు కీర్తింఁపబడుటచే "తస్య నామ మహద్యశః" అని ఇట నిర్దేశింపఁబడినవాడు.

పరమేశ్వరుఁబోలిన వస్తువు-ప్రపంచమున లేకుండుటజేసి, "న తస్య ప్రతిమా అస్తి" అని ఇఁట వర్ణింపఁబడినది.

## 20 వ వాక్యమున-

కరచరణాదులు లేనట్టి దివ్యజ్యోతిః స్వరూపుఁడైన పరశివుని

చక్షురాది ప్రాకృత ఇంద్రియములతో చూడరాదు. అవగాహనయు కాదు గాన హృదయములో నివసించువానిగా-శాంభవదీక్షచే పరిశుద్ధము పాపరహితము నగు మనస్సు అనెడు దివ్యనేత్రముతో పరమేశ్వరుని-పూర్వోక్త రీతిని భావించువారు-సంసారపాశ నిర్ముక్తులై-శివసాయుజ్యమునందియు శివానందము ననుభవింతురు.

## 21 వ వాక్యము-

"అజాత ఇత్యేవ కశ్చిద్భీరుః ప్రపద్యతే,
రుద్ర యత్తే దక్షిణం ముఖం-తేన మాం పాహి నిత్యమ్"

పరమేశ్వరుఁడు-జన్మమరణాదులు లేనట్టి నిత్యసత్యస్వరూపుఁడని భావించి-సంసారదుఃఖమునకు భీతిల్లిన ఒకానొక జీవాత్మ.... పరమేశ్వరు నాశ్రయించును. హే రుద్రా! సద్యోజాతాదిపంచముఖములలో-దక్షిణదిశయందు గల నీ ముఖముతో నన్ను ఎల్లకాలము రక్షింపుము! నీ అఘోరముఖముతో భక్తులందరికి-మేలుఁజేకూర్చు కూరదృష్టిని ప్రసరింపఁజేయక-మమ్ము కాపాడుమని శ్వేతాశ్వతర మహర్షి-ఈ వాక్యమున పరశివుఁ బ్రార్థించెను.

## 22 వ వాక్యము-

మా న స్తోకే తనయే మా న ఆయుషి మా నో గోషు మానో అశ్వేషు రీరిషః, వీరాన్మా నో రుద్ర భామితో వధీర విష్మంతః సదమిత్త్వా హవామహే"

పదార్థము-రుద్రుఁడాః (మా రీరిషః = మరణముఁజెందనీయకుము-అనుదానిని-ఈ వాక్యమున గల పదముల కన్నిటి నన్వయింప

వలెను) నః = మాయొక్క, తోకే = కుమారునివిషయమై, తనయే = పౌత్రప్రపౌత్రుల యందు, ఆయుషి = జీవనమునందు, నః గోషు అశ్వేషు = మా గోవులు అశ్వములు మొదలగు పశువులయందు, మారీరిషః = (రేషణమనగా-మరణము) మరణమును రానీయకుము! నః వీరాన్ = మా వీరులు ధీరులు నగు భృత్యులను, భామితః = కుపితుఁడవై, మా వధీః = చంపకుము! హవిష్మంతః = హవిః సమర్పణాత్మకములగు యజ్ఞములతో మేము, సదమిత్ = ఎల్ల కాలము, త్వా = నిన్ను, హవామహే = ఆరాధించువారము, అందు వలన-మమ్ము సదా రక్షించుచుండుమని పరమేశ్వరుని ప్రార్థించుట ముఖ్యమనియు, శివనివేదితము అను హవిస్సును జఠరాగ్నియందు సమర్పించుట-యజ్ఞములలో ముఖ్యమనియు తేటపడుచున్నయది.

ఇయ్యది-చతుర్థాధ్యాయము

## అథ పంచమాధ్యాయః

### మొదటి వాక్యమున-

నాలుగవ అధ్యాయమునందు చెప్పఁబడిన విషయమునే విపులీకరించుటకు ఈ ఐదవ అధ్యాయము ప్రారంభింపఁబడినది.

(విద్యయనఁగా? శివోపాసనమును బోధించు శాస్త్రము, అవిద్యయనఁగా? సంసారపాశమును బలపఱచునట్టి కామ్యకర్మపరమైన వాఙ్మయము.) అక్షరము అనంతమునగు పరబ్రహ్మమునందు అతి రహస్యముగా విద్యావిద్యలు రెండును దాగియున్నవి.

అవిద్య-క్షరమనఁబడును. విద్య-అక్షరమనఁబడుఁగును.

విద్యను అవిద్యను శాసించువాడు-ఈ రెంటికన్న భిన్నుఁడై విరాజిల్లును. వినాశము లేనట్టి పరిపూర్ణంబునగు పరబ్రహ్మమును ఇష్టప్రాణభావలింగరూపము నుపాసించుటకై శాంభవదీక్షఁ బరిగ్రహించి-బద్ధజీవుఁడైన పశువు-పతియనుగ్రహమున-సంసారపాశమునుండి విడిబడుటకు-ఉపయోగించు ఉపనిషత్సూత్ర గీతాశివాగమాది శాస్త్రవిజ్ఞానము-విద్య కాగా-సంసారసుఖభోగనిదానమగు మంత్రయంత్రాద్యభినివేశము అవిద్యయని ఇచట తేటపడినది.

## ద్వితీయవాక్యమున-

కారణమగు వస్తుజాతమును, అనేక రూపములతో కనఁబడుచున్నట్టి సమస్త ఉత్పత్తిస్థానములను ఒకే ఒక పరమేశ్వరుఁడు-అధిష్ఠించియుండువాడు. సృష్ట్యాదిని సంభవించిన బ్రహ్మాదులలో సుప్రసిద్ధుఁడైన కపిలమహర్షిని, మరియు మున్ముందు జన్మింపఁబోవు మహాపురుషుల ననుగ్రహదృష్టితో నవలోకించి పోషించువాడు-పరమేశ్వరుఁడేను; జన్మించునపుడు ఎవరిపై పరమేశ్వరానుగ్రహము ప్రసరించునో వారే శివజ్ఞానసంపన్నులై ప్రారబ్ధాంతమున పరమపదముఁ జేరుదురనియు. శివానుగ్రహరహితులు-ఐహికాముష్మికసుఖభోగలాలసులై పునఃపునః జన్మించుచుందురనియు సారాంశము.

## తృతీయవాక్యమున-

పూర్వోక్తమగు మహిమగల పరమేశ్వరుఁడు-ఒక్కొక బంధము ననేకవిధముల నొసఁగి-ఈ కర్మభూమియందు-చేతను (జీవాత్మ)లను-కర్మభూమిఁదాటి వెళ్ళనలవిఁ గాని స్థితిలో నుంచును. జన్మించుతఱి శివానుగ్రహము ప్రసరింపనివారు కర్మభూమియందు కామ్యకర్మల నాచరించి స్వర్గాదిలోకములందు పుణ్యఫలము ననుభవించి మరల భూలోకమునకు ఏతెంతురని భావము.

వాస్తవమును విచారించి చూడగా-ఇంద్రాదిలోకపాలురఁగూడ సృజించి-మహాదేవుఁడు అవ్వారిని శాసించు సర్వాధికారము కలిగి యుండునని తేటపడును.

నాలుగవ వాక్యమున—

సూర్యుఁడు పైన క్రింద అడ్డముగాను దిశలన్నిటిని తన కిరణములతో ప్రకాశింపఁజేయుచు రాణించునట్లు-అంతట వెలుగొందునట్టి సర్వశ్రేష్ఠుఁడైన పరమేశ్వరుఁడొకఁడే జగత్కారణములగు పృథివ్యాదులను నియమించువాఁడగును. శివుఁడు-సాకారుఁడు నిరాకారుఁడునని శ్రుతులు నిరూపించినవి. ఆకారముగల పరమేశ్వరుఁడు దివ్యమూర్తుఁడు అదివ్యమూర్తుఁడు నని—రెండు విధములు గలిగి యుండును. స్వయం—దివ్యస్వరూపము గలవాడు, బ్రహ్మ విష్ణు మహేశ్వరులుగ నుండువాడు శివుఁడేను; అగ్ని ఆదిత్యాదులందరును పరమశివుని దివ్యాంశములు కాగా—పృథివ్యాది పంచభూతములు-అదివ్యమూర్తులనఁబడుచు లింగాకారమున భక్తులచే నర్చింపఁబడుచున్నవి.

శివకంచియందు పృథివీలింగము, జంబుకేశ్వరమున జలలింగము, అరుణాచలముపై తేజోలింగము, కాళహస్తియందు వాయులింగము, చిదంబరక్షేత్రమున ఆకాశలింగము ప్రసిద్ధములై లోక కల్యాణము నొనఁగూర్చుచున్నవి. పార్థివ పాషాణాదినిర్మిత లింగములు సర్వత్ర దృశ్యమానములైనను జలతేజోవాయ్వాకాశములు లింగములుగా గోచరించుట పరమేశ్వరుని భక్తానుగ్రహలీలయందు గొప్ప విశేషముగా—పరిగణింపఁబడుచున్నయది.

అందువలననే మర్త్యలోకము గూడ-శివుని వినోదమునకు ఉపయోగించు నివాసమని-అభియుక్తులు నిర్వచించిరి.

ఐదవ వాక్యమున-

జగదుపాదానకారణమగు పరమేశ్వరుఁడు-పృథివ్యాది పంచ మహాభూతములలో తమ తమ ఉనికిని కల్పించుచు-జగన్నిర్మాణ సాధనములగు పంచభూతములను మేళవించి ఆయా రూపములతో పరిణమింపఁజేయుచున్నవాడు-

ఉనికి యనఁగా-స్వభావము-

పృథివికి—ధారణశక్తి, జలమునకు అప్యాయనశక్తి, తేజస్సునకు దాహకశక్తి, వాయువునకు చలనశక్తి, ఆకాశమునందు అవకాశశక్తి-స్థిరములగుట-స్వభావమనఁబడును.

ఇట్లు పరమేశ్వరుఁడు-పంచభూతములను జగద్రూపముగ పరిణమింపఁజేయుటే గాక-సత్వరజస్తమోగుణములను ప్రవర్తింపఁజేయుచు జగన్నాటకసూత్రధారియై స్వలీలావిలాసలోలుఁడగుచున్నవాడనియు, తానే విశ్వమునంతయు నియమించుననియు ఇందు విదితమైనది.

ఆరవ వాక్యమున-

వేదములలో రహస్యములైన ఉపనిషత్తులయందు దాగియున్నట్టి, సర్వజగత్కారణమైనట్టి బ్రహ్మమును—చతుర్ముఖబ్రహ్మ మరియు ఇంద్రాదిదేవతలు వామదేవాది ఋషులును శివానుగ్రహమున గుర్తింపఁ గలుగుదురని చెప్పవచ్చును.

పరమేశ్వరుని ఇచ్ఛాశక్తియొక్క పరిణామము కైలాసరుద్రుఁడనియు, జ్ఞానశక్తి పరిణామము—నారాయణుఁడనియు, క్రియాశక్తి పరిణామము చతుర్ముఖబ్రహ్మదేవుఁడనియు కొందరి యభిప్రాయము.

పరమేశ్వరుని శాంభవదీక్షతో-ఇష్టప్రాణభావలింగములుగ నారా

ధించిన మహానుభావులందరు గూడ-శివసములై శివసాయుజ్యముఁ
జెంది-అమృతులైరని-ఇఁట-శ్వేతాశ్వతరమహర్షి-నిరూపించెను.

ఏడవ వాక్యమున-

ఆరవవాక్యమువరకు పరశివబ్రహ్మలక్షణమును నిరూపించి
ఏడవ వాక్యమునుండి జీవాత్మయొక్క లక్షణమును శ్రుతి ప్రతిపా
దించుచున్నయది.

ఆణవ మాయిక కార్మిక మలములనఁదగు పాశములయొక్క-
సంబంధముగలవాడు, ఐహిక ఆముష్మిక ఫలములనొసఁగు కర్మలఁ
జేయువాడు, (చేయఁబడిన) సుకృత దుష్కృతములయొక్క- ఫలము
ననుభవించువాడు, మాతృ పితృ పత్నీ పుత్ర శ్వశుర శ్వశ్రూ పితా
మహమాతులాది అనేక రూపములఁ దాల్చువాడు, సత్త్వరజస్తమో
గుణముల ప్రభావము గలవాడు, స్వర్గమర్త్యపాతాళగమనములనఁ
దగు మూడు మార్గముల ననుసరించువాడునగు జీవాత్మ ప్రాణవాయు
వును నియమించుచు అద్దాని సహకారముతో తా జేసిన కర్మలఁబట్టి
సంసారమునందు ప్రవర్తించుచుండును. మరియు గుణత్రయపర
వశుఁడై అవివేకముతో అహంకారముతోడను పుణ్యపాపకర్మల నాచ
రించుచు అవ్వాని ఫలములను సుఖదుఃఖరూపములుగ ననుభవించుట
అనివార్యమగునని-ఇఁట-తేటపడినది.

ఎనిమిదవ వాక్యము-

"అంగుష్ఠమాత్రో రవితుల్యరూపః - సంకల్పాహంకార
సమన్వితో యః,

బుద్ధే ర్గుణేనాత్మగుణేన చైవ-ఆరాగ్రమాత్రో హ్యవ
రోఽపి దృష్టః"

జీవాత్మ-బొటనవ్రేలి కొనయంతవాడైనను సూర్యునివలె శరీర మంతట ప్రకాశించువాడు, మానసిక సంకల్పము శరీరేంద్రియాభి మానరూపమైన అహంకారము అనువానితో కూడినవాడై బుద్ధిగుణ మగు నిశ్చయముతో, శరీరగుణములగు జననజరావ్యాధిమరణముల తోడను అత్యంత (సూదిమొనయంత) అల్పపరిణామముగల అణువ గుటచే-పరమాత్మ భిన్నుఁడుగా పరిగణింపఁబడుచున్నవాడు.

ఇఁట గల ఆత్మశబ్దమునకు శరీరమని యర్థము.

శరీరబుద్ధిధర్మములతో పరివేష్టింపఁబడిన జీవాత్మ-నిజరూప మును విస్మరించి శివునుపాసింపకుండుతఱి-గురు కటాక్షముచే విస్మృ తిని తొలగించుకొని శివు నారాధించి తరింపవలసియుండునని సారాంశము.

తొమ్మిదవ వాక్యము-

"వాలాగ్రశతభాగస్య-శతధా కల్పితస్య చ,
భాగో జీవస్య విజ్ఞేయః-స చానంత్యాయ కల్పతే"

జీవాత్మయొక్క అణుత్వ మెంతటిదనఁగా-వెండ్రుకకొనఁదగు నూరవభాగమును వంద తునుకలుగా నొనర్ప-అవ్వానిలో నొక తునకంత కొలత గలవాడు-జీవాత్మయని గుర్తింపవలెను. ఇట్టి జీవాత్మ-దేవమానవాది అనంతజన్మల నొందువాడగును. నిజరూప మును మఱుగుపఱచుకొని సంసారపాశబద్ధుఁడై పశువనదఁగు జీవాత్మ మాయాప్రభావమున-పెద్దపులినోట నిఱికిన జింకవలె, పామునోటఁ

జిక్కిన కప్పవలెను విలవిల కొట్టుకొనుచు-అనేక జన్మల నొందుచు ఏదేనొక జన్మయందు సుకృతాతిశయప్రసన్నుఁడైన శివుని అనుగ్రహముతో శాంభవదీక్షా స్వీకారమున శరణాగతుఁడైనచో- సంసార పాశవిముక్తుఁడై పతిసాయుజ్యమును సంపాదింపఁగలుఁగునని ఈ వాక్యమునందు సువిదితమైనది.

## పదవ వాక్యమున-

వస్తుతః-జీవాత్మ-స్త్రీగాని పురుషుఁడు గాని నపుంసకుఁడుగాని కాడు- కర్మవశమున పరిగ్రహింపఁబడు శరీరముఁబట్టి స్త్రీపురుషాది సంజ్ఞలు గలవాడగును. ఇట్టివాడైనను స్వకర్మప్రాప్త శరీరగతహృదయములో పరమేశ్వరుఁడు సూక్ష్మజ్యోతిర్లింగముగ నున్నవాడని గుర్తించి-ప్రార్థించిన యెడల-ప్రాకృతశరీరములను తొలగించుకొని-దివ్యశివస్వరూఁడు కాగలుగును.

జీవాత్మ-దేవమానవ పశుపక్ష్యాది జన్మల నెందుకు పొందునను ఆశంకకు-దిగువ 11వ వాక్యార్థము-సమాధానమగుచున్నయది.

## 11 వ వాక్యమున-

జీవాత్మ- తన ఇష్టముతో ఇంద్రియవిషయములను తలచుచు అవ్వానిని ప్రత్యక్షముగ ననుభవింపఁగోరినవాడై-యుక్తాయుక్త వివేకమును పోగొట్టుకొని-అన్నకబళముతో మంచినీరుతోడను తన శరీరమును పెంచుకొనును. మరియు అనేకపూర్వజన్మలయందు తా జేసిన పుణ్యపాపకర్మల ననుసరించి స్వర్గ మర్త్య పాతాళాదిలోకములలో నానావిధశరీరములను క్రమముగ స్వీకరించి సుఖాభాసరూపమగు దుఃఖము ననుభవించుచుండును.

కర్మయే-శరీరసంబంధహేతువు కాగా-విషయవ్యామోహము-కర్మకారణమగును. కర్మబద్ధమైన శరీరము గలవాడైన నద్దానిని శాంభవదీక్షతో శుభ్రపఱచి-న్యాయధర్మసంపాదితమగు భోజ్యాదికము నిష్టలింగమునకు సమర్పించుచు శివప్రసాదముగ ననుభవించువాడు-శివార్థము శరీరమును పోషించువాడగుటచే-శరీరమునకు గల కర్మబంధము విడిపోవుటయేగాక క్షుత్పిపాసాది వికారముల నణచుకొనఁ గలుగును. ఫలాపేక్షలేనట్టి సంధ్యావందనాది కర్మ-శివారాధనముగ పరిణమించును.

ఇత్యాద్యాశయము-ఇందు-నిగూఢమైనది.

12 వ వాక్యమున-

దైవవశమున తనకు తారసిల్లిన సత్త్వరజస్తమోగుణముల ననుసరించి-దేవమానవాది స్థూలరూపములను పిపీలికా (ఎఱ్ఱచీమ)ది సూక్ష్మరూపములను పరిగ్రహించుచు-సాత్త్వికరాజస తామసక్రియలకుఁ దగు ప్రవర్తనములతో పూర్వసంస్కారజన్యములగు అభిరుచుల కొదనుండు జీవాత్మకు శరీరముల ననుసంధింపఁజేయువాడు-జీవభిన్నుఁడైన పరమాత్మయని ఇట మహర్షి నిర్ధారించెను. కర్మలేని జ్ఞానము, శరీరములేని ప్రాణము, ప్రాణములేని శరీరము నిరుపయోగములు కాగా-నిష్కామములగు నిత్యనైమిత్తికకర్మల నాచరించుటతో చిత్తశుద్ధి కలిగి శివనిష్ఠ-స్థిరపడునని విదితమైనది.

13 వ వాక్యము-

"అనాద్యనంతం కలిలస్య మధ్యే-విశ్వస్య స్రష్టార

మనేక రూపం, విశ్వస్యైకం పరివేష్టితారం-జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"

సంసారచక్రమునందు- జీవాత్మ-పరిభ్రమించుటను వివరించి సంసారబంధవిముక్తికై వలయు సాధనమును నిరూపించుచున్నారు.

కారణసముదాయమగు జగత్తునందు ఆదిమధ్యాంతములు లేనివాడై తానొకఁడే విశ్వమును పుట్టించుచు అద్దాని నంతరాత్మగా వ్యాపించు పరమేశ్వరుని జీవాత్మ సాక్షాత్కరింపఁజేసికొనఁగలిగినచో ముక్తుఁడగును.

సర్వవ్యాపకుడైన పరమాత్మయొక్క సాక్షాత్కారమెట్లగుననఁగా- ఉపాసనతో సాక్షాత్కారము సంభవించును. నిర్మలమనస్సుతో గురుప్రదత్తమగు ఇష్టలింగమును- తన ప్రాణము అను భావనతో-అర్చించు మహాపురుషునకే-తన దివ్యశివరూపమును ప్రసాదించును. అట్టి తఱి జీవాత్మయొక్క సచ్చిదానందమయమగు నిజరూపము ఆవిర్భవించును.

"యమేవైష వృణుతే తేన లభ్య స్తస్యైష వృణుతే తనూం స్వామ్" అను కఠోపనిషద్వాక్యము పై యంశమును సమర్థించినది.

జలపుష్పపత్ర ధూప నీరాజనాద్యుపచారములను భక్తిశ్రద్ధలతో ఇష్టలింగమునకు సమర్పించు మాహేశ్వరులు-హృదయమున సద్భావము కలిగియున్నచో-శివానుగ్రహపాత్రులగుదురని యీ వాక్యముద్ఘోషించినది.

14 వ వాక్యము-

"భావగ్రాహ్య మనీడాఖ్యం-భావాభావకరం శివం
కళాసర్గ కరం దేవం-యే విదు స్తే జహు స్తనుమ్"

శక్తి భావముతో గ్రహింపఁదగినవాడు, ప్రాకృతశరీరము లేనివాడు, మోక్షమునకు బంధమునకు కారణము. తన శక్తియొక్క శాంత్యాది కళలతో జగమును నిర్మించువాడు నగు పరమేశ్వరుని బాహ్యాభ్యంతరము లయందు పూజా జప ధ్యానాదులతో ఆరాధించు మాహేశ్వరులు-జన్మరాహిత్యముతో శివసాయుజ్యము నొందుదురు.

భావశుద్ధి లేనట్టి బాహ్యపూజనము డాంబికమగును గాన ఇష్టలింగమును పూజించుచు ప్రాణలింగమును ప్రణవపంచాక్షర్యనుసంధానరూపము నారాధించుచు భావలింగమును "శివోఽహం" ధ్యానముతో దశావధానములతోడను భావింపవలెనని ఇందు తేటపడుటచే శాంభవదీక్షితుఁడు-ప్రతిదినము-ఏకకాలముందైనను లింగత్రయమునందు నిష్ఠగలవాడు కావలెనని విదితమగుచున్నయది.

ఇయ్యది పంచమాధ్యాయము

## అథ షష్ఠాధ్యాయః

1 వ వాక్యమున-

"కళాసర్గకరం దేవం" అనుచో- పరమేశ్వరుఁడు తన శక్తుల ప్రభావముచే జగమును నిర్మించుననుట-యెట్లు పొసఁగును? సృష్టి ప్రళయాదులు-ఆయా వస్తువులయొక్క స్వభావములగుటచే పరమేశ్వరుని సంబంధమే ఉండదుకదా! లేక కాలమైనను జగత్కారణమగుగాక! ఇందువలన పరమేశ్వరుఁడు-జగద్వ్యాపకములగు శక్తుల

నావిర్భవింపఁజేయు ననుట నెట్లంగీకరింపవలె నను-ఆశంకకు సమాధానము ఈ అధ్యాయమని గుర్తింపవలెను.

ఎట్లనఁగా?

కొందరు మేధావులు-స్వభావము జగత్కారణమనియు, అవివేకులైన మరికొందరు-కాలము జగత్కారణమనియు వాక్రుచ్చుచున్నవారు. బ్రహ్మభిన్నమైనదేదియు జగత్సృష్టిప్రళయాదులను నిర్వహింపఁజాలదు. అందువలన జగత్తును నిర్మించుట మొదలగునది-పరమేశ్వరుని మహిమయని అంగీకరింపవలెను. చతుర్ముఖాదులు గల ఈ జగచ్చక్రమును త్రిప్పు సామర్థ్యము-జడములైన స్వభావకాలాదులకు ఉండఁజాలదు.

శ్లో॥ మర్త్యో హి లోకః పరమేశ్వరస్య-లీలావినోదాయ వినిర్మితం గృహం।
అత్రైవ యోగ్యా య ఇహోద్య దృష్టా-స్తేఽముత్ర యోగ్యాః శివతుల్యరూపాః॥"
శరణగీత.

"మానవలోకము.పరమేశ్వరుని లీలావినోదమునకై నిర్మింపఁబడిన గృహమగునది. ఎవరు శాంభవదీక్షితులై శివు నుపాసించుచు మానవోత్తములుగ కనఁబడుదురో, వారే పరమపదమునందు శివసమానులై శివానందానుభవార్హులగుదురు."

ఇవ్విధము తా సృజించిన జగత్తునందు చొఱఁబడినవాడై నిర్లిప్తుడుగ సమస్త జగత్కార్యములను పరమేశ్వరుఁడే నిర్వహించుననియు, జడములగు పంచభూతాదులకు అట్టి సామర్థ్యము లేదనియు ఇఁట తేటపడినది.

2 వ వాక్యమున-

ఈ జగత్తును భూతభవిష్యత్‌వర్తమాన కాలములయందు వ్యాపించి-కాలమును ప్రవర్తింపఁజేయుచు-సత్త్వరజస్తమోగుణముల నధిష్ఠించి-సర్వజ్ఞుఁడై రాణించు పరమాత్మయే-పృథివీ జల అగ్ని వాయు ఆకాశములను సృష్ట్యాదివ్యాపారమును ప్రవర్తింపఁజేయునని సాధకుఁడు భావింపవలెను.

పరమేశ్వరుని వలననే ఆకాశాది పంచభూతమేళనము ద్వారా జగత్తు సిద్ధమగునని "ఆత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః అగ్నే రాపః, అద్భ్యః పృథివీ" ఇత్యాది శ్రుతులు ప్రతి పాదించినవి.

శరీరపోషణార్థము దురితములఁజేయువారి నుద్ధరించుటకై-మధు మాంసములను విసర్జించి సాత్త్వికహారమును శివప్రసాదముగ స్వీక రించుచు చిత్తశుద్ధి గలవారై తరింపుదనియు, బహిర్లింగధారణమే మోక్షమునకు సరిపడదనియు, వామకరతలమున ఇష్టలింగము నర్చించుచు పరస్త్రీలపై చూపు నిలుపువారిపై శివానుగ్రహము ప్రసరింపదనియు, పత్రపుష్పాది సమర్పణక్రియ, మంత్రార్థమును మనస్సులో భావించుచు ప్రణవపంచాక్షరీ మహామంత్రమును జపించుట, "శివోఽహం" ధ్యానము అనువాని నాచరించువారిపై శివానుగ్రహము ఈజన్మయందే ప్రసరించుననియు అభియుక్త మాహేశ్వరుల నిర్వచనము.

3 వ వాక్యమున-

పరమేశ్వరుఁడు జగత్తును సృజించి-సృష్టమును పరిశీలించియు పృథివ్యాదితత్త్వమును జలాదితత్త్వముతోడను ఒకటిగా రెండుగా

మూడుగా ఎనిమిదిగా నుండు ప్రకృతితో కాలముతోడను సూక్ష్మము లగు కామక్రోధాది జీవాత్మ గుణముల తోడను మేళవించును.

ఒకటి-పృథివి............మూడు-పృథివ్యాపస్తేజస్సులు,

రెండు-భూజలములు; ఎనిమిది - పృథివ్యాపస్తేజోవాయ్వాకాశములు మనస్సు బుద్ధి అహంకారము అనునవి.

ఒకదానిని రెండుగా, రెంటిని మూడుగా, మూడిటి నెనిమిదిగా సిద్ధపఱచువాడు పరమేశ్వరుఁడే అని సారాంశము.

4 వ వాక్యమున-

సత్త్వరజస్తమో గుణములతో నేర్పడు పుణ్యపాపకర్మలను పుట్టించి-వస్తువులనన్నిటిని కర్మలఁబట్టి జీవాత్మలకు తారసిల్లఁజేయు వాఁడు పరమేశ్వరుఁ దేను.

పుణ్యకర్మలు-ఫలాకాంక్ష లేనివగుతఱి-ప్రాచీన సుకృత దుష్కృతములు నశించును. ఈ జన్మలో నిష్కామ్యముగ కర్మల నాచరించుటచే నియ్యవి బంధకములు కాజాలవు. కర్మలన్నియు క్షీణింపగా-బద్ధజీవుఁడు ముక్తుఁడై విలక్షణుఁడగును. అనఁగా-ఆవిర్భూతనిజరూపుఁడై శివసాయుజ్యము నొంది-ప్రాకృతవాంఛలు లేకుండుట-విలక్షణత్వమనఁబడును. చిత్తశుద్ధి లేనిచో సర్వవిధ సౌకర్యములు-లోపించును. శరీరవాఙ్మనస్సులచే శివు నుపాసించువారు-చిత్తశుద్ధిఁ బడయుదురు. శివుని సేవించియే మోక్షలక్ష్మీసంపన్నుఁడు కాఁజాలును. శరీర కుటుంబపోషణావశ్యకమగు ధనము లభించుచున్నను తదధికముగ సువర్ణాదిప్రాప్తికై ప్రయత్నించువాడు శివు నారాధింపఁజాలడని వివేకము.

5 వ వాక్యమున-

జగత్తునకు ప్రప్రథమకారణమగు పరమేశ్వరుఁడే-శరీరసంయోగమునకు, శరీరసంబంధకారణములగు పుణ్యపాపాదులకును కారకుఁడగుచున్నవాఁడు-మరియు భూతభవిష్యత్ వర్తమానకాలముల నధిష్ఠించియుండుటచే కాలమునకు కట్టుబడకనుండును జీవసంబంధముగల ప్రాణాదివిభాగములు లేనివాడై నిష్కళుఁడుగా నిర్ణయింపఁబడెను. జీవాత్మకు పూర్వసంస్కారవశమున కలుగు ఇచ్ఛననుసరించి శివుఁడు జీవునిచే మంచిపనిని-లేక-చెడుపనిని చేయించునని శ్రుతి "ఏష ఏవ సాధుకర్మ కారయతి, ఏష ఏవాసాధుకర్మ కారయతి" అని ప్రబోధించినది. ఐతే జీవుఁడు తన పూర్వవాసన ననుసరించి కలుగు దుష్ట అభీష్టములను బలవంతముగ తొలగించుకొనినచో ఆతని శిష్ట అభీష్టముల నీడేర్చుచు చిత్తశుద్ధిని కలుఁగజేసి ధ్యానజపపూజాదుల నొనరింపఁజేయువాఁడు శివుఁడేనని-ఇట- స్పష్టమగుచున్నయది. విశ్వోత్పత్తికారణము స్తోతవ్యుఁడు సర్వాద్యుఁడు నగు శివుని-తన హృదయమున భావలింగముగ నున్నవానిగ ధ్యానించి శివసాయుజ్యము నొందవలెను.

6 వ వాక్యమున-

సంసారవృక్షము, తత్కారణములగు కాలకర్మశరీరములు అనువానిని మించినవాడై ప్రపంచమును ప్రవర్తింపఁజేయుచు జీవాత్మకు సుకృతములను ప్రసాదించి దుష్కృతములను పోగొట్టువాఁడు, ఐశ్వర్యమునకు ప్రభువు, విశ్వాధారంబు నగు పరమాత్మ నమృతునిగా తన హృదయములో నున్నవానిగా నుపాసించినచో ప్రారబ్ధకర్మక్షయానంతరమే ముక్తుండగును.

"బీజమునందు అంకురమున్నట్లు తనలో శివుఁడు దాగి యుండును" అని సిద్ధాంతశిఖామణియందు నిర్వచింపఁబడినది.

దేహమునే శివాలయముగ భావించి ఇష్టప్రాణ భావలింగాత్మకుఁ డగు శివుని–బహిరంతస్స్థలయందు ఉపాసింపవలెను. ఈ అశాశ్వత శరీరములో శివుఁడే సారవత్తరమైన వస్తువగును. శివుఁడు లేని శరీరము-శవమై-పరిత్యాజ్యమగును గాన ఈ శరీరము స్వస్థముగ నున్నపుఁడే శివు నుపాసించుటకు సాధకుఁడు యత్నింపవలెను. శివాలయము నొకచో నిర్మించి శివలింగమును ప్రతిష్ఠించుటకంటె నుత్కృష్టము శాశ్వతఫలప్రదంబు శివలింగధారణంబని మాహేశ్వర ప్రవరుల యభిమతము.

## 7 వ వాక్యము-

"తమీశ్వరాణాం పరమం మహేశ్వరం-తందేవతానాం పరమం చ దైవతం। పతిం పతీనాం పరమం పరస్తాత్-విదామ దేవం భువనేశమీడ్యమ్"

ప్రసిద్ధులైన ప్రభువులను నియమించు మహేశ్వరుఁడు, ఇంద్రాది దేవతల నత్యంత శ్రేష్ఠుఁడు, బ్రహ్మవిష్ణ్వాది పాలకులను మించిన వాఁడు, సమస్తలోకాధీశ్వరుఁడు. భక్తులచే నుతింపఁబడువాఁడు నగు మహాదేవుని పూజాజపస్తోత్ర ధ్యానములతో గుర్తింతుము గాక!

ఇట్లు అసాధారణ ధర్మ విశిష్టుఁడైన పరమాత్మను శివాంశమగు జీవాత్మ–ఇష్టప్రాణ భావలింగస్వరూపునిగ నారాధించి ముక్తుఁడు కావలెనని–మహర్షి ఇట ప్రబోధించెను.

8 వ వాక్యము-

"స తస్య కార్యం కరణం చ విద్యతే-న తత్సమశ్చా భ్యధికశ్చ దృశ్యతే । పరాఽస్య శక్తి ర్వివిధై వ శ్రూయతే-స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ"

పరమేశ్వరునకు ప్రపంచ కార్యసాధకములగు శరీరేంద్రియాదులు-అవసరము లేదు. పరమేశ్వరునితో సమానుఁడు గాని, ఆతనికంటె గొప్పవాడు గాని లేడని భావింపవలెను.

పరమేశ్వరుని శక్తి-ఇచ్ఛాజ్ఞానక్రియలు అను అనేకవిధములు గలదై సహజసిద్ధయై ఉండునది.

పరమేశ్వరునకు శరీరేంద్రియాదులు లేకున్నను "శరీరమును ప్రాణమువలె" పరమేశ్వరు నెడబాయనిదై ఆతని సృష్ట్యాదివ్యాపారమునకు శక్తి తోడుపడుచుండును. మరియు భక్తుల ననుగ్రహించు శివుని లీలావినోదమునకై (ఆతనికంటె వేరైనదైనను) ఆతనియందే స్థిరపడునది. ఆ శక్తియే-పార్వతి, ఉమా ఇత్యాదినామధేయములతో పేర్కొనఁబడుచున్నయది.

ఇచట గల బల శబ్దమునకు ఇచ్ఛ అనునర్థము ప్రాచీనగ్రంథములయందు వ్రాయఁబడినది.

9 వ వాక్యమున-

పరమేశ్వరుని రక్షించువాడు మరియొకఁడు అవసరము లేదు. జగత్తు నాతని శాసించువాడు లేడు. సర్వస్వతంత్రుఁడైన పరమాత్మ నూహించుటకు ఒకానొక గుర్తు లేదు. సమస్త జగత్కర్తయగుటయే గాక శరీరేంద్రియస్వామియగు జీవాత్మను నియమించువాడు-పర

మేశ్వరుఁడేను. (పరమేశ్వరుఁడు, పరమాత్మ, పరశివుఁడు ఇత్యాది పదములు వేదాంతములయందు సమానార్థకములగునట్టివి.) పరమాత్మను పుట్టించువాడు గాని, ఆతని పైవాడు గాని ఎవఁడును లేదనియు, ఒక్కొకజీవునకు ఆతని కర్మననుసరించి సుఖదుఃఖముల ననుభవింపఁజేయువాడు-శివుఁడే ననియు, ఇఁట శ్వేతాశ్వతర మహర్షి-వివరించెను.

ఈ వాక్యమున గల "లింగ" శబ్దమునకు "గుర్తు" అను నర్థము సందర్భోచితమైనది.

## 10 వ వాక్యము—

"య స్తంతునాభ ఇవ తంతుభిః ప్రధానజైః స్వభావతో
దేవ ఏకః సమావృణోత్ । స నో దద్యాత్ బ్రహ్మ
వ్యయమ్"

సాలెపురుఁగు తననుండి తంతువులను పుట్టించి ఆ తంతువు (దారము)లతో చుట్టబడినట్లు - సత్త్వరజస్తమోగుణాత్మకయగు ప్రకృతినుండి ఆవిర్భవించిన మహత్తత్త్వాదులతో సహజముగా (తః ఇష్టముచే) ఆచ్ఛాదింపఁబడిన పరమాత్మ హృదయస్థుఁడైనను గోచరింపకుండును. అట్టి పరమేశ్వరుఁడు జీవునిచే ఉపాసింపఁబడి ప్రసన్నుఁడై తనతో సామ్యము నిడియు స్వీయ ఆనందమును ప్రసాదించువాడగును.

ఇందుకు మహాత్ములయొక్క అమృతవాణీ ప్రబోధమునందు ప్రగాఢవిశ్వాసము ఆవశ్యకమగునది.

11 వ వాక్యము-

"ఏకో దేవః సర్వభూతేషు గూఢః-సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా । కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః-సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"

ఒకే ఒక మహాదేవుఁడు ప్రాణులందఱిలో దాగియుండుటఁజేసి చరాచరమునంతయు వ్యాపించువాడై జీవాత్మల నంతరాత్మగా ప్రేరే పించుచు సుకృతదుష్కృతములను జీవేచ్ఛకు అనుగుణముగా చేయించుచు సాక్షిమాత్రుఁడై ప్రళయమున జీవులందరికి విశ్రాంతి స్థానంబునై జీవాత్మల తెలివిని కాపాడుచు-శక్తి సంకోచము గల వాడునై ఒంటరిగానే ఆనందానుభవతన్మయుండగును.

12 వ వాక్యమున-

స్వతంత్రుఁడైన ఒకే ఒక దేవుఁడు (శివుఁడు) పరాధీనులగుటచే స్వయముగ కర్మనొనర్పఁజాలనట్టి అనేక జీవాత్మలకు సూక్ష్మభూత ములను నానావిధములుగ ననుసంధింపఁజేయును. అట్టి పరమాత్మను శాంభవయోగమువలన తమలోనున్నవానిగ గుర్తించువారికి-శాశ్వత సుఖ(మోక్ష)ము లభించును. భోగలాలసులకు శివోపాసనము ఘటింప కుండుటచే మోక్ష (శివసాయుజ్య)ము చేకూరదని సారాంశము.

13 వ వాక్యము-

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా మేకో బహూనాం విదధాతి కామాన్ । తత్కారణం సాంఖ్యయోగాధి గమ్యం-జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"

నిత్యులైన జీవాత్మలలో నిత్యుఁడు అనఁగా-ప్రళయమందును

స్వరూపముగు మహాజ్యోతిస్స్వగ నుండువాడు, చేతనులై (తెలివిగల వారైన) ప్రాణులలో సంపూర్ణజ్ఞానము గల చేతనుఁడు. అనేకులైన క్షేత్రజ్ఞులకు స్ఫూర్తినొసఁగునట్టి ఒకే ఒక రూపముతో నుండువాడు, జీవుల సదభీష్టముల నీడేర్చువాడు, జగత్కారణంబు, కర్మసముచ్చిత జ్ఞానము (ఉపాసన)చే పొందఁదగినవాడు నగు శివుని దర్శించినచో-సర్వవిధ సంసారబంధములనుండి-జీవాత్మ-విడిబడి-శివసాయుజ్యము నొందును.

## 14 వ వాక్యము-

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం-నేమా
విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః। తమేవ భాంత
మనుభాతి సర్వం-తస్య భాసా సర్వమిదం విభాతి"

పరమేశ్వరుఁడు స్వయంప్రకాశమానమగు పరంజ్యోతియగుటచే- శివప్రకాశమునందు-రవిప్రభలో దీపమువలె-సూర్యకాంతి-లేశమాత్రము కాదు-చంద్రుఁడు నక్షత్రములును స్వల్పాతిస్వల్పకాంతి గలవగును. ఈ మెఱుపులును వెలుగొందవు. అగ్ని-మందగించునని చెప్పనేల? భూత భవిష్యత్ వర్తమానకాలములయందు సంపూర్ణముగ ప్రకాశించు పరమాత్మననుసరించియే సమస్తము వెలుగులోనికి వచ్చుచున్నయది పరమేశ్వరుని దివ్యకాంతిచే సూర్యచంద్రనక్షత్రాదికమంతయు ప్రకాశించుచు-లోకమునకు-చీకటిని పారదోలునది.

## 15 వ వాక్యమున-

ఈ జగత్తులో-సూర్యాదులను ప్రకాశింపఁజేయునట్టి, చేతనాచేతన విలక్షణుఁడైనట్టి, పరశివుఁడు విరాజిల్లుచున్నవాడు, ఇట్టి పరమాత్మయే-అగ్నివలె-జీవకృత పాపములను దహించివేయుటే గాక

జీవునిచే తన నుపాసింపఁజేయుటకు జలప్రధానమైన శరీరములో ప్రవేశించియున్నవాడు. అట్టి శివునినే ఉపాసించినచో మృత్యుమయమగు సంసార సముద్రము నుల్లంఘింపఁ గలుగును. మోక్షమునకు మరియొక సాధనము లేదు గాన శాంభవదీక్షితుఁడై నిష్కామ్యముగ శివు నుపాసించి ముక్తుఁడు కావలెనని ఇందు విదితమైనది.

## 16 వ వాక్యము-

"స విశ్వకృద్విశ్వవిదాత్మయోనిః-జ్ఞః కాలకారో గుణీ సర్వవిద్యః,
ప్రధానక్షేత్రజ్ఞపతి ర్గుణేశః - సంసారమోక్షస్థితిబంధ హేతుః"

పదార్థము_యః = ఏ పరమాత్మ, విశ్వకృత్ = విశ్వమును నిర్మించువాడు, విశ్వవిత్ = చరాచరప్రాణుల వాంఛలను గుర్తించువాడు, ఆత్మయోనిః = తానే విశ్వముగా పరిణమించు ప్రకృతిగ నుండువాడు, జ్ఞః = జ్ఞానస్వరూపుఁడు, కాలకాలః = సర్వాధారమగు కాలమును పుట్టించువాడు. గుణీ = అపహతపాప్మత్వాది దివ్యగుణములు గలవాడు, సర్వవిత్ = చరాచర ప్రపంచగత విశేషములను తన అసంకుచిత జ్ఞానముతో గుర్తించువాడు నగునో, సః = అట్టి పరశివుఁడు- ప్రధానస్య = ప్రకృతి (ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి)కి, క్షేత్రజ్ఞస్య = జీవాత్మకును, పతిః = ప్రభువు, గుణేశః = సత్త్వరజస్తమోగుణములను నియమించువాడు, సంసారస్య = జగత్తునకు, మోక్షస్య = ముక్తికి, స్థితేః = జీవనమునకు, బంధస్య=సంసారపాశబంధమునకును, హేతుః = కారకుఁడగును.

బంధమోక్షములు, జీవనము, సత్త్వరజస్తమోగుణప్రవర్తనంబు

సర్వజ్ఞుఁడు సర్వస్వతంత్రుఁడు నగు శివుని యధీనములే కాని జీవాధీనములు కావని భావము.

## 17 వ వాక్యమున-

పరమాత్మ-"న తత్ర సూర్యో భాతి" ఇత్యాదిని నిర్దేశింపఁబడిన పరంజ్యోతి యగువాడై జననమరణాదులు లేనివాడై, సర్వనియంతగా నిలుకడ గలవాడు, సర్వజ్ఞుఁడు, నర్వవ్యాపకుఁడు జగద్రక్షకుడునై, ఈ ప్రపంచమును ఎల్లకాలము శాసించు వైభవము గలవాడునై యుండును. భూతభవిష్యద్వర్తమానకాలత్రయమునందును జగన్నియామకుఁడు మరియొకఁడులేడని గ్రహింపవలెను.

## 18 వ వాక్యము-

> "యో బ్రహ్మాణం విదధాతి పూర్వం-యో వై వేదాంశ్చ
> ప్రహిణోతి తస్మై। తగ్ంహ దేవ మాత్మబుద్ధిప్రకాశం-
> ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే"

ఎవడు సర్వాద్యుఁడైన చతుర్ముఖ బ్రహ్మదేవుని పుట్టించి-ఆతనికి వేదముల నుపదేశించెనో, అట్టి, నా బుద్ధిని వికసింపజేయు నట్టి మహాదేవుని-ముముక్షువునై శరణముగ ఆశ్రయించుచున్నాను. శాంభవదీక్షాస్వీకారమే శరణాగతికి నాంది యనియు బ్రహ్మాదుల నాశ్రయించుటచే మోక్షము సంఘటింపదనియు వివేకము.

## 19 వ వాక్యమున-

అవయవములులేనిది, నిశ్చలము, నిర్వికారము, దోషరహితము పుణ్యపాపలేపరహితము, మోక్షమునకు పరమావధి, కట్టెలు పూర్తి కాలిన నిప్పువంటిది యగు పరశివాత్మక జ్యోతిర్లింగమును మోక్షా

పేక్షతో బాహ్యాభ్యంతరములయందు ధరించి-పూజించుచు ప్రార్థించుచు ధ్యానించుచును "భోగమోక్షములకు నీవే ఆధార" మని శరణాగతుఁడ నగుచున్నాను.

20 వ వాక్యము-

"యదా చర్మవదాకాశం-వేష్టయిష్యంతి మానవాః ।
తదా శివ మవిజ్ఞాయ-దుఃఖస్యాంతో భవిష్యతి ॥

ఆకాశమును చర్మపలె మానవులు (తదుపలక్షిత దేవదానవాదులు) చుట్టి కప్పుకొనఁగలుఁగనెడ—శివశబ్దైకవాచ్యంబగు పరబ్రహ్మము నుపాసించి గుర్తింపకయే-సంసారదుఃఖమును పోగొట్టుకొనఁగలుగుదురు. అనఁగా-శివు నుపాసించియే మోక్షము నొందవలెననియు, "శివ ఏకో ధ్యేయః శివంకరః, సర్వమన్యత్ పరిత్యాజ్య" ఇత్యాది శ్రుతులు పై యంశమునే సమర్థించిననియు ఇఁట నిర్ధారితమైనది.

21 వ వాక్యమున-

శ్వేతాశ్వతరుఁడను శివయోగి-యోగధ్యానశక్తివలన శివానుగ్రహమువలనను బహుఋషులచే ఆచరింపఁబడి అనుభవింపఁబడినది, పరమపవిత్రంబు నగు శివతత్త్వమును అత్యాశ్రములనఁబడు శ్రౌతశైవులకు బాగుగా విశదీకరించుచు ఉపదేశించెను.

22 వ వాక్యమున-

ఉపనిషత్తులలో రహస్యము, పూర్వకాలమునందు ఉపదేశింపఁబడినదియు నగు నీ శివజ్ఞానమును-ప్రశాంతచిత్తుఁడగు కుమారునకు శిష్యునకైన నుపదేశింపవలెను. కుమారుఁడు లేక శిష్యుఁడు ప్రశాంత

చిత్తుఁడు కానిచో-అట్టివారికి ఇద్దాని నుపదేశింపఁగూడదని-శ్వేతాశ్వతరమహర్షి-ఇఁట-తన సదాశయమును ప్రకటించెను.

## 23 వ వాక్యమున-

వేదాంత ప్రబోధార్హుఁడైన శిష్యుఁడెట్టివాడు కావలెననఁగా-

ఈ యుపనిషత్తునందు నిర్దేశింపఁబడిన లక్షణము గల పరమశివునందు కలుగు అనన్యఏకాగ్రభక్తి- వేదాంతజ్ఞానబోధకుఁడగు ఆచార్యునందు గల మహాత్మునకు—ఇంతవరకు చెప్పఁబడిన అంశములు ప్రకాశించును. అనఁగా- ఇందలి ప్రతిపాదనము-ఇతరులకు చెప్పుటకే గాక-స్వానుభవరూపమగునని విబుధులు గ్రహింతురుగాక!

శ్వేతాశ్వతరోపనిషత్తు-సర్వము
శివతత్త్వప్రభాచంద్రీకరణముతో సమాప్తము.

---

## ముఖ్య గమనిక

శ్రీ మంద సత్యనారాయణ—బి.ఏ. బి ఇ.డి. గారిచే రచింపఁబడి వెలకం ప్రెస్, ప్రైవేట్ లిమిటెడ్, బ్రాడీపేట గుంటూరునందు ముద్రింపఁబడిన "పురుష (సూక్త) వేదసుధ, అను గ్రంథములో 21వ పుటయందు శ్రీ ఆలమూరి వేంకట సీతామహాలక్ష్మిదేవిగారు రచించిన ప్రబోధ గీతమును దిగువ చదివి—స్త్రీ ప్రణవనిషేధవాదులు తమ ఆర్భాటమును విరమింతురు గాక!

"ప్రాణాయామము చేయుచునిల- ప్రణవాక్షరమును పలుకవలెన్. నియమముతోడను ప్రణవాభ్యాసము స్త్రీ పురుషుల కగు శీలము రా"

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

శ్రీ సద్యోజాతాది పంచబ్రహ్మమూర్తయే నమః

# శ్రీ యజుర్వేదీయ జాబాలోపనిషత్తు

ఇందు ఆరు వాక్యములు గలవు.

## మొదటి వాక్యము-

"అత్ర హి జంతోః ప్రాణేషూత్క్రమమాణేషు రుద్ర స్తారకం బ్రహ్మ వ్యాచష్టే । యేనాసావమృతీభూత్వా మోక్షీ భవతి. తస్మాదవిముక్తమేవ నిషేవేత, అవిముక్తం న విముంచే దేవమేవైతద్యాజ్ఞవల్క్యః"

జగద్రూపుడగు పరమేశ్వరునకు భ్రూమధ్యస్థాన మనఁబఱఁగు అవిముక్త (కాశీ) క్షేత్రమున జీవాత్మయొక్క పంచప్రాణములు శరీరమునుండి లేచుచుండగా-విశ్వనాథుఁడు-తారకమగు ఓంకార (ప్రణవ)మును అద్దాని స్థూలరూపమగు శివపంచాక్షరీమహామంత్ర మును దక్షిణకర్ణమున నుపదేశించును. అట్టి యుపదేశముచే ఈ ప్రాణి-జరామరణరహితుఁడై శివసాయుజ్యము నొందును. అందు వలన అవిముక్తక్షేత్రమున నివసించి-ఆజన్మాంతము విడువకుండ వలెను. ఇట్లు బృహస్పతికి యాజ్ఞవల్క్యుఁడు నిర్వచించెను.

## ద్వితీయవాక్యమున-

శివభక్తుఁడు-అవిముక్తమునందు శివు నుపాసింపవలెను. వరణ అసి అనఁబడు నదులమధ్య-వారాణసియనఁబఱఁగుచు అవిముక్త క్షేత్రము ప్రతిష్ఠితమై యున్నది. ఇంద్రియకృత దోషములను పోగొట్టునదగుటచే "వరణ" అనియు, ఇంద్రియకృత దురితములను కత్తివలె ఛేదించును గాన "అసి" అనియు ఇవి పేర్కొనఁబడును.

## తృతీయవాక్యమున-

బ్రహ్మచారులైన శివయోగులు "కింజప్యేనామృతత్వంబ్రూహి" "దేనిని జపించినచో మోక్షము చేకూరు" నని ప్రశ్నింపగా-యాజ్ఞవల్క్యమహర్షి-"శతరుద్రీయేణేతి" "శతరుద్రీయమనఁబడు రుద్రాధ్యాయ (నమకచమక)మును భస్మరుద్రాక్షధారియై జపించినను, శతరుద్రీయముఁ జదువుచు శివు నభిషేకించినను ముక్తుఁడగును.

ఎందుకనఁగా "ఏతాని హ వా అమృతస్య నామధేయాని భవంతి. ఏతైర్హవా అమృతో భవతీతి" శతరుద్రీయము నందు చెప్పఁబడిన భవరుద్రాదినామదేయములు-అనాదిముక్తుడైన పరమేశ్వరునిఁ జెప్పునట్టివి. ఇట్టి నామదేయముల నుచ్చరించుటతో జీవుఁడు-శివుఁడగును" అని బ్రహ్మచారులకు ప్రబోధించెను.

## నాలుగవ వాక్యమున—

జనకమహారాజు ప్రశ్నింపగా-యాజ్ఞవల్క్యమునీంద్రుఁడు-బ్రహ్మచర్యమును ముగించి గృహస్థుఁడై వానప్రస్థుఁడునై సన్న్యాసాశ్రమమును స్వీకరింపవలెను. అథవా ఏనాడు వైరాగ్యము కలుగునో ఆనాడే సన్న్యసింపవచ్చును. విరాగుఁడు-బ్రహ్మచారియైనను స్నాత

కుఁడైనను గృహస్థుఁడైనను వానప్రస్థుఁడైనను సన్న్యాసి కావచ్చును ఇత్యాదిని వక్కాణించెను.

## ఐదవ వాక్యమున-

అత్రిమహర్షి ప్రశ్నింపగా- యాజ్ఞవల్క్యుఁడు- "ఆతురుఁడు- ప్రాణత్యాగమునకై గంగాగోదవర్యాది పుణ్యనదీజలమందు పడినను, అగ్నిఁ బ్రవేశించినను, మహాప్రస్థానము నొనర్చినను ముక్తుండగును" ఇత్యాదిని ప్రత్యుత్తరించెను.

## ఆరవ వాక్యమున-

సన్న్యాసి-ప్రాణధారణకై శ్రోత్రియుల గృహములయందు సద్యోవక్వమైన ఆహారమును యాచించుచు-శివాలయమునందైనను గుడ్డి గుడిసెయందైనను, వృక్షమూలాదులయందైనను నదీతీరమున నైనను, పర్వతగుహయందైనను జలప్రవాహమునకు దూరముగ నిర్జన పరిశుభ్రప్రదేశమునందైనను నివసించుచు అహంకారమమ కారములను విసర్జించి-ప్రణవపంచాక్షరిని జపించుచు శివుని ధ్యానించుచు దేహత్యాగముఁజేయునెడ-అమృతుండగును.

ప్రణవ పంచాక్షరీజపము శివధ్యానము తదితర ఆవశ్యకములున్న శాంభవదీక్షితుఁడైన పరివ్రాట్టునకే-అథవా-నిరాహారి శైవునకే సాధ్యములగునని-ఈ ఆరు వాక్యముల సారాంశము-ద్యోతకమగుచుండుట-ఇందు గమనార్హము.

ఓం తత్సత్.

జాబాలోపనిషత్తు-సమాప్తము.

—o—

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

# శ్రీ యాజుషీయ కాలాగ్నిరుద్రోపనిషత్తు

"సహనావతు" ఇత్యాది-శాంతిపాఠము.

ఓం అథ కాలాగ్నిరుద్రోపనిషదః సంవర్తకోఽగ్ని ర్ఋషిః, అనుష్టుప్ ఛందః, శ్రీ కాలాగ్నిరుద్రో దేవతా, శ్రీ కాలాగ్నిరుద్రప్రీత్యర్థే భస్మత్రిపుండ్రధారణే (జపే) విని యోగః.

ఈ యుపనిషత్తునకు-సంవర్తకాగ్ని యనువాడు-ఋషి, అను ష్టుప్-ఛందస్సు, శ్రీకాలాగ్నిరుద్రుఁడు-దేవత, శ్రీకాలాగ్నిరుద్రుని ప్రీత్యర్థము-భస్మత్రిపుండ్రములను ధరించునపుడు-లేక-జపరూప ముగా-దీనిని వినియోగింపవలెను. భగవానుఁడైన కాలాగ్నిరుద్రుని సనత్కుమారుఁడు ప్రణమిల్లి-భస్మత్రిపుండ్రధారణవిధానమును ప్రబో ధింపుమని ప్రశ్నింపగా-కాలాగ్నిరుద్రుఁడు దిగువవిధము వక్కాణిం చెను. సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములఁ జదువుచు అగ్ని సంభూతమగు భస్మఁబరిగ్రహించి "అగ్నిరితిభస్మ" ఇత్యాదివాక్యము లతో నభిమంత్రించియు "మానస్తోకే" అను మంత్రముతో స్వీకరించి "మానో మహాంతం" అను మంత్రమున నీటఁదడిపి "త్రియాయుషం" ఇత్యాదిమంత్రముల నుచ్చరించుచు-నొసలు, వక్షస్సు, భుజములు,

చేతులు, ఉదరము, పాదములు ఇత్యాది స్థలములయందు మూడు రేఖలుగ ధరింపవలెను.

"వ్రత మేతచ్ఛాంభవం సర్వేషు వేదేషు వేదవాదిభి రుక్తం భవతి, తస్మా త్త త్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ".

"ఈ భస్మత్రిపుంద్ర ధారణము-శాంభవవ్రతమనఁబడుఁగును. వేద వేత్తలు వేదములన్నిటియందు దీనిని పేర్కొనినవారు. అందువలన మోక్షముఁ గోరువారు-పునర్జన్మ లేకుండుటకై దీనిని నిత్యము ఆచరింపవలెను.

ఫాలప్రదేశమున నేత్రాంతములవరకు శిరస్సునుండునట్లు కను బొమల నడుమ భస్మరేఖాత్రయమును ధరింపవలెను. ఇట్లు విధి పూర్వకముగ భస్మరేఖలను ధరించువాడు- బ్రహ్మచారియైనను, గృహస్థుఁడైనను, వానప్రస్థుఁడైనను, యతి (అత్యాశ్రముఁడు) ఐనను, మహాపాతక ఉపపాతకములను పోగొట్టుకొని సమస్త పుణ్య తీర్థములయందు గ్రుంకులిడిన ఫలమును, వేదముల నన్నిటిఁ జదివిన మహిమను, బ్రహ్మవిష్ణ్వాద్యమరుల నర్చించిన పుణ్యమును, శివ మంత్రము నెల్లకాలము జపించిన సుకృతమును పొందుటయేగాక- జీవితమున కామ్యాకామ్యసుఖముల ననుభవించి-శరీరత్యాగానంతరము శివసాయుజ్యము నొందును. మరల నీలోకమున జన్మపరంపర లేని వాడగును.

ఇయ్యది-కాలాగ్నిరుద్రుని దివ్యామృతప్రబోధము. దీనిని భస్మఁధరించుచు పఠించువాడు-ముక్తుఁడగును.

"సహనా వవతు" ఇత్యాది-శాంతిపాఠము.

కాలాగ్నిరుద్రోపనిషత్తు-సమాప్తము.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీ ఆథర్వణీయ అథర్వశిరోపనిషత్తు

"ఓం భద్రం కర్ణేభిః" ఇత్యాదికము-శాంతిపాఠము.

"ఓం దేవా హ వై స్వర్గం లోక మగమం స్తే రుద్ర మపృచ్ఛన్, కో భవానితి, సోఽబ్రవీ దహమేకః ప్రథమ మాసం, వర్తామి చ, భవిష్యామి చ, నాన్యః కశ్చిన్మత్తో వ్యతి రిక్తః"

"ఒకప్పుడు బ్రహ్మవిష్ణ్వాది దేవతలు-స్వర్గలోకమనదగు కైలాసమునకు వెళ్ళగా-పరమేశ్వరుడు సాక్షాత్కరించెను. అప్పుడు వారు మహేశ్వరుని "నీవెవరని" ప్రశ్నింపగా-నేను సృష్టికి పూర్వము ఉంటిని, సృష్టిలో ఉండువాడను, భవిష్యత్ కాలమునఁ గూడా ఉంటాను. భూతభవిష్యత్వర్తమాన కాలములయందును నాకంటె ఇతరుఁడెవఁడు నుండఁజాలడు" ఇత్యాది వాక్యములతో పరమేశ్వరుడు-అమరులకు తానే పరమాత్మనని ప్రబోధించెను.

అందువలననే శివుఁడు-దేహేంద్రియాంతఃకరణములలో నివాసైన జీవాత్మలో ప్రవేశించెనని ఈ యుపనిషత్తు విశదపఱచినది.

నిత్యము, అనిత్యము, బ్రహ్మము, దిశలు, విదిశలు, పురుషుఁడు స్త్రీ, గాయత్రి, సరస్వతి, ఛందస్సులు, అగ్నిత్రయము, ఋగ్యజుః

సామాథర్వణవేదములు, ఆదిమధ్యాంతములు, సర్వాతీతమైన జ్యోతిస్సు ఇత్యాదులు నేనేనని మహేశ్వరుఁడు నిర్వచించెను.

మరియు నన్నెవరు తెలిసికొనెదరో వారు దేవతలందరిని గుర్తింతురని ప్రబోధించెను.

"యో హ వై రుద్రః స భగవాన్, యశ్చ బ్రహ్మా, భూర్భువఃసువ స్తస్మై వై నమోనమః శీర్షం జనదోం విశ్వరూపోఽసి"

ఇత్యాది మంత్రములయందు-బ్రహ్మదేవుఁడు, విష్ణుమూర్తి, మహేశ్వరుఁడు, ఉమాదేవి, వినాయకుఁడు, స్కందుఁడు, ఇంద్రుఁడు, అగ్ని, భూర్భువఃసువర్మహోజనతపఃసత్యలోకములు, పృథివీజలతేజోవాయ్వాకాశములు, సూర్యచంద్రులు, నక్షత్రములు, అష్టగ్రహములు, ప్రాణవాయువు, కాలము, యముఁడు, మృత్యువు, అమృతము, శాంతి, పుష్టి, తుష్టి ఇత్యాదులు శివుఁడే ననియు, మాత్రాత్రయము గల ఓంకారము-ప్రణవమనఁబడుచు-సర్వవ్యాపకము అనంతము తారము సూక్ష్మము శుక్లము వైద్యుతము పరబ్రహ్మంబు ననియు పేర్కొనఁబడినది.

రుద్రుఁడే-ఈశానుఁడు మహేశ్వరుఁడు మహాదేవుఁడు నని వ్యవహరింపఁబడును. స్మరించుచుండగానే తన శరీరము నూర్ధ్వముఖముగా నొనర్చునదగుటచే ఓంకారమగుననియు, ఉచ్చరించుచుండగానే-ఋగ్యజుఃసామాథర్వణవేదములను యజ్ఞమున బ్రాహ్మణులకు అందించును గాన ప్రణవమనియు, సమస్తలోకములను వ్యాపించుటచే సర్వవ్యాపియనియు, గర్భజన్మవ్యాధిజరామరణములు గల సంసారమువలన నగు మహాభయము అను సముద్రమునుండి తరింప

జేయునదగుటఁజేసి తారమనియు తెలియవలెను. "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థుః" "ఒకఁడే రుద్రుఁడున్నవాఁడు-రెండవవాఁడుఅను శబ్దముతో చెప్పఁబడుటకు-రుద్రునకు వేరైనవారు లేరు" ఇత్యాదిని పరమేశ్వరుఁడు-తన నెడఁబాయనట్టి శాసించు పుట్టించు శక్తులతో సృష్టిఁజేసి రక్షించుచు అంత్యకాలమున విశ్వమును సంకుచితము నొనర్చువాఁడు అనియు, బ్రహ్మవిష్ణ్వాదుల నందరిని శిక్షించువాఁడగుటచే ఈశానుఁడనియు, జీవాత్మలయొక్క కర్మవాసనలఁ బోగొట్టి అనుగ్రహించియు శాంభవదీక్షాయోగమును కలుగఁజేయువాఁడగుటచే మహేశ్వరుఁడనియు, ప్రకృతిఁజెందిన వికారములను పరిత్యజించి-గొప్పనైన జ్ఞానయోగైశ్వర్యమునందే విరాజిల్లుటచే మహాదేవుఁడనియు, పరమేశ్వరు నుపాసింపవలెను. వేదవేదాంతములయందలి శివపరములగు వాక్యములు గ్రహింపఁదగినవి. దేవతలు, ఋషులు, పితరులు, మానవోత్తములందరును శివునుపాసించియే ముక్తులైరి. హృదయమున వెంట్రుకకొనయంత గల జీవాత్మ (తన)లో పరమేశ్వరుఁడున్నవాఁడని భావించువారికే మోక్షము సమకూరును. అంతర్యామిభావన లేనివారికి పరమశాంతి (ముక్తి) లభింపదు. సమస్త ప్రపంచమును అంతర్యామిగ వ్యాపించి పరిపూర్ణుఁడగు పరమేశ్వరుని ప్రణవశివ పంచాక్షరీ మహామంత్రముతో నుపాసింపవలెను. పంచప్రాణముల చేరిక, హృదయము అనువానిమధ్య ప్రాణలింగస్వరూపముతో పరమేశ్వరుఁడు విరాజిల్లును. క్రోధము, క్షమ, ఇత్యాది గుణములు-మనస్సు నాశ్రయించునట్టివి. జననమరణాదులకు మూలమగు తృష్ణ (ఆశ)ను విసర్జించి శుద్ధబుద్ధితో బాగుగా విచారించుకొనియు తృష్ణాశ్రయమగు మనస్సును తృష్ణారహితముగ నొనర్చి-పరమేశ్వరునందు నెంకొలుపవలెను. రుద్రుని విషయమై జ్ఞానులు "రుద్రుఁడు ఒక్కఁడే పరమాత్మ"యని చెప్పుదురు.

"ఇష మూర్ధం తపసా నియచ్ఛత" అభివృద్ధినొందించు ఇష్ట లింగమును దీక్షచే ధరింపుడు" "వ్రతమేతత్ పాశుపతం" "భస్మ రుద్రాక్షధారణ మంత్రజపాది సంపన్నమగు శివలింగధారణము-పాశుపతవ్రతముగ పేర్కొనఁబడును. "పశువైన జీవుని సంసారపాశము నుండి ఈ జన్మయందే విడదీయునది-పాశుపతవ్రతమగును.

ఈ అథర్వశిరస్సు నధ్యయనముఁజేయుచు ఇందు చెప్పఁబడిన రీతిని శివు నుపాసించువాడు-పాపనిర్ముక్తుఁడై పరమపవిత్రుఁడునై ముక్తుండగును. ఇట్టివానిని దేవతలు గుర్తింతురు. మరియు గాయత్రీ మంత్రలక్షజపఫలమును, రుద్రాధ్యాయమును లక్షతడవలు జపించిన పుణ్యమును, సమస్త పుణ్యతీర్థస్నానసుకృతమును, సర్వయజ్ఞాచరణ ఫలమును, వేద పురాణ ఇతిహాస శివాగమాదిపఠన మహిమను, దశ సహస్ర ప్రణవజపఫలితమును పొందును. తన వంశములో పూర్వీకు లగు పదితరములవారిని ముందు జన్మించు పదితరములవారిని తరింపఁజేయును.

ఇట్లు అథర్వశిరుఁడను మహర్షి-వక్కాణించెను.

"యో రుద్రో అగ్నౌ యో అప్స్వంత ర్య ఓషధీ ర్వీరుధ ఆవివేశ తస్మై రుద్రాయ నమో అస్తు"

"అగ్నియందు ఉదకములయందు ఓషధులలో లతాగుల్మములయందును సూక్ష్మరూపమున నుండు రుద్రునకు నమస్కారము."

"ఓం భద్రం కరణేభిః" ఇత్యాదికము-శాంతిపాఠము.

అథర్వశిరోపనిషత్తు-సమాప్తము.

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

# శ్రీ అథర్వణీయ అథర్వశిఖోపనిషత్తు

పైప్పలాదుఁడు, అంగిరస్సు, సనత్కుమారుఁడును—"భగవానుఁడా! శివధ్యానమున దేనిని మొదటఉచ్చరింపవలెను? ధ్యానము నెట్లు చేయవలెను? ధ్యానించువాడెవఁడు? ధ్యానింపఁదగినవాడు ఎవరు?" అని ప్రశ్నింపగా-అథర్వణుఁడు దిగువవిధము వచించెను. శివధ్యానమున మొదట ఓంకారము నుచ్చరింపవలెను. ఓంకారముతో ప్రణవపంచాక్షరితోఁడను శివుని ధ్యానింపవలెను. ప్రణవధ్యేయుఁడైన శివుఁడే-అక్షరము పరబ్రహ్మంబు నగును.

అకార ఉకార మకారములు అర్ధ (చంద్రాకార) మాత్రయను దానితో ఓంకారము-నాలుగు పాదములు కలదగును.

ఓంకారము-బ్రహ్మ విష్ణు రుద్ర సదాశివమయము కాగా ఐదవదగ నాదము పరశివమయంబు నగును.

ఇంద్రియములను మనస్సున నిలిపి-

"ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం-సర్వమిదం బ్రహ్మ విష్ణు రుద్రేంద్రా స్తే సంప్రసూయంతే-సర్వాణి చేంద్రియాణి సహభూతైః-న కారణం కారణానాం, ధ్యాతా-కారణంతు ధ్యేయః సర్వైశ్వర్య సంపన్న స్సర్వేశ్వరః శంభు రాకాశమధ్యే"

ఏకాగ్రచిత్తమున ధ్యేయుండైన పరశివుని దిగువవిధము ధ్యానింపవలెను. "బ్రహ్మవిష్ణు మహేశ్వరాది చేతనాచేతన ప్రపంచము ఇంద్రియములన్నియు, పంచమహాభూతములు శివునివలన ఆవిర్భ వించును. జగత్కారణములగు ప్రకృత్యాదులకు కారణంబగు శివుడు దేనినుండియు ఆవిర్భవించుట లేదు. ధ్యానించు పురుషుఁడు సర్వ కారణమైన శివుని-హృదయాకాశమున-సర్వైశ్వర్యసంపన్నుని గాను, సర్వేశ్వరునిగాను ధ్యానింపవలెను.

ఇందే మరల "శివ ఏకో ధ్యేయ శ్శివంకరః సర్వమన్య త్పరి త్యాజ్య" "ముముక్షువు-దేవతాంతర మంత్రాంతరాదులను విడనాడి-ఇహపరశ్రేయఃప్రదుఁడగు శివునొకనినే ధ్యానింపవలెను" అని శివ ధ్యానము బలపరుపఁబడినది.

అధర్వశిఖోపనిషత్తు-సమాప్తము.

# అథ యాజుషీయ రుద్రహృదయోపనిషత్ ప్రారంభః

## శుకవ్యాస సంవాదము-ఈయుపనిషత్తు.

"సర్వదేవాత్మకో రుద్ర-స్సర్వే దేవా శ్శివాత్మకాః"

"రుద్రుఁడు సర్వదేవతాస్వరూపుఁడు, అమరులందరు-శివుఁడం తర్యామిగ గలవారు"

"యా ఉమా సా స్వయం విష్ణుః" అనువాక్యమున-ఉమాదేవియే

విష్ణువని చెప్పుటచే-విష్ణువు శక్త్యంశమని తేటపడుచున్నయది. త్రైలోక్యవృక్షమూలము- బ్రహ్మ విష్ణు మహేశ్వరులగుదురు."

రుద్ర శబ్దమును త్రివారముచ్చరించు విచక్షణుఁడు-సర్వపాప నిర్ముక్తుఁడగును. స్త్రీ పురుషులు వాణీహిరణ్యగర్భులు లక్ష్మీనారాయణులు, ఛాయాసూర్యులు, తారాచంద్రులు, దివారాత్రులు, యజ్ఞవేదికలు, స్వాహావహ్నులు, వేదశాస్త్రములు, వల్లీవృక్షములు, గంధపుష్పములు, పీఠలింగములు, ద్వంద్వములన్నియు పార్వతీపరమేశ్వరుల అంశములతో నేర్పడినవి.

సర్వదేవాత్మకుఁడగు రుద్రుని "రుద్రో నర ఉమా నారీ"ఇత్యాది మంత్రములతో నమస్కరింపవలెను. జలమధ్యమున మంత్రార్థమును భావించుచు జపించునెడ-బ్రహ్మహత్యాపాపము నివర్తించును. సచ్చిదానందమయము ప్రాకృతవాఙ్మనస అగోచరంబు నగు శివతత్త్వమును తెలిసికొనినచో-సమస్తంబు విదితమగును.

విద్య- పర అపర యని ద్వివిధంబగును.

ఋగ్యజుఃసామాథర్వవేదములు, శిక్షా కల్ప వ్యాకరణ నిరుక్త ఛందోజ్యోతిషములు అను వేదాంగములు, పరమాత్మఁజెందనట్టి ప్రాకృతబుద్ధులును అపరవిద్య యనఁబడును.

ఓంకారవాచ్యము, అగ్రాహ్యము, అగోత్రము, రూపవర్జితము, నిత్యము, విభువు, సర్వగతము, సుసూక్ష్మము, అవ్యయము భూతయోనియు నగు శివతత్త్వమును కనుగొనుటకు గల సాధనములలో నుత్తమమైన శివపంచాక్షరీ మహామంత్రానుసంధానము శివలింగధారణపూర్వకముగ ఇష్టప్రాణభావలింగాత్మక మహాలింగము నుపాసించుచు ఉపనిషదర్థమును విచారించుట- పరవిద్య యనఁబడును.

యథావిధి కల్యాణదేశికు నాశ్రయించి పరవిద్యఁ బరిగ్రహింప వలెను. ఈ శరీరవృక్షమున మంచిరెక్కలు గల పక్షులఁబోలిన జీవే శ్వరులు కలరు. అవ్వారిలో జీవాత్మ-కర్మఫలము ననుభవించుచుం డును. మహేశ్వరుఁడు జీవుని కర్మఫలానుభవమునకు సాక్షిగ నుండును.

శివసాక్షాత్కారముతో జీవుని శోకమోహములు-పటాపంచ లగును. పాపరహితులైన జిజ్ఞాసువులు-శివుని-పూజాజపధ్యానము లతో దర్శింపఁ గలుఁగుదురు. మాయాపాశబద్ధులకు శివదర్శనము సంఘటింపదు.

ఇత్యాదిని-సంసారదుఃఖమును పోగొట్టు రుద్రుని రహస్యమైన విజ్ఞానమును ప్రబోధించిన రుద్రహృదయోపనిషత్తు-శాంకరీయ శివ తత్త్వప్రభాఽఽంధ్రీకరణముతో-సమాప్తము.

శ్రీ మహాగణాధిపతయే నమః

# అథర్వాణీయ
# భస్మ జాబాలోపనిషత్తు

భుసుండుఁడనఁబడు జాబాలుఁడు-మహేశ్వరునకు ప్రణమిల్లి బిల్వదళములను విభూతిని చేతఁబట్టుకొని-దోసిలొగ్గినవాడై-అర్చిం చియు శిరస్సువంచి భస్మధారణవిధానముఁ గూర్చి ప్రశ్నించెను.

అట్టితఱి-బ్రహ్మవిష్ణురుద్రాతీతుఁడు హిరణ్యవర్ణరూపమున భాసిల్లువాడు, ఓంకారస్వరూపుఁడు, ఉమార్ధకృతశరీరుఁడు, సోమ సూర్యాగ్నినయనుఁడు, అనంతుఁడు, సూర్యచంద్రకాంతి గలవాడు,

వ్యాఘ్రచర్మాంబరధరుడు, మృగహస్తుడు భస్మోద్ధూళితవిగ్రహుడు తిర్యక్ త్రిపుండ్ర రేఖావిరాజమాన ఫాలప్రదేశుడు, స్మితపూర్వాభిభాషియు, వీరాసనారూఢుడు, అప్రమేయుడు, అనాద్యంతుడు, నిష్కళుడు, నిర్గుణుడు, శాంతుడు, నిరంజనుడు, అనామయుడు నగు మహేశ్వరుడు-తనమూలరూపమగు పరశివుని ప్రార్థించి దిగువ విధము జాబాలునకు చెప్పదొడగెను.

గోమయము నుదయాత్ పూర్వము స్వీకరించి "త్ర్యంబకం" అను మంత్రముతో ఎండించి అగ్నియందు "సోమాయస్వాహా" అను మంత్రముతో తిలలు వడ్లతో కూడిన నెయ్యితో అష్టోత్తర సహస్ర (1008)పర్యాయములు చివరన-త్ర్యంబకమంత్రముతో 108సారులు హవనము నొనర్చి-స్విష్టకృద్ధోమమును పూర్ణాహుతిని అష్టదిక్పాలక బలిప్రదానమును గావించి-అగ్ని ఉష్ణత-పూర్తిగా తగ్గిన తరువాత-అట్టి భస్మపై గాయత్రీమంత్రజలమును చల్లియు సువర్ణరజతతామ్ర మృణ్మయములలో ఏదేనొక పాత్రయందు ఉనిచి రుద్రగాయత్రితో మరల జలప్రోక్షణముజేసియు పరిశుభ్రప్రదేశమున నెలకొలుప వలెను. ఆ సమయమున మాహేశ్వరులకు భోజనము నిడియు తాను పరిశుద్ధుడై "సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములతో పరిశుభ్రమైన వామహస్తమున స్వీకరించిన పొడిభస్మతో అపాదమస్తకము ఉద్ధూళనము జేసికొనవలెను.

భస్మ దడిపి-తర్జనీ మధ్యమానామికాంగుళులతో మూడురేఖలుగ శిరస్సు, లలాటము, కంఠము, హృదయము, నాభి, భుజములు. పృష్ఠము, పాదములు ఇత్యాది స్థలములయందు ధరించినవాడై శివుని నమస్కరించియు భస్మదడిపిన శేషమును శరీరమునకు పూసికొనవలెను-ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములయందు బ్రాహ్మణుడు-

భస్మధారణమును జ్ఞాపకముతో చేసికొనుట-విధియైయున్నది. భస్మను ధరింపక-భుజింపఁగూడదు. నీరు త్రాగవలదు. గాయత్రీ శివపంచాక్షర్యాది మహామంత్రములను జపింపరాదు. హవనమును దేవర్షి పితృతర్పణము నొనర్పఁగూడదు. బ్రహ్మచారులు, గృహస్థులు, వానప్రస్థులు, సన్న్యాసులును భస్మను ధరింపవలెను. ప్రమాద వశమున ధరింపనిచో-జలమధ్యమున అష్టోత్తరశతగాయత్రీజపము, ఉపవాసము అనునవి-ప్రాయశ్చిత్తములు. యతి-భస్మధారణమును విడనాడినచో ఒకనాడు ఉపవసించి పన్నెండువేలు ప్రణవమును జపింపవలెను. అట్లు కానిచో మరణానంతరము యముఁడు యతులను జంతువుల పాలు చేయును. మంత్రపూతమగు భస్మ లభింపని యెడల-దావానల భస్మనైనను మరియొక లౌకికభస్మనైనను ధరింపవలెను.

భస్మధారణమువలన స్వర్ణచౌర్యాది మహాపాపములు నశించును. సమస్త వేదపారాయణఫలమును, సమస్త పుణ్యతీర్థస్నానఫలమును దీర్ఘాయుష్యమును పొందును.

## ద్వితీయాధ్యాయము

జాబాలుఁడు ప్రశ్నింపగా మహేశ్వరుఁడు చెప్పఁదొడఁగెను. బ్రాహ్మణుఁడు సూర్యోదయమునకంటె ముందు మేలుకొని-శౌచాదికమును నిర్వర్తించి స్నానముఁజేసి మడిధోవతిఁగట్టుకొని-ఉదయించుచున్న సూర్యునకు మ్రొక్కియు భస్మోద్ధూళనమును గావించుకొని త్రిపుండ్రములను ధరింపవలెను. రుద్రాక్షలఁధరింపవలెను. ఆ పిదప సంధ్యావందనప్రయుక్తమగు గాయత్రీమంత్రజపము నొనర్చి-శివపంచాక్షరిఁజపించియు త్రికాలములయందు శివలింగము నర్చింపవలెను. శివపూజావిధానమెట్లనఁగా-రుద్రసూక్తములతో శివు నభి

షేకించి భస్మను కోమలబిల్వదళములను ధూపదీపనైవేద్యాదులను సమర్పింపవలెను. ఏకాదశవార రుద్రాభిషేకము ఇందు అనంతఫల ప్రదముగ ముఖ్యమైనది.

పూజాంతమున జపింపఁదగిన షడక్షరీమహామంత్రోచ్చారణ క్రమమెట్టిదనఁగా?

"ఓమిత్యగ్రే వ్యాహరేత్, నమ ఇతి పశ్చాత్, తతః శివాయే త్యక్షరత్రయం, నాతస్తారకః మంత్రస్తారకోఽయం పంచాక్షరః. శైవ స్తారకోఽయ ముపదిశ్యతే మను రవిముక్తే శైవేభ్యో జీవేభ్యః, శైవోఽయమేవ మంత్ర స్తారయతి, స ఏవ బ్రహ్మోపదేశః"

"ఓమ్" అని మొదట "నమః" అని తరువాత, "శివాయ" అని తదనంతరము ఉచ్చరింపవలెను. దీనికన్న శ్రేష్ఠమగు తారక మంత్రము మరియొకటి లేదు. ప్రణవపంచాక్షరమంత్రమే తారకమగును- ఈ మంత్రమునే కాశీక్షేత్రమున శివభక్తులకు అంత్యకాలమున విశ్వనాథుఁడు ఉపదేశించును. ఇదియే బ్రహ్మోపదేశము.

(ఇఁట స్త్రీ పురుష వివక్ష లేనందున. కొందరు శివమంత్రోపదేశము స్థూల శరీరగత దక్షిణకర్ణములో-గాక-సూక్ష్మశరీరమునందు జరుగునని-తమ ఊహాపోహలతో అపార్థమును కల్పించుట శోచనీయము. సూక్ష్మశరీరమున కర్ణాదీంద్రియములు వ్యక్తములుగ నుండవు గదా!)

కాశీక్షేత్రమున మరణించువారు-విశ్వనాథుని దివ్యరూపమును దర్శించి శివషడక్షరీ మహామంత్రోపదేశము నొందుదురు గాన వారికి

జన్మరాహిత్యము సంభవించునని భస్మజాబాలము నొక్కి వక్కా ణించుచున్నయది.

"కాశ్యామేవ ముక్తికామానాం తత్త్యాజ్యం, మోచకోఽహ మవిముక్తే నివసతాం, నావిముక్తాత్ పరం స్థానం"

"ముక్తికాములై కాశీక్షేత్రమున నివసించువారు—శరీరము నచ్చో టనే విడువవలెను. అవిముక్తమున నివసించి మరణించువారిని నేనే ముక్తులఁజేయుదును. అవిముక్త (కాశీక్షేత్ర)మును మించిన క్షేత్రము మరియొకటి లేదు" అని విశ్వేశ్వరుఁడు వక్కాణించెను. కాశీక్షేత్ర స్థులు—ప్రత్యహము విశ్వేశ్వరజ్యోతిర్లింగమును దర్శించి—పూజించి తీర్థమును పుచ్చుకొనియే పయఃపానాదుల నొనర్పవలెను.

సూర్యచంద్రాగ్నులు అద్దానిని ప్రకాశింపఁజేయఁజాలవు. వాయువు కదలింపఁజాలదు. విశ్వేశ్వరజ్యోతిర్లింగము—స్వయం ప్రకాశమానమై పాతాళమువరకు తన మూలము కలిగియుండును.

విశ్వనాదు నభిషేకించిన ఉదకముఁదగు తీర్థమును ముమ్మారు పుచ్చుకొనినయెడల-జన్మజన్మాంతరకృతదురితములు తొలగును. అట్టి వాడు-దుఃఖమయమగు సంసారబంధమునుండి విడిబడును. విశ్వనాథ జ్యోతిర్లింగమును—రుద్రమును చదువుచు—పాలతో నభిషేకించుట, పెరుగు నెయ్యి తేనె శర్కర అనువాని నభిషేకించుటయు ప్రశస్తము లగును. పూర్ణిమ అమావాస్య ఆర్ద్రానక్షత్రము వ్యతిపాత గ్రహణము సంక్రాంతి మొదలగు పర్వకాలములయందు రుద్రాభిషేకము, నువ్వు లతో కూడిన అక్షతలతో యవలతో బిల్వదళములతో నర్చించుటయు, దూపదీపనైవేద్య మంత్ర పుష్పాదులను సమర్పించుటయు కాశీనివాసు లైన శివభక్తులందరికిని పరమకర్తవ్యములు. "కాశీ మరణమువలన

లభించు నా లోకమున శోకమోహములుండవు. నా లోకమునుండి ఈ లోకమునకు రావడముండదు. భస్మరుద్రాక్షలింగధారులైన ఆత్మాశ్రములు, యోగులు, అమరులు. తదితర భక్తులును మోక్షమునకై నన్ను ప్రార్థించుట-బంగారమునకు పరిమళము అబ్బినట్లు శ్రేష్ఠాతిశ్రేష్ఠమగును" అని విశ్వనాథుఁడు-విశదీకరించెను.

శాంభవదీక్షితులగు మహాశైవులు భస్మరుద్రాక్షధారులై-వేదశిరోభూషణమగు ప్రణవపంచాక్షరిని జపించుచు కాశీక్షేత్రమున సంతోషమున నివసించుచుందురు.

కాశీక్షేత్రమున రత్నవేదికపై విశ్వనాథుఁడధివసించి-కాశియందు మరణించిన జీవాత్మలను రప్పించి-భస్మరుద్రాక్షభూషితుల నొనర్చిఁ జేసి-స్వాంకమునందు కూర్చోబెట్టి స్పృశించియు "వీరికి మానవాది పునర్జన్మలు రాకూడదని "ప్రణవశివపంచాక్షరి నుపదేశించును. అందు వలన వారు శివసాయుజ్యమునొందుదురు. ఈ యంశమును "తత్రైకా రత్నవేదికా, తత్రాహ మాసీనః కాశ్యాం మృతాం శ్చైవానీయ స్వస్యాంకే సన్నివేశ్య భసితరుద్రాక్షభూషితా నుపస్పృశ్య-మాభూదేతేషాం జన్మమర్త్యం చేతితారకం శైవం మనుముపదిశామి. తతస్తే ముక్తా మామనువిశంతి" అను వాక్యము-ఉద్ఘోషించినది.

బ్రహ్మేంద్రాగ్నివరుణాదులు గూడ కాశీమృతివలన నగు మోక్షమును పొందఁజాలరు. జ్యోతిర్మయుఁడై అన్నపూర్ణాదేవితో కూడ విశ్వనాథుఁడు కాశీక్షేత్రమున నివసించి చంద్రకోటిసమప్రభుఁడునై శివభక్తులచే ధ్యానింపఁబడుచున్నవాడు.

కాశీక్షేత్రమున అంతర్గృహమునందు మూత్ర పురీషములను విసర్జించినవారు, ప్రతిగ్రహముఁబట్టువారు, భస్మను రుద్రాక్షలను ధరింపనివారు, గ్రహయజ్ఞముల నొనర్పనివారు, విశ్వనాథునర్చింపని

వారు, ప్రణవశివపంచాక్షరిని జపింపనివారు, కాలభైరవుని పూజింపని వారు. పాపాత్ములును కాశీమరణానంతరము- ఘోరము నానావిధము నగు భైరవయాతనను పిశాచజన్మతో ననుభవించినపిదప పరిశుద్ధులై శివసాయుజ్యము నొందుదురు.

కాశీక్షేత్రమున పొరపాటు లేనివారై నివసించుట-ముఖ్యము.

భస్మజాబాలోపనిషత్తు-సమాప్తము

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# సామవేదీయ రుద్రాక్షజాబాలోపనిషత్తు

శ్రీ కాలాగ్నిరుద్రుని భుశుండుడు ఇట్లు ప్రశ్నించెను.

రుద్రాక్షము లెట్లుద్భవించినవి? వానిని ధరించుటచే ఫలమెట్టిది?

భగవానుడైన కాలాగ్నిరుద్రుడు దిగువవిధము వక్కాణించెను.

"నేను త్రిపురసంహారమునకై కనులు మూసికొనియుండగా- నా నేత్రములనుండి జలబిందువులు భూమియందు పడినవి. అవి- లోకకల్యాణార్థము రుద్రాక్షములుగ నుద్భవించినవి. అవ్వాని పేరు తలచినంతమాత్రమున దశగోదానఫలము, దర్శన స్పర్శనములతో వింశతిగోదానఫలము చేకూరును. రుద్రాక్షమాలతో ప్రణవశివ పంచాక్షరాది మహామంత్రములను జపించుట-అనంతఫలప్రదంబగును.

ఉసిరికాయంత రుద్రాక్షము శ్రేష్ఠము, రేగివండంత రుద్రాక్షము మధ్యమము, శనగయంతది కనిష్ఠము.

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు శూద్రులు నీ రుద్రాక్షములను ధరింపవచ్చును. రుద్రాక్షములు సమానమైన గుండ్రతనము, నునుపు, గట్టిదనము, స్థూలత్వము, బొటిమెలు కలిగియున్నచో శుభప్రదములగును పుఱుగులు తొలచినవి, పగిలినవి, బొటిమెలు లేనివి. పైనొక్కొకచో ముడులు గలవి. కోయఁబడినవి. మూలాగ్రములు సమానములుగలేనివి పనికిరావు. స్వయం ద్వారముగల రుద్రాక్షము ఉత్తమము. మానవునిచే చేయఁబడిన ద్వారముగలది మధ్యమము, మంచి రుద్రాక్షములను పట్టుదారముతో ధరింపవలెను. ఒఱపాయి యందు బంగారువన్నెగీత గల ఉత్తమ రుద్రాక్షములను శివభక్తులు ధరింపవలెను.

"సుప్తే పీతే సదాకాలం-రుద్రాక్షం ధారయే న్నరః"

నిద్రించినపుడు భుజించుతఱి నీరు త్రాగునపుడు ఎల్లకాలము మానవుఁడు రుద్రాక్షములను ధరింపవలెను. ధరించునపుడు పంచబ్రహ్మ మంత్రములను పఠింపవలెను.

"ఏకవక్త్రం తు రుద్రాక్షం-శివతత్త్వస్వరూపకం ।
తద్ధారణాత్ పరే తత్త్వే-స్లీయతే విజితేంద్రియః"

"ఏకముఖి రుద్రాక్షము–పరశివస్వరూపమగును. అద్దానిని జితేంద్రియుఁడై ధరించినచో శివసాయుజ్యము నొందును.

ద్విముఖి–అర్ధనారీశ్వర స్వరూపము, త్రిముఖి, అగ్నిత్రయాత్మకము, చతుర్ముఖి–చతుర్ముఖ బ్రహ్మ స్వరూపము.

పంచబ్రహ్మస్వరూపమగు పంచవక్త్రరుద్రాక్షములను ధరించుటచే సదాశివుఁడు ప్రసన్నుఁడగును. షడ్వక్త్రము-కార్తికేయస్వరూపము.

క్షనిని ధరించుటచే గొప్పసంపత్తు ఆరోగ్యము విజ్ఞానము చిత్తశుద్ధియు నమకూరును. సప్తవక్త్రము సప్తమాతృస్వరూపము, అష్టముఖి-అష్ట వసుప్రియము, నవవక్త్రము నవదుర్గాత్మకము, దశవక్త్రముయమ ప్రియమైనది. ఏకాదశముఖము-ఏకాదశరుద్రాత్మకము, దీనిని ధరించు టచే సౌభాగ్యము వర్ధిల్లును. ద్వాదశముఖము విష్ణుప్రియము, ద్వాదశా దిత్యరూపమున్ను, త్రయోదశముఖము-మన్మథప్రియమై కామ్యముల నొసఁగూర్చును. పదునాలుగు ముఖములు గలది-వ్యాధులఁబోగొట్టి ఆరోగ్యము నొసఁగును.

మద్యము, మాంసము, వెల్లుల్లి, నీరుల్లి, ఎఱ్ఱయుల్లి, మునగ, విరిగి మొదలగు నిషిద్ధములను విసర్జించి రుద్రాక్షములను ధరించుట శ్రేయస్కరము.

పర్వకాలములయందు రుద్రాక్షముల నవశ్యము ధరింపవలెను. విధియుక్తముగ రుద్రాక్షములను ధరించుటవలన మంత్రములన్నియు సిద్ధించును

"మృత్యుతారకం గురుణా లబ్ధం కంఠే బాహౌ శిఖాయాం వా బధ్నీత" అనువచనముఁబట్టి-రుద్రాక్షమును తన్మూలమగు శివలింగ మును గురువుగారి చేతఁ బరిగ్రహించి-శిష్యుఁడు-కంఠమునందుగాని భుజముపై గాని శిఖయందు గాని హృదయముపై గాని ధరించినచో జననమరణాత్మకమగు మృత్యువు తొలగునని విదితమైనది.

ఈ యుపనిషత్తును సాయంప్రాతఃకాలములలో పఠించువారికి అనేకజన్మకృత పాపములు నశించుటయే గాక-ఆరువేల లక్షల గాయత్రీ మంత్రమును జపించిన ఫలము సమకూరును. శివసాయు జ్యము లభించును.

రుద్రాక్షజాబాలోపనిషత్తు-సమాప్తము.

## బృహజ్జాబాలోపనిషత్తునందు పంచమబ్రాహ్మణమున

శ్లో॥ యే భస్మధారణం త్యక్త్వా-కర్మ కుర్వంతి మానవాః ।
తేషాం నాస్తి వినిర్మోక్ష-స్సంసారా జ్జన్మకోటిభిః ॥
మహాపాతకయుక్తానాం-పూర్వజన్మార్జితాగసాం ।
త్రిపుండ్రోద్ధూళనద్వేషో-జాయతే సుదృఢం బుధాః! ॥
యేషాం కోపో భవేద్బ్రహ్మన్-లలాటే భస్మదర్శనాత్।
తేషా ముత్పత్తిసాంకర్య-మనుమేయం విపశ్చితా ॥
యే భస్మధారిణం దృష్ట్వా-నరాః కుర్వంతి తాడనం।
తేషా చండాలతో జన్మ-బ్రహ్మన్నూహ్యం విపశ్చితా॥
త్రిపుండ్రం యే వినిందంతి-నిందతి శివమేవ తే ।
ధారయంతి చ యే భక్త్యా-ధారయంతి శివం చ తే ॥
దిగ్భస్మరహితం ఫాలం-ధిగ్గ్రామ మశివాలయం।
ధి గనీశార్చనం జన్మ-ధిగ్విద్యా మశివాశ్రయామ్ ॥

భస్మను ధరింపక-సుకృతముల నాచరించువారికి-కోట్లకొలది జన్మలయందైనను సంసారబంధవిముక్తి కాదు. పూర్వజన్మలయందు ఈ జన్మయందును మహాపాతకముల నొనర్చినవారికి భస్మధారణము నందు ద్వేషము కలుగును. ఎదుటివారి నొసట భస్మఁజూచి ఏవగించుకొనువారి జన్మయందు సాంకర్యము కలదని ఊహింపవచ్చును. భస్మధారిని శిక్షించువారు-చండాల జన్మనుండి వచ్చినవారని స్ఫురించును. భస్మత్రిపుండ్రములను నిందించువారు-శివుని నిందించువారగుదురు. భస్మత్రిపుండ్రములను ధరించువారు-శివలింగమును ధరించువారగుదురు. భస్మలేని నొసలు, శివాలయము లేని గ్రామము, శివుని పూజింపని జన్మ, శివునాశ్రయింపని విద్యయు వ్యర్థములగును.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# మహానారాయణోపనిషత్తు

## అను

# కూచిరుద్రము

వ్యాఖ్యాత- శ్రీపతి పండితారాధ్యుల-బసవపండితారాధ్యులు.

తెలుగుసేత- శ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు.

## ప్రార్థన.

శ్లో॥ శ్రీమచ్చంద్రకళాధరం భవహరం శ్రీశాధిపం శంకరం
వేదాంతోభయవేద్య మవ్యయ మజం వేదాదివిశ్వాత్మకమ్।
మాయాఽతీత మనాదిబోధ మమృతం మృత్యుంజయం సర్వగం
గంగాలోల మనంతవైభవయుతం గౌరీధవం నౌమ్యహమ్॥
వామే హైమవతీ శిలాదతనయస్త్వగ్రే మహేంద్రాదయః
పశ్చాద్విష్ణు విరించి ముఖ్యదివిజాః ప్రాగాదికోష్ఠాదిషు

శ్రీ విఘ్నేశ్వర వీరభద్ర గుహ శాస్త్రృ భృంగిచండా
దయో-మధ్యే చంద్రశతప్రభామయతనుం శంభుం భజే
శాశ్వతమ్॥

సర్వవేదాంత సిద్ధాంత-శివాద్వైత మతాధిపం।
భవభక్తినిధిం భవ్యం-భజే శ్రీపతి పండితమ్॥

గౌతమీతీరవిలస-ద్దక్షవాటీపురే స్థితం।
భీమారాధ్యాత్మజం వందే-మల్లికార్జునపండితమ్॥

సూత్రగీతార్థవక్తారం-వేదాంతార్థప్రబోధకం।
జగద్గురుం నీలకంఠ-మాచార్యం ప్రణమామ్యహమ్॥

సదాశివసమారంభాం-శ్రీకంఠాచార్యమధ్యమాం।
అస్మదాచార్య పర్యంతాం-వందే గురుపరంపరామ్॥

అస్మచ్ఛ్రీబ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యః పరమ
గురుభ్యో నమోనమః

శిలేషు సతితా మేతాం-వేదోపనిషదం పరాం।
బసవపండిత వ్యాఖ్యాన-మనుసృత్యాంధ్రభాషణే॥

ధాతృవత్సర భాద్రాది-పక్షే వై సప్తమీ తిథౌ।
బుధవారే సమారభ్యా-నువదామి యథోదితమ్॥

అష్టాదశోత్తరైకోన-వింశత్యాం శాలివాహనే। (1918)
నిర్విఘ్నం పూర్ణతా మీయాత్-కారుణ్యాత్ పార్వతీపతేః॥

మూలం :

"అంభస్యపారే భువనస్య మధ్యే-నాకస్య పృష్ఠేమహతో
మహీయాన్,

శుక్రేణ జ్యోతింషి సమనుప్రవిష్టః-ప్రజాపతి శ్చరతి
గర్భే అంతః"

తైత్తిరీయశాఖయందు అరణ్యకమున ఖిలకాండలో గల నారాయణీయ యాజ్ఞిక్యుపనిషత్తు- "అంభస్యపారే" మొదలుకొని "బ్రహ్మణో మహిమానం" వరకు అశీతి (80) అనువాకములు గలదిగా-శ్రోత్రియుల వేద పాఠమునందు గనఁబడుచున్నయది.

## ప్రథమానువాకగత ప్రథమవాక్యార్థము-

సర్వవేదాంత ప్రతిపాద్యుఁడు, సర్వాధిష్ఠానము, సర్వాత్మకుఁడు, పరబ్రహ్మంబు నగు మహాదేవుడనఁబడు శివునియొక్క పరత్వము. "నారాయణము" అను పంచమాధ్యాయమున ప్రతిపాదింపఁబడుచున్నయది.

నారాయణఋషిచే చెప్పఁబడినందున, నారాయణుని హృదయమున పరమేశ్వరుఁడు నివసించి ఉపాసింపఁబడినందున, నీయుపనిషత్తునకు "నారాయణము" అను సంజ్ఞ యేర్పడుట-సమంజసుగు గదా! అపారమగు సముద్రమున నుండునట్టి (యో రుద్రో అగ్నౌయ అప్సు" ఇత్యాది శ్రుతివాక్యము ఇందుకు ప్రమాణముగ నుండుటచే-ఉపక్రమవాక్యమునకు విష్ణుపరత్వము సిద్ధింపదు ) భువనమధ్యమున స్వర్గమునకంటె పై భాగమున ఆకాశమునకన్న పెద్దవాడై తన తేజస్సుచే సూర్యచంద్రాదులఁ బ్రవేశించినట్టి (అంతర్యామియై సూర్య చంద్రాదులను ప్రకాశింపఁజేయునని భావము.)

చతుర్ముఖ బ్రహ్మదేవుని రూపమున-గర్భమధ్యమున సంచరించునట్టి పరమేశ్వరుఁడు సముద్రాదిసర్వ స్థలములయందు ఉండువాడని ఈ వాక్యము-విశదపఱచినది.

శ్లో॥ ప్రళయే వటరూపేణ-నివసన్ శశిశేఖరః ।
స్వశాఖాగ్రస్థితే వర్ణే-హరిం ధత్తే కృపానిధిః ॥

బ్రహ్మదిన ప్రళయమున-జలమయమగు సముద్రమునందు వట వృక్షరూపమున నుండు మహేశ్వరుఁడు-వటవృక్షము (మఱ్ఱిచెట్టు) యొక్క శాఖాగ్రమున గల పర్ణము (ఆకు) నందు శ్రీహరిని కరుణతో కాపాడుచుండు నను స్కాందశివమహాపురాణ శ్లోకము ఇందుకు ఆధారమైనది. భువనమధ్యమనఁగా-అంతరిక్షము, అద్దానియందు సూర్యరూపమున ప్రకాశించువాడనియు, బ్రహ్మ విష్ణు మహేంద్రాదులకు అధిపతియనియు, ప్రజాపతియనఁగా-సర్వజీవాధిపతియై-గర్భస్థ జీవాత్మను పోషించుననియు చెప్పవచ్చును.

## ద్వితీయ తృతీయ చతుర్థ పంచమ వాక్యార్థములు-

పరమేశ్వరునందు చరాచరప్రపంచము-ప్రళయమున-ఆధార్ధ పడియుండును. సృష్టికాలమున పరమేశ్వరునుండి ఆవిర్భవించును. బ్రహ్మ విష్ణ్వాదిదేవతలు శివు నాశ్రయించియుందురు. భూతభవిష్యత్ వర్తమానకాలత్రయమునందు గల ప్రపంచము-శివాధిష్ఠితంబేను, శివుఁడు-చిచ్ఛక్తిరూపమగు హృదయాకాశమునందు- భక్తులు తన నుపాసించుటకై నివసించును.

స్వర్గ మర్త్య పాతాళముల నాక్రమించు పరశివుని జ్ఞానులు "శివోఽహం" భావనతో నుపాసింతురు. జగత్తును పుట్టించు ఆదిశక్తి పరమేశ్వరునుండి బయలుపడినదై-జలప్రధానములగు పంచమహా భూతములతో జగత్తును నిర్మించి హరిబ్రహ్మాదిజీవాత్మలను బ్రహ్మాండమున ప్రవేశింపఁజేసెను. ఓషధులు పురుషులు స్త్రీలు పశువులు ఇత్యాది చరాచరాదిప్రాణులలో పరమేశ్వరుఁడు ప్రవేశించెను. షర్థ

మేశ్వరుని కన్న అణువైనది మహత్తైనదియు లేదు. శివరూపము-ఏకము అవ్యక్తము అనంతము తమస్సునతిక్రమించినదియునై యున్నది. పరమేశ్వరుని తేజస్సుఁబరిగ్రహించియే సూర్యచంద్ర గ్రహనక్షత్రాదులు ప్రకాశించుచున్నవి.

శివజ్ఞానులు—గురూపదిష్టమార్గమున-శరీరమధ్యమునగల అక్షరమగు హృదయాకాశమునందు శివు నుపాసింతురు. ఇఁట "సముద్రే" అను శబ్దమునకు "వైకుంఠము" అను నర్థమును చెప్పుట పొసఁగదు. ఎందుకనఁగా? "అంతః" "సముద్రే" అనుచో "సముద్రేచ" అని చకారము ప్రయోగింపఁబడలేదు. సముద్రే" అనుదానిని "సముద్రేణ" "ముద్రయా సహ వర్తత ఇతి" అను వ్యుత్పత్తితో తృతీయాంతముగ గుర్తించి-గురూపదిష్టమగు లక్ష్యముతో శివు నుపాసింతురని నిరూపించుట-సమంజసమగుచున్నయది.

## షష్ఠ సప్తమ అష్టమ వాక్యార్థములు

శివుఁడే—జ్ఞానస్వరూపుఁడు, కాలత్రయాబాధ్యుఁడు, శివభక్తులచే ధ్యానింపఁదగు పరతత్త్వము, యాగాది సుకృతస్వరూపుఁడు, అనేక రూపములు గలయట్టి భూతభవిష్యత్ వర్తమాన ప్రపంచమంతయు నగుటే గాక-అగ్నివాయుసూర్యచంద్ర విష్ణుస్వరూపుఁడునై గుణత్రయాతీతమగు శుద్ధసత్త్వగుణము ప్రధానముగా గలవాడు, చతుర్ముఖబ్రహ్మదేవుఁడు జలాధిష్ఠాతయగు వరుణుఁడు నగువాడున్ను, మరియు బ్రహ్మవిష్ణురుద్రులు శివునినే ఉపాసింతురు.

సర్వాత్మకత్వము, సర్వవిలక్షణత్వము, సర్వాధికత్వము, సర్వకారణత్వము అను విశిష్టధర్మములు ఇట నుపదేశింపఁబడుటచే నియ్యవి శివేతరదేవతలయందు గానరామిఁజేసి-ఈ యుపనిషత్తు విష్ణుపరము కాదని విదితమైనది.

విద్యుత్స్వరూపుఁడైన హిరణ్మయ పురుషునుండి-నిమిషములు, కళలు, ముహూర్తములు, కాష్ఠలు, అహోరాత్రములు, శుక్లకృష్ణ పక్షములు, చైత్రాది మాసములు, వసంతాది ఋతువులు, ప్రభవాది సంవత్సరములు మొదలగు కాలవిభాగము-అవిర్భవించినది. కాల కాలుఁడు శివుఁడే నని పరమార్థము-

## నవమ దశమ వాక్యార్థములు-

పరమేశ్వరుఁడు—ఉదకోపలక్షిత పంచమహాభూతములను, అంతరిక్షమునకు క్రిందివగు భూరాదిలోకములను (ఈ రెంటిని) పుట్టించెను. పైన మధ్యన చివరన గ్రహింపనలవిఁగాని పరమేశ్వరుని శాసించువాడు మరియొకఁడు లేడు. పరమేశ్వరుని నామధేయము-గొప్పకీర్తి యని చెప్పఁబడును.

శివుని దివ్యరూపము-చక్షురాది ఇంద్రియములకు గోచరమగునది కాదు. ప్రాకృతనేత్రముతో శివుని జ్యోతిర్లింగ స్వరూపమును గాంచఁజాలనివారు మానవులు; శ్రద్ధాభక్తిధ్యానయుక్తము శివజ్ఞాన సంపన్నంబు నగు పరిశుద్ధమైన మనస్సుతో శివుని కనుగొనవచ్చును. ఇట్లు శివరూపమును ధ్యానాదులతో నుపాసించువారు-ముక్తులగుదురు.

ప్రతిదిశ ననుసరించియుండు పదార్థములన్నియు పూర్వము పరమేశ్వరుని గర్భమునుండి అవిర్భవించినవి. వర్తమానకాలమున జన్మించుననియు, భవిష్యత్తున ఉదయించుననియు నగు ప్రాణులు పరమేశ్వరు నాశ్రయించునవియేను, శివభిన్నుఁడైన నారాయణుని ప్రతిపాదింపదీయుననిషత్తని "హి" అనుటవలన విదితమగును.

"పురుషో వై రుద్ర స్తన్మహో నమో నమః" "విశ్వం భూతం

చిత్రం బహుధా జాతం జాయమానం చ యత్ । సర్వోహ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ నమోనమః" ఇత్యాది మంత్రాంతరముల యందు శివుని సర్వాత్మకత్వము-విశదీకరింపఁబడినది. విశ్వాతీత మగు దివ్యమైన, మిశ్రసత్త్వరజస్తమో రహితము, శుద్ధసత్త్వగుణ ప్రధానము నగు దివ్యశరీరము గలవాడు శివుఁడని "ప్రత్యఙ్ముఖః" "ప్రత్యఙ్ = విశ్వభిన్నమైన, ముఖః = దివ్యశరీరము గలవాడు" అను పదము నిరూపించుచున్నయది. ఇట్టి పరశివుఁడు-చరాచరములోని మృద్దారుశిలాకృతులలో విలసిల్లువాడని ఏకాదశవాక్యము ఉగ్గడించినది.

ఇఁక ద్వాదశవాక్యమున-

అనంతనేత్రములు, అపరిమితముఖములు, అసంఖ్యాతహస్తములు, అగణితపాదములు గల ఒకే దేవుఁడైన శివుఁడు-భూమ్యాకాశములను పుట్టించి-హస్తములు పాదములు మొదలగు అవయవములతో జీవాత్మలకు శరీరముల ననుసంధింపఁజేయును. "విశ్వతశ్చక్షు" రిత్యాదివాక్యములతో శివుఁడే పరమాత్మ యని శ్వేతాశ్వతరము ప్రబోధించుటఁజేసి-ఇందు విష్ణుపరత్వము లేదని తెలియవలెను.

త్రయోదశవాక్యమున-

పరమేశ్వరుఁడు-మిత్రునివలె స్థావరజంగమప్రాణులకు సన్నిహితుఁడగువాడు ఈ ప్రపంచమంతయు మహాప్రళయమున పరమేశ్వరునియందు సూక్ష్మరూపమున విశ్రాంతిఁ జెందుచుండును. ఆ సమయమున ముకుళితపటము వలె ప్రపంచము చిన్నదై-మహాసృష్టిని ప్రసారితవస్త్రము వలె పెద్దదగును.

చతుర్దశవాక్యమున-

ఇందుగల గంధర్వ శబ్దార్థములు-

"గాం=సర్వాతిశయం ఫాలనేత్రం, గంగాం, వృషభం, పాశుపతాస్త్రం వాధారయతీతి = గంధర్వః"

"సమస్త వస్తువులను మించినట్టి ఫాలనేత్రమును, గంగను, వృషభమును. లేక-పాశుపతాస్త్రమును ధరించువాడు-గంధర్వుడనఁబడును"

అథవా "గాం = దిశం ధారయతీతి- గంధర్వః"

"దిశలను వస్త్రముగ ధరించువాడు గంధర్వుఁడనఁబడుఁగును."

శివసహస్రనామములలో "దిగంబరః" అను నామమును ఇందుకు ప్రోద్బలకముగ గాననగును.

గంధర్వశబ్దవాచ్యుఁడు సర్వజ్ఞుఁడు నగు పరశివుఁడు హృదయ భ్రూమధ్య స్థానాది గుహలయందు దాగియున్నవాడని-శివధ్యానయోగముచే గుర్తించువాడు- పునర్జన్మ నొందనివాడై శివసముఁడగును.

"స పితుః పితా న భవతి" "జనకునకు జనకుఁడు కాడు అనఁగా-తండ్రి తానే పుత్రుఁడుగ జన్మించును గాన తాను-పృథక్ కుమారుఁడుగ జన్మింపడని భావము.

పంచదశ షోడశ సప్తదశ అష్టాదశ ఏకోనవింశతి వాక్యార్థములు-

పరమేశ్వరుఁడే-దేవమానవాదులకు బంధువు, పుట్టించువాడు, పోషించువాడు, సమస్తలోకములయందలి జీవాత్మలయొక్క వైకుంఠ

సత్యలోకాదులను గుర్తించువాడు నగును. పరశివుని మహాకైలాస మున ముక్త పురుషులు-నిరతిశయానందము ననుభవించుచుందురు. మరియు తమ ఆనందానుభవము గల సామగీతములను నాలపించు చుందురు.

ముక్త పురుషులు పుణ్యలోకములయందు స్వేచ్ఛావిహారముఁ జేయుచు నచటి సుఖములను మనస్సుతో ననుభవించుటే గాక ఆకాశమునందు భూమిపైనను సంచరించుచుందురు. ప్రాణులను పంచభూతములను దిశలను దిగంతరములను వ్యాపించినట్టి పశుపతి సృష్టికి పూర్వము చేయఁబడిన కర్మలను కనుగొని తత్కర్మఫల భోగమునకై సృష్టిలో జీవాత్మల నావిర్భవింపఁజేయువాడు-

జీవాత్మ, ప్రకృతి అనువానిని నియమించువాడు. బ్రహ్మవిష్ణ్వాదులకు విస్మయముఁగలిగించు మహాలింగస్వరూపుఁడు, కుబేరసఖుఁడు, లేక లక్ష్మీసహితుఁడైన విష్ణువునకు ప్రియుఁడు అనఁగా భర్త, (విష్ణు వల్లభః అనునామము-శివసహస్రనామాంతర్గతముగ ప్రసిద్ధమైనది.) ధర్మ అర్థ కామ మోక్షములు అను చతుర్వర్గముయొక్క ఫలము చేకూరుటకై భక్తులచే ప్రార్థింపఁబడువాడు, ముముక్షువులచే ఏకాగ్రశక్తి నుపాసింపఁబడువాడు, సర్వజ్ఞుఁడు నగు పరమేశ్వరు నాశ్రయించి ఉపాసించియు ముక్తుఁడనగుదునని-శివయోగి-వ్యక్తపఱచు చున్నవాడు.

## 20 వ వాక్యము-

ఉద్దీప్యస్వ జాతవేదోఽపఘ్నం నిర్ౠతిం మమ। పశూగ్శ్చ మహ్యమావహ, జీవనం చ దిశో దశ। మానోహిగ్ం

సీ ర్జాతవేదో గామశ్వం పురుషం జగత్ । అభిభ్రదగ్న
అగహి–శ్రియా మాఽపరిపాతయ"

పదార్థము-చేతనాచేతనముల నావిర్భవింపఁజేసి యవ్వాని కర్మ లను గుర్తించువాడు, లేక అగ్నిస్వరూపుడు జాతవేదుఁడనఁబడును.

"జాతాని చేతనాచేతనాని, తత్కర్మాణి చ వేత్తీతి జాతవేదాః, తస్య సంబుద్ధిః జాతవేదః!" అని వుత్పత్తి.

హే జాతవేదః = సర్వజ్ఞుఁడవు అగ్నిస్వరూపుఁడవు నగు పర మేశ్వరా! మమ = నాయొక్క, నిర్ఋతిం = పాపమును, అపఘ్నన్ = నశింపఁజేయువాడవై, ఉద్దీప్యస్వ = నాలో ప్రకాశింపుము! లేక నన్ను ప్రకాశింపఁజేయుము! మహ్యం = నాకొరకు, పశూన్ = నీ యారాధనకుపయోగించు గవాదిపశువులను, ఆవహ = కలుగఁ జేయుము! దిశోదశ = పదిదిశలయందు, జీవనం చ = జీవనాధారము లగు అన్నవస్త్రాదులను ఇప్పింపుము! హే జాతవేదః = అగ్ని స్వరూపుడవైన మహాదేవా! నః = మాయొక్క, గాం = గోవులను, అశ్వం = అశ్వములను, పురుషం = పుత్రులను, భృత్యులను, జగత్ = భూమిని, మాహిగ్ంసీః = హింసింపక కాపాడుము! హే అగ్నే = అగ్నిస్వరూపా! అబిభ్రత్ = భయంకరఘోరరూపములను ధరింపనివాడవై, ఆగహి = రమ్ము! శ్రియా = శ్రద్ధా భక్తి జ్ఞాన వైరాగ్యరూపమగు సంపదనుండి, మా = నన్ను, అపరిపాతయ = పతితుని గావింపకుము!

ఘోరతనువగు పరమేశ్వరుని ప్రసన్నుఁడవు కమ్మను ప్రార్థ నము ఈ వాక్యమునకలదు. ఈ మంత్రము–దీపాదిసమర్పణమునందు వినియోగము కలదైనను అగ్నిస్వరూపుఁడు శివుఁడగుటచే-శివపర మైనదనియే భావింపవలెను.

ఇఁక పరమేశ్వరుని మరియు తత్కళత్ర పుత్రాది భక్తులను ప్రార్థించు మంత్రములు తదర్థమున్ను దిగువ వ్రాయఁబడుచున్నవి.

1 "పురుషస్య విద్మ సహస్రాక్షస్య మహాదేవస్య ధీమహి-
తన్నో రుద్రః ప్రచోదయాత్"

"పురి = దహరాకాశే శేత ఇతి. పూర్ణత్వాద్వా, పురుషః"

శరీరము అను పట్టణమునందు గల హృదయమందలి దహరాకాశమున శయనించువాఁడగుటచేత, జగత్తునంతట నిండిన పూర్ణత్వము కలిగియుండుటఁ జేసియు పురుషుఁడనఁబడును. "శంభురాకాశమధ్యే" "శివఏకో ధ్యేయః" ఇత్యాది అథర్వశిఖావచనమున "పురుషో వై రుద్రస్తన్మహో నమః"అను శ్రుత్యంతరమునందును దహరోపాస్యత్వము, పురుషశబ్దవాచ్యత్వము శివునకే ప్రతిపాదింపఁబడినందున నీ యుపనిషత్తునను దహరోపాస్యుఁడు పురుషశబ్దవాచ్యుఁడు శివుఁడేనని సునిశ్చితముగ తెలియనగును. మహాదేవస్య = బ్రహ్మ విష్ణు రుద్రాధికుఁడు, సహస్రాక్షస్య = అనంతనేత్రములు గలవాఁడు, పురుషస్య = పురుషశబ్దవాచ్యుఁడు నగు శివుని (కర్మణి షష్ఠి) విద్మ = ఉపాసించుచున్నాము, ధీమహి = ధ్యానించుచున్నాము, (ఇట్లు అంతరుపాసనము బహిరుపాసనమున్ను చెప్పఁబడినవి.) నః = మా యొక్క, తత్ = శివధ్యానసమన్వితమైన ఉపాసనమును, రుద్రః ప్రచోదయాత్ = పరమేశ్వరుఁడు ప్రేరేపించి నిర్విఘ్నముగ కొనసాగించుగాక!

ఇచ్చోట మహాదేవుఁడు-బ్రహ్మవిష్ణురుద్రాతీతుఁడని తెలుపుటకై మొదట పరమేశ్వరుని గాయత్రీమంత్రమును వేదపురుషుఁడు ప్రతిపాదించుట-పరమార్థమై యున్నది.

2. "తత్పురుషాయ విద్మహే-మహాదేవాయ ధీమహి, తన్నో రుద్రః ప్రచోదయాత్".

"సచాసౌ పురుషః=తత్పురుషః, తస్మై తత్పురుషాయ"

లోకవేద ప్రసిద్ధుఁడు పురుషుఁడు నగు మహాదేవుని-బాహ్యమున ఇష్టప్రాణలింగములుగ భావించి జపపూజనాదులతో ఉపాసించు చున్నాము. అంతరమున భావలింగముగ "శివోఽహం" భావనతో ధ్యానించుచున్నాము- శేషము పూర్వోక్తము.

ఇట్లు ప్రప్రథమము-మహాదేవుని ఉపాస్యత్వమును ఆదరముతో రెండు మంత్రములయందు చెప్పుటచే మహాదేవుఁడు-ఇతర దేవతా సమానుఁడు కాడని విదితమైనది.

ఇఁక మహాదేవుని పుత్రాదులయొక్క మంత్రములు ఉదాహరింపఁబడుచున్నవి.

3. కుటిలమైన తుండము (నాసిక) గలవాడగుటచే వక్రతుండుఁడనియు ఏకదంతముండుటఁజేసి దంతియనియు చెప్పఁబడు విఘ్నేశ్వరుఁడు- మహాదేవుని అపరస్వరూపుడగుటఁజేసి "తత్పురుషాయ" "తదంశభూతాయ పురుషాయ" అను నిర్వచనమువలన తత్పురుషుఁడనఁబఱగుచున్నవాఁడు. ఇట్లే మిగత మంత్రములకు అర్థమును నిరూపింపనగును.

4. చక్రమువంటి (తుండం)ముఖము గల నంది నుపాసించుచు ధ్యానింతుము.

5. శివాంశసంభూతుఁడైన పురుషుఁడగు కుమారస్వామి నారాధింతుము.

6. "వేదాః ఆత్మా = స్వరూపం యస్యాసౌ = వేదాత్మా,

యద్వా వేదాః = ఆత్మని....బుద్ధౌ యస్య సః = వేదాత్మా" "వేదములు స్వరూపముగ గలవాడు వేదాత్మ యగును. (లేక) వేదములు తన బుద్ధియందు గలవాడు-వేదాత్మ యగును. అని వేదాత్మశబ్ద నిర్వచనములు.

"హిరణ్యం గర్భే-యస్యాసౌ" "హిరణ్యము గర్భమందు గలవాడు" "హిరణ్యరూపః గర్భోయస్యసః" "హిరణ్యరూపమైనగర్భము గలవాడు" అను నిర్వచనములఁబట్టి-బ్రహ్మదేవుఁడు హిరణ్యగర్భుఁడనఁబడుచున్నవాడు.

7. కన దీప్తౌ అను ధాతువు ననుసరించి "కాత్యాయనాయ" సంపూర్ణ దీప్తి (ప్రకాశము) గలయట్టి కన్యాకుమారి యనఁబడు దుర్గాదేవి నుపాసించుచు ధ్యానింతుము.

8. నారాయణుఁడు- శక్త్యంశ సంభూతుఁడై నందున గౌణముగా తత్పురుషుఁడనఁబడుఁగును. అందువలననే కాత్యాయనీ గాయత్ర్యనంతరమే విష్ణుగాయత్రి-నిర్వచింపఁబడినది.

రుద్రగాయత్రీ మంత్రములలో-శివుఁడే పురుషశబ్దవాచ్యుఁడని చెప్పుటచే విష్ణువల్లభుఁడు కాగలిగెను.

శ్లో॥ శివస్య శక్తి ర్వినియోగకాలే-చతుర్విధాఽభూచ్ఛివ
సత్ప్రసాదాత్ ।
భోగే భవానీ పురుషే చ విష్ణుః-క్రోధే చ కాళీ సమరే
తు దుర్గా॥
,, ప్రకృతిస్త్వంపుమాన్ రుద్ర-స్త్వయి తద్వీర్యమాహితం।
త్వన్నాభిపంకజాజ్జాతః-పంచవక్త్రః పితామహః॥
శంకరసంహిత.

శివకేశవ సంభూతం-కలయే శాస్తృభైరవమ్ ।
శివరహస్య ఖండము.

'శివశక్తి-వినియోగకాలమున-శివానుగ్రహమువలన నాలుగు విధములైనది. ఎట్లనఁగా? శివుని ఆనందభోగమున భవానిగాను, పురుషరూపమున విష్ణువుగాను, క్రోధ సమయమున కాళీదేవి గాను, సమర (యుద్ధ) కాలమున దుర్గాదేవిగాను ఆవిర్భవించినది".

"నీవు ప్రకృతివి కాగా-పురుషుఁడైన రుద్రుఁడు నీలో తన సంకల్పము అను వీర్యమును నెలకొలిపినందున-నీ నాభికమలము నుండి-పంచవక్త్ర (ముఖ)ములుఁగల పితామహుఁడనై ఉద్భవించితిని" అని విష్ణువుఁగూర్చి బ్రహ్మవచనము.

"అష్టభైరవులలోని "శాస్త" అను భైరవుఁడు-శివకేశవ సమావేశము వలన జన్మించె" నని శివరహస్యఖండములో వ్రాయఁబడినది.

ఇఁక శివధ్యానయోగము నభ్యసించువారికి ఇంద్రియజయమున? స్నానకాలమున ధరింపఁదగిన దూర్వ (గఱిక)ను ప్రశంసించుటయు, అశ్వక్రాంతే మొదలుకొని-త్వయి సర్వం ప్రతిష్ఠితం వరకు స్నానకాలమున మృత్తికను ధరించుటకు భూమిని ప్రార్థించుటయు కలవు.

"గంధద్వారాం" ఇత్యాదిమంత్రముగూడ-భూమిని ప్రశంసించునదేను- ఎట్లనఁగా?

గంధద్వారాం = గంధః పరిమళము, ద్వారం = ద్వారముగా గలది, దురాధర్షాం = తిరస్కరింపనలవిగానిది, నిత్యపుష్టాం = శాశ్వత బలము గలది, కరీషిణీం = గోమయము మొదలగు కరీషములు

గలది, (లేక) ధనలక్ష్మి స్వరూపురాలు, ఈశ్వరీగ్ం సర్వభూతానాం = ప్రాణులందరిని పోషించువారిలో శ్రేష్ఠురాలునగు భూమీ! త్వాం = నిన్ను, ఇహ = ఇప్పుడు, ఉపహ్వయే = సమీపించుమని ఆహ్వానించు చున్నాను. అందువలన నాకు శ్రియం = గో భూ గృహ హిరణ్యాది సంపదను (ఆవహేతి శేషః) ఆవహ = కలుగఁజేయుము! అని "గంధద్వారాం" ఇత్యాది మంత్రార్థమును వేదాంతార్థజిజ్ఞాసువులు గుర్తింపవలెను.

ప్రథమానువాకమున 31వ వాక్యమునుండి 36వరకు వరుణ ప్రార్థనము, ఉదకప్రశంస, అఘమర్షణము, స్నానమంత్రములు ఉదాహరింపబడినవి. 37నుండి 43వరకు జలములో నిలువఁబడి చదువఁదగిన మంత్రములు చెప్పఁబడినవి. 44, 45 వాక్యములలో పరమేశ్వరుఁడు సర్వస్రష్టయై ప్రపంచము నాక్రమించె నను నిర్వచనము గలదు.

## 46 వ వాక్యము-

"తామగ్నివర్ణాం తపసా జ్వలంతీం-వైరోచనీం కర్మ
ఫలేషు జుష్టాం,
దుర్గాం దేవీగ్ం శరణమహం ప్రపద్యే-సుతరసి తరసే
నమః"

వహ్నిస్వరూపురాలు, శివధ్యానము అను తపస్సుతో వెలుగొందునది. ఇంద్రనీలమణికాంతి గలది, కర్మచేతను, ఫలాపేక్షారహితమైన కర్మనాచరించుటచేతను ఉపాసింపఁబడునది, శివభిన్న శక్తిరూపము గలదియు నగు దుర్గాదేవిని శరణము

(రక్షకురాలు)గ ఆశ్రయించుచున్నాను. దేవీ! నీ సామర్థ్యము నభినందించు నన్ను సంసారసాగరమునుండి తరింపఁజేయుము!

47 మొదలుకొని 50వరకు అగ్నిప్రార్థనమంత్రములు గలవు.

## ఇయ్యది ప్రథమానువాకము-

## ద్వితీయ తృతీయ చతుర్థ పంచమానువాకములలో-

అగ్ని పృథివీ వాయ్వంతరిక్ష రవి చంద్ర దిక్ దేవ పిత్రంతర్యామియగు శివునకు మమకారము అను ఆహుతిని సమర్పింపవలెను. ఇఁట అన్న శబ్దమునకు "అనంతి-సర్వజీవా మానందం దత్వా-రక్షతీత్యన్నం" అను నిర్వచనముఁబట్టి-ప్రాణులను కాపాడునట్టి శివలింగము అను నర్థము. "లింగే సుషుప్తిః" అను శ్రుతి ననుసరించి-సుషుప్తియందు ప్రాకృతానందము నొసఁగి రక్షించునదిగా ఉపపన్నంబగుచున్నయది.

అపరిచ్ఛిన్న పరిపూర్ణ శివుఁడు-పరిచ్ఛిన్న లింగరూపమున హృదయస్థుఁడై జీవాత్మకు గాఢనిద్ర (సుషుప్తి) యందు-ఇంద్రియాతీతమైన ప్రాకృతానందమును అనుభవింపఁజేయునని భావము.

భూరన్నమిత్యాదిని లింగరూపేణ పరిచ్ఛిన్నత్వము; భూరగ్నయ ఇత్యాదిని అపరిచ్ఛిన్న మహత్త్వము; జీవాత్మ శాంభవ దీక్షితుఁడై గావించు శివపూజనాది శ్రౌతకర్మను రక్షింపుమని ప్రార్థించుటయు కలవు.

## 6 వ అనువాకము-

"య శ్ఛందసా మృషభో విశ్వరూప శ్ఛందోభ్య

శ్ఛందాగ్ం స్యావివేశ, సతాగ్ం శిక్యః పురోవాచోపనిష దింద్రో జ్యేష్ఠ ఇంద్రియాయ నమో దేవేభ్య స్స్వధా పితృభ్యో భూర్భువ స్సువ శ్ఛంద ఓమ్"

పదార్థగర్భితభావము–ఏ పరశివుఁడు వేదములకు ప్రభువో, చేతనాచేతనభరిత ప్రపంచము స్వరూపముగ గలవాడో, ఛందోభ్యః పురా = వేదములకన్న ముందు ఆవిర్భవించినవాడై, ఛందాగ్ంసి= వేదములలో, అవివేశ = వాచ్యరూపమున ప్రవేశించెనో, (వేదరూపా పరాశక్తిః = వేదార్థస్తు మహేశ్వరః" అని ఆగమప్రామాణ్యము) శిక్యః = శిక్యము (ఉట్టి) వలె వేదాశ్రయుఁడైనట్టి, సః = అట్టి పర శివునియొక్క ఇష్టలింగమును ధరించినట్టి, జ్యేష్ఠః = అమరులలో శ్రేష్ఠుఁడైనట్టి, ఇంద్రః = శచీపతియగు దేవేంద్రుఁడు ఇంద్రియ నామకునకు– శివమహిమాదులను ప్రతిపాదించు ఉపనిషత్తును నిర్వచించెను.

శివజ్ఞానప్రతిబంధములు తొలగుటకై దేవపితృవ్యాహృతులు "నమో దేవేభ్యః" ఇత్యాది నుదాహరింపఁబడినవి.

## సప్తమానువాకము–

"నమో బ్రహ్మణే ధారణం మే అస్త్వనిరాకరణం,
ధారయితా భూయాసం- కర్ణయోః శ్రుతం మాచ్యోఢ్వం
మమాముష్య ఓమ్"

ఈ మంత్రము– ఇష్టలింగధారులైన శివభక్తులచే ప్రార్థింపఁ బడునది.

ఓం = ఓంకారస్వరూపుఁడు మరియు ప్రణవసహిత శివ

పంచాక్షర్యాత్మకుఁడు నగు, బ్రహ్మణే = సమస్తప్రపంచము నంత రాత్మగా వ్యాపించు శివునికొరకు, నమః = నమస్కారమగుగాక!.

(ఇట- ఓం నమో బ్రహ్మణే (ఓం నమఃశివాయ) అను షడక్షరీమంత్రము ఉదాహృతమగుట- గమనార్హము)

ధారణం = అట్టి పరశివుని-లింగరూపమును శాంభవదీక్షావిధిని ధరించుట, అనిరాకరణం = నాకు అవినాభావ సంబంధముగ, అస్తు = సంభవించుగాక!, ధారయితా భూయాసం = శివలింగమును బాహ్యమున శరీరగత కంఠాదులయందు ధరించువాడ నగుదును గాక!, అముష్య మమ = ఇట్టి శివలింగధారుఁడనగు నాకు, కర్ణయోః శ్రుతం = కర్ణశ్రుతమైన లింగాంగ సామరస్యము, మాచ్యోధ్వం = భ్రష్టము కాకుండుగాక!"

"బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మ-శివో మే అస్తు సదాశివోమ్"

"నమస్తారాయ" ఇత్యాది శ్రుతులయందు మరియు "సర్వజ్ఞాయ నమ స్తుభ్య- మోంకారాయ నమోనమః" ఇత్యాది లింగపురాణాదుల లోను శివునకే ఓంకార పదవాచ్యత్వము ప్రతిపాదింపఁబడినది.

## అష్టమానువాకమున-

శివసాక్షాత్కారసాధనములు-నిర్దేశింపఁబడినవి.

మనస్సులో పరమేశ్వరుని ధ్యానించుట, (ఋతము) గాయత్రీ పంచాక్షరీజపముతో కూడిన యథార్థప్రవర్తనము, (సత్యము) వేద స్మృత్యాగమపురాణాదుల నర్థముతో కూడ విని ఏకార్థనిశ్చయము కలిగియుండుట, (శ్రుతము) పరదూషణాదులను సహించుటయు,

(శాంతము) వైరాగ్యముతో బాహ్యేంద్రియములను నిగ్రహించుట, (దమము) శివధ్యానయోగాభ్యాసముతో అంతరింద్రియవశీకారము, (శమము) గురుచరేశ్వరులకు స్వార్జితమును యథాపకాశము సమర్పించుట, (దానము) నిత్యశివారాధనము (యజ్ఞము) ఇవన్నియు తపస్సులనఁబడును. వీని నాచరించు మాహేశ్వరులకు అంత్యకాలమున శివదర్శనము సంఘటించునని—అష్టమానువాకము ఘోషించినది.

## నవమానువాకమున-

పుష్పించిన వృక్షము యొక్క సుగంధము దూరము ప్రసరించునట్లు పుణ్యకర్మయొక్క ప్రభావము దూరదూరము వ్యాపించును. కత్తి అంచును తప్పించుకొనినట్లు-తనను సంసారసముద్రమున పునః పునః పతనము కాకుండునట్లు రక్షించుకొనవలెను.

## దశమానువాకము-

"అణో రణీయా న్మహతో మహీయా-నాత్మా గుహాయాం నిహితోఽస్య జంతోః । తమక్రతుం పశ్యతి వీతశోకో-ధాతుః ప్రసాదా న్మహిమాన మీశమ్"

సూక్ష్మమునకంటె సూక్ష్మస్వరూపుఁడు, మహత్తు (ఆకాశము) కన్న గొప్పవాడు నగు పరమాత్మ—ఈ జీవాత్మయొక్క హృదయమున గల చిదాకాశమునందు నివసించువాడు.

మాయాధిష్ఠాతయై కర్మబద్ధుఁడు గానట్టి అనంతమైన మహిమ గలయట్టి ఈశ్వరు (శివు)ని-ఉపాసనచే గుర్తించినచో-శివానుగ్రహము

వలన జననజరావ్యాధిమరణాదిసమన్వితమగు సంసారముఁదగు దుఃఖము లేనివాడగును.

## 11, 12, 13, 14 అనువాకములలో-

పంచజ్ఞానేంద్రియములు మనోబుద్ధులు-అను సప్త ప్రాణములు గార్హపత్యాది అగ్నిత్రయము యొక్క ఏడుమంటలు, కాళీ కరాళీ మనోజవాధూమ్రవర్ణా స్ఫులింగినీ విశ్వపదాది సప్త అగ్నిజిహ్వలు, సమిధలు మొదలగు హవనోపకరణములు, సప్తఊర్ధ్వలోకములు, సప్త అధోలోకములు (చతుర్దశ భువనములు) సముద్రములు, మహానదులు, పర్వతములును పరమాత్మవలన ఆవిర్భవించినవై సముచిత రూపములతో ప్రవర్తించుచున్నవి. శివుఁడంతర్యామియై కారణరూపముగాను కార్యరూపముగాను పరిణమించుటచే-సర్వకర్త యగునని చెప్పుట పొసఁగునదేను.

అమరులలో బ్రహ్మదేవుఁడు, శివజ్ఞానులలో వామదేవ దధీచ్యాది స్వరూపుఁడు, శ్రోత్రియులలో అగస్త్యుఁడు, మృగములలో గజము, పక్షులలో "డేగ" అను పక్షిరాజము దుర్గఅరణ్యములలో కుఠారము (గొడ్డలి) చంద్రునివలె అహ్లాదింపఁజేయునట్టి పవిత్రముల నన్నిటి నతిక్రమించు పరమపావనుఁడును పరమేశ్వరుఁడే నని తెలియవలెను.

## 15 వ అనువాకము-

"అజా మేకాం లోహితశుక్లకృష్ణాం—బహ్వీం ప్రజాం జనయంతీగ్ం సరూపామ్ । అజో హ్యేకో జుషమాణో ఽను శేతే-జహాత్యేనాం భుక్తభోగా మజో ఽన్యః"

జన్మలేనిది,(నిత్యము) ముఖ్యురాలు రజస్సత్వ తమోరూపయు (లేక) బ్రహ్మ విష్ణు కాలరుద్ర స్వరూపురాలు, తనతో సమానమైన అనఁగా-రజస్సత్త్వతమో గుణములలో ఒక్కొక గుణము ప్రధానముగా గలయట్టి దేవమానవ పశుపక్ష్యాది అనేక విధములు గల ప్రాణులను పుట్టించునట్టి ప్రకృతిని—ఒకానొక జీవాత్మ—అనుభవించువాడై అనుసరించును. మఱియొక జీవాత్మ—నానావిధజన్మలయందు ప్రాకృతసుఖదుఃఖముల ననుభవించుటచే వేసారి (ప్రాకృతభోగముల యందు) విరక్తి గలవాడగును.

ప్రకృతి- చిత్ జడస్వరూపిణియై శివాధీనురాలగుటచే జగన్నిర్మాణ కారణము—స్వతంత్రముగ కానిదగుటఁజేసి-శక్తితో నిరంతరము కూడియుండు శివుఁడు శక్తిద్వారా-తానే జగత్కారణమగుచున్నవాడు. ఈ వాక్యమున—బద్ధజీవలక్షణము, ముముక్షుజీవస్థితియు నిర్దేశింపఁబడినదను శ్రీ నీలకంఠీయ వ్యాఖ్యానముండగా- ఈ గ్రంధకర్త- జీవపరమాత్మ పరముగ అర్థముఁజెప్పుట- శ్వేతాశ్వతర మంత్రములకు భిన్నమైనదని తోచెడిని.

## అనంతరవాక్యముల సారాంశము ఎట్లనఁగా?

గ్రీష్మకాలమందు తపించు సూర్యుఁడు, అంతరిక్షమున సంచరించు వాయువు, యజ్ఞమునందలి అగ్నియు, గృహమునకు ఏతెంచు అతిథియు, మానవులలో దేవతలలో నుండువాడు, కర్మఫలాశ్రయములగు స్వర్గాదిలోకములయందు నివసించు పుణ్యాత్ముఁడు, ఆకాశమునందు జీవాత్మలు, ఉదకమునందు జన్మించు ప్రాణులు, నేలపై జన్మించు ప్రాణులు, సుకృత కర్మఫలము ననుభవింపఁజేయు

దేవలోకములయందలి జీవాత్మలు, పర్వతముల పైజనించు ప్రాణులు వ్యాపకుఁడు సత్యస్వరూపుఁడునగు శివుఁడేను, శివునివలననే ఈ ప్రాణు లందరు ప్రవర్తించుచుందురు. శివునికంటె వేరైన వస్తువు లేదని తెలియవలెను. సృష్టికి ము న్ను శివుఁడొకఁడే నుండెను. సృష్టికాగానే చతుర్దశ భువనములలో నంతర్యామిగా (శివుఁడు) ప్రవేశించెను. బ్రహ్మవిష్ణురుద్రులకు ప్రభువగు శివుఁడు-ఇంద్రోపేంద్రాదులచే నుపా సింపఁబడుచున్నవాడై సూర్యచంద్రాగ్నిరూపములలో మరియు జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు పంచప్రాణములు అంతఃకర ణము అను పదహారిటితో నేర్పడు సూక్ష్మ శరీరమునందును ప్రవే శించెను.

చరాచర ప్రపంచమును విశేషించి పోషించువాడు, జగత్తును నిర్మించువాడు, మానవులకు నేత్రమువలె తెలివిఁగలుగఁజేయువాడు నగు శివుని స్తోత్రములతో ఆహ్వానించుచున్నాము గాన అట్టి శివుఁడు ఎల్లకాలము కళత్రపుత్ర క్షేత్రారామ వస్త్రసువర్ణాది ధనమును మాకు ప్రసాదించుగాక!

సూర్యమండలాంతర్వర్తి వగు దేవా! ఈ జన్మయందే-సంతాన సమృద్ధమగు సౌభాగ్యమును కలుఁగఁజేసితివి. ఐతే నాకు అప్పు డప్పుడు సంభవించు దుఃస్వప్నములవలన భయ (దుఃఖ)మును కలుఁగనీయకుము!

సూర్యునకు ప్రకాశము నొసఁగు సదాశివా! నా దురితముల నన్నిటిని పోగొట్టుము! శుభమును కలుగఁజేయుము!

పరమేశ్వరుని ఇష్టలింగమునందు ధ్యానించు మాకు మంద సుగంధ వాయవులు వీచుచు ఆనందమును కలుఁగఁజేయుగాక! నదులు మధువుఁ బోలినవై తృప్తి నిచ్చుగాక! రాత్రియందు ప్రాతఃకాలమున

పదార్థమంతయు మధువగుగాక! ఆకసమున వెలుగొందు భాస్కరుఁడు ఆరోగ్యమును పెంపొందించుగాక! గోవులు క్షీరప్రదానముతో మా యొక్క తనివిఁదీర్చుగాక।

ఇఁట "ఘృతం" అను శబ్దమునకు "రసవత్తరమైన బ్రహ్మము" అను నర్థముఁ జెప్పవలెను. శివుఁడు (బ్రహ్మము) ఆహారమునంతయు రుచికరముఁ జేయుగాక। ఘృతశబ్దవాచ్యమైన బ్రహ్మమే-జగత్తునకు ఉత్పత్తి స్థానమగునది. ఘృతమునందు పక్వమైన పదార్థము హవిస్సనఁబడును. అగ్నే! (ఘోరతనువిశిష్టశివా!) స్వాహాకారముచేయఁబడిన హవిస్సును మోయువాడవు. అట్టి హవిస్సును స్వధాకారముతో ననుసంధింపఁజేయుము! హవిశ్శేషముతో యజ్ఞకర్తను ప్రేక్షకులను తృప్తిపఱచుము! అమృతముకొరకు మథింపఁబడు సముద్రమునుండి ఉత్పన్నమైన ఒకానొక తరంగము-రహస్యముగ జపింపఁబడిన శ్రీ శివషడక్షరీ మహామంత్ర జపముతో అమృతరూపముఁ దాల్చినది. అట్టి అమృతమే భువిని ఘృతమైనది. ఘృతమునకు రహస్యమగు నామధేయము—దేవతాజిహ్వా (దేవతలనాలుక) యనఁబడును. ఘృత మూలమగు అమృతమునకు ఆశ్రయుఁడైన పరమేశ్వరునకు ఘృత శబ్దము-పరంపరయా వాచకంబగును గాన నీ మంత్రమున-ఘృత శబ్దమునకు-శివభక్తులచే నుపాసింపఁబడు పరమేశ్వరుఁడను నర్థము సమంజసంబగుచున్నయది.

పరమేశ్వరునకు ఘృతమను నామధేయమును వ్యవహరింతుము. ఈ యజ్ఞమున నమస్కారములతో పరమేశ్వరుని నుతింతుము. మాచే ప్రశంసింపఁబడు ఘృతము-నాలుగుపాదములు గల శివాగమములయందు నాలుగువేదములయందు ప్రతిపాదింపఁబడు హిరణ్య

కాంతిగల పరమేశ్వరుఁడేనని భావింపవలెను. పరమేశ్వరుఁడే ఘృత మును సర్వోత్తరమైన యజ్ఞసాధనముగ పుట్టించెను.

17 వ వాక్యము-

"చత్వారి శృంగా త్రయోఽస్య పాదాః-ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య-త్రిధా బద్ధో వృషభో రోరవీతి- మహో దేవో మర్త్యాగ్ం ఆవివేశ"

పరబ్రహ్మమగు శివునకు-ఋగ్యజుః సామాధర్వణములు అను నాలుగువేదములు, లేక క్రియాచర్యాయోగజ్ఞానములు అను నాలుగు ముఖ్యాంశములు (పరమేశ్వరుని అస్తిత్వమునకు వేదములే ముఖ్యప్రమాణములని "శాస్త్రయోనిత్వాత్" అను సూత్రముఁదగు అధికరణమునందు వేదవ్యాసభగవానుఁడు ప్రతిపాదించెను.) సచ్చిదానందములు, లేక-బ్రహ్మవిష్ణు కాలరుద్రులు, లేక సత్త్వరజస్తమో గుణములు పాదములు కాగా-ఘోర అఘోర అనునవి-లేక అగ్ని శ్రోత్రియుఁడు అనునవి రెండు శిరస్సు (ముఖము)లు ("ముఖ ద్వయం మహేశస్య-స్యా దగ్ని ర్బ్రాహ్మణ స్తథా" అను స్కాందమహాపురాణవాక్యము ఇందుకు ప్రోద్బలకము) ఆధారవ మొనలుకొని సహస్రారము వరకు గల ఏడు చక్రములు, లేక మహ తత్త్వము అహంకారము, పంచభూతములు అను ఏడు లేక సప్త ఊర్ధ్వలోకములు లేక సప్త అధోలోకములు హస్తములగును. (వృషభః) బ్రహ్మవిష్ణ్వాదులకన్న నధికుఁడు, (విశ్వాధికో రుద్రో మహర్షిః అను శ్వేతాశ్వతర శ్రుతివాక్యము ఇందుకు ప్రమాణము) మహేశ్వర సదాశివ శివరూపములతో, లేక ఇష్టప్రాణభావలింగ రూపములతో నుండువాఁడు నగు మహాదేవుఁడు- సూక్ష్మజగత్తును

స్థూలప్రపంచముగ పరిణమింపఁజేయుచు-స్థావరజంగమ ప్రాణులఁ బ్రవేశించెను. "తత్పురుషస్య విద్మ-మహాదేవస్య ధీమహి" అను రుద్ర గాయత్రియందు వేదపురుషుఁడు మహాదేవ పదమునే శివవాచకముఖ్య ముగ నిర్దేశించెను. మహాదేవ పదము "రూఢి ర్యోగ మపహరతి" అను న్యాయము ననుసరించి శివునియందే రూఢమైనందునను ఈ వాక్యమున "మహాదేవ" అను పదముతో శివుఁడే నిర్వచింపఁబడినం దున నారాయణపరత్వమును సాధింప వలను కాదని తెలియవలెను.

## 18 వ వాక్యమున-

మహేశ్వర సదాశివ శివరూపములతో ఆవిర్భవించినట్టి, లేక-ఇష్టప్రాణభావలింగములుగ నవతరించినట్టి, గాయకులగు బ్రహ్మ విష్ణ్వాదులచే నుతింపఁబడునట్టి అమృతస్వరూపుఁడైన శివుని. బ్రహ్మ విష్ణురుద్రాదులు ఉపాసించిరి.

"హరిస్తే సాహస్రం కమల" ఇత్యాది పుష్పదంతవిరచిత శివ మహిమ్నః స్తోత్రాదులయందు విష్ణూపాస్యత్వము-శివునకు కలదని స్పష్టపరుపఁబడినది.

బ్రహ్మవిష్ణ్వాదులలో చేరిన బ్రహ్మదేవుఁడు-ఇష్టలింగమును, మహావిష్ణువు ప్రాణలింగము నుపాసింపగా-విష్ణువు-తన హృదయ ములో భావలింగము నమరులకు చూపెట్టెనని-దిగువ వామన పురాణ శ్లోకమున గానన గును.

శ్లో॥ తతోఽవ్యయాత్మా స హరిః-స్వహృత్పంకజశాయినం।
దర్శయామాస దేవేభ్యో-మురారి ర్లింగ మైశ్వరమ్॥

మరియు భావలింగముగ ప్రాదుర్భవించిన శివు నమరులందరు లింగధారులై ఉపాసించిరి.

## 19 వ వాక్యము-

"యో దేవానాం ప్రథమం పురస్తాత్-విశ్వాధికో రుద్రో మహర్షిః, హిరణ్యగర్భం పశ్యత జాయమానగ్ం-స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు"

ఏ పరశివుఁడు-అమరులలో మొదటివాడైన చతుర్ముఖుఁడు-జన్మించుచుండగా- వేదప్రబోధపూర్ణమగు దృష్టితో నవలోకించి యాతని ననుగ్రహించెనో-అట్టి విశ్వాధికుఁడు, వేదాగమస్మృతి పురాణేతిహాసాది వాఙ్మయము నావిర్భవింపఁజేయువాడునగు, సంసార దుఃఖమును నివారించు రుద్రుఁడు-మాకు శుభ (ఇహపరశ్రేయః) ప్రదమైన బుద్ధి ననుసంధింపఁజేయుగాక!

(ఇందు వ్రాయఁబడు భావార్థములో ఏదేనొక పదముయొక్క-అర్థము రానంతమాత్రమున-చదువరులు-భావసమగ్రత లేదని భావింపకుందురు గాక! గ్రంథవిస్తరభీతిచే-ప్రతిపదమునకు అర్థము అన్వయము వ్రాయఁబడకుండుటను గమనింతురు గాక!)

## 20, 21, 22, 23, 24 వాక్యములలో-

"పరశివుని మించినదియు పరశివునితో సమానమైనదియు, ఏదియు లేదు. శివునికంటె చిన్నవాడు పెద్దవాడు ఎవఁడును లేడు. అట్టి శివుఁడు మహాకైలాసమునందు దహరాకాశమునందును నివసించుచు పురుషశబ్దవాచ్యుఁడై పరిదృశ్యమాన జగత్తున నిండియున్నవాడు. శివమహిమ నిట్లు నిరూపించి శివప్రాప్తికై ప్రయత్నించువారిని పేర్కొనుట-ఇందు గమనార్హమగుచున్నయది.

ఫలాభిసంధిసహిత కర్మతో సంతానముతో సువర్ణాది ధనము

తోడను మోక్షము సంభవింపదు. కర్మఫలత్యాగపూర్వకమగు శివోపాసనచేతనే శాంభవదీక్షితులు ముక్తులగుదురు. పరమేశ్వరుఁడు భక్తానుగ్రహార్థము హృదయగుహలో చిదాకాశమునందు నివసించుచున్నవాడు. అట్టి భావలింగాత్మకుఁడైన శివుని-ముముక్షువులు పొందగలుఁగుదురు. ఎట్లనఁగా?

ఉపనిషచ్ఛివాగమముల నధ్యయనము నొనర్చి యవ్వాని అర్థము ఏకరూపమైన శివతత్త్వమే నని నిశ్చయించుకొనినట్టి కర్మఫలత్యాగము యొక్క-లేక-సన్న్యాసమనఁగా-ఇష్టలింగధారణము యొక్క అవినాభావసంబంధముతో చిత్తశుద్ధిగలవారై మోక్షమునకై "శివోపాసనము" అను ప్రయత్నముఁజేయుమాహేశ్వరులు-ప్రారబ్ధము ముగియగానే సంపూర్ణశివదర్శనముతో మహాకైలాసమున ముక్తులై శివానందము ననుభవించుచుందురు.

శివు నెందు నుపాసింపవలె ననఁగా?

స్వల్పము పాపరహితము పరమేశ్వరగృహము శరీరమధ్యస్థితము నగు హృదయపుండరీకమున-అంగుష్ఠమాత్రము అతిసూక్ష్మము ఆనందప్రచురము నగు చిదాకాశమునందు ప్రాణభావలింగాత్మకుఁడైన శివుని-ప్రణవ శివపంచాక్షరీజపముతోడను "శివోఽహం" ధ్యానముతోడను దశావధానములతోడ నుపాసింపవలెను.

దహరోపాస్యునకు ముఖ్యనామధేయ మేమనఁగా?

వేదప్రారంభమున చివరను ప్రయోగింపఁబడిన ప్రణవము-అకారఉకార మకారాత్మకము తదధిష్ఠాతృబ్రహ్మవిష్ణురుద్రాత్మకము నగు ప్రకృతిని తనలో ఇమిడ్చుకొనఁగా-అట్టి ప్రణవముచే ముఖ్యముగా చెప్పఁబడువాడు మహేశ్వరుఁడగుచున్నవాడు.

ఇట్టి-ప్రకృతిరూపమగు ప్రణవమును ద్విజమాహేశ్వరస్త్రీలకు నిషేధించు మహాపండితులు-ప్రణవమును మించిన మహేశ్వరు నుపాసించుటకు-ఇష్టలింగధారణము గూడ నిషిద్ధమని వాదింపకుం డుట వారి ప్రజ్ఞావిశేషమని భావింపవచ్చును.

ఇట్లు ఇరువదినాలుగు వాక్యములకు సద్యస్స్ఫురణముతో వ్రాయ బడిన శైవసాంప్రదాయిక భావార్థము సమాప్తమైనది.

ఇఁక మహానారాయణోపనిషత్తులో ముఖ్యఘట్టమగు "సహస్ర శీర్షం" ఇత్యాదిని గల నారాయణశబ్దముతో ఇది శివపరము కాదేమో నను శైవమహాజనుల సందేహమును నివారించు టకై శ్రీపతి పండిత బసవ పండితారాధ్యులవారు పూర్వాపర సందర్భములను పరిశీలించి వ్రాసిన సంస్కృతభాష్యమును తెలుగు ననువదింప సాహసించితిని. మాహేశ్వరులైన జిజ్ఞాసువులు దీని నవధానముతో పఠించి-ఇదియు శివపరమే నను నిశ్చితజ్ఞానము గలవారగుదురు గాక!

ఏతత్పూర్వము-దహరవిద్యను నిర్దేశించి- దహరాకాశము నందు ఉపాసింపఁబడువాడు శివుఁడే నని—శివునియందు రూఢమగు మహేశ్వరపదముతో నిర్వచించి—ఈ యనువాకమునందు అట్టి శివు మహిమ ఎట్టిది? ఉపాసనస్థానమగు దహరాకాశము ఎట నుండును? దాని లక్షణము ఎట్టిది? దహరమునందు జీవాత్మ—ఏ రూపముతో నుండును? పరమాత్మ ఎట నుండును? ఇంద్రోపేంద్రాదుల వలె పరమాత్మ ప్రత్యేక శబ్దవాచ్యుఁడా? సర్వశబ్దవాచ్యుఁడా? ఇత్యాది ప్రశ్నల నన్నిటికి-సమాధానము నొసఁగుటకు—సహస్రశీర్షానువాక మును వేదపురుషుఁడు ఉద్ఘాటించెను.

ప్రశ్న: ఈ యనువాకమున-విష్ణువునందు రూఢమగు నారాయణశబ్దము ప్రయోగింపఁబడుటచే నియ్యది విష్ణుపరమగును గదా!

ఉత్తరము : పండితారాధ్య వేమనారాధ్య ఉద్భటారాధ్య నీలకంఠాచార్య భట్టభాస్కరాచార్యాది శ్రౌతశైవ సిద్ధాంతప్రతిపాదకులైన మహాపురుషులు మరియు శైవశాస్త్రజ్ఞాన ధురంధరులగు శ్రీహరదత్తాచార్య శ్రీ మదప్పయ దీక్షితేంద్రాది మహామహులును శివునియందు జత్వబాధను నివారించి సహస్రశీర్షానువాకము శివపరమగునని-అనేక విధములుగ నిర్ణయించిరి. "శివునివలన బ్రహ్మవిష్ణ్వాదులు ఉద్భవించిరి" ఇత్యాది అథర్వశిఖోపనిషన్నిర్వచనముండుటచేతను బ్రహ్మవిష్ణ్వాదులు-శివాత్మకులగుటఁజేసియు-నారాయణాది సర్వశబ్దవాచ్యత్వము శివునకు చెల్లునని చెప్పుట-సమంజసంబగుచున్నయది.

కావుననే దీని సమాప్తిని- "సర్వో వై రుద్ర-స్తస్మై రుద్రాయ నమః" ఇత్యాది వాక్యములచే శివుఁడు సర్వాత్మకుఁడని ప్రతిపాదింపబడినది.

భూమి మొదలుకొని జీవాత్మవరకు గల ఎనిమిది మూర్తులు గలవాడు శివుఁడని "అష్టమూర్తి రహిర్బుధ్న్య-మహాకాలో మహానటః" ఇత్యాది నమరకోశకారుఁడు, శివసహస్రనామములలో అష్టమూర్తి శివుఁడేనని వేదవ్యాసుఁడు నిరూపించుటవలన-అష్టమూర్తిమత్త్వములో చేరిన సకలజీవాత్మస్వరూపము శివునకే సంఘటించునని విదితమగుచున్నయది. తథాచ-జీవ సమష్టిరూపుఁడు నారాయణుఁడని "ఏకో విష్ణు ర్మహద్భూతం" ఇత్యాది సూక్తులు విశదపఱచుచున్నవి. పైగా-ఇందు ఈశ రుద్ర మహేశ్వర అంబికాపతి

ఉమాపతి పశుపత్యాది-అనితరసాధారణశబ్దములుండుటచే- పూర్వాపరవాక్య సమన్వయమున-ఇది శివపరమే నని బోధపడును.

## నారాయణశబ్ద నిర్వచనములు-

1. "న విద్యతే రాః" "ధనము లేని బీదవాడు" అట్టి నిర్ధనుఁడు కానివాడు 'నారాః' "కుబేరుఁడు" అట్టి కుబేరుని స్నేహముతో "అణతి" పలకరించును గాన నారాయణుఁడు శివుఁడే నగుచున్నవాడు.
2. న రాః = నారాః = ధనాభావము, అణః=సుఖాభావము, ఎవని భక్తిచే నుండవో వాడు నారాయణుఁడనఁబడును.
3. రాయః=వేదరూపమైన సంపత్తును, అణతి-చెప్పుటతో బయలు పఱచువాడు-రాయణుఁడగును. రాయణుఁడు కానివాడు-అరాయణుఁడనఁబడును. అరాయణుఁడు కానివాడు-నారాయణుఁడగును.

సృష్ట్యాదిని వేదములను బ్రహ్మదేవునకు ఉపదేశించినవాడు శివుఁడేనని "యోబ్రహ్మాణం విదధాతి పూర్వం" ఇత్యాది శ్రుతి ననుసరించి నారాయణశబ్దవాచ్యుఁడు శివుఁడే నని-ఇట-నిర్ధారింపఁబడినది.

ఇత్యాది నిర్వచనములు పెక్కు ఉన్నను విస్తరభీతిచే విరమించి-సహస్ర శీర్ష మిత్యాదులయొక్క-ఆవశ్యక పదార్థముతో భావమును వ్రాయుచున్నాము.

సహస్రశీర్షం="సర్వాననశిరోగ్రీవః"అను శ్రుత్యంతరము ననుసరించి-అనంతములైన శిరస్సులు గలవాడు, దేవః=సూర్యచంద్రాదు

లను ప్రకాశింపఁజేయువాడు, విశ్వాక్షం = అవధిలేని కన్నులు గలవాడు, విశ్వశంభువం=విష్ణ్వాదిచేతనా చేతన ప్రపంచమునకు ఇహపర సుఖమును కలుగఁజేయువాడు, విశ్వం = ప్రపంచము స్వరూపముగా గల నారాయణం = నారాయణశబ్దవాచ్యుఁడైన, దేవం = మహాదేవుఁడు, అక్షరం = నాశరహితుఁడు, (ఇందువలననే శివుఁడు మృత్యుంజయుఁడని లోకవేదములయందు ప్రసిద్ధిఁగాంచెను.) పరమం ప్రభుం = హరిబ్రహ్మాద్యఖిల జీవులను నియమించువాడు, (ఈశ్వరః సర్వభూతానాం-అను శ్రుతి ఇందుకు ప్రోద్బలకము) విశ్వతఃపరమం = ప్రపంచమునకన్న శ్రేష్ఠుఁడు, (ప్రపంచమునకు ఆశ్రయమగుటచే-ప్రపంచమును మించినవాడని భావము.) నిత్యం= భూతభవిష్యద్వర్తమానకాలత్రయముఁదగు పరిచ్ఛేదము లేనివాడు, హరిః = విష్ణ్వాదులను ఆకర్షించువాడు, (సర్వభూతదమనాయనమః అను శ్రుతి-ఇఁట గమనార్హము) విశ్వం = చేతనాచేతన ప్రపంచము, నారాయణం = నారాయణ శబ్దశబ్దితుఁడగు శివుఁడేను, అథవా-నారాయణం హరిం = విష్ణువును సంహరించు శివుఁడని చెప్పనగును. (ఇందుకు "హరిగ్ం హరంత మనుయాంతి దేవాః" అను శ్రుతి వాక్యము ప్రమాణమగును ) పురుషఏవేదగ్ం సర్వం = ఈ కనఁబడు ప్రపంచమంతయు పురుషశబ్దవాచ్యుఁడైన శివుఁడేను, తత్ విశ్వం = చేతనజగత్తు, ఉపజీవతి = శివునిచే రక్షింపఁబడుచున్నది. ("పురుషో వై రుద్ర స్తన్మహో నమో నమః" ఇత్యాది శ్రుతిశతముల యందు శివుఁడు పురుషశబ్దవాచ్యుఁడని ఉపదేశింపఁబడుటచే-ఇఁట పురుషుఁడు శివుఁడే నని నిరూపించుట-సమంజసంబగుచున్నయది.) విశ్వస్య = అచేతన ప్రపంచముయొక్క, పతిం = ప్రభువు, ఆత్మేశ్వరగ్ం = విష్ణ్వాది జీవాత్మసముదాయము నంతర్యామియై జీవాత్మ బుద్ధులను ప్రేరేపించువాడు, శాశ్వతం = నిత్యుఁడు, శివం = శివ

శబ్దవాచ్యుఁడు, అచ్యుతం = క్షతిలేనట్టి నిత్యరూపము గలవాడు, నారాయణం = నారాయణాంతర్యామియగువాడు, మహాజ్ఞేయం = గొప్పవారైన హరిబ్రహ్మాది శివభక్తాగ్రగణ్యులచే - ఉపాసనతో తెలియఁదగినవాడు, విశ్వాత్మానం = ప్రపంచాంతర్యామియు, పరాయణం = (పరంచ తత్ అయణం చ పరాయణం) హరిబ్రహ్మాదుల చేత గూడా పొందఁదగినవాడు, నారాయణపరం బ్రహ్మ = నారాయణునికన్న శ్రేష్ఠమైన పరశివాఖ్య బ్రహ్మము, లేక నారాయణ శబ్దవాచ్యుఁడైన పరబ్రహ్మము, తత్త్వం నారాయణః పరః = త్రిమూర్త్యతీతుఁడై నారాయణశబ్దవాచ్యుడైన, పరశివతత్త్వము, (ద్వే వావ బ్రహ్మణో రూపే = పరశివబ్రహ్మమునకుపరము అపరము నను రెండు రూపములు కలవని బృహదారణ్యకములోని తృతీయ బ్రాహ్మణమందలి చతుర్థానువాకమున చెప్పఁబడిన యంశము ఇందు నిరూపింపఁబడినది.) నారాయణపరంజ్యోతిః = నారాయణశబ్దవాచ్యుఁడైన శివుఁడు-ప్రాణుల హృదయాకాశమున విరాజిల్లు జ్యోతియగు ప్రాణలింగము, ఆత్మా నారాయణః పరః = బ్రహ్మ విష్ణు రుద్రులను మించినట్టి నారాయణశబ్దవాచ్యుఁడైన పరమాత్మయు, ("ప్రపంచో పశమం శాంతం-శివ మద్వైతం చతుర్థం మన్యంతే-స ఆత్మా-స విజ్ఞేయః" "సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రపంచ(సంసారబంధ)మునుపశమింపఁజేయునట్టి, నిర్వికారుఁడైనట్టి, సజాతీయ విజాతీయ భేద (ద్వైత)ము లేనట్టి, బ్రహ్మవిష్ణు రుద్రాతీతుఁడై నాలుగవవాడు నగు పరమాత్మ-శివుఁడని ముముక్షువులు ఉపాసించి గుర్తింపవలె" నని మాండుక్యోపనిషత్తునందలి ప్రబోధము నిట-నిదర్శనముగా గ్రహింపవలెను.) నారాయణపరో ధ్యాతా = నారాయణశబ్దవాచ్యుడైన పరశివుఁడు ముముక్షువులచే ధ్యానింపబడువాడు, ధ్యానం నారాయణః పరః = నారాయణశబ్దవాచ్యుఁడై ధ్యానగమ్యుఁడగునట్టి పర

శివుఁడు, యచ్చకించి జ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేఽపి వా = ఈ జగత్తున కనఁబడునదియు, వినఁబడునదియు, అంతర్బహిశ్చ తత్స ర్వం = లోన బయట నుండునట్టి సమస్తమును, వ్యాప్య నారాయణః స్థితః = వ్యాపించియుండునట్టి నారాయణశబ్దవాచ్య శివుఁడు, అనంత మవ్యయం కవిగ్ం-సముద్రేఽంతం విశ్వశంభువం = (ఇఁట నారా యణశబ్దము శివపరమగునని సూచించుటకై నారాయణశబ్దము నుప హరించుటయందు శివైకాంతికమగు శంభుశబ్దము నిర్దేశింపఁబడినది.) దేశకాలపరిచ్ఛేదము లేనివాఁడై నాదస్వరూపుఁడైనట్టి, సముద్రము నంతర్యామియగు (ఇఁట అంతశబ్దము "అంతః సమాప్తౌ స్థానే చ-నిర్ణ యేఽత్యంత రేఽపిచ" అను నిఘంటువుఁబట్టి స్థిత్యర్థము గలదగును.) విశ్వాత్మకుఁడైన మహాదేవుఁడేను.

ఇవ్విధము-శివుఁడు నారాయణశబ్దవాచ్యుఁడు, విశ్వాత్మకుఁడు నని శివమహిమను ప్రతిపాదించి-శివు నుపాసించుటకు విశిష్ట స్థాన మగు హృదయపుండరీకమును తల్లక్షణమును తదధిష్ఠానమును వేద పురుషుఁడు దిగువవిధము నిర్దేశించెను.

కమలముఁ దగు మొగ్గవలె నుండునది. క్రింద ముఖము గల దియు, కంఠము క్రిందినుండి నాభి (బొడ్డు)పై వరకు పన్నెండు అంగుళముల కొలత గలదియు నగు హృదయము-దహరపుండరీక మని చెప్పఁబడును. అద్ది-తేజోరూపముగ ప్రకాశించును. మరియు సమస్త ప్రపంచమునకు శ్రేష్ఠమైన ఆశ్రయమగును. శివయోగులు దహరపుండరీకమునందు శివధ్యానయోగదృష్టి ననంతకోటి బ్రహ్మాండ ముల నవలోకింతురని భావము. అట్టి హృదయము-కించిద్వికసిత పద్మముయొక్క మొగ్గవంటిదై నాడులతో ఎల్లకాలము శరీరమున వ్యాపించియుండును. అట్టి హృదయపుండరీకముయొక్క మధ్య

యందు సూక్ష్మమైన రంధ్రముగలదు. ఆ రంధ్రమునందు అణువుగా నెలకొనియున్నట్టి గొప్ప మంటల నంతట ప్రసరింపఁజేయునట్టి జ్యోతిస్సు గలదు. ఆ జ్యోతిస్సు-ఆహారమును ప్రాణాహుతులతో ముందు భక్షించి జఠరాగ్నికి అందఁజేయును. అట్టి జ్యోతిస్సుయొక్క కాంతులు-అడ్డముగా, పైన క్రిందునను ప్రసరించునవై పాదములు మొదలుకొని శిరస్సువరకు శరీరమును తపింపఁజేయును. ఈ తాపనము-స్థూలశరీరమునందు వేడిమి (ఆవిరి)గా గుర్తింపఁబడును.

హృదయపుండరీకమధ్యయందలి అణువైన మనస్సుయొక్క పై భాగమున వహ్నిశిఖఁబోలిన జీవాత్మయుండును. అట్టి జీవాత్మ నీలమేఘమధ్యయందలి మెఱుపు తీగవలె ప్రకాశించును వరిముల్లంత చిన్న రూపముతో స్వచ్ఛమైన పసుపు తెలుపు కలిపిన వన్నెతోదను అతిసూక్ష్మఁడునై రాజించుచుండును. అట్టి జీవాత్మయొక్క మధ్య యందు విష్ణ్వాదులను నియమించు శివుఁడు (పరమాత్మ) నివసించును.

ఇట్లు జీవేశ్వరుల స్వరూపమును నిరూపించి-జీవునిలో గల మహేశ్వరునియొక్క నారాయణాది సర్వరూపత్వము సర్వశబ్దవాచ్యత్వము ప్రతిపాదింపఁబడుచున్నయది.

స బ్రహ్మ స శివ స్సహరిః సేంద్రః సోఽక్షరః పరమః స్వరాట్ = అట్టి పరశివుఁడు-బ్రహ్మదేవుఁడు గాను, కాలరుద్రుఁడు గాను, విష్ణుమూర్తిగాను, దేవేంద్రుఁడు గాను, నాశరహితుఁడు శ్రేష్ఠుఁడు నగు విరాట్పురుషుఁడు గాను పేర్కొనఁబడుచున్నవాడు. "సర్వో వై రుద్ర స్తస్మై రుద్రాయ నమోఽస్తు" అని ఈ యుపనిషత్తు నుపహరించుతటి-పరమేశ్వరుఁడు హరిబ్రహ్మాది సమస్త స్వరూపములు గలవాడనియు సర్వశబ్దవాచ్యుఁడుననియు నిర్ణయింపఁబడినది.

శ్రీ రేవణసిద్ధ మరులసిద్ధ ఏకోరామసిద్ధ మల్లికార్జునపండితారాధ్యాదులు- "సహస్రశీర్షం దేవం" ఇత్యాదిని గల అనంతశీర్షత్వ ప్రకాశకత్వాది పరశివ ధర్మములను నారాయణునియందు గలవని నిరూపించినను ఈ యనువాకము శివపరమగుటలో ఎట్టి విరోధము లేదు. ఎట్లనఁగా?

శ్లో॥ శివస్య శక్తి ర్వినియోగకాలే-చతుర్విధాఽభూ చ్ఛివ
సత్ప్రసాదాత్ ।
భోగే భవానీ పురుషేషు విష్ణుః-క్రోధే చ కాళీ సమరే
చ దుర్గా ॥

శివునియొక్క ఆదిశక్తి-వినియోగముఁజెందు సమయమున-శివానుగ్రహమువలన నాలుగు విధములు గలదయ్యెను. ఆనంద భోగమునకై భవాని (పార్వతి)గాను, జీవాత్మ సమిష్టి స్థితిని విష్ణువుగాను, క్రోధమున కాళీదేవిగాను, యుద్ధమునకై దుర్గాదేవిగాను పరిణమించినది.

మరియు

శ్లో॥ ప్రకృతి స్త్వం పుమాన్ రుద్ర-స్త్వయి తద్వీర్య
మాహితం ।
త్వన్నాభిపంకజా జ్జాతః-పంచవక్త్రః పితామహః॥
స్కాందము.

"నీవు ప్రకృతివి కాగా-రుద్రుఁడు పురుషుఁడై తన సంకల్పము అను వీర్యమును నీయందు నెలకొలిపినందున నీ నాభికమలమునుండి పంచవక్త్రుఁడైన పితామహుఁడు జన్మించెను. అని విష్ణువుఁగూర్చిఁ ముని వచనము.

వాసుదేవుఁడు-పరాప్రకృత్యంశ సంభూతుఁడైనందున శక్తిగాను శివుఁడు శక్తిమంతుఁడుగాను బహుప్రమాణములు చాటుచున్నవి అని వక్కాణించిరి.

శ్రీ ఉద్భటారాధ్య వేమనారాధ్య విశ్వారాధ్యాదులైతేనో- ఈ యుపనిషత్తున ముఖ్యముగా ప్రతిపాదింపఁబడిన దహరోపాసన విషయమై-నారాయణుఁడు ఉపాసకుఁడనియు, శివుఁడు ఉపాస్యుఁడని నిర్ణయించుటకు_ సహస్రశీర్షానువాకగతములైన "నారాయణపరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః" ఇత్యాదివచనములు_శివపరత్వ సాధకములు కావని పాంచరాత్రులు శంకింపఁగూడదు.

"శివోఽహం" అను భావముతో శివతాదాత్మ్యమును పొందిన తనయొక్క అనితరసాధారణమగు హృదయమునందు జ్యోతిర్లింగమునవలోకించుసామర్థ్యము నారాయణునకు ఉండుటచేతను "ముక్తః శివ నమో భవేత్" అను సూక్తివలనను నారాయణుఁడు పరబ్రహ్మమనియు, నారాయణుఁడు పరమాత్మయగుననియు శ్రుతి ప్రశంసించుటలో (మా) శివపారమ్యమునకు విరోధమేమియు లేదని వ్రాకుచ్చిరి.

శ్రీ నీలకంఠాచార్య, భాస్కరభట్టాచార్య హరదత్తాచార్యులు మొదలగు కొందరు మహామహులు-సహస్రశీర్షత్వాది ధర్మములతో కూడిన శివుఁడు "దేవదత్తోమార్గం గచ్ఛతి" అనుచో "మార్గే గచ్ఛతి" అను నర్థమువలె-విశ్వశబ్దవాచ్యుఁడైన నారాయణునియందు ప్రకాశించువాఁడు (నారాయణందేవం అనుచో) అను నర్థము సమంజసమగుచున్నయది.

"బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వమార్యాపతేః_ ఘోణిత్వం సఖితా మృదంగవహతా చేత్యాది రూపం దధౌ" ఇత్యాది

స్తోత్రరీత్యా శివునకు విష్ణువు అంతరంగభక్తుఁడగుటచే శివుఁడు నారాయణునియందు విశేషముగ ప్రకాశించునని భావము. సూర్య కాంతమణియందు సూర్యకిరణము అధికము ప్రకాశించుట-లోకాను భవసిద్ధమైయున్నది.

అథవా- విశ్వం = అచేతన ప్రపంచమును, నారాయణం = నారాయణుఁడు మొదలగు చేతనవర్గమును, దేవం=ప్రకాశింపఁజేయు శివుఁడనియు చెప్పవచ్చును. చేతనాచేతన సముచ్చయముఁదెలుపు చకారము లోపించుట-ఛాందసము, నారాయణం హరిం = నారాయ ణుని హరించువాడు, శివుఁడని "హరింహరంత మనుయాంతి దేవాః" అనువాక్యమువలన నిర్ణయింపనగును.

విష్ణువుయొక్క నరసింహాద్యవతారములను-శివుఁడు శరభ సాళ్వాద్యవతారములతో- ఉపసంహరించె నని స్కాందమహాపురాణ మున వ్యాసభగవానుఁడు నిరూపించెను. "నారాయణం మహాజ్ఞేయం" అనుచో-నారాయణుఁడు శివతత్త్వము నుపదేశించువాడగుటచే మహా పురుషుఁడుగ తెలుసుకోదగినవాడని సూతసంహితయందు ఈశ్వర గీతయందును స్పష్టపరుపఁబడినది. "నారాయణపరం బ్రహ్మ" అనుచో నారాయణాత్ = నారాయణునికంటె, పరం = శ్రేష్ఠమైన బ్రహ్మ = బృహత్త్వాది విశిష్టుఁడగు శివుఁడేను. ఇందుకు శ్రుత్యంత రము "పరాత్పరతరో బ్రహ్మ-తత్పరాత్పరతో హరిః । యత్ప రాత్పరతో హీశ-స్తన్మే మనః శివసంకల్పమస్తు" స్కాందమున వ్యాసభుజస్తంభనానంతరము వ్యాసునిఁ గూర్చి విష్ణువు "మమ కర్తా మహేశ్వరః" అని శివపారమ్యమును చెవిలో రహస్యముగ చెప్పి నందున వ్యాసుని భుజస్తంభనమును నందికేశ్వరుఁడు తీసివేసెనని కలదు. "నారాయణపరో ధ్యాతా" అనుచో నారాయణునికన్న వేరైన

శివుఁడు ధ్యానయోగ్యుఁడనియు, "ధ్యానం నారాయణః పరః"అనుచో నారాయణునికన్న పరుఁడైన శివుఁడు-ధ్యానవిషయమగువాడనియు, అను నిర్వచనములు సమంజసములని ప్రతిపాదించిరి.

ఈ యనువాకమున లింగవ్యత్యయము ఛాందసమని ఆచార్య పురుషులు అంగీకరించినట్లు సంధివ్యత్యయము గూడా చాందసమని అంగీకరించుట ప్రశస్తమైనది.

## 12, 13 వ అనువాకములలో

సూర్యమండలాంత్వర్తి యగు శివుని సూర్యమండలమునందు ఉపాసించినచో సాలోక్యాది చతుర్విధముక్తులు-క్రమముగా లభించు నని ప్రతిపాదింపఁబడినది.

"సూర్యో ముఖ్యశరీరం స్యా-చ్ఛివస్య పరమాత్మనః,
ఆదిత్యహృదయే శివః"

ఇత్యాది స్కాందవచనముల ననుసరించి బ్రహ్మాండము సూర్యమండలమునందు సూర్యునిలో శివుని నుపాసింపవలెనని నిర పించి ప్రస్తుతము సాధకుఁడు-తన శరీరమున పరమేశ్వరుని ధ్యాని టను ధరించుటను, ఆరాధించుటను "నిధనపతయే నమః" ఇత్యాది 14, 15, 16, 17, 18, 19, 20, 21, 22, 23 అనువాకములలో వేదపురుషుఁడు దిగువవిధము ప్రతిపాదించెను.

## 1. నిధనపతయే నమః

నిధనం = ప్రాణులందరియొక్క వినాశ (వృత్తిలయ)ము గ ప్రళయమునకు పతయే = ప్రభువగు శివునకు నమస్కారము. మహ ప్రళయసాక్షి-శివుఁడని భావము.

## 2. నిధనపతాంతికాయ నమః

మరణాధిపతియగు యముని సంహరించు సదాశివునకు నమస్కారము. సర్వసంహారకుఁడు శివుఁడనియు సర్వసంహర్తృత్వము బ్రహ్మలక్షణమనియు ఇఁట ప్రవచింపఁబడినది.

## 3. ఊర్ధ్వాయ నమః

మహదాది సమస్తతత్త్వములను మించినట్టి శుద్ధసత్త్వగుణము ముఖ్యముగా గలయట్టి మాయాశక్తిస్వరూపుడైన శివునకు నమస్కారము.

## 4. ఊర్ధ్వలింగాయ నమః

సృష్ట్యున్ముఖురాలగు చిచ్ఛక్తితో కూడియుండు సదాశివునకు నమస్కారము.

## 5. హిరణ్యాయ నమః

సత్త్వరజస్తమస్సులు అను గుణత్రయము యొక్క సమష్టి స్వరూపము గల విద్యాశక్తి స్వరూపుడగు శివునకు అభివాదము.

## 6. హిరణ్యలింగాయ నమః

విద్యాశక్తితో కూడినట్టి స్వయంప్రకాశమానుఁడైనట్టి భావలింగమునకు శరణు.

## 7. సువర్ణాయ నమః

అవిద్యాశక్తిస్వరూపుడైన మహేశ్వరునకు వందనము.

8. సువర్ణలింగాయ నమః

అవిద్యాశక్తితో కూడినట్టి చిత్కాశగనుండునట్టి ప్రాణలింగము నకు శరణు.

9. దివ్యాయ నమః

గుణత్రయ సంపూర్ణయగు మహాశక్తిదగు స్వరూపము గల రుద్రునకు నమస్కారము.

10. దివ్యలింగాయ నమః

మహాశక్తితో కూడినట్టి వేధామనుక్రియాదీక్షితుని పవిత్రశరీర ముపై ప్రకాశించు ఇష్టలింగమునకు శరణు.

11. భవాయ నమః

శాంభవదీక్షితుని శుద్ధాంతఃకరణముగ నుండు మహాదేవునకు చేమోడ్పు.

12. భవలింగాయ నమః

శుద్ధాంతకరణ విరాజమానమగు మహాలింగమునకు వందనము.

13. శర్వాయ నమః

ఆకాశాధిష్ఠాత్రియగు పరాశక్తియొక్క స్వరూపము గల మహే శ్వరునకు నమస్కారము.

14. శర్వలింగాయ నమః

పరాశక్తి నెడబాయని ప్రసాదలింగమునకు శరణు.

15. శివాయ నమః

వాయుతత్త్వము నధిష్ఠించు ఆదిశక్తియొక్క స్వరూపము గల మహేశ్వరునకు అభివాదము.

16. శివలింగాయ నమః

ఆదిశక్తితో కూడియుండు చరలింగమునకు శరణు.

17. జ్వాలాయ నమః

తేజస్తత్త్వాత్మక యగు ఇచ్ఛాశక్తిగ నుండు మహేశ్వరునకు వందనము.

18. జ్వాలలింగాయ నమః

ఇచ్ఛాశక్తితో అవినాభావము గల శివలింగమునకు శరణు.

19. ఆత్మాయ నమః

ఉదకము నధిష్ఠించు జ్ఞానశక్తిగ నుండు శంకరునకు అభివాదము.

20. ఆత్మలింగాయ నమః

జ్ఞానశక్తితో కూడియుండు గురులింగమునకు శరణు.

21. పరమాయ నమః

భూ తత్త్వము నధిష్ఠించు క్రియాశక్తిగ నుండు పశుపతికి నమస్కారము.

## 22. పరమలింగాయ నమః

క్రియాశక్తితో నిరంతరము కూడియుండు ఆచారలింగమునకు శరణు.

"ఏతత్సోమస్య సూర్యస్య సర్వలింగగ్ స్థాపయతి"

ఏతత్ = ఈ దశవిధ లింగాత్మకుఁడైన, సూర్యస్య = సూర్య మండలాంత్వర్వర్తి యగు, సోమస్య = ఉమాశక్తి విశిష్టశివునియొక్క లింగం = లింగాత్మక స్వరూపమును, సర్వం = శాంబవదీక్షితులందరు (సర్వే అనునది సుప్తు కాగా సర్వం అను విభక్తివ్యత్యయము ఛాందసమని తెలియవలెను.) స్థాపయతి = ధరింపవలెను.

సిద్ధాంతాగమమున—

శ్లో॥ ప్రళయం నిధనం ఖ్యాతం-సర్వభూతలయాత్మకం।
తత్కర్తృత్వం మహేశస్య-సత్త్వాత్తత్పతి రీశ్వరః॥
తస్మై నమో మహేశాయ-తమఃసాక్షిస్వరూపిణే।
నిధనాధిపతిః కాలః-సర్వ సంహారకారణాత్॥
తస్యాంతకత్వం హర్తృత్వం-శివస్యైవ నిరూప్యతే।
ఏతత్సూర్యస్యమిత్రస్య-మండలాంతరవర్తినః॥
సోమస్య పార్వతీశస్య-లింగం భవభయాపహమ్।
సర్వేషు భక్తదేహేషు-స్థాపయేత్ గురుణా సదా॥
పవిత్రాణాం పవిత్రత్వాత్-పవిత్రమితి కథ్యతే।
తస్మాద్ధార్యం సదా లింగం-పాణిమంత్రేతి మంత్రతః॥

పాణౌ లింగం సమాసాద్య-దీక్షాకాలే గురుః శివమ్ ।
యేన స్మరతి తన్మంత్రం-పాణిమంత్రం వదంతి హి ॥

మననాత్ పూజనాద్భక్తాన్-త్రాయతీతి నిరుక్తితః ।
పాణిమంత్రమితి ప్రోక్తం-తల్లింగం బ్రహ్మ శాశ్వతమ్॥

నిధనమనఁగా-ప్రళయమున ప్రాణులందరు మహేశ్వరుని యందు నామరూపవిభాగానర్హ సూక్ష్మస్థితిని దాగియుండుట, ప్రళయము నొనర్చు సామర్థ్యముండుటచే మహేశ్వరుఁడు-నిధనపతి యనఁబడెఁను. నిధనాధిపతి-కాలము (మృత్యువు-లేక యముఁడు) నగుటచే-కాలమృత్యుయములను సంహరించువాడు శివుఁడగుటఁజేసి నిధనపతాంతికుఁడని నిరూపింపఁబడెను.

ఈ సూర్యుని మండలములో నుండు పార్వతీపతియొక్క-సంసారభయమును పోగొట్టు-ఇష్టలింగమును శివభక్తులందరి శరీరములయందు గురువు ఎల్లకాలమునకై నెలకొలుపవలెను అట్టి శివలింగము-పవిత్రములలో పావనమగుటచే పవిత్రమని చెప్పఁబడెను. అందువలన "పాణిమంత్రం" ఇత్యాది మంత్రమున శివలింగము నెల్లకాలము ధరింపవలెనని తేటపడుచున్నయది. గురువు దీక్షాకాలమున శిష్యుని వామ హస్తమునందు లింగమునిచి-దేనితో శివుని స్మరించునో అట్టి మంత్రమును పాణిమంత్రముగా వేదవిదులు-చెప్పుచున్నవారు.

మననమనఁగా- వామకరతలమున పూజించుటవలన భక్తులను రక్షించునది గాన పాణిమంత్రమని ఇష్టలింగము నిర్వచింపఁబడెను. అట్టి లింగము-శాశ్వతమైన పరబ్రహ్మంబగును.

లింగమహాపురాణమున-

శ్లో॥ వేదేషు శాస్త్రసంఘేషు-పురాణేష్వాగమేషు చ।
బ్రాహ్మణస్య సమాఖ్యాతం-లింగధారణ ముత్తమమ్॥

వేదశాస్త్ర పురాణ శివాగమములయందు బ్రాహ్మణునకు లింగధారణము ఉత్తమమైనదిగా చెప్పఁబడినది.

అతః సర్వేషు కాలేషు-ధారయే ల్లింగ ముత్తమం।
గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్ర-దున్మిష న్నిమిషన్నపి॥
శుచిర్వాప్యశుచిర్వాఽపి-లింగం సర్వత్ర ధారయేత్।
లింగధారీ సదా శుద్ధో-నిజలింగం మనోహరమ్।
అర్చయన్ గంధపుష్పాద్యైః-కరపీఠే సమాహితః॥
నిత్యాని కర్మబృందాని-తథా నైమిత్తికాని చ।
కుర్యా ల్లింగాంగ సంబంధీ-ద్విజన్మా కామవర్జితః॥

నడచుచున్నవాఁడైనను నిలచియున్నవాఁడైనను నిద్రించునపుడైనను మేలుకొనియున్నతఱియైనను కనులు తెఱచినపుడైనను కనులు మూసినపుఁడైనను పరిశుద్ధుఁడైనను అపరిశుద్ధుడైనను అన్ని సమయములయందు ఇష్టలింగమును విడువక ధరింపవలెను. లింగధారి-సదా శుద్ధుఁడని భావింపవచ్చును. అట్టి లింగధారి-మనోహరమైన తాను ధరించినట్టి ఇష్టలింగమును-ఏవగించుకొనక- వామకరపీఠమునందు స్థిరచిత్తమున గంధపుష్పాదులతో నర్చింపవలెను. లింగాంగ సంబంధియగు బ్రాహ్మణుఁడు (క్షత్రియుఁడు వైశ్యుఁడు) కోరికలు లేనివాడై సంధ్యావందనాది నిత్యకర్మలను శ్రాద్ధాది నైమిత్తికకర్మల నాచరించుచుండవలెనని శ్లోకార్థము.

"నిధనపతయే నమః" మొదలుకొని ఇష్ట ప్రాణ భావలింగాత్మకుఁడగు శివుఁడు-సర్వాత్మకుఁడనియు, సర్వోపాస్యుఁడనియు, సర్వభక్తులచే ధరింపఁదగినవాడనియు, పూర్వానువాకమునందు ఉపదేశించి దిగువ మంత్రములయందు శివుని స్తుతి-నమస్కార పూర్వకముగ ప్రారంభింపఁబడినది.

సద్యోజాతం = "సద్యోజాతః క్షితిః ప్రోక్తా-వామదేవ స్తథా జలం" అను కామికాగమోక్తి ననుసరించి-పృథివీజన్యములైన మృత్తికా స్ఫటిక శిలాదులతో నిర్మింపఁబడిన శివ (ఇష్ట) లింగమును ప్రపద్యామి = ధారణపూజాదులతో శరణము నొందుచున్నాను. సద్యోజాతాయ = సాధనాంతరముల యవసరము లేకయే భక్తుఁడు ప్రార్థించు సమయమున నావిర్భవించు పరమేశ్వరునకు నమోనమః = నమస్కారమును రెండుపర్యాయములు ఉచ్చరించుటఁజేసి-శివుఁడు సర్వశ్రేష్ఠుఁడని విదితమైనది.

ఇఁట "వై" అనునది-శివుఁడు అనన్యశరణుఁడని తేటపఱచునది. భవేభవే = ప్రతిజన్మయందు, అతిభవే = పాంచరాత్రాది అవైదిక జన్మలలో, న భవస్వమాం = నన్ను జన్మింపఁజేయకుము! మహాపాశుపత జన్మనొసఁగుమని భావము. భవోద్భవాయ = బ్రహ్మాది కార్యవర్గమును పుట్టించునట్టి శివునకు, నమః = ప్రణామము. "జాతస్య జాయమానస్య-గర్భస్థస్యాపి దేహినః-మా ఽభూన్మమకులే జన్మ యస్య శంభు ర్న దైవతమ్" స్కాందము. "జన్మించినట్టి, జన్మింపనున్నట్టి, గర్భమున నెలకొనియుండు ప్రాణినగు నాకు-శంకరుఁడు దైవముగా లేనట్టి కులమునందు జననము సంభవింపకుండుగాక!" అను ప్రమాణము- పై యంశమును సమర్థించుచున్నయది.

వామదేవాయ నమో = లీలామంగళస్వరూపముగల దేవునకు నమస్కారము, జ్యేష్ఠాయ నమః = హరిబ్రహ్మాదులకంటె ముందు వాడగుటచే పెద్దవాడైన మహేశ్వరునకు నమస్కారము. శ్రేష్ఠాయ నమః = మృత్యుంజయుఁడగుటచే బ్రహ్మవిష్ణ్వాదులకన్న గొప్పవాడగు మహాదేవునకు నమస్కారము. రుద్రాయ నమః = మహాప్రళయకాలమున బ్రహ్మవిష్ణ్వాదులను హరించురుద్రునకు వందనము. కాలాయ నమః = జీవుల కర్మ ననుసరించి ఆ యా సమయముల యందు ఫలమునొసఁగు కాలకాలునకు అభివాదము. కలవికరణాయ నమో =(ఇఁట లకారమునకు హ్రస్వము ఛాందసము) కళ (ముప్పది కాష్ఠ)లను కాష్ఠ (పదునెనిమిది తెప్పపాట్లు) లను విభజించి కర్మకాలము నేర్పరచు దేవునకు నమస్కారము. బలవికరణాయ నమో = శరీరేంద్రియములు అవసరము లేనట్టి సామర్థ్యము గల మహేశ్వరునకు అభివాదము, బలాయ నమో = బ్రహ్మవిష్ణ్వాదులకుఁగూడ జయింపనలవిగానట్టి బలము గల దేవునకు వందనము, బలప్రమథనాయ నమః = బలిష్ఠములైన మత్స్య కూర్మ వరాహ నారసింహాది విష్ణ్వవతారములను సంహరించు సదాశివునకు అభివాదము. సర్వభూతదమనాయ నమో = మహాప్రళయమున ప్రాణులందరి నణచునట్టి ఈశ్వరునకు నమస్కారము. మనోన్మనాయ నమః = తననుపాసించుటకు బుద్ధిని ప్రేరేపించు భర్గునకు వందనము.

అఘోరేభ్యః = భక్తుల యభీష్టఫలము నొసఁగుటకు అనుకూల రూపములు గలయట్టి, అథ = మరియు, ఘోరేభ్యః = దుష్టులను నిగ్రహించుటకు భయంకరములైనట్టి, ఘోర ఘోరతరేభ్యః = మృత్యుకాలాదులను సంహరించుచు మిక్కిలి భీతిఁగొలుపునట్టి, సర్వేభ్యః = చేతనాచేతనములైన పృథివ్యాది అష్టమూర్తులు గలయట్టి,

సర్వేశర్వేభ్యః = పశుపతిత్వ చంద్రశేఖరత్వాది పంచవింశతి (25) లీలావిగ్రహములు గలయట్టి, రుద్రరూపేభ్యః = రుద్రరూపములకు, నమస్తే అస్తు = నమస్కారమగు గాక!

మహాదేవాయ = దేవతలందరిని మించిన దేవుఁడైనట్టి, తత్పురుషాయ = తచ్ఛబ్దముచే చెప్పఁబడు పూర్ణపురుషుఁడగు శివుని, ధీమహి = ఉపాసింతుము, తత్ = ఆ యుపాసనమునకై, రుద్రః = శివుఁడు, నః = మమ్ము, ప్రచోదయాత్ = ప్రేరేపించుగాక!

సర్వవిద్యానాం = నిగమాగమ స్మృతిపురాణాద్యష్టాదశ విద్యల యొక్క, ఈశానః = నియామక ప్రభువు, సర్వభూతానాం = "ఏకో విష్ణుర్మహద్భూతం" అన్నట్లు మహాప్రాణియగు నారాయణుఁడు మొదలగు సమస్త ప్రాణుల నాజ్ఞాపించు సామర్థ్యము గలవాడు, బ్రహ్మాధిపతిః = బ్రాహ్మణుల యధిపతి, ("బ్రాహ్మణానాం శివో దేవః = క్షత్రియాణాం తు మాధవః" ఇత్యాది సూక్తులు మనుస్మృతిప్రోక్తములు గమనార్హము లగుచున్నవి.) బ్రహ్మణః = చతుర్ముఖబ్రహ్మయొక్క, అధిపతిః = ఏలిక, బ్రహ్మ = పరబ్రహ్మంబగు, శివః = పరమేశ్వరుఁడు, మే = నాకు, సదాశివః = ఎల్లకాలము ఇహపరశ్రేయస్సు నొసగూర్చువాడై, ఓం ప్రణవాత్మకుఁడుగ రక్షకుఁడగు గాత!

ఇట్లు చెప్పుటచేత—మహాకైలాసమున-లీలామంగళ విగ్రహుఁడైన సదాశివుఁడు-చిచ్ఛక్తి విశిష్టుడై మాయను లోబఱచుకొనియుండువని విదితమైనది.

"శేరతే సజ్జనమనాంసి అస్మిన్నితి శివః,
శేతే సజ్జనమనస్యయ మితి శివః"

"సజ్జనుల మనస్సులు ఈతనియందు విశ్రాంతిఁజెందును గాన

శివుఁడనఁబడును. "సజ్జనుని మనస్సునందు ఈతఁడు విశ్రమించును గాన శివుఁడని చెప్పఁబడును. ఇత్యాదులు-శివశబ్దనిర్వచనములు.

నమో హిరణ్యబాహవే=సువర్ణాభరణములు గల హస్తములు గలవాడు, (హస్తములు హిరణ్మయములని చెప్పటలో శరీరమంతయు సువర్ణమయమను నర్థము ఇమిడియున్నది.) హిరణ్యవర్ణాయ = బంగారువన్నె ఒడలు గలవాడు, హిరణ్యరూపాయ=తప్తకాంచనము వలె-లేక-శుద్ధరజతముఁ (వెండి) బోలిన శుద్ధస్ఫటిక వర్ణము గల దివ్యరూపము గలవాడు, "మేరుమందరవాసాయ-శుద్ధస్ఫటికరూపిణే, హిరణ్మయాయ శర్వాయ = మహాకైలాసవాసినే" ఇత్యాది శివాగమ సూక్తులు-ఇందుకు ప్రోద్బలకములు.

హిరణ్యం అనఁగా-తేజస్సులగు సూర్యచంద్రాగ్నులయొక్క, పతయే=ప్రభువు, లేక హిరణ్య (ధన)ములకు నధికారి, సర్వైశ్వర్య సంపన్నుడని భావము. అంబికాపతయే=త్రిగుణాత్మకయగు మాయ నధిష్ఠించి వశపఱచుకొనువాడు, ఉమాపతయే = ప్రణవస్వరూపు రాలగు చిచ్ఛక్తి యనఁదగు పార్వతీదేవి యొక్క భర్త, "యస్య మాత్రాత్రయం నామ వ్యక్తం సత్ప్రణవాత్మకం. బభౌ హస్వద్వయం దీర్ఘం = ద్విమాత్రత్వాదుమైవ సా" "అ. ఉ. మ్." అను మూడు మాత్రలు—శివుఁడు ప్రణవాత్మకుఁడని తెలుపుచున్నవి. "ఉ. మ్" అను హ్రస్వద్వయమున దీర్ఘమును చేర్పగా "ఉమా" అనునది-చిచ్ఛక్తి వాచకంబగు" నని-శంకరసంహితావచనము.

పశుపతయే = బ్రహ్మవిష్ణ్వాది దేవతలయొక్క ప్రభువు, "పశూనాం బ్రహ్మవిష్ణ్వాది-దేవానాం పతిరీశ్వరః"స్కాంధము.

"అహ మేకః ప్రథమ మాసం-పశూనా మధిపతి రసాని"
త్రిపురతాపనీయోపనిషద్వాక్యము.

అట్టి మహాదేవునకు "నమో నమః" నమస్కారము, నమస్కారము. శివునిపై ఆదరముతో నమస్కారద్వయమును శ్రుతి సమర్పించినదని తెలియవలెను.

ఋతగ్ం=మనోవికారము లేనట్టి, లేక-ఉపాసనాత్మకజ్ఞాన గమ్యమైనట్టి, సత్యం = వాగ్వికారము లేనట్టి లేక భూతభవిష్యద్వర్తమాన కాలత్రయపరిచ్ఛేదము లేనట్టి, పరం బ్రహ్మ=బ్రహ్మవిష్ణుమహేశ్వరాతీతమైనట్టి, పురుషం=పరిపూర్ణమగు, కృష్ణపింగళం=నలుపు గోరోజనవర్ణము కలిగినట్టి, ఊర్ధ్వరేతం = ఉత్కృష్టమైన లేక అగ్నిరూపమైన లేక హిరణ్మయమైన రేతస్సు గలిగినట్టి, విరూపాక్షం = వరుసగా లేని మూడుకన్నులు గలిగినట్టి, విశ్వరూపాయ = అష్టమూర్తులతో ప్రపంచము స్వరూపముగ గలయట్టి పరశివతత్త్వమునకు నమస్కారము.

కద్రుద్రాయ=సృష్టిఁజేయు రుద్రుఁడు, ప్రచేతసే=సర్వజ్ఞుఁడు, మీఢుష్టమాయ=వర్షాదులచే భూమిఁదడుపుచు ప్రాణులను తృప్తి పఱచువాడు, తవ్యసే = తపఃఫలరూపుఁడు, హృదే=మనోహరదివ్యమంగళ విగ్రహుఁడు నగు మహేశ్వరుని కొరకు, శంతమగ్ం = అమృతమువలె ఆనందపఱచునట్టి స్తోత్రమును, వోచేమ=పలుకుదుము.

సర్వోహ్యేష రుద్రః = ఇట్టి రుద్రుఁడు-చేతనాచేతన సమ్మిశ్రిత సమస్త జగదాత్మకుఁడు, తస్మై రుద్రాయ నమో అస్తు=అట్టి రుద్రునకు నమస్కారమగుగాక!

### రుద్రశబ్ద నిర్వచనములు-

రుదం = అజ్ఞానమును, ద్రావయతి=తొలగించును గాన-

రుదం = వేదమును, రాతి = బ్రహ్మదేవునకొసఁగువాడగుటను రుదం = ప్రణవశివషడక్షర మంత్రానుష్ఠానమును కలుగఁజేసి రాతి = తన రూపము ననుగ్రహించువాడగుటచేతను, రుదం = సుఖమును, రాతి = ఇచ్చువాడగుటఁజేసియు, రుదం = సంసారదుఃఖమును, ద్రావయతి = నివారించును గానను- రుదం = అశుభమును, ద్రావయతి = లేకుండఁజేయువాడగుటవలనను శివుఁడు-రుద్రుఁడని చెప్పఁబడును.

ఇట్లు పురాణములయందు వేదవ్యాసభగవానుఁడు, రుద్రభాష్యమున విద్యారణ్యాది మహామహులును రుద్రశబ్దము శివపరమని నిర్ధారించినవారు. ఇందువలన రుద్రశబ్దము శివునియందే రూఢమని తేటపడినది. తథైవ నారాయణశబ్దము-"నారం అయనం యస్య" అను వ్యుత్పత్తిచే విష్ణునందు రూఢమనునెడ -మొసలి గూడ జలస్థాయియగుటచే నారాయణ శబ్దవాచ్యమగునని అంగీకరింపవలసివచ్చును.

## త్ర్యంబక మంత్రార్థము-

సుగంధిం = మిక్కిలి గొప్పవైన సర్వజ్ఞత్వాది గుణములనఁదగు పరిమళము గలవాడు, పుష్టివర్ధనం = శమ దమ భక్తి జ్ఞాన వైరాగ్యములయొక్క సమృద్ధి (పుష్టి)ని సంపాదించువాడు నగు త్ర్యంబకం = మూడు కన్నులు, సత్త్వరజస్తమోగుణములు, ఇచ్ఛా జ్ఞానక్రియాశక్తులు, స్వర్గమర్త్యపాతాళములు, సృష్టి స్థితిసంహారములు గల మహాదేవుని, యజామహే = ఆజన్మాంతము పూజించుచున్నాము. లేక ధరించుచున్నాము. అందువలన బంధనాత్ = తొడిమెనుండి, ఉర్వారుకమివ = దోసపండువలె, మృత్యోః = జననమరణ ప్రవాహవిశిష్టమైన సంసారమనఁదగు మృత్యువునుండి, ముక్షీయ = విడిబడు

దును గాక! అమృతాత్ = మోక్షమునుండి మా మృక్షీయ = విడిబడ కుందును గాక!

శ్లో॥ త్ర్యంబకం మహాదేవం-లింగరూప మనామయం ।
దివ్యగంధ సమాయుక్తం-జ్ఞానవైరాగ్యసిద్ధిదమ్ ॥
అమృతా ద్దేహపాతాంతం-శ్రద్ధాభక్తిసమన్వితాః ।
యజామహే ధారయామః-పూజాం కుర్మోయథావిధి ॥
పక్వకాలే యథా వృంతా-దుర్వారుకఫలం భువి ।
తథాఽహంమృత్యుసంసారాత్-విముచ్యేయం న సంశయః॥

అను శ్లోకములతో స్కాందమునందు త్ర్యంబకమంత్రార్థము ఉపబృంహింపఁబడినది.

త్రిసుపర్ణ మంత్రార్థము-

ఆయా = లక్ష్మీదేవిచేత, చితం = అధిష్ఠింపఁబడిన, త్రిసుపర్ణం = మూడు మంచి దళములు గల బిల్వమును, బ్రాహ్మణాయ = "త్వం దేవేషు బ్రాహ్మణః-అహం మనుష్యేషు" అన్నట్లు దేవతలలో బ్రాహ్మణుఁడగు శివునకు, దద్యాత్ = సమర్పింపవలెను, ఏతే = ఇట్టి శివభక్తులు, బ్రహ్మహత్యాం వా = బ్రహ్మహత్యాది మహాపాపములను, ఘ్నంతి = పోగొట్టుకొనెదరు, యే బ్రాహ్మణాః = ఏ విప్రోత్తములైన శైవులు, త్రిసుపర్ణం = బిల్వదళమంత్రమును, పఠంతి = చదువుచు శివునకు బిల్వమును సమర్పింతురో, తే = అట్టివారు, సోమం = పరమేశ్వరుని. ప్రాప్నువంతి = పొందుదురు. మరియు అసహస్రాత్ = వేయిమందివరకు, పంక్తిం = భోజనాదులుగల బ్రాహ్మణపంక్తిని, పునంతి = పావనముఁజేయుదురు.

ఇత్యాది మహానారాయణోపనిషద్గతములలో ముఖ్యములైన ఘట్టములకు- శ్రీపతిపండిత-బసవపండితారాధ్యకృత సంస్కృత భాష్యాంధ్రానువాదము-శివతత్త్వప్రభాఖ్యము సమాప్తము.

## శైవ పురుషసూక్తముఁదగు ఉపోద్ఘాతభాష్యమున-స్కాందే

శ్లో॥ హిమాద్రే రపత న్మౌళౌ-గంగా రుద్రస్య వేగతః ।
తదీయభారసంభ్రాంతో-హ్యావాదీ త్తాం సదాశివః ॥
హ్రీమతి ర్భవ నాత్యుచ్చై-ర్వర్త స్వప్రాప్య మా మిహ ।
పురుషం పురుషశ్రేష్ఠం-బ్రహ్మవిష్ణ్వాదికారణమ్ ॥
సా తం నత్వా మహాదేవం-తదాప్రభృతి భక్తితః ।
హ్రియా జటాసు మిళితా-హ్రీరితి ప్రోచ్యతే బుధైః ॥

రుద్రయామళే-

శ్లో॥ తస్యాంకమండలారూఢా-శక్తి ర్మాహేశ్వరీ పరా ।
మహాలక్ష్మీ రితి ఖ్యాతా-శ్యామా సర్వమనోహరా ॥

కూర్మపురాణే-

శ్లో॥ హ్రీ శబ్దేన భవేద్గంగా-సర్వపాప ప్రభంజనీ ।
లక్ష్మీ ర్గౌరీతి విఖ్యాతా-మహాలక్ష్మీ ర్మహేశ్వరీ ॥
గంగాలక్ష్మీపతిత్వంచ-శివస్య పరమాత్మనః ।
తస్మా త్తద్దక్షిణః పార్శ్వౌ-హ్యహాఃసామ్యం ప్రపద్యతే ॥

వామభాగస్తు తస్యైవ-దేవీ పార్శ్వతయా సదా।
రాత్రిసాదృశ్య మాప్నోతి-మహాదేవస్య శూలినః ॥

అర్థము-

ఈశ్వరుని శిరస్సునందు హిమాద్రినుండి గంగాప్రవాహము వేగమున పడుచుండగా-మహేశ్వరుఁడు గంగావేగముఁదగు భారము వలన సంభ్రాంతుఁడై గంగను గూర్చి-నన్నాశ్రయించుచున్నావు గాన సిగ్గుపడినదానవై అత్యున్నత ప్రవాహమును తగ్గించుకొని నా దరిఁజేరుము-అని నుడివెను. అందువలన బ్రహ్మవిష్ణ్వాదికర్తయు పురుషోత్తముఁడు నగు మహాదేవుని గంగాదేవి భక్తితో నమస్కరించి సిగ్గుచే శివుని జడలలో దాగినది. ఆ కారణమున గంగాదేవి "హ్రీః" అని బుధులచే వ్యవహరింపఁబడెను.

పరమేశ్వరుని తొడపై మాహేశ్వరి యనఁబడు పరాశక్తి-ఆసీనురాలై సర్వమనోహరశ్యామరూపమున "మహాలక్ష్మి" యని ప్రసిద్ధురాలయ్యెను హ్రీ శబ్దముతో- సర్వపాపప్రభంజనియగు గంగాదేవి-చెప్పఁబడెను. లక్ష్మీశబ్దముతో-మాహేశ్వరి మహాలక్ష్మి యనఁదగు గౌరీదేవి వ్యవహరింపఁబడెను. అందువలన పరమాత్మ యగు శివుఁడు-గంగాపతి యనియు లక్ష్మీపతియనియు పేర్కొనఁబడుచున్నవాడు- ఆ కారణమున శివుని కుడిభాగము-దినముతో సమానము కాగా-వామభాగము రాత్రిఁబోలినదై యుండును. అనఁగా గౌరీదేవి ఎడమభాగమున గంగాదేవి కుడిభాగమున శ్యామశ్వేతవర్ణములతో నలరారుచుందురు. "హ్రీ శ్చ లక్ష్మీ శ్చ పత్న్యౌ" అను వాక్యము-పురుషసూక్తము శివపరమని చెప్పుటకు-ప్రతిబంధకమని పరులు చేయు ఆర్భాటము-స్కాంద రుద్రయామళ కూర్మపురాణ ప్రమాణములచే పరిహృతమైనదని విబుధులు గ్రహింతురు గాక!

## శ్రీ శివమహాపురాణే-వాయవీయసంహితాయాం ఉత్తరభాగే

శ్లో॥ బ్రహ్మక్షత్ర విశాం దేవి-యతీనాం బ్రహ్మచారిణాం।
తథైవ వానప్రస్థానాం—గృహస్థానాం చ సుందరి ॥
శూద్రాణా మథ నారీణాం-ధర్మ ఏషః సనాతనః।
ధ్యేయ స్త్వయాఽహం దేవేశి-సదా జాప్యః షడక్షరః ॥

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, సన్న్యాసులు, బ్రహ్మచారులు, వానప్రస్థులు, గృహస్థులు, జన్మరాహిత్యమునకై పరితపించి ఆచార్యు నాశ్రయింప త్వరపడువారు, ("శుక్—సంజాతా ఇత్యతః ద్రావణాత్ శూద్రః" అను వ్యుత్పత్తిచే శూద్రశబ్దమును శ్రీ నీలకంఠ భగవత్పాదులు-తమ సూత్ర భాష్యమున నిర్వచించిరి.) ద్విజస్త్రీలు, దేవేశ్వరీ! నీతో కూడ నన్ను ధ్యానించుచు ప్రణవశివ షడక్షర మహామంత్రమును ఆ జన్మాంతము జపింపవచ్చును.

---

## ప్రకటన

సోమవారవ్రతోద్యాపన గ్రంథము కొన్ని సవరణలతో వ్రాయఁబడి-ముద్రింపఁ జేయఁబడుచున్నది. శైవవాఙ్మయాభిరుచి గల ఉత్తములు-ఇందుకు ఆర్థిక సహకారము నౌదార్యముతో శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి(120) 184/A వెస్ట్‌మారేడుపల్లి సికింద్రాబాద్ 500026 గారికి త్వరలో అందజేయగలరు!

అన్నదేవర-సుబ్బారావు.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

# అథర్వణీయ శరభోపనిషత్తు

## శివతత్త్వ ప్రభాఽఽఽం ద్రీకరణము

పైప్పలాదుఁడు-భగవానుఁడా! బ్రహ్మవిష్ణురుద్రులలో ఎవరు అధికులు? ఎవరు ఉపాస్యులు? అని బ్రహ్మదేవుని ప్రశ్నించెను. పితామహుఁడు-బహుపుణ్యముల నాచరించినవారికే పరమేశ్వరుఁడు లభ్యుండగును. పరమేశ్వరుని దివ్యశరీరమునుండి-నేను విష్ణువు, జన్మించితిమి. దేవేంద్రాదులు మోహమువలన మహాదేవుని గుర్తింపఁ జాలరు. ప్రళయమున లోకములనన్నిటి నుపసంహరించి తనలో దాచువాడు-శివుఁడేను. శంకరుఁడు వీరభద్రుఁడై ఘోరమైన శరభ రూపముఁదాల్చి- విష్ణువుయొక్క నృసింహరూపమును తన-తీక్ష్ణము లైన నఖముల(గోళ్ల)తో చీల్చి-నృసింహచర్మను ధరించెను. బ్రహ్మ దేవుని పంచమశిరస్సును భైరవరూపమున త్రెంచివేసెను. ఫాల నేత్రాగ్నిస్ఫులింగమాత్రమున ప్రళయమున ప్రపంచమును దహించి సృష్టికాలమున పుట్టించి రక్షించు సంపూర్ణస్వాతంత్ర్యము గలవాడు. మహేశ్వరుఁడేను. యముని వామపాదముతో తన్నినవాడు, ఘోర హాలాహలవిషమును త్రాగినవాడు, విష్ణువు- వామపాదమునందు తన నేత్రమును సమర్పించుటచే ప్రసన్నుఁడై సుదర్శనచక్రము (శ్రీహరికి) నొసగినవాడు, దక్షయజ్ఞమున నమరులను శిక్షించి విష్ణు వును పాశము (త్రాడు)చే బంధించినవాడు, అవలీలగా త్రిపురాసుర

లను సంహరించినవాడు, అట్టి తటి దేవతలందరిని పశువులుగా వ్యవహరించి-తాను పశుపతి యగువాడు, విష్ణ్వవతారములగు మత్స్య కూర్మ వరాహ నారసింహాదులు విజృంభించి జగత్తును బాధించు చుండగా నవ్వాని నుపసంహరించినవాడు, మన్మథుని మదము నణచినవాడు నగు మహేశ్వరుని "తస్మై రుద్రాయ నమో అస్తు" అని అమరులు ప్రార్థించిరి. మరియు అనేకవిధముల స్తోత్రములను పఠించి క్షమాపణము నభ్యర్థించిరి. అని వక్కాణించి (బ్రహ్మదేవుఁడు) మరియు నిట్లనియెను.

అందువలన పరమేశ్వరుఁడు సంతుష్టుఁడై-బ్రహ్మావిష్ణ్వాదుల యొక్క తాపత్రయమును నానావిధదుఃఖములను పరిహరించుటయే గాక—ఇందు చెప్పఁబడిన వాక్యములతో తనను ప్రార్థించు ప్రజలను రక్షించెను.

"యత్పాదాంభోరుహ ద్వంద్వం-మృగ్యతే విష్ణునాఽ
ధునా-స్తుత్వా స్తుత్యం మహేశాన-మవాఙ్మానస గోచ
రమ్ । భక్త్యా నమ్రతనో ర్విష్ణోః-ప్రసాదమకరో
ద్విభుః"

"ఎవని పాదకమలయుగళమును, దర్శింప విష్ణువు ఇప్పటికిని వెదకుచున్నవాడో, అవాఙ్మానస గోచరుఁడు నుతింపఁదగినవాడు నగు నట్టి మహేశ్వరుని ప్రార్థించి భక్తిచే నమ్రవదనుఁడైన విష్ణువుపై శివుఁడు అనుగ్రహదృష్టిని ప్రసరింపఁజేసెను.

భగవానుఁడు ఆదిదేవుఁడు సత్యుఁడు నిత్యుఁడు సర్వసాక్షి నిత్యానందుఁడు నిర్వికల్పుఁడు అచింత్యశక్తిసంపన్నుఁడు నగు గిరీశుఁడు—వసిష్ఠ వామదేవ శుక విరించి సనత్సుజాతాది మహానుభావులచే ప్రార్థింపఁబడుచుండును.

"అతిమోహకరీ మాయా—మమ విష్ణోశ్చ సువ్రత!
తస్య పాదాంబుజధ్యానా-ద్దుస్తరా సుతరా భవేత్"

చతుర్ముఖుఁడు వెండియు నిట్లు వక్కాణించెను.

"సువ్రతుఁడవైన పైప్పలాదా! శివు నెడబాయనట్టి మాయ నన్ను విష్ణువుఁగూడ మిక్కిలి మోహింపఁజేయును. ఐతే ఇట్టిమాయ-శివుని పాదపద్మములను ధ్యానించుటవలన. మోహమును కలిగింపఁజాలదు"

"ఓం తస్మై మహాగ్రాసాయ-మహాదేవాయ శూలినే,
మహేశ్వరాయ మృడాయ-తస్మైరుద్రాయ నమోఅస్తు"
"పరాత్పరతరో బ్రహ్మా-యత్పరాత్ పరతో హరిః,
తత్పరాత్ పరతో హీశ-స్తస్మా త్తుల్యోఽధికో నహి"

"జగత్తును సంహరించి ఒక కబళముగా మ్రింగువాడు, త్రిశూలధారి, సృష్టికాలమున జగత్తును రక్షించువాడు, బ్రహ్మవిష్ణ్వాది మహామహులను శాసించువాడు, మహాదేవుఁడు నగు రుద్రునకు నమస్కారమగుగాక!"

"స్థూలప్రకృతిని మించినవాడు చతుర్ముఖుఁడు, ఆతనికంటె శ్రేష్ఠుఁడు శ్రీహరి కాగా—శ్రీహరికన్న గొప్పవాడు మహేశ్వరుఁడగుటచే—మహేశ్వరునితో సమానుఁడు గాని, మహాదేవునికన్న అధికుఁడు గాని లేడని తెలియవలెను.

శివుఁడొకఁడే నిత్యుఁడగుటఁజేసి ముముక్షువు—విష్ణ్వాదిదేవతలను పరిహరించి-సంసారబంధమోచకుఁడగు శివునినే ఆజన్మాంతము ధ్యానింపవలెను.

శరభోపనిషత్తు—సమాప్తము.

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# ఛాందోగ్యోపనిషత్తు

## శివతత్త్వ ప్రభా ఉల్లంద్రీకరణము

ఈ యుపనిషత్తు గూడ శివాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించు నదియేను.

"ఓమిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత" "ఓమ్-అను అక్షరమును హెచ్చుగా గానముఁజేయుచు పరమేశ్వరు నుపాసింపవలెను" ఇత్యాది వచస్సులతో(ఉపనిషత్తులు-పరమాత్మ ఉపాస్యుఁడని చెప్పుచుండుటఁ జేసి) పరమేశ్వరుఁడు-ఉపాసనవిషయుఁడగుటవలన-సగుణ స్వరూపుఁడని ఛాందోగ్యము నిరూపించినది.

మరియు నిదే యుపనిషత్తునందు తృతీయాధ్యాయమున పదు నాలుగవ ఖండమునందు "సర్వం ఖల్విదం బ్రహ్మ-తజ్జలానితి శాంత ఉపాసీత" ఇత్యాది ప్రథమవాక్యమున-పరిదృశ్యమానమగు జగత్తంతయు బ్రహ్మాత్మకము గదా! అని భావించి "తస్మాజ్జాయత ఇతి తజ్జం" "తస్మిన్ లీయత ఇతి తల్లం" "తస్మాత్ అనితీతి తద నం" "ఈ జగత్తు బ్రహ్మమువలన పుట్టుచున్నది" "బ్రహ్మమునందు దాగియుండువది" "బ్రహ్మము వలన జీవించుచున్నది" అను వ్యుత్పత్తుల ననుసరించి-ఉపాసకుఁడు శాంతుఁడై జగత్కారణము బ్రహ్మం బని గుర్తించి దిగువవిధము ఉపాసింపవలెను"

పురుషుఁడు (జీవాత్మ) ఉపాసనచే పరిపూర్ణుఁడగును గాన ఈ లోకమున చేయు ఉపాసనము ననుసరించి-పరలోకమున ఉపాసనానుకూలఫలము గలవాడగును. అందువలన కామ్యోపాసనమును విసర్జించి-నిష్కామ్యముగ శివు నుపాసింపవలెను. శివోపాసనమునకు అంతరంగసాధనము మనఃశాంతి యగును.

శుద్ధమనస్సుచే గ్రహింపఁదగినవాడు, ప్రాణము-లేక-జీవాత్మ శరీరముగ గలవాడు, సంపూర్ణప్రకాశమానరూపము గలవాడు, సత్యసంకల్పుఁడు, జగన్నిర్మాణము కర్తవ్యముగ గలవాడు, సమస్తకళ్యాణగుణములు గలవాడు, దివ్యసుగంధము గలవాడు, దివ్యమైన ఆనందాభిరుచి గలవాడు, ఆకాశమువలె సమస్తమును వ్యాపించువాడు, ప్రాకృతకామ్యముల నాదరింపనివాడు-శివుఁడగునని ధ్యానింపవలెను.

మరియు చతుర్థాధ్యాయమున జానశ్రుతివృత్తాంతము నందును ఏతాం భగవో దేవతాం శాధి! యాం దేవతా ముపాస్సే" "భగవానుఁడా! నీవు ఏ దేవతను సర్వాధారముగ నుపాసించుచున్నావో అట్టి దేవత నుపాసించు విధానము నుపదేశింపుము! అని జానశ్రుతి-రైక్వుని ప్రశ్నించిన సందర్భముఁబట్టి వేదాంతములన్నియు ఉపాసనమును విధించునవని తెలుపుచు-ఛాందోగ్యము శివాద్వైతమును బలపఱుచుచున్నయది.

ఇవ్విషయమై ఉపాఖ్యాయిక-ఛాందోగ్యమునందు నాలుగవ అధ్యాయము యొక్క ప్రథమవాక్యమునుండి ఎనిమిదవ వాక్యము వరకు ప్రథమ ఖండమునందు దిగువవిధము వ్రాయఁబడినది.

పౌత్రాయణుఁడనఁబడు జానశ్రుతిమహారాజు శ్రద్ధతో అనాథులకు బాటసారులకు ధనమును అన్నము నొసఁగుచు అన్నిదిసల

యందు గ్రామనగర మార్గములయందు అరణ్యములయందు చలి, గాలి, ఎండ, వాన, ఆకలి, దప్పి అనువానివలన నగు బాధలనుతొలగించు వస్త్ర శయన అన్నోదకాది భోగ్యజాతసంపూర్ణములగు వసతుల నేర్పఱచెను. అట్టి పుణ్యాతిశయముతో జానశ్రుతియొక్క దురిత సంచయమంతయు నశించినందున నాతనికి బ్రహ్మజిజ్ఞాసను కలుగజేయుటకు-కొందరు మహర్షులు హంసరూపములఁదాల్చి-మేడపై రాత్రి నిద్రించు జానశ్రుతిపై పంక్తిగా నేతెంచిరి. అవ్వానిలో అగ్రేసరమగు హంసఁ గూర్చి "భో భో భల్లాక్ష! అనియు, తన మాట నాలకింపనట్లు నటంచినందుకు మందలోచనా! అనియు రెండుతడవలు సంబోధించి అద్దానివెనుకనుండు ఒకానొక హంస ఇట్లు పలికెను.

"జానశ్రుతియొక్క అన్నదానాది ప్రభావమువలన కలిగిన తేజస్సు స్వర్గమువరకు వ్యాపించినది. అట్టి పుణ్యము విషయమై నీవు ఆసక్తిని చూపకుము" అని నుడువగా-ముందున్న హంస-ఈ జానశ్రుతి-మానవ సామాన్యస్థితి నతిక్రమించి శకటము (బండి)తో నుండు రైక్వుని వలె మహిమగలవాడని నిరూపింతువా? రైక్వుఁడే గదా బ్రహ్మజ్ఞుఁడై మహాప్రభావము గలవాడు, బ్రహ్మజ్ఞుఁడు కానట్టి జానశ్రుతిఁ దగు ప్రభావము ఎట్టిది? అట్టితఁడీ ఎవరారైక్వుఁడని పృష్ఠగామిహంస ప్రశ్నింపగా-అగ్రగామి హంస-ప్రాణులందరి సుకృతములు విజ్ఞానమున్ను ఎవని కర్మసహితజ్ఞానములో చేరునో అట్టివాడు-రైక్వుఁడు, అట్టి రైక్వుని తేజస్సుముందు-ఈ దీనుని తేజస్సు ఎంతటిది! అని ప్రత్యుత్తరించెను.

జానశ్రుతి మహారాజు-తన స్వప్నమున-తన నిందతో కూడిన హంసప్రసంగము నాకర్ణించి-ఆ రాత్రి నెట్లో గడిపినవాడై పదక

నుండి లేవగానే ద్వారపాలకుఁబిలిచి-రైక్వుని బండిగుర్తుఁ దెలిపియు రైక్వుని వెదకుటకు పంపగా-ఒకానొక నిర్జనప్రదేశమున బండిక్రింద గజ్జి గోకుచుండు రైక్వుని గుర్తించి-ద్వారపాలకుఁడేతెంచి రాజునకు నివేదించెను.

జానశ్రుతి స్వయముగా వెంటనే బయలుదేరి రైక్వుని సమీపించినవాడై ఆరువందల ఆవులను కంఠహారమును వడిగల గుఱ్ఱాల రథమును సమర్పించెదను. నీవుపాసించు దేవతఁగూర్చి ఉపదేశింపుమని ప్రార్థించెను. అంత రైక్వుఁడు రాజు సమర్పింపఁదలచిన వస్తుజాతమును నిరాకరించుచు ఇట్లు బదులు చెప్పెను.

బ్రహ్మజిజ్ఞాసకై మథనపడి పరుగెత్తి వచ్చిన శూద్రా! గోవులతో సహ సమస్తము నీకే ఉండుగాక! కళత్రము ఒకానొకనివాసము లేనట్టి నాకు ఇవి ఎందుకు? నీవొసఁగువానిని రక్షించు శక్తి-నాకెక్కడిది? అని రైక్వుఁడు వచింపగా-గోసహస్రమును హారాదికమును సమీపవర్తి గ్రామమును వివాహమునకై కన్యను సమర్పింతును. బ్రహ్మవిద్య నుపదేశింపుమని జానశ్రుతి-ప్రార్థించెను. అప్పుడు రైక్వుఁడు ప్రసన్నుఁడై నీవు ఈయదలచినవాని నన్నిటిని తీసికొని రమ్మని ఆదేశించియు వానిఁబరిగ్రహించి-బ్రహ్మవిద్యను జానశ్రుతికి నుపదేశించెను.

ఇట్టి జానశ్రుతి కథచే ఉపనిషత్తులు ఉపాసనమును విధించునవిగా సగుణబ్రహ్మపరములగునని తేటపడినందున-నిర్గుణబ్రహ్మ సాధకములు కానివై కేవలాద్వైతమును నిరాకరించునవగునని విదితమైనది. శుక్-బ్రహ్మజ్ఞానాభావముచే కలుగు దుఃఖమువలన బ్రహ్మోపదేశమునకై పరుగెత్తి వచ్చినాడని భావించి-రైక్వుఁడు జానశ్రుతిని "శూద్ర" అని సంబోధించెనని ఆచార్య నిర్వచనము.

సత్యకాముని చరితము గూడ ఇందు పొందుపరుపఁబడినది. ఉప కోసలుఁడు కామలాయనుఁడనఁబడు సత్యకాముఁడు ఆచార్యు నాశ్రయించి పన్నెండేడ్లు అగ్నులను సేవించుచు నివసించెను. అట్టి సత్యకామునకు బ్రహ్మోపదేశముఁజేయకయే ఆచార్యుఁడు ప్రవాసము నొనర్పఁగా ఆదివ్యాధిపరవశుఁడై ఉపవాసముతో ఆచార్యుని అగ్నులను కాపాడుచుండిన సత్యకాముని గార్హపత్య దక్షిణ ఆహవనీయములనఁబడు మూడగ్నులు కూడి కరుణతో అనుగ్రహించినవై "ప్రాణో బ్రహ్మ, కం బ్రహ్మ, ఖం బ్రహ్మ" ఇత్యాది వాక్యములతో బ్రహ్మవిద్య నుపదేశించి "అవశిష్టమును నీ ఆచార్యుఁడు ఉపదేశించు" నని పలికినవి.

అటుపిమ్మట ఆచార్యుఁడఱుదెంచి-ప్రసన్నముఖుఁడైన సత్యకాముఁగాంచి "సౌమ్యుఁడా! నీ ముఖము తేజస్విగా కనుపడుచున్నది. ఎవరు నీకు బ్రహ్మవిద్య నుపదేశించి రని అడుగగా—సత్యకాముఁడు అగ్నులును భయపడి సమాధానము నిడకుండిరి. అందువలన అగ్నులే వీనికి బ్రహ్మోపదేశము నొనర్చినవని-నిశ్చయించుకొని ఇంకను చెప్పవలసినది ఉన్నదని గ్రహించి-నేను అట్టి విషయమును నీకు ఉపదేశింపగల-నని వక్కాణించి-తామరాకు నీటి నంటకుండునట్లు బ్రహ్మజ్ఞానియొక్క సుకృత దుష్కృతరూపమైన సంచిత ఆగామి కర్మ (జ్ఞానిని) సంక్రమింపదనియు, బ్రహ్మజ్ఞాని దేవపథమునందు సంచరించి పరమపదముఁజేరి—మరల నీ లోకమునకు రాదనియు, ఆచార్యుఁడు సత్యకామునకు అగ్నిప్రబోధితశేషము నుపదేశించెను. ఈ ఆఖ్యాయిక గూడ-బ్రహ్మము సవిశేషమని ప్రతిపాదించుటయే గాక సగుణబ్రహ్మ (శివ) లోకమును చెందించు అర్చిరాదిగతిని ప్రబోధించుటచే— నిర్గుణబ్రహ్మవాదులయొక్కయు, అర్చిరాదిగతి

లేదని వాదించు వారియొక్కయు మతముల నీయుపనిషత్తున-నిరాకరించినదని తెలియవలెను.

మరియు ప్రథమాధ్యాయగత షష్ఠఖండమున-
ఆరవ వాక్యమున-

"అథ య ఏషోఽంతరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రు హిరణ్యకేశ ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః, యథా కప్యాసం పుండరీకమేవ మక్షిణీ, తస్యోదితి నామ, స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదితః"

"సూర్యమండలమునందు శివధ్యానయోగులచే చూడఁబడు దివ్య పురుషుఁడు-బంగారువన్నెతో శోభించు వెంట్రుకలు గలవాడు, గోరు మొదలుకొని తలవరకు సమస్త శరీరము సువర్ణమయముగ గలవాడునై రాజించును. అట్టి పరశివుని ఫాలనేత్రము-ముకుళితపుండరీక సదృశము కాగా-సూర్యునిచే వికసింపఁబడిన కమలములఁబోలిన రెండునేత్రములు కాంతివంతములైయుండును. అట్టి పరమపురుషుఁడు సమస్త పుణ్యకర్మల నంటనివాడగుటఁజేసి "ఉత్" అని వ్యవహరింపఁబడును అని యున్నందున-పరమాత్మ కరిగిన బంగారుఁబోలిన వన్నె గలవాడనియు, నామరూపరహితమగు నిర్గుణబ్రహ్మము మరియు నీలమేఘశ్యాముఁడు కాదనియు నిట తేటపడినది.

ప్రశ్న: ఛాందోగ్యమున ఆరవ అధ్యాయమునందు మొదటి వాక్యమున- "సదేవ సౌమ్యేద మగ్ర ఆసీత్. ఏకమేవాద్వితీయం" "సౌమ్యుఁడా? ఈ ప్రపంచము - సృష్టికి మున్ను సత్తుగానే ఉండెను. సజాతీయ విజాతీయ స్వగత భేదము లేనిదై ఒకటిగానే

ఉండెను" అని ప్రతిపాదింపఁబడుటచే- ఈ యుపనిషత్తు - శుద్ధాద్వైతమును సాధించునదని చెప్పవలెను కాదా?

ఉత్తరము: "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం" అను ప్రతిజ్ఞను ప్రతిపాదించుటద్వారా సచ్ఛబ్దవాచ్యమగు బ్రహ్మము - జగదుపాదానము, జగన్నిమిత్తము, సర్వజ్ఞము, సర్వశక్తిసంపన్నము, సత్యసంకల్పము, సర్వాంతరము, సర్వాధారము, సర్వనియామకము, సర్వాత్మకము నగుటయే గాక అనంత మాంగళ్యగుణములు గలదని నిరూపించి- అట్టి బ్రహ్మము అంతర్యామిగ గలవాడవు నీవని శ్వేతకేతువునకు ఉపదేశించుటకై ప్రవర్తించినదగుటచే ఛాందోగ్యము నిర్విశేషబ్రహ్మమును ప్రతిపాదించునది కాదని తెలియవలెను.

ప్రశ్న: ఛాందోగ్యశ్రుతి–శివాద్వైతపరము ఏ మాత్రముకాదు. ఎట్లనఁగా? "తత్త్వమసి" "బ్రహ్మము నీవగుదువు" అని తొమ్మిది పర్యాయములు ఉపదేశము ఇందుండుటఁజేసి-ఇయ్యది జీవబ్రహ్మైక్యమును ప్రతిపాదించునదని స్ఫురించుచున్నది గదా!

ఉత్తరము: ఈయుపనిషత్తు-వినఁగానే జీవబ్రహ్మైక్యపరమగునను భ్రాంతిని పరులకు కల్పించుచున్నది కాని విచారింపగా-తనలోని భావమును దాచక వివరించినదని విదితమగుచున్నది-

ఎట్లనఁగా-

ఛాందోగ్యమున షష్ఠాధ్యాయమున అష్టమఖండమునందు ప్రథమవాక్యమున-ఆరుణియనఁబడు ఉద్దాలకుఁడు-స్వప్నాంతమగు సుషుప్తియందు జీవాత్మ పరమాత్మతో నేకీభవించి గాఢనిద్రఁజెంది బాహ్యము నెరుగనివాడైన పిదప పరమాత్మను గుర్తెరుగనందున జాగరూకుఁడై సుఖదుఃఖముల ననుభవించును- సుషుప్తిని కలిగించు

పరమాత్మ అణుస్వరూపుడై నీలో నున్నవాడని శ్వేతకేతువుఁగూర్చి "తత్త్వమసి" త్వం తదంతర్యామికోఽసి" అని యుపదేశించెను.

బృహదారణ్యకమున "ఈ పురుషుఁడు (జీవాత్మ) ప్రాజ్ఞాత్మ (పరమాత్మ)తో కూడి బాహ్యమును అంతరమును తెలియకుండు" నని యున్నందున సుషుప్తి యందుగూడా జీవేశ్వరుల భేదము పొడ గట్టుచున్నది. ఇంతేగాక భగవానుఁడగు వేదవ్యాసుఁడు "సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన" అను బ్రహ్మసూత్రమున "సుషుప్తియందు ఉత్క్రాంతియందును జీవపరమాత్మలకు భేధము కలదు" అని నిర్ధారించెను.

ఒకానొక పక్షి-వ్యాధుని హస్తగతమగు సూత్రముచే బంధింపఁ బడినదై-సూత్రబంధము నుండి విడిబడుటకు-నలుదిశల వైపు ఎగురుచు- ఏచోటనుండియు నిర్గమసమార్గము లభింపనందున సూత్రబంధము (వల)నే ఆశ్రయించునట్లు-జీవాత్మ-మనోగతిని పురస్కరించుకొని కామ్యకర్మఫలముల ననుభవించుటకు దేవమానవాదిజన్మల నొందుచు పరమేశ్వరునికన్న వేరు ఆశ్రయము లేనివాడై జనన మరణజరాదిసంపన్నమగు సంసారబంధమున చిక్కుకొని చివరి జన్మలో పరమేశ్వరునకు శరణాగతుఁడై శాంభవదీక్షా స్వీకారముతో ఇష్టప్రాణభావలింగాత్మకుఁడైన శివు నారాధించినచో ముక్తుఁడగును.

శకుని దృష్టాంతము ననుసరించి జీవేశ్వరులు-ఆశ్రయాశ్రయీ భావము గలవారగుటచే నభేదము ఉపపన్నము కాదని తెలియుచున్నది.

"సన్మూలాః సోమ్యేమాః సర్వాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః" అనువాక్యమున-పరమేశ్వరుఁడు సర్వాధారుఁడగునని విశదీకరింపఁబడినది. ఇట్టి పరమేశ్వరుఁడంతర్యామిగ గలవాడవు నీవని-

శ్వేతకేతుఁగూర్చి "తత్త్వమసి" అను వాక్యముతో ప్రబోధింపఁబడిన దనుట-సమంజసముగానున్నయది.

గంగాది మహానదులు-సముద్రముతో కూడినవై-నేను గంగానదిని, నేను యమునానదిని-అను జ్ఞానము లేనివై సముద్రముతో సహ బడబాగ్నిఁ బ్రవేశించి-నామరూపవిభాగము లేనివగునట్లు-జీవాత్మలు-సుషుప్తియందు మరణమున ప్రళయమునందును పరమేశ్వరునితో ఏకీభవించినను పరమేశ్వరుని గుర్తింపనందున సృష్ట్యాదులయందు జననజరాది సంప్రాప్తిరూపమగు సంసారపాశముచే బంధింపబడుచున్నవారు.

నీటిలో వేయఁబడిన లవణమును మరునాడు చూడనివాడై త్రాగి లవణరసము జలమునందున్నదని నాలుకతో గ్రహించినట్లు చేతనాచేతనములందు దాగియున్నట్టి పరమాత్మను ప్రత్యక్షముగ దర్శింపరాదు గాన ఉపాసనచే పరమేశ్వరుని దర్శింపనగుననియు, అట్టి పరమాత్మ అంతర్యామిగ గలవాడవు నీవని "తత్త్వమసి" వాక్యార్థమును నిరూపింపవలెను.

ఒకానొకని కనులుమూసి తస్కరులు గంధారదేశమునుండి తీసికొనివచ్చి నిర్జనారణ్యమునందు విడచివెళ్ళిన పిదప-నేత్రబంధముగల పురుషుఁడు-వ్యాఘ్రాదిభయముచే అఱచుచుండగా- ఒకానొక కారుణికుఁడు దైవికముగ నచ్చోటున కేతెంచి దయతో నేత్రబంధమును తీసివేసి-ఉత్తరదిశకు వెళ్ళినచో నీ గంధారదేశముఁ జేరుదువని చెప్పగా నాతఁడు గ్రామగ్రామములయందు జనులను విచారించుచు స్వదేశముఁ జేరి సుఖంబుండునట్లు-జీవాత్మ- శరీరధారియై దారాపుత్రాదిమోహవస్త్రముచే బంధిపఁబడి-అనేకజన్మల నొంది కర్మానుభవదుఃఖమును సహింపఁజాలక-ఆర్తుఁడై ఆచార్యు నాశ్రయించి శివు నుపాసించినచో

మోహబంధమును త్రెంచుకొని వివేకవైరాగ్యసంపన్నుఁడై పరంజ్యోతిని దర్శించిన వెనువెంటనే సచ్చిదానందమయమగు నిజరూపము నావిర్భవింపఁజేసికొని శివసముఁడై శివానందము ననుభవింపఁగలిగినవాడై జననమరణాది సంసారములోనికి రాకుండును.

మరణించువానికి మోక్షముఁజెందువానికిని పరమేశ్వరు నాశ్రయించుట ఒకటే నైనను ముముక్షువై శివునుపాసించువాడు-మరల జన్మపరంపరలో ప్రవేశింపడు అనుపాసకుఁడు- జన్మపరంపర నొందునని వివేకము.

ఛాందోగ్యమున సప్తమాధ్యాయమునందు ఇరువదిమూడవ ఖండమున-24వ ఖండమునందును "యో వై భూమా తత్సుఖం" ఇత్యాదిని "భూమ" అను శబ్దమును నిర్వచించుతఱి-ముక్తపురుషునిచే అనుభవింపఁబడు శివానందము భూమశబ్దితంబనియు భూమప్రాప్తి యందు శివేతరముండదని చెప్పినంతమాత్రమున జీవుని అస్తిత్వమునకు భంగము రాదనియు, ఒకవేళ జీవాత్మ పరమాత్మతో తాదాత్మ్యము నొంది లేనివాడగునని చెప్పునెడ-శివానందానుభవము ఎవనికనియు? భూమశబ్దవాచ్యంబగు బ్రహ్మము సాక్షాత్కరించుతఱి-బ్రహ్మవిశేషణమగు చేతనాచేతనప్రపంచమును దర్శించుట మొదలగు వానియొక్క నిషేధము "యత్ర నాన్యత్ పశ్యతి" ఇత్యాది నొనర్పఁబడినదనియు, శివానందరసాస్వాదపరుఁడగు ముక్తాత్మకు-ప్రాకృత ప్రపంచదర్శనానుభవాపేక్ష కలుగదనియు ఇతరమును విస్మరింపఁజేయునదే భూమయనియు "ఏతత్తతో భవతి, ఆకాశశరీరం బ్రహ్మ, సత్యాత్మ, ప్రాణారామం" అనుచో "ఏతత్ = ఈ ప్రపంచము, తతః = ముక్త్యనంతరము, ఆకాశశరీరం = చిదంబరము శరీరముగా గలదియు, సత్యాత్మ = సత్యస్వరూపము, ప్రాణారామం = ప్రాణమనఁబడు చిదంబరశక్తియందు విహరించునదియు నగు, బ్రహ్మ =

బ్రహ్మముగా, భవతి=గోచరించు" నని శ్రీ నీలకంఠభగవత్పాదులు తమ సూత్రభాష్యమున భూమాధికరణమునందు ప్రతిపాదించినందున జీవబ్రహ్మైక్యము సంఘటింపదనియు విదితమైనది.

ఈ భూమప్రకరణమునందే పరమేశ్వరుఁడు-తన మహిమ యందు ప్రతిష్ఠ గలవాడై ప్రపంచము నంతర్యామిగా సర్వజగత్కారణుఁడు నని చెప్పుటచే సర్వజగత్కారణత్వాదిధర్మములు గలవాడు పరమేశ్వరుఁడని విశదమగుచున్నందున-బ్రహ్మము నిర్విశేషమని చెప్పనలవి కాదు. మరియు "యదిద మస్మిన్ బ్రహ్మపురే" ఇత్యాది వాక్యమున "బ్రహ్మము నుపాసింపవలె" నని యుండుటచే బ్రహ్మము సవిశేషమని ఈ యుపనిషత్తు నిరూపించుటే గాక శివాద్వైత సిద్ధాంతమును సమర్థించుచున్నయది.

అపహతపాప్మత్వాది ధర్మములు-బ్రహ్మమునకు ముక్తాత్మకు నుండునని ఈ ఛాందోగ్యము నిర్ధారించి-బ్రహ్మము సగుణమనియు, జీవబ్రహ్మైక్యము ఇందు నిరూపింప వలనుపడదనియు సారాంశము విదితమైనది.

ఛాందోగ్యము అతివిస్తృతమగుటచే-మహోపాధ్యాయ, శివశ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు తమ బ్రహ్మపథాంతర్గత వేదపథమున కేవలాద్వైత ప్రతిషేధమునందు వ్రాసిన ప్రశ్నోత్తరరూపమగు ప్రతిపాదనమును పురస్కరించుకొని-భావసారాంశము యథాశక్తి-నుల్లేఖింపఁబడినది.

ఛాందోగ్యము-సమాప్తము.

ఓమ్

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# బృహదారణ్యకోపనిషత్తు

## శివతత్త్వ ప్రభాఽఽంద్రీకరణము

ప్రశ్న: ఓయీ! బృహదారణ్యకోపనిషత్తున ప్రథమాధ్యాయమున నాలుగవ బ్రాహ్మణమునందు "బ్రహ్మ హవా ఇద మగ్ర ఆసీత్ తదాత్మాన మేవాఽవైత్-అహం బ్రహ్మాస్మీతి- తస్మాత్తత్సర్వం సమభవత్-తద్యోయో దేవానాం ప్రత్యబుద్ధ్యత-స ఏవ తదభవత్ తథా ఋషీణాం తథా మనుష్యాణాం-తద్దైతత్ పశ్యన్ ఋషిర్వామ దేవః ప్రతిపేదే-అహం మనురభవం సూర్యశ్చేతి-తదిదమప్యేతర్హి-య ఏవం వేద-అహం బ్రహ్మాస్మీతి- స ఇదగ్ం సర్వం భవతి-తస్య హ న దేవాశ్చ నాభూత్యా ఈశతే-ఆత్మా హ్యేషాం స భవతి అథ యోఽన్యాం దేవతా ముపాస్తే-అన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద-యథా పశురితి"

"సృష్టికి మున్ను ఈ జగత్తు బ్రహ్మముగానే యుండెను. అప్పుడు "అహం బ్రహ్మాస్మీతి" "నేను బ్రహ్మము" నని తనను తాను గుర్తించెను. అట్టి బ్రహ్మమునుండి జగత్తంతయు ప్రభవించెను మానవులలోనే గాక దేవతలందుగూడ ఎవడెవడు "నేను బ్రహ్మము" నని గుర్తించెనో, వాడు వాడు బ్రహ్మంబయ్యెను. ఈ భావన-ఋషులలో

మనుష్యులలోను సుదృఢమైనందున వామదేవుఁడను ఋషి-అహం బ్రహ్మాఽస్మి' భావనతో- "నేను మనువును సూర్యచంద్రాది సమస్త చేతన స్వరూపుఁడ" నని నిర్వచించెను ఇట్లు గుర్తించువాడు-సమస్త జగద్రూపుఁడై బ్రహ్మంబగును. అట్టి బ్రహ్మజ్ఞానిని దేవతలుగూడ నిరోధింపఁజాలరు. బ్రహ్మము తాను కానని బ్రహ్మభిన్నుఁడనని ఇంద్రచంద్రాదుల నుపాసించువాడు-దేవతలఁగూర్చి పశువుగా ప్రవర్తించును" అని యుండుటచే నిఁట "అహం బ్రహ్మాస్మి" అని జీవబ్రహ్మైక్యము ప్రతిపాదింపఁబడుటఁజేసి-"యోఽన్యాం" ఇత్యాదిని-జీవేశ్వరభేదజ్ఞానము నిందింపఁబడినందున- శుద్ధాద్వైతపరత్వము పొడగట్టుచున్నది గదా!

ఉత్తరము: "తదాత్మానమేవాఽవైత్- అహం బ్రహాస్మి" ఇత్యాదికము బ్రహ్మవాక్యమగుటచే నీయుపనిషత్తు జీవబ్రహ్మైక్యపరము కాదని తెలియుచున్నది. ఎట్లనఁగా? "యఏవం వేద-అహం బ్రహ్మాస్మి,"అనుచో ఉపదేశింపఁబడిన అభేదము "యోఽన్యాం దేవతా ముపాస్తే" అను వాక్యముఁదగు శేషమగుటచే- "అహంబ్రహ్మాస్మి" "నేను బ్రహ్మము" నను "శివోఽహం" భావన-ఉపాసనావిషయమగుచున్నయది. అందువలన నీ ఐక్యభావన పారమార్థిక (వాస్తవ)ము కానిదై జీవబ్రహ్మైక్యభ్రమను నిరాకరించునదైనది.

ఇందువలననే ఇంద్రప్రాణాధికరణమునందు "మాముపాస్వ". "నన్నుపాసింపుము" అను ఇంద్రునివాక్యము "శాస్త్రదృష్ట్యాతూపదేశో వామదేవవత్" "ఇంద్రుఁడు ప్రతర్దనునకు నేను బ్రహ్మము నను తాదాత్మ్యభావనతో శాస్త్రదృష్టితోడ నన్నుపాసింపుమని-పూర్వము వామదేవుఁడు-అహం మను రభవం సూర్యశ్చ-ఇత్యాదిసర్వాత్మభావము నుపదేశించినట్లు-సంఘటితమగు నని శ్రీ నీలకంఠభగవత్పా

దులు-తమ బ్రహ్మసూత్ర భాష్యమున నిరూపించిరి. మరియు వేదాంతవిజ్ఞానముచే లభించిన జీవబ్రహ్మసామరస్యభావనతో బ్రహ్మ భావమును పొందినట్టి, దేవమనుష్యాదిదేహసంబంధమగు అహంభావ సంకోచమును పోగొట్టుకొనినట్టి, విశ్వాకారమగు పరాహంభావము గలిగినట్టి వామదేవుఁడు-తాను మనుసూర్యాది సర్వప్రపంచస్వరూపుఁడనని యుపదేశించుట-సుసంగతమైనది. "ప్రాణోఽస్మి" అనుచోగల ప్రాణశబ్దము-పరబ్రహ్మఁ జెప్పునది. పరమేశ్వరుఁడు ఆనందమయుఁడగుటచే సమస్తజీవులను బ్రతికించువాడై ప్రాణశబ్దవాచ్యుండగుచున్నవాడు. "ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽనందోఽజరోఽమృతః" అనువాక్యము-ప్రాణము పరమేశ్వరుఁడని-సమర్థించినది. అనిగూడా శ్రీ నీలకంఠాచార్యులు ప్రతిపాదించిరి.

మరియు "అహం బ్రహ్మాస్మి" "మాముపాస్వ" అను ఉపదేశము శాస్త్రదృష్టితో చేయఁబడినది. ఎట్లనఁగా? శ్రీకృష్ణాదులు-అర్జునాదులకు భగవద్గీతాదులను శాస్త్రదృష్టితో-"అహం, అహం" అని యుపదేశించిరి. బ్రహ్మమును శాస్త్రముతో గుర్తించి యుపాసించుటతో బ్రహ్మభావమును పొందినట్టి, కించిజ్జజీవభావము లేనట్టి, బ్రహ్మస్వరూపముతో నేకీభవించిన(శాస్త్ర)దృష్టితో తనకు ఉపాస్యత్వమును సర్వాత్మకత్వము గలదని యుపదేశించుట- యుక్తమైనదని-నీలకంఠ భగవత్పాదులు సమర్థించిరి

ప్రశ్న: ఈ యుపనిషత్తున నాలుగవ అధ్యాయమునందు బాలాకి బ్రాహ్మణమున "బ్రహ్మ తే బ్రువాణి" అని ప్రతిజ్ఞఁజేసి-అజాతశత్రువు- నిద్రించు పురుషుని రెండుమూడు పర్యాయములు పిలిచినను వాడు మేలుకొననందున-చేతికఱ్ఱతో కొట్టగా-వెంటనే వాడు లేచెను" "పాండరవాస! సోమరాజన్!" అని ప్రాణముయొక్క నామ ధేయములతో పిలిచినన్దానిని వినిపించుకోనందున యష్టిఘాతముతో

లేచినందునను "ప్రాణశబ్దితపరమాత్మకంటె వేరైన జీవుఁడు తెలియదగినవాఁడు" అని ద్యోతకమగుచున్నది. ఈ సందర్భమున తెలియదగిన జీవాత్మ-బ్రహ్మభిన్నుఁడు కాదని పొడఁగట్టుటచే ఇందు జీవబ్రహ్మైక్యము ముఖ్యసారాంశమగుటజేసి ఈ యుపనిషత్తు-శుద్ధాద్వైతమును సాధించునదని చెప్పుట-సమంజసము కాదా?

ఉత్తరము: బాలాకిబ్రాహ్మణమునందు-జీవునకు సుషుప్తిదశలో బ్రహ్మాధారత్వముతో అనఁగా-జీవాత్మ పరమాత్మనాశ్రయించి గాఢనిద్రఁజెందునని-భేదమును నిరూపించుటతో అభేదభ్రాంతి-నిరాకరించఁబడినది. గాఢనిద్రనుండి మేలుకొనిన జీవుఁడు ఎటనుండి వచ్చెనని కాశిరాజగు అజాతశత్రువు ప్రశ్నించి పరమాత్మనుండి వచ్చెనని తానే బదులు చెప్పుటఁబట్టి-జీవేశ్వరులకు ఐక్యము అసంభావితమని తెలియుచున్నందున నియ్యది శివాద్వైతప్రతిపాదకమనుట-అవిచలమైనది.

ఈ యుపనిషత్తునందే తృతీయాధ్యాయమునందు సప్తమబ్రాహ్మణమున మూడవ వాక్యమునుండి-

"యః పృథివ్యాం తిష్ఠన్-పృథివ్యా అంతరో- యం పృథివీ న వేద-యస్య పృథివీ శరీరం-యః పృథివీమంతరో యమయతి-ఏష త ఆత్మాఽంతర్యామ్యమృతః"

"ఏ పరమాత్మ పృథివియందు ఉన్నవాఁడై భూమిబాహ్యమునందు గాక-భూమిలో దాగియున్నను పృథివి- ఏ పరమాత్మఁ గుర్తింపదో ఏపరమాత్మకు పృథివి శరీరమో, ఏ పరమాత్మ-లోకములను ధరించుట విషయమై పృథివిలో నుండి ప్రేరేపించునో, అట్టి ఈ పరమాత్మ (శివుఁడు) అమృతుఁడనఁబడుఁచు నీకు (మాకును) అంతర్యామి యగువాఁడు."

"యో విజ్ఞానే తిష్ఠన్—విజ్ఞానాదంతరో-యం విజ్ఞానం న వేద-యస్య విజ్ఞానం శరీరం-యో విజ్ఞానమంతరోయమ యతి—ఏష త ఆత్మాఽంతర్యామ్యమృతః"

"ఏ పరమాత్మ జీవాత్మయందు ఉన్నవాడై-జీవాత్మలో దాగియున్నను—జీవాత్మ ఏ పరమాత్మను గుర్తింపదో, ఏ పరమాత్మకు జీవాత్మ శరీరమో, ఏ పరమాత్మ-సుఖదుఃఖభోగము విషయమై జీవాత్మను లోనుండి ప్రేరేపించునో అట్టి ఈ పరమాత్మ (శివుఁడు) అమృతుఁడనఁబడుఁచు నీవు మొదలగు ప్రాణులందరికి నంతర్యామి యగువాఁడు"

ఇత్యాది ఇరువదియొక (21) వాక్యములలో-పృథివ్యాదుల కంటెను జీవాత్మకంటెను పరమాత్మ భిన్నుఁడు (వేరు) అని ప్రతిపాదించుటచేతను, చిదచిత్తులు ఈశ్వరునకు శరీరమని—శరీరశరీరి భావము నుపదేశించుటవలనను, ఈ యుపనిషత్తు (బృహదారణ్యకము) సవిశేషశివాద్వైతపరమే నని ఋజువగుచున్నది.

మరియు శ్రీ నీలకంఠీయ బ్రహ్మసూత్రభాష్యమున-అంతర్యామ్యధికరణమునందు "ఉభయేఽపి హి భేదేనైన మధీయతే" అను సూత్రమున— కాణ్వులు మాధ్యందినులు అను ఉభయులు-బ్రహ్మము జీవుని కన్న భిన్నమని జీవాంతర్యామిగా నిర్ణయించుటఁజేసియు ఈ యుపనిషత్తు-సవిశేష శివాద్వైతపరమగునని తేటపడినది.

ఇంతేగాక-పృథివ్యాది అష్టమూర్తులలో నంతర్యామిగ పరమేశ్వరుఁడు నిర్దేశింపఁబడుటచే- శివేతరదేవతల నిందు నిరూపింపవలను పడదు గానను ఇయ్యది శివపరమగునని చెప్పుట ప్రశస్తమగుచున్నయది.

ఇందు రెండవ అధ్యాయమున నాలుగవ మైత్రేయీ బ్రాహ్మణమునందు-

ప్రశ్న : నవ్వాఽరే పత్యుఃకామాయ పతిఃప్రియో భవతి" "మైత్రేయీ! భర్త యొక్క ఆనందమునకై భర్త-ప్రియుఁడు కాడు. తన సంతృప్తి కొరకు మాత్రము ప్రియుఁడగును" అను వాక్యము మొదలుకొని "ఆత్మా నాఽరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాపితవ్యః" "ఆత్మయే దర్శింపఁదగినది, వినఁదగినది, మననముఁ జేయఁదగినది, ధ్యానింపఁదగినదియు"అను వాక్యమువరకు 'ఆత్మనస్తు కామాయ" "ఆత్మయొక్క వాంఛితము ఫలించుటకై భార్యా భర్త్రాదికము ప్రియమగు"నని చెప్పుటచే-ఈ ప్రకరణమునందు భోగప్రీతిగల ఆత్మ సంసారిజీవుఁడని విశదమగుచున్నందున జీవాత్మయే దర్శింపఁదగినవాడని పర్యవసానముగ స్ఫురించుటఁజేసి-జీవబ్రహ్మలకు భేదము లేదని ఇందు ప్రతిపాదింపఁబడినదని తెలియవలెను. అందువలన నీ బృహదారణ్యకోపనిషత్తు-కేవలాద్వైతపరమగునని నిరూపింపవలెను గదా!

ఉత్తరము: "ఆత్మనస్తు కామాయ" ఇత్యాదివాక్యములలో గల ఆత్మశబ్దము ఉపక్రమబలముఁబట్టి-జీవాత్మఁజెప్పనదగుటచే-అంతతః నిర్దేశింపఁబడిన ఆత్మశబ్దముగూడ ద్రష్టవ్యుఁడుగా జీవాత్మనే నిర్వచించునని-వాక్యాన్వయాధికరణమునందు ఆశంకించుకొని "యాజ్ఞవల్క్య మహర్షి-సన్న్యసింపఁదలచి-తన భార్యలిరువురికి స్థిరచరాస్తిని విభజింప నుద్యుక్తుఁడు కాగా-జ్యేష్ఠపత్నియగు మైత్రేయి-నీ జ్ఞానయోగము నుపదేశింపుము! నాకు మీ ఆస్తియందు ఆపేక్షలేదని ప్రార్థింప యాజ్ఞవల్క్యుఁడు "అమృతత్వస్య తు నాశాస్తి విత్తేన" అనువాక్యమున "మోక్షమునకు విత్తముతో నవసరము లేదు" అని

ప్రబోధించి "ఆత్మని ఖల్వరే దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే-ఇదం సర్వం విజ్ఞాతం-ఇదం సర్వం యదయమాత్మా-యేనేదం సర్వం విజానాతి తత్కేన విజానీయాత్?" "ఆత్మను చూచినచో ఆత్మను గురించి వినినచో ఆత్మను గురించి విచారముఁజేసినయెడల-ఆత్మ నపరోక్షముగ గుర్తించినచో—ఈ చేతనాచేతనసమ్మిశ్రితమగు జగత్తం తయు విదితమగును. మరియు ఇదంతయు ఆత్మయేను. ఎవనిని తెలిసికొనినచో ఇది యంతయు తెలియునో అట్టి పరమాత్మను దేనితో తెలిసికొనవలెను? ఇత్యాది అనేక వాక్యములు-బ్రహ్మలక్షణము లను బోధించుటఁజేసి-ఇఁట గల ఆత్మ శబ్దము-జీవపరమాత్మలకు సాధారణమైనను-జీవాత్మయందు వర్తించువాడు పరమాత్మయగుటచే పరమాత్మ-నిరుపపద ఆత్మ శబ్దముచే నిర్దేశింపఁబడుటయందు ఔచిత్యము కలదని శ్రీ వేదవ్యాస భగవానుఁడు-ప్రథమాధ్యాయగత చతుర్థపాదమున "వాక్యాన్వయాత్" అను సూత్రార్థముగ ప్రతి పాదించెను.

పరమాత్మను దేనితో తెలిసికొనవలెనను ప్రశ్నకు "శ్రోతవ్యో" ఇత్యాదిని— శ్రవణమనననిదిధ్యాసనములు-పరమాత్మ దెలిసికొను టకు సాధనములగునని-సమాధానమొసఁగఁబడినది.

పరమాత్మ (శివ) దర్శనము వలననే మోక్షము చేకూరునని "యదా చర్మ వదాకాశం" ఇత్యాది శ్వేతాశ్వతరోపనిషద్వాక్యమున ప్రతిపాదింపఁబడుట- ఇఁట గమనార్హమగుచున్నయది.

ఇట్టి సమర్థనము వలన బృహదారణ్యకమంతయు శివాద్వైత పరమగునని నిర్ధారింపఁబడుటను విబుధులు గ్రహింతురు గాక!

ఇట్లు—శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థము శైవారాధ్యలోక కల్యాణా ర్థంబు యథామతి శివతత్త్వపరగా ఉపనిషత్తుల నాంధ్రీకరించి-కొన్ని

వాక్యములకు-పదార్థమును, మరికొన్నిటికి-పదార్థగర్భిత భావమును ఇంక కొన్నిటికి-కేవల సారాంశమును వ్రాసితిని. ప్రథమభాగమున ఏడు ఉపనిషత్తులు, ద్వితీయ భాగమున పదియైదు ఉపనిషత్తులు కలవు. ఈ అర్థస్ఫురణమునకు పూర్వోత్తర సందర్భసమన్వయమునకును మహోపాధ్యాయ, శివయోగి ముదిగొండ నాగలింగశాస్త్రులఁ గారి బ్రహ్మపథాది గ్రంథములు, శ్రీ వీరశైవపండిత ప్రకాండుల వ్యాఖ్యలు, శ్రీ గోపాలానందాచార్యుల విశిష్టాద్వైత పరమగు దశోపనిషత్ భాష్యము, అటనట శాంకరభాష్యంబు ఆధారములైనవి. గ్రంథ విస్తరభీతిచే ముఖ్యవాక్యములు మాత్రము ఉదాహరింపబడినవి.

వీనిని వ్రాయఁ బ్రోత్సహించినట్టి, లోకారాధ్యులైన, శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావు (విజయవాడ) గారు ఈ రెండు పొత్తముల నచ్చొత్తింప-సంపూర్ణ ఆర్థికబాధ్యతను వహించి-నా కృషిని సార్థక మొనర్చినందుకు-వారికి నా అభినందనములు.

బృహదారణ్యకోపనిషత్తుతో_మరియు
సర్వంబు సమాప్తము.
ఓం తత్సత్.

శివః ప్రసీదతు.
శైవాశ్చ ప్రీణంతు.

నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులు
(శైవమహాపీఠాధిపతి)

శ్రీమహాగణాధిపతయే నమః

ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, కైవల్య, మాండూక్య సప్త ఉపనిషత్తులకు

శ్రీ శ్రీ నీలకంఠాచార్యకృతభాష్యమును, శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రికృత సంస్కృతవ్యాఖ్యానము ననుసరించి



శ్రీ నిర్మల శంకరశాస్త్రికృత-

**శివతత్త్వప్రభాఽఽంధ్రీకరణము**



ప్రకాశకులు - శివజ్ఞానలహరి, ధార్మికసంస్థ, రిజిస్టర్డ్
హైదరాబాద్.

అధ్యక్షులు-శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావుగారు,
విజయవాడ-10.



శ్రీ ధాతృ సం॥ 1996, వెల : రూ. 60/-

# విషయసూచిక

# తొలిపలుకు

భరత ఖండమున సర్వమతస్థులకును ప్రమాణ గ్రంథములు వేదములు. వేదమును శిరసావహించెడి మతములారు విధములు. అవి - శైవము, శాక్తము, వైష్ణవము, సౌరము, గాణాపత్యము, స్కాందములై యున్నవి. అట్టి శైవ మతమును వ్యాప్తిలోనికిఁదెచ్చి, శతాధిక గ్రంథకర్తవై కృష్ణానదీ తీరమున గుంటూరునకు ఎనిమిది మైళ్ళ దూరమున నున్న తాడికొండ గ్రామమున క్రీ.శ. 1876 సం॥ సరియగు ధాతనామ సంవత్సర చైత్రశుద్ధ నవమి సోమవారమున భూలోక ప్రవేశము జేసిన, మహోపాధ్యాయ శివయోగి శివశ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రిగారు చిరస్మరణీయులు.

శ్రౌత శైవులకు వేదాగమము లుభయమును పరమ ప్రమాణములు శిరోధార్యములై యున్నవి. అట్టి వేద ప్రామాణ్యముతో ఆవిష్కరింపబడినదే వైదికపుష్టి కలిగిన శివారాధ్య శ్రౌత శైవ సంప్రదాయము. భారతీయ సంస్కృతికే మణిభూషణము. శ్రీ నాగలింగ శాస్త్రిగారిట్టి శ్రౌత శైవ సంప్రదాయమతిప్రాచీనమని తమ గ్రంథములందు నిరూపించిరి, ద్వైత, అద్వైత విశిష్టాద్వైతములను వాని భేదములను నిరూపించి, ఆయా మతాచార్యులు స్వమత ప్రతిష్ఠాపనమునకై వేదమంత్రములకును వ్యాససూత్రములకును గావించిన యర్థములు సరియైనవి కావనియు, కర్మ జ్ఞాన సముచ్చయ విలసితమై, భస్మ రుద్రాక్ష లింగధారణ సహితమైన శైవమహాదీక్షయే మోక్షసాధనమని సప్రమాణముగా నిరూపించిరి. వేదపథము, వ్యాస

పథము, శివఏవ కారణం, శ్రౌతాన్యేన శైవఖిహ్నని, శ్రౌతమేవ హి లింగ ధారణం, శిష్టా స్సర్వే శ్శివం ప్రపన్నాః, శివాద్వైత పథము, కేవలాద్వైత ప్రతిషేధము, వేదాంతార్ధ పరిష్కార తార హారము, రక్షారుద్రాక్ష చండమార్తాండము, విద్యాస్థాన వినిర్ణయము, మత వినోదచర్చ చతుర్వేద, భారత రామాయణ తాత్పర్య సంగ్రహములు, జ్ఞాన వాశిష్ఠము, శైవ సిద్ధాంత సంగ్రహము, కారణోత్తర మకుతోత్తర, చంద్ర జ్ఞాన శివాగమములకు తెలుగులో వ్యాఖ్యానములు, బసవ పురాణ పీఠికా విమర్శనము, అప్పయ దీక్షిత చరిత్ర, నీలకంఠ భాష్య చర్చ, ఇత్యాది నూరు పైగా శైవగ్రంథములు రచించి, నీలకంఠారాధ్యుల భాష్యపథమే సరియైనదనియు సిద్ధాంతీకరించిరి. ఇంకను మోక్ష స్వరూప నిర్ణయమను గ్రంథములో జీవ బ్రహ్మైక్యము ముక్తి స్వరూపమని యెన్నుట భ్రాంతి యనియు, పరమ పురుషార్థ స్వరూపమును తెలుపునట్టి వేదాన్త వాక్యముల వలనను, వాని యర్థమును నిర్ణయింపనేర్పడిన బ్రహ్మసూత్రముల వలనను పరమేశ్వరుని పరమ సారూప్యంబును సాయుజ్యంబు ననునదియే మోక్ష స్వరూపంబని నిర్ణయించిరి. 13-12-1948 సం॥ శివసాయుజ్యమునందిరి. వీరు శైవమత ప్రచారమునకై మద్రాసు నుండి శ్రౌత శైవ ప్రకాశిక యను మాసపత్రికను, తెనాలి సంస్కృత కళాశాలలో కొంతకాలము విద్యాంగఅపి తెనాలినుండి, శైవరహస్య బోధిని, జ్ఞాన వాహిని యను మాసపత్రికలను నడిపి శైవ సాహిత్యమున కెనలేని సేవఁజేసిరి. ఇటీవలనే స్వర్గస్థులైన చందనోలు శ్రీ తాడేపల్లి రాఘవ నారాయణశాస్త్రిగారు పాతంజలి భాష్యమును వీరి యొద్దనే చదివిరి. మధురావిజయమను గ్రంథమును రచించి తమ గురుపాదులు శ్రీ నాగలింగశాస్త్రిగారికి అంకితమిచ్చిరి. శ్రీ నాగలింగ శాస్త్రిగారు, భారతజాతి సంస్కృతికే మూలమైన శైవమునకు

జేసిన సేవ అపారము. అమ్మహనీయుని 120 వ జన్మదిన సందర్భముగా నివాళులర్పించుచు ఆయన స్మృతి చిహ్నముగా శ్రీశ్రీ నీలకంఠ భగవత్పాదాచార్య కృత ఉపనిషత్ భాష్యమును, శ్రీనాగలింగ శాస్త్రిగారి సంస్కృత వ్యాఖ్యాన సమన్వితముగా, ప్రస్తుత శైవమహాపీఠాధ్యక్షులు శ్రీ కంఠ విద్యాభూషణ, సంస్కృత సాహిత్య రత్న, ఆంధ్రానువాద కుశల, ఆసన్న అర్ధశత గ్రంధకర్తలు మల్లికార్జున పండితారాధ్య వంశీయులు గౌతమ గోత్రజులు, జ్ఞానవయోవృద్ధులు నగు శివశ్రీ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారిచే ఆంధ్ర వ్యాఖ్యానము వ్రాయబడి మా శివజ్ఞానలహరి ధార్మిక సంస్థ ప్రథమ కుసుమముగ జిజ్ఞాసువుల కందజేయబడుచున్నది. శ్రీ శంకరశాస్త్రి గారికి మా నమోవాకములు. ప్రశంసావాక్యములు పంపిన శివశ్రీ కాశీనాథుని పూర్ణ మల్లికార్జునుడు గారికి మా కృతజ్ఞతలు.

ది. 30-6-1996
విజయవాడ-10

అన్నదేవర సుబ్బారావు
అధ్యక్షులు శివజ్ఞాన లహరి
ధార్మిక సంస్థ హైద్రాబాదు-29



# విన్నపము

మన భారతీయ సంస్కృతికి మూల గ్రంథములై, దేశ విదేశీయులచే కొనియాడబడి, ప్రస్థాన త్రయముగా భాసిల్లిన బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు భగవద్గీతల కనేకులు తమ తమ మతానుసారముగా తమ సిద్ధాంతమున కనుగుణముగా వ్యాఖ్యానములు వ్రాసి యున్నారు. వీనిలో చాలవరకు కొన్నింటిని పరిశీలించిన తర్వాత కలిగిన అభిప్రాయమేమన? ఇవి "కలౌ శైవ మరోచకమ్" యను నానుడి నాశ్రయించి వ్రాసినట్లు కనుపట్టినది. 'శివ' 'బ్రహ్మ' పదములకు శైవులు ఏక వాక్యార్థతను సాధించిరి. అది యీ వ్యాఖ్యానములలో మృగ్యము. మరియు శివపదమున కొకచోట మంగళకరుడనియు, మరియొక చోట మరియొక విధముగను "తథా శివ మనిజ్ఞాయ దుఃఖస్యాంతో భవిష్యతి" అను శ్వేతాశ్వతర మంత్రమందలి "శివ పదమును "దేవ" పదముగా మార్చి వ్యాఖ్యానించుచు, ఇట్లే శివ, బ్రహ్మ, పశుపతి, లింగ, భర్గ, రుద్ర, త్ర్యంబక, ఈశ్వర ఇత్యాది పదములకు ఒక్కొకచోట నొక విధముగా అర్థమును వ్రాయుచు, విపరీతార్థములతో శివద్వేషమునే ప్రధానీకరించుకొని, పరమప్రామాణికమైన భస్మ రుద్రాక్ష లింగధారణ సహితమై మోక్షసాధనమైన శైవమహాదీక్షనే, తృణీకరించుచు వ్రాసిన వ్యాఖ్యానములు జిజ్ఞాసువులను ముఖ్యముగా శైవులను తప్పుదారి పట్టించు విధముగా యుండుటచే భారతీయ సంస్కృతికి ముఖ్యములైన నీ ద్వాదశ ఉపనిషత్తులకు శివపరముగా వ్యాఖ్యానమునందించుట అవసరమైనది. ఇందు- ఈశావాస్య, కేన, కఠ, ప్రశ్న, ముండక, కైవల్య మాండూ

క్యోపనిషత్తులు ప్రథమభాగముగా శ్రీ శివశ్రీ నిర్మల శంకర శాస్త్రిగారి తెలుగర్థముతో కలవు. మిగిలిన ఛాందోగ్య, ఐత రేయ తైత్తిరీయ, బృహదారణ్యక, శ్వేతాశ్వతర ఉపనిషత్తుల సారాంశము-శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి గారివ్యాఖ్యానముతో రెండవ భాగముగా వెలువడగలదు. విజ్ఞులు గ్రహింతురుగాక!

విజయవాడ-10
ది. 30-6-1996

అన్నదేవర సుబ్బారావు
అధ్యక్షులు శివజ్ఞానలహరి, హైదరాబాదు-29

# ప్రశంసా వాక్యములు

శివశ్రీ ॥ లోకారాధ్యులు కాశీనాథుని పూర్ణమల్లికార్జునుడు గారు **M.A. B.L. Ex. M P.** స్వాతంత్ర్య సమర యోధులు బుట్టాయి పేట, బందరు వారి ప్రశంసా వాక్యములు.
–శివశ్రీ॥ అన్నదేవర సుబ్బారావు గారికి–శివస్మృతులతో వ్రాయునది!

'శివజ్ఞాన లహరి' యను సంస్థను స్థాపించి, తద్ద్వారా భారతీయ సంస్కృతికి మూలభూత శైవ వాఙ్మయమును, ముఖ్యముగా యీ గ్రంథమును జిజ్ఞాసువుల కందజేయ సంకల్పించుట మీ శైవ మతాభిమానమునకు తార్కాణము మీ పవిత్రాశయము శివానుగ్రహమున సఫలమగుగాక!

ఆస్తికులందరును ఉపనిషత్తులను, బ్రహ్మసూత్రములతో బాటు, భగవద్గీతను గూడ ప్రమాణ గ్రంథములుగా స్వీకరించి వారి వారి మతానుసారముగా వ్యాఖ్యానము గావించుకొని యున్నారు. శ్రీ నీలకంఠాచార్యుల వారి సిద్ధాంతమే ఆచరణీయముగా గ్రహించువారు శ్రౌత శైవులైన ద్వాదశాచార్యులు" వారి తరువాత శ్రౌతశైవమత ప్రచారము గావించినవారు ప్రథమ శైవ మహాపీఠాధిపతులు శతాధిక గ్రంథకర్తలునగు శివయోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు. శ్రీవారు శ్రీ నీలకంఠాచార్యుల వారి గ్రంథములకు సంస్కృతములో వ్యాఖ్యానము వ్రాసిరి. సంస్కృత భాషాజ్ఞానము చాల తక్కువగా యున్న ఈ కాలములో సర్వులకు సులభగ్రాహ్యమగునట్లుగా, విద్వత్ వరేణ్యులు శివశ్రీ ॥ - నిర్మల శంకరశాస్త్రి గారు, ఈ సప్తోపనిషత్తులను ఆంధ్రీకరించి శైవులకు మహోపకారము జేసినారు. శివాద్వైత సిద్ధాంతము సులభతరమును క్లేశరహితమును అగుటవలన ఈ మార్గములో సులభముగా పరమేశ్వరుని జేరుట కవకాశము గలదు.

ఈశ్వరశబ్దము శివునకే రూఢము, శివాద్వైతమతము లోని విశేష మేమనగా? వేదములు, ఉపనిషత్తులు భగవద్గీత అనువాని యందు జెప్పిన మంత్రార్థముల కనుకూలముగ, భస్మరుద్రాక్ష శివలింగ ధారణము, పంచాక్షరీ మంత్రజపము, శివలింగాభిషేకము, శివపూజ, దశావధాన కార్యక్రమము లిందుండుటయే ఇట్టి విశేషములను సామాన్యులకందుబాటులో నుండు రీతిగా ఆంధ్ర భాషలోనికి అనువదించి మతోద్ధరణఁ జేయుటయే గాక తాము జీవన్ముక్తులగుటకు పాత్రత సంపాదించిన శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి మహోదయులను అభినందించుచున్నాను. వారికి పార్వతీ పరమేశ్వరులు సుదీర్ఘమైన ఆయుష్యమును శారీరక మానసిక పాటవమును ప్రసాదింతురుగాక!.

కాశీనాథుని పూర్ణ మల్లికార్జునుఁడు
బందరు, ది. 21-6-1996

# కృతజ్ఞత

విజయవాడ-10
ది. 1-7-1996

లోకారాధ్యులు
శివశ్రీ॥ నిర్మల శంకరశాస్త్రి ఆరాధ్యులవారికి
శరణులు నమస్కారములు-

అయ్యా!

ఈ ఏడు ఉపనిషత్తులు శివాద్వైత పరముగ వ్యాఖ్యానము వ్రాసి నాకు మహదానందము కలిగించినారు. భావితరములవారు తమ కృషి కెంతయొ ఋణపడి ఉండగలరు. వయోవృద్ధులై యుండి అనారోగ్యమును గూడ లెక్క జేయక ఈ ఉపనిషత్తుల కార్యము పూర్తి జేసినందులకు చాల కృతజ్ఞుడను. ఇటులనే మిగతా ఐదు ఉపనిషత్తులకు అవసరమైనచోట్ల మంత్రములను వ్రాయుచు మిగతా చోట్ల సారాంశము మాత్రము వ్రాసి 200 పేజీలు మించకుండా మొదటి భాగము వలెనే వ్రాసి త్వరగా పూర్తిజేయ గోర్తాను. తమ కృషికి నా అండ దండలు ఎప్పుడూ ఉంటాయి. తమ ఆశీస్సు లభ్యర్థిస్తున్నాను.

ఇట్లు విధేయుడు
అన్నదేవర సుబ్బారావు
M.A. B.L. F.R.S. (Retd)
శివజ్ఞాన లహరి,
అధ్యక్షులు,

# ఆశీరభినందనము

శివశ్రీ ॥ అన్నదేవర సుబ్బారావు గారు - సరస గంభీర హృదయులు, ఉదారస్వభావులు, శైవసంప్రదాయనిరతులు శివపూజా దురంధరులు, శైవమత ప్రచారమును గ్రంథరూపమున, ప్రవచనరూపముననను, పృచ్ఛకుల సందేహములను తీర్చు పరిష్కారముల తోడను-గావించుచు సమకాలిక ఆరాధ్యశైవులకు కనువిప్పు గలిగించు ఆదర్శపురుషులై యున్నవారని భావించుచు వీరిని సర్వాత్మనా అభినందించుచున్నాను. వీరికి వీరి కుటుంబమునకును దీర్ఘాయురారోగ్యభాగ్యములను కన్యాదాన సుకృతఫలములను శివుఁడు ప్రసాదించుగాక!

శ్రీవారి ప్రథమ తనూభవుఁడైన శివశ్రీ ॥ అన్నదేవర చంద్రశేఖర్ గారు - ఆంగ్లేయభాషా కోవిదుఁడైనను వేదాగమస్మృతి పురాణాదిసమ్మతమగు శైవ సంప్రదాయమునందు ఆసక్తి గలవారై నిత్యము శివారాధనముఁ జేయుచు ధన్యులగుచున్నవారు.

వీరికి దీర్ఘాయురారోగ్యభాగ్యములతో ఇహ పరములను సాధించు సామర్థ్యము - శివానుగ్రహమువలన - దినదినప్రవర్ధమాన మగుగాక!

)-7-1996,

నిర్మల శంకరశాస్త్రి

శ్రీ

## వాజసనేయ సంహితాంతర్గతమగు

# ఈశావాస్యోపనిషత్తు

"ఓం ఈశావాస్యమిదగ్ం సర్వం-యత్కించ జగత్యాం జగత్ । తేన త్యక్తేన భుంజీథా–మా గృధః కస్యస్విద్ధనమ్"

పదార్థము. జగత్యాం=భూలోకము మొదలగు లోకములన్నిటి యందు, జగత్ = చరాచరప్రాణిజాతము, యత్కించ = ఏదేది గలదో, (తత్ అధ్యాహారము) తదిదం సర్వం = అట్టి ఈ ప్రపంచ మంతయు, ఈశావాస్యం = పరమేశ్వరునిచే వ్యాపింపఁబడినది.

తేన = సర్వనియామకుఁడైన ఈశ్వరునిచే, త్యక్తేన = నీ కొరకు విడుదల చేయఁబడిన దానితో, భుంజీథాః! = శాస్త్రముఁదగు అనుజ్ఞ గలిగిన అనుభవము ననుసంధింపఁజేసికొనుము! కస్యస్విత్ = ఎవనియొక్కయు, ధనం = స్థిరచరాస్తిని, మాగృధః! = అపే క్షింపకుము!

చేతనుఁడు–స్వభావమున, అచేతనము–స్వరూపమున ఈశ్వర భిన్నమైన మార్పుఁజెందునవగుటచే–జగత్–అను శబ్దముతో ఇఁట చెప్పఁబడినవి. "దోషము గలదని భావించి మమకారము లేనివాడ వై భోగ్యము ననుభవింపుము" అనియు చెప్పవచ్చును. అనఁగా–శరీర పోషణమునకు మాత్రము ఉపయోగించు ఆహారము మొదలగువానిని

స్వీకరించుచుండుమని భావము. "ప్రతిదాని నమితముగ నపేక్షింప కుము! అనుభవింపదగిన వస్తుజాతమంతయు జీవమాత్రునిది కాదు. సమస్తము పరమేశ్వరునిదేను, పరమేశ్వరుడే ఈ చరాచరమును పుట్టించి అందు ప్రవేశించి నియమించుటచే ప్రపంచము ఈశ్వరుని శరీరమై నొప్పుచున్నది. "నేను కర్తను నేను భోక్తను" ఇత్యాది అభినివేశము లేనివాడవై భోగ్యమునంతయు ఈశ్వరునకు నివేదించి తత్ప్రసాదముగ అనుభవింపుమని విశదార్థము.

"కుర్వన్నేవేహ కర్మాణి-జిజీవిషే చ్ఛతగ్ం సమా। ఏవం
త్వయి నాన్యథేతోఽస్తి-న కర్మ లిప్యతే నరే" 2

ప. శతం సమాః=నూరువత్సరములు (అనగా_యావజ్జీవము) కర్మాణి=ఫలాపేక్ష లేనట్టి నిత్యనైమిత్తికాది విహితకర్మలను, ఇహ = ఈ లోకమునందు, కుర్వన్నేవ= చేయుచున్నవాడవయ్యే. జిజీవిషేత్ = జీవింపగోరవలెను. త్వయి = నీ విషయమై, ఏవం = చెప్పబడిన కర్మానుష్ఠానమే ఉచితమైనది, ఇతః = చెప్పబడిన విధానమునకంటె, అన్యథా = మరియొక విధానము, నాస్తి = లేదు, నరే= మోక్షమునపేక్షించు మానవుని విషయమై, కర్మ = నిష్కామకర్మాచరణము, న లిప్యతే = బంధమును కలిగించునది కాదు.

"జిజీవిషేత్" అనునది_జీవించుమను విధిని బోధించునదై నను "స్నాత్వా భుంజీత" "స్నానమునొనర్చి భుజింపవలెను" అనుచో ర్మానుష్ఠానమునుగురించి స్నానమును విధించినట్లు-కర్మాచరణమును ధించుచున్నయది. మోక్షాపేక్ష కలిగినంతమాత్రమున జ్ఞాననిష్ఠ సిద్ధింపదు గాన సంధ్యావందనాది నిత్యకర్మలను శ్రాద్ధాదినైమిత్తిక కర్మలను నిష్కామబుద్ధి నాచరించుచు శాంభవదీక్షా స్వీకారపురస్సర

ముగ శివు నారాధించుట యను భక్తియోగము గలవాడైనచో చిత్త శుద్ధిని ధ్యానము నభ్యసించి శివానుగ్రహమువలన శివ సాక్షాత్కారము అను అపరోక్షజ్ఞానమున ముక్తుఁడగును.

వస్తుతః-కర్మ-బంధకము కానట్టిది. భోగాపేక్షయే బంధక మగును. అని ఇందు పరమార్థము.

"అసూర్యా నామ తే లోకా - అంధేన తమసాఽఽవృతాః,
ప్రేత్యాభిగచ్ఛంతి యే కే - చాత్మహనో జనాః" 3

ప. అసూర్యానామ = తామసప్రకృతి గల అసురులను చెంది నట్టి. తే లోకాః = ప్రసిద్ధములైన లోకములు (జన్మలును) అంధేన తమసా = కటిక చీకటి (అజ్ఞానము)లో, అవృతాః=నిండినవి కలవు.

యే కే చ=ఎవరైతే, ఆత్మహనః=పరమాత్మ యగు శివునుపా సింపనట్టి, జనాః = జనులో, తే = అట్టివారు, తాన్ = గాఢాంధకార (అజ్ఞాన) మయములగు నరకలోకములను, ప్రేత్య = మరణించిన తరువాత, అభిగచ్ఛంతి = పొందుదురు.

పరమేశ్వరుని లింగధారణదీక్షతో నుపాసింపనివారు శివద్రోహు లనఁబడుదురు. శివోపాసనలేనివారు-దానధర్మాది సుకృతముల నాచ రించి స్వర్గాది పుణ్యఫలభోగములను పొందుదురు గదా! నరకగాము లెట్లగుదురను ఆశంకకు సమాధానము-స్వర్గాదిలోకములనుండి మానవ లోకమునకు ఏతెంచి అనేక జన్మలలో సంసారవ్యామోహితులై శివుని విస్మరింతురు గాన-శివునుపాసింపనివారికి ఏనాటికైనను నరక యాతన-తప్పదని సారాంశము.

"అనేజ దేకం మనసో జవీయో - నైన ద్దేవా ఆప్నువన్

పూర్వ మర్షత్ । తద్ధావతోఽన్యా నత్యేతి - తిష్ఠ
త్తస్మి న్నపో మాతరిశ్వా దధాతి" 4

ప. అనేజత్ = కదలనిది, మనసో జవీయః = మనస్సున కంటె వేగము గలది. పూర్వం = మనస్సునకంటె ముందు, అర్షత్ = చేరునదియు నగు ఏనత్ = ఈ బ్రహ్మమును, దేవాః = హరిబ్రహ్మాద్యమరులు, నాప్నువన్ = పొందలేదు.

తత్ = అట్టి బ్రహ్మము. ధావతః = పరుగెత్తునట్టి, అన్యాన్ = గరుడాదులను, అత్యేతి = అతిక్రమించును ఐనను బ్రహ్మము తిష్ఠత్ = ఒకానొకచో స్థిరపడునదేను, తస్మిన్ = ఆ బ్రహ్మమునందు ఆధారపడిన మాతరిశ్వా = వాయువు, అపః = భూజలాగ్నిసముద్రాదికమగు సమస్తమును, దధాతి = నిలుపుచున్నది.

భావము. బ్రహ్మము(పరమేశ్వరుఁడు)జీవాత్మలందరిలోనుండునదగుటచే సంకల్పాదులతో వేగముగల మనస్సునకంటె నధికవేగము గలదని చెప్పుట పొసఁగును. మనోవేగమునకు అందని వస్తువే లేదు. మనోఽధిక వేగము గల బ్రహ్మమునకు గోచరము కాని వస్తువుండదని చెప్పనేల? మనస్సు సమీపించిన చోటునకు అంతకుముందే బ్రహ్మము చేరును.

హరిబ్రహ్మాద్యంతర్యామిగ నుండు పరమేశ్వరుని తరువాతివారైన దేవతలు గుర్తింపఁజాలరు. ఇందుకు "హరిబ్రహ్మాదీనా మపి నికటభాజా మసులభం" అను ఆద్యశంకరాచార్యోక్తి-నిదర్శనము. సంసారబద్ధులందరు—అజ్ఞానాంధకారముచే గ్రుడ్డివారుగ నుందురు.

నేలలోని నిధిని తెలియనివారు-పైపై నడచినను నిధిని గుర్తింపనట్లు జగత్తును ధరించు గట్టిదనము లేనిదైనను వాయువు బ్రహ్మము నాశ్రయించియే జగద్ధారణసామర్థ్యము కలిగియుండును.

పరమేశ్వరుఁడు-ఇష్ట ప్రాణ భావ లింగరూపమున శాంభవదీక్షితు లందరిని వ్యాపించును గాన మనోవాయువేగాధికవేగముతో భక్తుల ననుగ్రహించునని గూడా చెప్పవచ్చును.

"తదేజతి తన్నైజతి - తద్దూరే తద్వదంతికే । తదంతరస్య సర్వస్య - తదు సర్వస్యాస్య బాహ్యతః" 5

ప తత్ = బ్రహ్మము, ఏజతి = చలించినట్లు కనుపడును. తత్ = బ్రహ్మము, నైజతి = వాస్తవముగ కదలికలేనిదై స్థిరపడు నది. తత్ = బ్రహ్మము, దూరే = తన నుపాసింపనివారికి అందు నది కాదు, తద్వత్ = అదే బ్రహ్మము, అంతికే = సమీపించునదియు, తత్ = బ్రహ్మము, అస్య సర్వస్య = ఈ చేతనాచేతన ప్రపంచము యొక్క, అంతరస్య సర్వస్య = లోని మనోబుద్ధ్యాది సమస్తమును, బాహ్యతః = ఆకాశాది బహిః ప్రదేశములను వ్యాపించునదియు,

భా. శాంభవదీక్షితులై శివు నుపాసించువారికి ఇష్టలింగరూప మున సన్నిహితమై, ప్రాణలింగరూపమున లోనిదై భావలింగము (బ్రహ్మము) గోచరించును. శివు నుపాసింపనివారిని జన్మపరంపరలో పడవేసి దూరమగును. అనఁగా అట్టివారికి శివభక్తి కలుగమి శివ స్వరూప సాక్షాత్కారము సంభవింపదని పరమార్థము. మాహేశ్వర రూపమున దివ్యమంగళ విగ్రహమునను చలించువాడు పరంజ్యోతిగ పరమపదమున స్థిరపడువాడు-పరమేశ్వరుఁడని తెలియవలెను.

సమస్త జీవాంతర్యామిగ సర్వవ్యాపియగు సదాశివుఁడు విభువై అణువులో నణువుగను మహత్తులో మహత్తుగ నుండు వాడనియు చెప్పవచ్చును.

యస్తు సర్వాణి భూతా-న్యాత్మన్యేవానుపశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం - న తతో విజుగుప్సతే ॥ 6

ప. శివు నుపాసించు యస్తు = ఎవఁడైతే, సర్వాణి భూతాని = ప్రాణులందరిని, ఆత్మన్యేవ = పరమేశ్వరునందే, అనుపశ్యతి = భావించునో, మరియు సర్వభూతేషు = ప్రాణులందరియందు, ఆత్మానం = పరమేశ్వరు నవలోకించునో, అట్టి శివోపాసకుఁడు, తతః = శివాత్మకులుగ భావింపఁబడు ప్రాణులవిషయమైన విజుగుప్సతే = తిరస్కారభావము నొందఁజాలడు.

భా. జీవాత్మలందరును పరమేశ్వరునిపై ఆధారపడియుండువారనియు, పరమేశ్వరుఁడు జీవులందరిలో నుండువాడనియు దృఢముగా భావించు శివోపాసకునకు—ప్రపంచమున తుచ్ఛమైన వస్తువే కనుపడదు. సమస్తము శివుఁడుగానే గోచరించునని తెలియవలెను.

యస్మిన్ సర్వాణి భూతా-న్యాత్మైవాభూ ద్విజానతః ।
తత్ర కో మోహః కః శోకః-ఏకత్వ మనుపశ్యతః ॥ 7

ప. విజానతః = విమర్శించి వస్తుతత్త్వమును గుర్తించువానికి, యస్మిన్ = ఏ ఉపాసనసమయమునందు, సర్వాణిభూతాని = బ్రహ్మాది ప్రాణులందరు పరమేశ్వరునిచే నియమింపఁబడువారై ఈశ్వరాంశ గలవారగుటచే, ఆత్మైవ = శివస్వరూపులుగానే, అభూత్ = అగుదురో, తత్ర = అట్టి సమయమున, ఏకత్వం = జీవేశ్వరుల నొకచో గల స్థితిని. అనుపశ్యతః = దృఢముగ భావించు శివోపాసకునకు, మోహః = జీవాత్మ స్వతంత్రుఁడు కాడు పరతంత్రుడు అను భావము స్థిరపడును గాన-మమకారమువలన కలుగు మోహము, కః = ఎక్కడిది? శోకః = మోహముచే కలుగు దుఃఖము, కః = ఎక్కడిది?

శరీరమే ఆత్మయనియు, శరీరేంద్రియాదిభిన్నుఁడైన జీవాత్మయే పరమాత్మయనియు, ప్రతిశరీరమున గల జీవాత్మ స్వతంత్రుఁడ

నియు భావించువారికి-జీవశివసమానాధికరణ భావము గోచరింపదు గాన వారు శోకమోహముల పాలగుదురు. ఎవరైతే "సర్వా మాహేశ్వరీ ప్రజా" అన్నట్లు చరాచరప్రపంచమంతయు శివాంతర్యామికమని గుర్తించి శివశరీరము జగత్తని భావింతురో అట్టివారికి శివానుగ్రహము వలన శోకమోహములు సంఘటింపవని సారాంశము.

స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ-మస్నావిరం
శుద్ధ మపాపవిద్ధమ్।కవి ర్మనీషీ పరిభూః స్వయంభూ
ర్యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధా-చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః"

ప. సః = సర్వభూతముల నంతర్యామియగు పరమాత్మ నుపాసించువాడు, శుక్రం = స్వప్రకాశుఁడైన, అకాయం = ప్రాకృతశరీరము లేనట్టి, అవ్రణం=ప్రాకృతశరీరము లేనివాడగుటచేతనే వ్రణాదులు లేనట్టి, అస్నావిరం = నరాలు లేనట్టి, శుద్ధం = ఆకలి దప్పి మున్నగు వికారములు లేనట్టి, అపాపవిద్ధం = పుణ్యపాపరూపములగు కర్మలచే ఆక్రమింపఁబడనట్టి బ్రహ్మమును (శివుని) పర్యగాత్ = ధ్యానమున పూర్తిగ పొందెను.

అట్టి శివోపాసకుఁడు- కవిః = వ్యాసాదులవలె శివపారమ్యమును ప్రతిపాదించు ప్రబంధములను రచించువాడై, మనీషీ = బుద్ధి బల సంపన్నుఁడై, పరిభూః = కామక్రోధాది అరిషడ్వర్గము నదుపులో పెట్టువాడై. స్వయంభూః = ఇతరాపేక్ష లేనివాడునై శాశ్వతీభ్యః సమాభ్యః = చిరకాలపర్యంతము, అర్థాన్ = వేదవేదాంత శివాగమాది ప్రోక్తములగు పశుపాశపతి సంబంధము గలయట్టి విషయములను యాథాతథ్యతః = ఉపక్రమాది షడ్విధ తాత్పర్య లింగ సమన్వయముతో, వ్యదధాత్ = మనస్సున నిలుపుకొనెను.

అథవా-

సః = ఉపాస్యుఁడైన శివుఁడు- కవిః = సర్వజ్ఞుఁడు, మనీషీ= మనస్సును శాసించువాడు, పరిభూః = హరిబ్రహ్మాదులకు అందరాని ఉన్నతస్థానమునందు స్థిరపడువాడు, స్వయంభూః = తనంతటతానే ఆవిర్భవించువాడునై, శాశ్వతీభ్యః సమాభ్యః = చిరకాలముండునట్లు, అర్థాన్ = ఆకాశాదులను, యా థాతథ్యతః=పూర్వకల్పములయందున్నట్లే, వ్యదధాత్ = నిర్మించెను.

శాంభవదీక్షితుఁడై శివు నుపాసించు మాహేశ్వరుఁడు శివోపాసనసమయమున. శివుఁడు ప్రకృతిఁజెందిన పాంచభౌతిక శరీరము లేనివాడై దివ్యమంగళవిగ్రహము గలిగియుండుననియు, శివుని విగ్రహము- జరామరణవ్యాధివ్రణాదిరహితమనియు కర్మబంధము లేనిదనియు, భావించుచు సేవ్యసేవకభావమున ఇష్టలింగము నారాధించుచు పరాభక్తిని ప్రాణలింగమును శివషడక్షరీమహామంత్రాను సంధానరూపమున భజించుచు "శివోఽహం" భావనతో భావలింగమును దర్శించువాడగునని విదితమైనది.

"అంధం తమః ప్రవిశంతి- యేఽవిద్యా ముపాసతే,
తతో భూయ ఇవ తే తమో-య ఉ విద్యాయాం
రతాః" 9

ప. యే = ఎవరు, ప్రపంచభోగములను పరలోకసుఖముల పేక్షించుచు, అవిద్యాం = కర్మనుమాత్రము, ఉపాసతే = ఆచరింతురో, తే = వారు, అంధంతమః = గ్రుడ్డిచీకటిఁబోలినట్టి సంసారమును, ప్రవిశంతి = పొందుచుందురు.

యే = ఎవరు, విద్యాయాం ఉ = జ్ఞానమునందే, రతాః =

ఆసక్తి గలవారో, తే = వారు, తతః = కర్మనిష్ఠులకన్న, భూయ ఇవ = అధికముగానే, తమఃస్వరూపమైన నికృష్టదశను పొందుదురు.

భా. కేవలము కర్మ నాచరించువారు-సంసారమున జన్మ పరంపరను పొందుచు ముక్తిని పొందఁజాలరనియు, నిత్యనైమిత్తిక కర్మలను బొత్తుగా విడనాడి ఆత్మజ్ఞానమునకై పాటుపడువారు కర్మకర్తలకంటె నధికము పతితులగుదురనియు వివేకము. కర్మతో గూడిన జ్ఞానము (శివోపాసన) ఆరాధ్యశైవులందే నుండుటచే వారు-ముక్తి సౌధసోపానముల నధిరోహింతురనుట ఇలదు పరమార్థము.

"అన్యదేవాఽఽహు ర్విద్యయాఽన్యదాహు రవిద్యయా,
ఇతి శుశ్రుమ ధీరాణాం - యే న స్తద్విచచక్షిరే" 10

ప. విద్యయా = కేవల విద్యవలన, అన్యదేవ = వేరైన ఫలమే ననియు, అవిద్యయా = కేవల కర్మవలన, అన్యత్ = వేరైన ఫలము చేకూరుననియు, ఆహుః = వేదవేదాంతవిదులు వక్కాణించిరి.

ఇతి = ఇట్లు, యే = ఎవరు, నః = మాకు, విచచక్షిరే = ఉపదేశించిరో, ధీరాణాం = అట్టి విజ్ఞానుల వచనమును, శుశ్రుమ = వినుచున్నాము (అంగీకరించుచున్నాము)

తొమ్మిదవ మంత్రమునందు గల విషయము మరియొక భంగిమగ నిందు వక్కాణింపఁబడినది. అనఁగా వేదాంత వాక్యజ్ఞానము నందే నిష్ఠగలవారికి-ముక్తికంటె వేరైనఫలము (దృఢమైన సంసార బంధము) తారసిల్లుననియు, నిత్యనైమిత్తిక కామ్య కర్మలను మాత్రము ఆచరించుచు శివోపాసనాత్మకమగు జ్ఞానము నవలంబింపని వారికి. శివసాయుజ్యమునకంటె వేరైన ఫలము (జన్మ పరంపర)తప్పదనియు విదితమైనది.

"విద్యాం చావిద్యాం చ-యుస్తద్వేదోభయం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా-విద్యయాఽమృత
మశ్నుతే" 11

ప. యః = ఎవఁడు. విద్యాం = జ్ఞానమును, అవిద్యాంచ = కర్మను, తదుభయం = కర్మజ్ఞానములను, సహ = కూడనుండునవిగ, వేద = గుర్తించునో, సః = వాడు, అవిద్యయా = కర్మచేత, మృత్యుం = జ్ఞానమును భంగపఱచునట్టి పుణ్యపాపకర్మ బంధమును, తీర్త్వా = అతిక్రమించి, విద్యయా = ఇష్టప్రాణభావలింగోపాసనచే అమృతం = మోక్షమును, అశ్నుతే = పొందును

ఫలాభిసంధి లేనట్టి కర్మ, శివోపాసనాత్మకంబగు జ్ఞానంబు-అంగాంగిభావమున మోక్షము అను ఒకే ఫలము నాపాదించునవి. ఉపాసనాత్మక జ్ఞానమునకు పూర్వకృతపుణ్యపాపములు ప్రతిబలధకములగుటచే-ఇహజన్మయందు సుకృతములను ఫలము నపేక్షింపక చేయుచున్నయెడల చిత్తశుద్ధిద్వారా శివునియందు అనన్య భక్తి-స్థిరపడును అట్టి భక్తితో శివు నారాధించువాడు-శివసాక్షాత్కారము నంత్యకాలమున పొంది ముక్తుఁడగునని సారాంశము

"అంధం తమః ప్రవిశంతి - యేఽసంభూతి ముపాసతే
తతో భూయ ఇవ తే - య ఉ సంభూత్యాం రతాః" 12

"అన్యదేవాహుః సంభవా - దన్యదాహు రసంభవాత్
ఇతి శుశ్రుమ ధీరాణాం - యే న స్తద్విచచక్షిరే" 13

"సంభూతిం చ వినాశం చ - య స్తద్వేదోభయం సహ
వినాశేన మృత్యుం తీర్త్వా-సంభూత్యాఽమృత మశ్నుతే" 14

ప. యే = ఎవరు, అసంభూతిం = నిత్యాత్మస్వరూపమునే, ఉపాసతే = చింతించుచుందురో, తే = వారు, అంధంతమః = కటికచీకటివలె దుఃఖమయమగు సంసారమును, ప్రవిశంతి = పొందుచుందురు, యే = ఎవరు, సంభూత్యాం ఉ = కేవలకర్మయందే రతాః = ఆసక్తి గలవారో, తే = వారు, తతోభూయః = సంసారమునకంటె నధికముగ, అంధంతమః = గాఢాంధకారబంధురమగు నరకజాతము నొందుదురు.

సంభవాత్ = కేవలకర్మవలన కలుగు ఫలము, అన్యదేవ = మరియొకటేనని ఆహుః = విబుధులు చెప్పుదురు. అసంభవాత్ = కేవల జ్ఞానమువలన కలుగు ఫలము, అన్యదేవ = మరియొకటేనని, ఆహుః = విజ్ఞానులు వక్కాణింతురు.

ఇతి = ఈవిధము, యే = ఎవరు, నః = మాకు, విచచక్షిరే = ఉపదేశించిరో, తద్ధీరాణాం = అట్టి ఉపాసకుల వచనమును, శుశ్రుమ = వినుచున్నాము.

యః = ఎవఁడు, (అ)సంభూతిం = జ్ఞాననిష్ఠను, వినాశం = కర్మాచరణమును, తదుభయం = ఆ రెంటిని, సహ = అంగాంగిభావముతో కూడియుండునవిగ, వేద = గుర్తించునో, సః = వాడు, వినాశేన = కర్మతో, మృత్యుం = సంసారబంధమును తీర్త్వా = త్రెంచుకొని, అసంభూత్యా = శివోపాసనతో, అమృతం = మోక్షమును, అశ్నుతే = పొందును

శ్రుతులలో పునరుక్తిదోషమును పాటింపరాదు గావున 9, 10 11 వాక్యములలో చెప్పఁబడిన కర్మజ్ఞానసముచ్చయమునే 12, 13, 14 వాక్యములయందు శబ్దభేదముతో విశదీకరించుట- కర్మజ్ఞాన సముచ్చయమున గల ఆదరమును వ్యక్తికరించుచున్నయది.

సంభూతియనఁగా-ఉత్పత్తి వినాశములు గల కర్మయగును అసంభూతియనఁగా-ఉదయాంతములు లేనట్టి పరమాత్మస్వరూప మగును. మోక్షాపేక్షతో కర్మను విడనాడి కేవలము జ్ఞానమునందే ప్రవర్తించు వారికి- చిత్తశుద్ధి కలుగమి=జ్ఞానభ్రష్టత ఏర్పడును. జ్ఞానము నభ్యసింపక కర్మయందే లంపటులగువారికి సంభవించు స్వర్గాదిపుణ్యలోకసుఖానుభవము శాశ్వతము కాకుండుటచే-పునఃపునః కలుగు సంసారబంధమున మమకారాదులతో నరకప్రవేశము సంఘటించును.

అందువలన సంధ్యావందనాది వర్ణాశ్రమధర్మము ననుష్ఠించుచు బాహ్యమున ఇష్టలింగము నారాధించుచు మనస్సున ప్రాణలింగమును శివషడక్షరీ మహామంత్రముతో అనుసంధించుచు భావలింగమును "శివోఽహం" భావనతో ధ్యానించినచో కర్మజ్ఞానసముచ్చయము గలవాడై తరించునని భావము

"హిరణ్మయేన పాత్రేణ - సత్యస్యాపిహితం ముఖం,
తత్త్వం పూష న్నపావృణు - సత్యధర్మాయ దృష్టయే" 15

వ. సత్యస్య = జీవాత్మయొక్క, పరమాత్మయొక్కయు, ముఖం = ద్వారమగు మనస్సు, హిరణ్మయేన పాత్రేణ = బంగారు గిన్నెవలె మనస్సునాకర్షించునట్టి శబ్దాదివిషయజాతముతో అపిహితం = ఆచ్ఛాదింపఁ బడినది విషయవాసనతో ఆత్మస్వరూపమును గుర్తించుటకు సమర్థము కానిదని భావము.

పూషన్ = సర్వరక్షకుఁడవైన పరమేశ్వరా! త్వం = నీవు, తత్ = అట్టి ఆచ్ఛాదనమును. దృష్టయే = ఉపాసన సిద్ధించుటకై, సత్యధర్మాయ = పరమేశ్వరుని పొంది అపహతపాప్మత్వాది నిజధర్మములను ఆవిష్కరింపఁజేసికొనుటకొఱకును. అపావృణు = తొలగింపుము!

భా. "సత్యం చానృతం చ" ఇత్యాది శ్రుతి ననుసరించి సత్య శబ్దము-జీవాత్మను. సర్వవిధముల సత్యమగు బ్రహ్మమును చెప్పు నట్టిది. ఆత్మస్వరూపమును గుర్తించుటకు-మనస్సు ద్వారమగు నట్టిది. అందువలన ఆత్మజ్ఞానమునకు మనస్సు ముఖమని చెప్పఁబడినది. శబ్ద స్పర్శ రూప రస గంధాదులగు ఇంద్రియార్థములు మనస్సును పరమాత్మ నుపాసింపనీయనివై తమవైపు ఆకర్షించును గాన హిరణ్మయ పాత్రవంటివని నిరూపింపఁబడినవి.

ఇంద్రియములు-విషయములను, మనస్సు-ఇంద్రియములను, బుద్ధి-మనస్సును, జీవాత్మ-బుద్ధిని, అవ్యక్తము జీవాత్మను, పరమ పురుషుఁడు అవ్యక్తమును నిగ్రహింపవలెను.

"పరమేశ్వరా! మనస్సుతో ఇంద్రియములను నిగ్రహింపఁ జాలను. అవి మనస్సును పీడించుచున్నవి గాన నీవే రక్షించువాడవని శరణాగతుఁడై ఇష్టలింగమును ప్రార్థించినచో-పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై మనోనిగ్రహము ననుగ్రహించును.

"పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభినిష్పద్యతే" అను శ్రుతి ననుసరించి-ముక్తాత్మ-పరంజ్యోతిః స్వరూపుఁడైన పరమేశ్వరుఁజేరి-నిజరూపమును ఆవిష్కరింపఁజేసికొను" నని తెలియనైనది.

"పూషన్నేకర్షే యమ సూర్య - ప్రాజాపత్య వ్యూహ
రశ్మీన్, సమూహ తేజో - యత్తే రూపం కల్యాణతమం
తత్తే పశ్యామి, యోఽసా వసౌ పురుషః సోఽహమస్మి" 16

ప. పూషన్ = ఆశ్రితులను పోషించువాడా! ఏకర్షే = ఇంద్రియములకు గోచరము కానట్టిదానిని గుర్తించువాడా! అథవా ఏక =

ముఖ్యుడవైన, ఋషే = సర్వజ్ఞుఁడా! ("విశ్వాధికో రుద్రో మహర్షిః" అను శ్రుతివాక్యము ఇందుకు ప్రోద్బలకము) యమ = జీవాత్మలలో ప్రవేశించి నియమించువాడా! సూర్య=సర్వాత్మనా నిన్నాశ్రయించు వారి బుద్ధిని ప్రేరేపించువాడా! ప్రాజాపత్య=ప్రజలకు ప్రభువగువాడా రశ్మీన్ = నీ దివ్యదేహకాంతులను, వ్యూహ = క్షణమాత్రము ఉప సంహరింపుము! యత్తేజః=మా నేత్రములకు సుఖము కలుగఁజేయు ఏ ప్రకాశమో, తత్ = అట్టి, నీ సౌమ్యతేజస్సును, సమూహ = కూర్పుము! యత్ కల్యాణతమం తే రూపం = ఏ నీ దివ్యరూపము సమస్త మంగళములను కలుగఁజేయునదో, తత్ తే పశ్యామి = అట్టి నీ దివ్యమంగళ విగ్రహమును చూడఁగలుఁగుదును యః అసౌ పురుషః = ఏ ఈ పరమపురుషుఁడున్నాడో. సోఽహ మస్మి = అట్టి పరమశివుఁడు నేనగుదును. ("శివోఽహం" భావనతో శివుని ధ్యానించి శివుఁడ నగుదును) ఇట్టి దివ్యతేజోమయుఁడగు శివుని చూడఁజాలని కొందరు. శివానుగ్రహదూరులై శివుని నిరాకారునిగ చెప్పుదురు.

ఇట్టి దివ్య ప్రభావము కోటిసూర్యప్రకాశంబు గల పరమేశ్వరుని ఉగ్రకాంతులను చూడఁజాలనివాడై ముక్తదశయందు శివుని కల్యాణతమమగు సౌమ్యరూపమును గాంచుచు శివానందము ననుభవించుచు శివసముఁడగుటకు ఈ వాక్యమునందు-పరమేశ్వరుని-పోషించువాడనియు. సర్వజ్ఞుఁడనియు, సన్మార్గము వైపు ప్రేరేపించు వాడనియు, చరాచరప్రభువనియు, శివోపాసకుఁడు-ఇష్టలింగము నందు- ప్రార్థించుచు శరణాగతుఁడు కావలెనని విశదమైనది.

"వాయు రనిల మమృత మథేదం - భస్మాంతగ్ం శరీరం, ఓం క్రతో స్మర, కృతగ్ంస్మర, క్రతో స్మర, కృతగ్ం స్మర" 17

ప. వాయుః = గమనశీలుడు, అనిలం = ఒకచో స్థిరనివాసము లేనివాడు, అమృతం = జరామరణాదులు లేనివాడును జీవాత్మ యగును.

అథ = మరియు, ఇదం శరీరం = ఈ శరీరము, భస్మాంతం = చివర బూడిద యగునది. (అథవా భూనిక్షిప్తమగుచో కీటాంతం = చివర పుఱుగులగునది).

ఓం క్రతో = యజ్ఞ స్వరూపుడవైన పరమేశ్వరా! నాచేత చేయఁబడిన పుణ్యములకు ఉపాసనలకును గురి యగువాడా! స్మర! = నిన్ను స్మరించు నన్ను కనిపెట్టుము! కృతగ్ం స్మర = కర్మ యోగపూర్వకమగు అరాధనముచే కలిగించిన నీ ప్రీతిని స్వీకారముతో స్మరించుము! క్రతో స్మర! కృతగ్ం స్మర" అని రెండు పర్యాయములు చెప్పుట-ఆదరముతో నని తెలియపలెను.

భా. వాయువునందు పరిమళము మొదలగువాని నారోపించినట్లు ఆత్మ-దేవాదినానాశరీరములయందు ప్రవేశించి-స్థూలదేహముల కంటె విలక్షణుఁడైనను శరీరగతదోషముల నాత్మయందు ఆరోపింతురు. వాయువునకు ఎట్లు ఒకచో నిలుకడ లేదో అట్లే జీవాత్మకు అనేక శరీర ప్రవేశమువలన స్థిరనివాసము లేదు. జరామరణాది దోషములు వస్తుతః ఆత్మకు ఉండవుగాన అమృతుఁడనఁబడును.

ఎంతో మనోహరముగ కనఁబడు శరీరము-ఏనాటికైనను నశించునదే నని-భస్మాంతం, కీటాంతం అని చెప్పఁబడినది, "నా కృతము నంతయు కనిపెట్టి అనుగ్రహముతో నన్నుద్ధరింపుమని" ఉపాసకుఁడు అంత్యకాలమున శివునకు మొఱపెట్టుకొనవలెనని "ఓ క్రతో" ఇత్యాది వాక్యము విశదీకరించినది.

"అగ్నే నయ సుపథా రాయే - అస్మాన్ విశ్వాని
దేవ వయునాని విద్వాన్ । యుయోధ్యస్మ జ్జుహురాణ
మేనో, భూయిష్ఠాం తే నమఉక్తిం విధేమ" 18

ప. అగ్నే = ఊర్ధ్వగతిని పొందించు, దేవ = పరమేశ్వరా! సుపథా = శోభనమైన అర్చిరాదిమార్గముతో, రాయే = ముక్తిసంపదకై, అస్మాన్నయ = మమ్ము గొంపోవుము! జుహురాణం = విడువనలవిగానట్టి, ఏనః = సంచిత ఆగామి కర్మరూపమగు పాపమును, అస్మత్ = మానుండి, యుయోధి = విడిపించుము! మా అంత్యకాలము సమీపించినది గాన, తే=నీకు (నిన్ను గురించి) భూయిష్ఠాం = పూజాదులకంటె శ్రేష్ఠమగు నమ ఉక్తిం = నమఃశబ్దోచ్చారణమును విధేమ = చేయుచున్నాము.

హృదయమున జీవాత్మ నంతర్యామి యగు భావలింగము అనఁదగు పరమాత్మ యొక్క అనుగ్రహముచే ప్రకాశించు (కనఁబడు) మూర్ధన్యనాడీద్వారముగుండా ముక్తాత్మ ప్రయాణము నంభవించుటఁ జేసిఁ "అగ్నే నయ సుపథా రాయే" అని ఇందు చెప్పఁబడినది.

శాంభవదీక్షచే తన నాశ్రయించిన శైవులను శివుఁడు-అర్చిరాది మార్గమున పయనింపఁజేసి-పునరావృత్తిరహితమైన శాశ్వతంబగు పరమపదమునఁ బ్రవేశింపఁజేయునని-ఈవాక్యమున వ్యక్తమగుచున్నయది.

పాశుపతదీక్షా స్వీకారమున ఇష్టలింగమును ధరించినంత మాత్రమున శివుఁడు కరుణించి-ఉపాసకుల ప్రారబ్ధకర్మదక్క నితరకర్మల నన్నిటిని నిర్మూలింపఁజేయుననియు, అంత్యకాలమున అశక్తస్థితిని నమఉక్తి అనఁబడు శరణు నుచ్చరించుట తోడనే శివుఁడనుగ్రహించునియు విదితమైనది.

ముఖ్యసారాంశము– ఈ ఉపనిషత్తున– ఆత్మ పదమునకు పరమేశ్వరుఁడను నర్థముఁజేసి—సర్వభూతాంతరాత్మ, సర్వభూతాధారుఁడు అను లక్షణములతో పరమేశ్వర సమర్థనము గలదని నిర్ధయింపవలెననియు; చివరన "కవిర్మనీషి" ఇత్యాదులతో పరమేశ్వరుఁడు– సర్వజ్ఞత్వాది అనంతమాంగళ్యగుణములు గలవాడని నిరూపించుచు "యత్తే రూపం కల్యాణతమం పశ్యామి" అనుచో దివ్య మంగళ విగ్రహము గలవాడు. పరమేశ్వరుఁడని ప్రతిపాదించుటచే ఈ ఉపనిషత్తు శివాద్వైతపరమే నని విశదమగును. కేవలాద్వైతము– బ్రహ్మము రూపరహితమని చెప్పును గాన నియ్యది కల్యాణతమమగు శివరూపమును నిర్వచించుటచే శివేతరమతములవారికి సమర్థనీయము కాదని–చదువరులు గ్రహింతురు గాక !

ఇయ్యది

శ్రీ నీలకంఠీయ భాష్యమున శ్రీ నాగలింగీయ వ్యాఖ్యానమున ఈశావాస్యోపనిషత్తు సమస్తమునకు శాంకరీయ "శివతత్త్వ ప్రభ" అనెడు ఆంధ్రానువాదము-సమాప్తము.

——

శ్రీ మహాగణాధిపతయే నమః

# కేనోపనిషత్తు

"కేనేషితం పతతి ప్రేషితం మనః, కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః। కేనేషితాం వాచ మిమాం వదంతి చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి" 1

పదార్థము-మనః=మనస్సు; కేన=ఎవనిచేత ప్రేషితం=ప్రేరేపింపఁబడినదై; ఇషితం=ఇష్టమునుగురించి; పతతి=సమీపించి పడును? ప్రథమః=ముఖ్యమగు; ప్రాణః=ప్రాణవాయువు; కేన=ఎవనిచేత; యుక్తః=సంయోగమును పొందినదై ప్రైతి=తన కార్యమునకై బయలుదేరును? కేన=ఎవనిచే ప్రేరేపింపఁబడినవారై ప్రజలు, ఇషితాం=ఇష్టమైన, వాచం=వాక్కును; వదంతి=పలుకుచున్నారు? చక్షుః=నేత్రమును; శ్రోత్రం=చెవిని; క ఉ దేవో =ఏ దేవుఁడు; యునక్తి=ప్రేరేపించును?

"వాచం" అనునది - కర్మేంద్రియములను; "చక్షుః శ్రోత్రం" అనునవి-జ్ఞానేంద్రియములను చెప్పునవి.

ఇంద్రియాధిపతియైన మనస్సు గాని, పంచప్రాణముఖ్యమగు ప్రాణవాయువు గాని, వాక్కు మొదలగు కర్మేంద్రియములు గాని, కన్ను చెవి మున్నగు జ్ఞానేంద్రియములు గాని తమంతట తాము ప్రవర్తించునవి కావనియు, జీవాత్మయు పరతంత్రుఁడేననియు ...్యఁడు గుర్తించి-జీవాత్మకంటె నితరుఁడైన వాడే మనఃప్రాణా

దులను ప్రేరేపించునేమోయని సంశయించి-గురువును ప్రశ్నించెనని ఇందు విదితమైనది.

"శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్-వాచో హ వాచం స ఉ ప్రాణస్య ప్రాణః। చక్షుష శ్చక్షుః అతి ముచ్య ధీరాః-ప్రేత్యాస్మాల్లోకా దమృతా భవంతి" 2

పదార్థము-స ఉ=ఆ సదాశివుఁడే; శ్రోత్రస్య=చెవికి: శ్రోత్రం =శబ్దమును వినుపించు వాస్తవమైన శ్రవణేంద్రియ మగువాడు; మనసః=మనోబుద్ధి అహంకారచిత్తాత్మకమగు అంతఃకరణమునకు; మనః=నిజమైన అంతఃకరణ మగువాడు; వాచో హ=వాచం= (ద్వితీయాంతము ఛాందసము) వాక్కును పలికించువాడు; ప్రాణస్య =ప్రాణవాయువునకు; ప్రాణః=ఆత్మను శరీరధారిగ జీవింపజేయు వాడు; చక్షుషః=నేత్రగోళమునకు; చక్షుః=ప్రకాశమును కలుగఁ జేయువాడు నగును.

ధీరాః=బుద్ధిబలము గలవారు; అస్మాల్లోకాత్=ఈ భూలోక మునుండి; ప్రేత్య=బయలుదేరి; (మరణించినతరువాత) అమృతాః =పరమశివపదముఁజేరి ముక్తులు; భవంతి=అగుదురు.

పరమేశ్వరుఁడే శ్రోత్రాది ఇంద్రియములను శబ్దశ్రవణాది విషయ గ్రాహకములుగ ప్రేరేపించుచు జీవాత్మను ఇంద్రియ విషయ ముల ననుభవింపఁజేయువాడు. కర్మవశ్యుఁడు పరతంత్రుఁడు పరా ధీనకర్తయు నగు జీవాత్మ-ఇంద్రియములను ప్రవర్తింపఁజేయఁ జాలడు.

"శ్రోత్రాంగే తు ప్రసాదకం" "హృదయాంగే మహా లింగం" "దృగంగే శివలింగకం" "ఆచారలింగం ప్రాణాఖ్యం"

ఇత్యాది శివాగమవాక్యములు—చెవి మొదలగు ఇంద్రియములలో ప్రసాదలింగాది సూక్ష్మరూపములతో శివుఁడు నివసించి ఇంద్రియములను ప్రేరేపించుననియు; ఆ యా ఇంద్రియ విషయములను శివోపాసకుఁడు తనకై గాక-పరమేశ్వరునకే అనుభవకాలమున సమర్పింపవలెననియు విదితమైనది. ఇందువలన సర్వాంగలింగ సాహిత్యము ఏర్పడునని సారాంశము.

"న తత్ర చక్షు ర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి-నో మనో న విద్మో న విజానీమో, యథై తదనుశిష్యా దన్యదేవ-తద్విదితా దథో అవిదితా దధి। ఇతి శుశ్రుమ పూర్వేషాం-యే న స్తద్వ్యాచచక్షిరే" 3

పదార్థము-తత్ర = ఆ పరమేశ్వరుని విషయమై; చక్షుః = నేత్రము=న గచ్ఛతి=గమనమును చేయఁజాలదు. వాక్ = వాక్కు; న గచ్ఛతి = సమీపించి వెళ్ళునది కాదు. నో మనో = మనస్సు ప్రవర్తింపఁజాలదు. ఏతత్ = ఈ శివస్వరూపమును యథా = ఎవ్విధము, అనుశిష్యాత్ = గురువు ఉపదేశించునో, తథా = అవ్విధమును, నవిద్మః = గుర్తింపఁజాలము. పరమేశ్వరునిఁబోలిన వస్తువును న విజానీమః = తెలియలేము. తత్ = ఆ శివతత్త్వము, విదితాత్ = తెలియఁబడు జడప్రపంచమున కంటె, అన్యదేవ = వేరైనదేను, అథో = మరియు, అవిదితాత్ = ఇంద్రియాగోచరమైన జీవాత్మకన్న, అధి = శ్రేష్ఠమై వేరైనదగును.

ఇతి = ఇట్లు, యే = ఎవరు, నః = మాకు, తత్ = ఆ శివతత్త్వమును గురించి, వ్యాచచక్షిరే = వక్కాణించిరో, పూర్వేషాం = అట్టి పూర్వికులగు శివయోగుల యొక్క సదుపదేశమును, శుశ్రుమ = వినుచున్నాము.

పరమేశ్వరుఁడు-ప్రత్యక్షముగ చూడనలవిఁగాని నాడనియు, అనుమానము (ఊహ)తో సాధింపదగినవాడు కాడనియు, వేదవాక్కునకు అందువాడనియు, లౌకికవస్తువులకన్న విలక్షణుఁడనియు, పూర్తిగ తెలిసినవాడు కాడనియు పూర్తిగ తెలియనివాడు కాడనియు, విదితుఁడైనట్లు స్ఫురించి అవిదితుఁడగుననియు, అందువలననే జిజ్ఞాసకు విషయమగుననియు" శైవసంప్రదాయపరులగు మహానుభావులు ఇట్లు నిర్వచించినారని సారాంశము.

"యద్వాచాఽనభ్యుదితం-యేన వాగభ్యుద్యతే
తదేవ బ్రహ్మ త్వం విద్ధి-నేదం యదిద ముపాసతే"4

యత్ = ఏ శివస్వరూపము, వాచా=వాక్కుచే, అనభ్యుదితం= ప్రకాశింపఁబడదో, యేన = ఏ శివునిచేత, వాక్ = వాగింద్రియము, అభ్యుద్యతే = ఉపయోగముగలదిగ ప్రకాశింపఁబడునో, తదేవ = అట్టి శివలింగమునే, బ్రహ్మ = బ్రహ్మముగ, త్వం విద్ధి = నీవు గుర్తింపుము, (ఉపాసింపుము!)

అట్టిదే పరశివతత్త్వమనఁబఱఁగును. యదిదం ఏ = ఈ మూర్త్యాత్మలగు విష్ణుబ్రహ్మాది దేవతలను, ఉపాసతే = ఉపాసించుచున్నారో, ఇదం= ఈ మూర్త్యాత్మక దేవతాగణము, న=బ్రహ్మము కాదు.

"సోమః పవితే జనితా, పృథివ్యాజనితాగ్నేః జనితా, సూర్యస్య జనితేంద్రస్య, జనితాఽథ విష్ణోః" ఇత్యాదిశ్రుతి-పృథవ్యగ్ని సూర్య ఇంద్ర విష్ణ్వాదులను పుట్టించువాడు పరమేశ్వరుఁడేనని చెప్పుటచే-విష్ణ్వాదులు మూర్త్యాత్మలై శివుని వలన జన్మించుచున్నందున-సర్వకారణకారణుఁడైన శక్తివిశిష్టుఁడు నగు శివుని-శివలింగముగ భావించి-ఇష్టప్రాణభావలింగములను గురువువలన

స్వీకరించి ధరించి పూజింపవలెననియు, శివమంత్రమును జపింపవలె ననియు, శివుని ధ్యానింపవలెననియు తేటపడుచున్నందున ముముక్షువు లందరిచే ముఖ్యముగ నుపాసింపఁదగినది - శివస్వరూపమనఁదగు శివలింగమే ననియు శాంభవదీక్షితుఁడే శివోపాసనార్హుఁడనియు విదిత మైనది.

నారాయణుఁడు పరమాత్మయనుచో "న, అరాః, అణః" అను పదచ్ఛేదమున అరాః = దరిద్రము, అణః = దుఃఖము, న = ఎవని భక్తిచే నుండవో, అట్టి శివుఁడు నారాయణ శబ్దవాచ్యుండగు" నను నిర్వచనము కలదు గాన నారాయణుఁడు-మూర్త్యాత్మయగు విష్ణువు గాక-శివుఁడే నని పరమార్థవిదుల ప్రతిపాదనము.

"యన్మనసా న మనుతే-యేనాఽహూ ర్మనో మతం,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి-నేదం యదిద ముపాసతే" 5

పదార్థము-యత్ = ఏ పరశివలింగమును, మనసా = ఇంద్రియ లోలంబగు మనస్సుచే, న మనుతే = భావించుచు గుర్తింపఁజాలరో, యేన = ఏ పరశివునిచే, మనః = మనస్సు మతం = స్వాభిముఖముగ ప్రకాశింపఁజేయబడునని, శివయోగులు అహుః = చెప్పుచున్నారో, తదేవ = అట్టి పరశివలింగమునే, బ్రహ్మ = బ్రహ్మముగ, త్వంవిద్ధి = నీవు ఉపాసింపుము ! యత్ = ఏ, ఇదం = ఈ చేతనాచేతనవర్గమును, ఉపాసతే = స్వల్పబుద్ధి గలవారు ఉపాసింతురో, ఇదం = ఇదంతయు న = సాక్షాత్ బ్రహ్మము కాదు.

భా. శివలింగస్వరూపము అపరిచ్ఛిన్నమగుటచే బ్రహ్మమగు ననియు, హరిబ్రహ్మాది చేతనులు-ఆకాశాద్యచేతనములును అకారము మొదలగు పరిమితి గలవారగుటచే బ్రహ్మము కారనియు, శివుఁడు-భక్తుల ననుగ్రహించుటకు ఇష్టప్రాణభావలింగరూపములతో విలసిల్లి ను సర్వస్వతంత్రుఁడగుటచే పరిమితి లేనివాడనియు తెలియవలెను.

ఇందుకు-"సద్రూపం భావలింగం స్యాత్-చిద్రూపం ప్రాణలింగకం,
ఆనందరూప మాచార్యై-రిష్టలింగ ముదాహృతమ్"

అను ఆగమప్రమాణము-నిదర్శనము.

"యచ్చక్షుషా న పశ్యతి-యేన చక్షూంషి పశ్యతి,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి-నేదం యదిద ముపాసతే" 6

"యచ్ఛ్రోత్రేణ న శృణోతి-యేన శ్రోత్రమిదం శ్రుతం,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి-నేదం యదిద ముపాసతే" 7

"యత్ ప్రాణేన న ప్రాణితి-యేన ప్రాణః ప్రణీయతే,
తదేవ బ్రహ్మ త్వం విద్ధి-నేదం యదిద ముపాసతే" 8

ప. యత్ = ఏ పరశివలింగమును, చక్షుషా = ప్రాకృత నేత్రముచే' న పశ్యతి = సాక్షాత్కరింపఁజేసికొనలేరో, యేన = ఏ శివుని ప్రేరణచే, చక్షూంషి = నేత్రములను, పశ్యతి = చూపు గలుగునట్లు చేసికొనుచున్నారో, (ఇట "పశ్యతి" అను ఏకవచనము ఛాందసము) యత్ = ఏ పరశివమహిమను, శ్రోత్రేణ = చెవిలో, న శృణోతి = అవధరింపఁజాలరో, యేన = ఏ సదాశివునిచే, ఇదం = ఈ; శ్రోత్రం = కర్ణము, శ్రుతం = వినగలుగునో,

యత్ = ఏ పరమాత్మ, ప్రాణేన = ప్రాణవాయువుచే, న ప్రాణితి = జీవనవ్యాపారము నవలంబింపదో, యేన = ఏ పరమాత్మచే ప్రాణః = ప్రాణవాయువు (లేక) శరీరధారియగు జీవాత్మ, ప్రణీయతే = జీవనమును కొనసాగించునో, తదేవ = అట్టి పరశివ జ్యోతిర్లింగ స్వరూపమునే, బ్రహ్మ = బ్రహ్మముగ, త్వం విద్ధి = నీవుపాసింపుము ! యత్ = ఏ, ఇదం = ఈ ఇంద్ర చంద్రాది చేతన వర్గమును,

ఉపాసతే = అల్పజ్ఞానులు ఉపాసించుచున్నారో, ఇదం = ఈ చేతన వర్గము, న = బ్రహ్మము కాదు.

చేతనాచేతన ప్రపంచమంతయు పరమేశ్వరుని కార్యము కాగా పరమేశ్వరునిచే అంతర్యామిగ వ్యాపింపఁబడినదగుటఁజేసి సమస్తంబు శివాధీనమైనదనియు. శివలింగమే ఉపాస్యంబనియు విదితమైనది.

ఇయ్యది-శ్రీ నీలకంఠ శివాచార్య ప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగ శాస్త్రికృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కేనోపనిషద్గత ప్రథమ ఖండము.

—:o:—

శ్రీ మహాగణాధిపతయే నమః

# కేనోపనిషత్-ద్వితీయ ఖండము

"యది మన్యసే సువేదేతి-దభ్రమేవాపి నూనం,
త్వం వేత్థ బ్రహ్మణో రూపం-యదస్య త్వం యదస్య
దేవేష్వథ-ను మీమాంస్య మేవ, తే మన్యే విదితమ్" 1

వ. సువేద = నేను శివస్వరూపమును విశదముగ గుర్తెరుగుదును, ఇతి = అని, మన్యసేయది = భావించుచున్నచో, తత్ = ఆ శివ స్వరూపము, దభ్రమేవ = స్వల్పమైనదేను, న్యూనమపి = ఇద్దిముమ్మాటికి నిశ్చయము.

అస్య = ఈ శివునియొక్క, రూపం=స్వరూపమును, యత్ = ఏ ఈ లోకమున, త్వం = నీవు, వేత్థ=గుర్తెరుగుచున్నావో, మరియు యదస్య = ఏ ఈ శివునియొక్క. దేవేష్వథ = దేవతలలోనైనను రూపం = స్వరూపమును, త్వం వేత్థ = నీవు కనిపెట్టుచున్నావో, తదుభయం దభ్రం ను=అ రెండును స్వల్పములేను. అతః = ఇందువలన. తే విదితం = నీకు తెలిసినదంతయు, మీమాంస్యమేవ = పరిచ్ఛిన్నమగుటచే మరల విచారింపఁదగినదే నని, మన్యే = భావించుచున్నాను.

శ్లో॥ పరబ్రహ్మ మహాలింగం-ప్రపంచాతీత మవ్యయం ।
తదేవ సర్వభూతానా - మంత స్త్రిస్థానగోచరమ్ ॥

మూలాధారే చ హృదయే - భ్రూమధ్యే సర్వదేహినాం।
జ్యోతిర్లింగం తదాభాతి-యద్బ్రహ్మేత్యాహు రాగమాః॥
అపరిచ్ఛిన్న మవ్యక్తం - లింగం బ్రహ్మ సనాతనం।
ఉపాసనార్థ మంతఃస్థం - పరిచ్ఛిన్నం స్వమాయయా॥

ప్రాకృతిక ప్రపంచము నతిక్రమించినదియు, వినాశము లేనిదియు నగు పరబ్రహ్మము మహాలింగ మనబడును. అదియే ప్రాణులందరిలో మూలాధారము హృదయము భ్రూమధ్యము నను మూడు ప్రదేశములయందు ఉపాసకులందరికి జ్యోతిర్లింగముగ ఉపాసనసమయమునందు ప్రకాశించును. ఆ జ్యోతిర్లింగము బ్రహ్మం బని వేద ఆగమాదులు-వక్కాణించుచున్నవి.

వస్తుతః-శివుని మహాలింగ స్వరూపము-పరిమితి లేనిదై ప్రాకృత నేత్రములకు కనుపడునది కాదు. ఐనను భక్తులు ఉపాసించుటకు తన మాయాశక్తి సంబంధమున పరిమితి గలదై హృదయాది స్థానములయందు గోచరమగునట్టిది.

ఉపాసించుతటి దివ్యదృష్టిలో గోచరించు ప్రాణభావలింగములు గూడ పరిచ్ఛిన్నములనియు, మూర్ధన్యనాడి ద్వారా నిష్క్రమించి పరమపదముఁ బ్రవేశించిన తరువాతనే నిజరూప ఆవిష్కరణద్వారా ముక్తాత్మకు శివసాయుజ్యము ఘటించుననియు, శరీరమునుండి బయలుదేరిన పిమ్మటనే సంపూర్ణ శివదర్శనమగుననియు సారాంశము.

"నాహం మన్యే సువేదేతి_నో న వేదే తి వేద చ।
యో న స్తద్వేదనో - న వేదేతి వేద చ॥ 2

ప. సువేదేతి=పరశివస్వరూపమును బాగుగా గుర్తెరుగుదునని, అహం = నేను, న మన్యే = భావించుచులేను. కింతు = కాని, వేదచ

= స్వల్పముగ బ్రహ్మమును గుర్తెరుఁగుచున్నాను. న వేదేతి = బ్రహ్మమును పూర్తిగ తెలియలేను, నో = అని కాదు.

నః = మాలో, యః = ఎవఁడు, తత్ = పరశివస్వరూపమును, వేద = స్వల్పముగ గుర్తెరుగునో, సః=వాడే, తత్=బ్రహ్మమును, వేద = పూర్తిగ గుర్తెరుగఁజాలును. న వేదేతి = పూర్తిగ తెలియఁజాలఁడని, నో = కాదు. వేద చ=స్వల్పముగ తెలియువాఁడేను.

భా. గురువునకు శిష్యుఁడు నివేదించు వాక్యమిది, శిష్యుఁడు కల్యాణదేశికునివలన శాంభవదీక్షఁబరిగ్రహించి-కరతలమున ఇష్ట లింగమును గాంచుచు గురూపదేశము ననుసరించి ఇందు ప్రాణభావ లింగములను భావించుచున్నను సంపూర్ణ శివదర్శనము ఘటింప లేదనియు తథాపి స్వల్పముగ శివజ్ఞానము కలుగుచున్నందున నావలె శాంభవదీక్షితుఁడై ప్రయత్నించు మాహేశ్వరుఁడు మొదట కొద్ది కొద్దిగా శివజ్ఞానముగలవాడై సాధన క్రమమున భావలింగ సాక్షాత్కారముతో పరంజ్యోతిఁజేరుననుట-ఇందు పరమార్థము

"యస్యామతం తస్య మతం-మతం యస్య న వేద సః,
అవిజ్ఞాతం విజానతాం-విజ్ఞాత మవిజానతామ్" 3

గురుశిష్య సంవాదమును విరమించి శ్రుతి-స్వయం నిరూపించు చున్నది. ఎట్లనగా ?

ప. యస్య = ఎవనికి బ్రహ్మము, అమతం = సంపూర్ణముగ బుద్ధి బలముచే తెలియ నలవి గాదో, తస్య = అట్టి జిజ్ఞాసువునకు, మతం = శాస్త్ర ఆచార్య ఉపదేశము వలన ఉపాసనచేతను సంపూర్ణ ముగ తెలిసికొన శక్యంబగును. యస్య = ఎవనికి, మతం = బుద్ధి బలముచే బ్రహ్మము తెలిసినట్లుండునో, సః = అట్టివాడు, న వేద=

ఉపాసనచే సంపూర్ణముగ తెలిసికొనుటకు అర్హుఁడు కాజాలడు, విజానతాం = నేను బ్రహ్మమును గుర్తెరుగుదునని భావించువారికి, అవిజ్ఞాతం = బ్రహ్మము ఎన్నటికైనను తెలియునది కాదు. అవిజానతాం = "పూర్తిగా తెలియలేదు బ్రహ్మము" అని అనుకొనువారికి, విజ్ఞాతం = మొదట పరోక్షముగ తదువాత అపరోక్షముగను తెలియునదగును.

బ్రహ్మము (పరశివతత్త్వము) సర్వాత్మనా తెలియునది కాదనినచో "తెలియు" నని చెప్పిన వాక్యములు వ్యర్థములగును. ఉపాసనచే కలుగు దివ్యదృష్టికి గోచరమగు బ్రహ్మము-ఎవరికిని సాక్షాత్కరింపదనునెడ-"ఆత్మా వా రే ద్రష్టవ్యః" ఇత్యాది శ్రుతులకు సార్థక్యము ఏర్పడదు గాన శాంభవదీక్షితుఁడై శివునుపాసించువానికి-అంత్యకాలమున శివసాక్షాత్కారము సంభవించునని-విదితమైనది.

"ప్రతిబోధవిదితం మత-మమృతత్వం హి విందతే,
ఆత్మనా విందతే వీర్యం. విద్యయా విందతేఽమృతమ్"

ప ప్రతిబోధమనఁగా - లింగాంగ సామరస్యమనఁదగు శివాద్వైతజ్ఞానము, అట్టి ప్రతిబోధముతో విదితం = ఉపాసింపఁబడు శివస్వరూపము, మతం = బాగుగ నవగతమగును. హి = ఎందువలననఁగా ? ప్రతిబోధముతో శివునుపాసించు మాహేశ్వరుఁడు అమృతత్వం = జరామరణరాహిత్యమును విందతే = పొందును.

ఆత్మనా = పరమాత్మయగు శివుని యనుగ్రహమున, వీర్యం = శివదర్శనానకూలమగు సామర్థ్యమును, విందతే = పొందును విద్యయా = ఇష్ట ప్రాణభావలింగోపాసనాత్మకమగు జ్ఞానముతో, అమృతం = పునరావృత్తి రహితమగు పరమపదప్రవేశముతో శివానందమును, విందతే = అనుభవించువాడై పొందును.

శ్లో॥ శివ ఏవ జగత్సర్వం-శివ ఏవాహ మిత్యపి ।
భావయన్ పరమో యోగీ-భవదోషై ర్నలిప్యతే॥
రేణుకాచార్యులు.

శ్లో॥ అథ మోక్షార్థిభిః ప్రాజ్ఞైః—శివ ఏవ శివంకరః ।
ధ్యేయః సర్వం పరిత్యజ్య-శివా దన్యత్తు దైవతమ్ ॥
సూతసంహిత-యజ్ఞవైభవఖండము.

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం-హృద్దేశేఽర్జున తిష్ఠతి ।
భ్రామయన్ సర్వభూతాని· యంత్రా రూఢాని మాయయా॥
తమేవ శరణం గచ్ఛ-నర్వభావేన భారత॥ భగవద్గీత.

శ్లో॥ కీటో భ్రమరయోగేన-భ్రమరో భవతి ధృవం ।
మానవః శివయోగేన-శివో భవతి సర్వదా ॥ స్మృతి.

ఇత్యాది ప్రమాణములు-మోక్షాపేక్ష గల శాంభవదీక్షితుఁడు-హరిబ్రహ్మేర్యమరుల నుపేక్షించి శివునినే ధ్యానింపవలెనని సిద్ధాంతీకరించుచున్నవి. అందువలన శివోపాసకులకు ఐహికఫలముల యపేక్ష లేకున్న నవ్వారి యోగక్షేమములను శివుఁడే ప్రసాదించునని తేటపడినది,

శ్లో॥ కిమ స్తి బహునో క్తేన—మానుషం జన్మ దుర్లభం।
తత్రాపి దుర్లభం జన్మ-కులే శైవస్య కస్యచిత్ ॥

పెక్కు మాటలేల ? మానవజన్మ—సామాన్యముగ లభించునది కాదు. మానవ జన్మలో శైవకులమందు జన్మించుట దుర్లభమైనదిగాన ఇష్టలింగధారులైన ద్విజులందరు శివునినే ఉపాసించి తరింపవలెనని సారాంశము.

"ఇహ చే దవేదీ దథ సత్య మ స్తి-న చేదిహావేదీత్
మహతీ వినష్టిః, భూతేషు భూతేషు విచింత్య ధీరాః-
ప్రేత్యాస్మా ల్లోకా దమృతా భవంతి" 5

వ. ఇహ = శాస్త్రాధికారయోగ్యమగు నీ మాహేశ్వర జన్మ యందే, అవేదీచ్చేత్ = "శివోఽహ"మను భావనతో శివుని గుర్తించిన యెడల, అథ = ఈ శరీరమును విడిచిన వెనువెంటనే, సత్యం = శాశ్వతమైన మోక్షఫలము, అ స్తి = ప్రాప్తంబగును. ఇహ = ఈ శ్రౌతశైవారాధ్యజన్మయందు నావేదీచ్చేత్ = శివు నుపాసింపనిచో, మహతీ = గొప్పదైన, వినష్టిః = "సంసారబంధ సంబంధము" అను వినాశము సంభవించును.

భూతేషు భూతేషు = చరాచరప్రాణులందరిలో, విచింత్య = అవినాభావముతో శివుఁడున్నాడని గుర్తించి, ధీరాః = శివజ్ఞానముతో రమించు మాహేశ్వరులు, అస్మాల్లోకాత్ = ఈలోకమునుండి, ప్రేత్య = నిర్గమించి, అమృతాః = ముక్తులు, భవంతి = కాగలరు.

శివుఁడు సర్వాంతర్యామి యని భావించుచు ఇష్టలింగముమ పూజించుచు ప్రాణలింగమును శివపంచాక్షరీ మంత్ర జపముతో అను సంధించుచు "శివోఽహం" అను భావనతో భావలింగమును ధ్యానించి శివసాయుజ్యము నొందవలెనని సారాంశము.

ఇయ్యది-శ్రీ నీలకంఠశివాచార్య ప్రణీతభాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రికృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కేనోపనిషద్గత-ద్వితీయఖండము.

---

శ్రీ మహాగణాధిపతయే సాంబశివాయ నమః

# కేనోపనిషత్-తృతీయఖండము

"బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే—అథ తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయంత, త ఐక్షం తాస్మాక మేవాయం విజయోఽస్మాక మేవాయం మహిమేతి" 1

ప. బ్రహ్మ హ = సర్వోపరి విరాజమానుండగు శివుఁడే, దేవేభ్యః = ఇంద్రాది దేవతల ప్రయోజనమునకై, విజిగ్యే = రాక్షసులను పరాజితులఁజేయించెను. అథ = ఆ వెనువెంటనే, తస్య బ్రహ్మణో హ = ఆ పరశివుని యొక్క, విజయే = గెలుపునొనఁ గూర్చుటయందు, దేవాః = దేవతలు, అమహీయంత = గొప్పగా ప్రశంసింపఁబడిరి. తే = అట్టి అమరులు, అయం విజయః = ఈ విజయము,అస్మాకమేవ=మా సామర్థ్యముననే లభించినదని, ఐక్షంత =గర్వముతో భావించుచుండిరి. అయం మహిమా= ఈ గొప్పదనము, అస్మాకమేవేతి = మాదేనని విఱ్ఱవీగుచుండిరి.

భా. మొదటి రెండవ ఖండములలో ఇంద్రియాధిపతియొక్క ప్రభువగు పరమేశ్వరుని లక్షణమును నిరూపించి మూడవ ఖండము నందు పరమేశ్వరునిచే ప్రసాదింపఁబడిన శరీరవాఙ్మనోబలము-ఇట ఆఖ్యాయికతో ప్రతిపాదింపఁబడుచున్నయది.

అమరుల నంతర్యామిగ నుండు పరశివుఁడే శరీరాదిసాధనములకు బలము నొసఁగి విజయమును చేకూర్చెను.

పూర్వకల్పమున ప్రళయము సంభవించిన తఱి- మొదట జన్మించిన హరిబ్రహ్మలు-నేను పెద్ద, నేను పెద్దనని పోరాడినపుడు పరిపూర్ణుఁడైన పరమేశ్వరుఁడు-జ్యోతిః స్తంభరూపమున నావిర్భవించి-హరిబ్రహ్మలయొక్క అహంకారమును పోనాడినట్లు-ఇం దాదుల అభిమానమును నిరాకరింప యక్ష (పూజ్యమగు శివలింగ) రూపమున నావిర్భవించెనని-తరువాతి వాక్యములలో గాననగును.

"తద్ధైషాం విజజ్ఞౌ-తేభ్యో హ ప్రాదుర్బభూవ।
తన్న వ్యజానంత-కిమిదం యక్ష మితి ॥ 2

ప. ఏషాం = ఈ దేవతలయొక్క, తత్ = అట్టి అభిమానమును, విజజ్ఞౌ = పరశివాఖ్యమగు బ్రహ్మము గుర్తెరిగెను. తేభ్యోహ = అమరుల అహంకారము నణచి అనుగ్రహించుటకై, ప్రాదుర్బభూవ = పూజ్యమగు శివలింగ స్వరూపముతో బ్రహ్మము ఆకాశమునందు గోచరమయ్యెను.

ఇదం యక్షం = ఈ యక్షస్వరూపము, కిమితి = ఏమిటని తర్కించినవారై తత్ = బ్రహ్మమును, న వ్యజానంత = అమరులు తెలియకుండిరి.

కరిగిన నెయ్యి గట్టిపడినట్లు సర్వాంతర్యామియగు పరశివుఁడు-ఒకానొక తేజఃపుంజరూపమున-దేవతల గర్వమును పోగొట్టి-మీరు స్వతంత్రకర్తలు గాక శివాధీనకర్తృత్వము గలవారని-బోధించుటకు సాక్షాత్కరించెను. అందువలన అమరులు చకితులై అంతరిక్ష గోచరమగు యక్షస్వరూపమును కనుగొనఁదలచిరని సారాంశము.

"శివో దాతా శివో భోక్తా-శివః సర్వ మిదం జగత్" ఇత్యాది ప్రమాణములు-జయాపజయాదులు శివాధీనములని తెలుపుచున్నవి.

"తేఒగ్ని మబ్రువన్, జాతవేద ఏతద్విజానీహి,
కిమిదం యక్షమితి - తథేతి" 3

ప. తే = ఆ అమరులు అజ్ఞానవశమున, జాతవేదః = అగ్ని, ఏతద్యక్షం = ఈ యక్షరూపము, కిం = ఎట్టిదో, ఇదం = ఈ విషయమును, విజానీహి = గుర్తింపుము! ఇతి = ఈ విధముగా, అగ్నిం = అగ్నిదేవునిఁగూర్చి, అబ్రువన్ = పలికిరి తథేతి = అగ్ని ఆటులే నని యంగీకరించి,

"తదభ్యద్రవ త్తమభ్యవదత్-కోఒసీ త్యగ్నిర్వా అహ
మస్మీ త్యబ్రవీ జ్జాతవేదా వా అహ మస్మీతి" 4

తత్ = బ్రహ్మమును గురించి, అభ్యద్రవత్ = వడిగా పరుగెత్తెను. తం = అగ్నిని, యక్షరూపము = కోఒసీతి = ఎవడవని, అభ్యవదత్ = అభిముఖముగ ప్రశ్నించి పలికెను.

అహం = నేను, అగ్నిర్వా = అగ్ని దేవుడను, అస్మి = అగుచున్నాను. జాతవేదా వా అహ మస్మి = జాతవేదుడుగ నేను ఉన్నాను, ఇతి = ఇట్లు, అబ్రవీత్ = అగ్ని యక్షునుద్దేశించి గర్వముతో వక్కాణించెను.

"తస్మింం స్త్వయి కిం వీర్య మిత్యపీదగ్ం దహేయం,
యదిదం పృథివ్యా మితి" 5

"తస్మై తృణం నిదధా వేతద్దహేతి, తదుప ప్రేమాయ
సర్వజవేన తన్న శశాక దగ్ధుమ్, స తతఏవ నివవృతే
నైత దశకం విజ్ఞాతుం, యదేత ద్యక్ష మితి" 6

ప. తస్మిన్ = అగ్నియని జాతవేదుఁడు నని పేరు

యట్టి, త్వయి = నీయందు, వీర్యం = సామర్థ్యము, కిం = ఎట్టిదని యక్షుఁడు అడుగగా- పృథివ్యాం = భూమి మొదలగు ప్రపంచమున, యదిదం = ఏ ఈ దృశ్యమానము గలదో, ఇదం సర్వం = దీని నంతటిని, దహేయం = కాల్చుదు నని అగ్ని పలికెను.

ఏతత్ = దీనిని, దహేతి = కాల్చుమని, తస్మై = అగ్నికొరకు, తృణం = గడ్డిపఱకను, నిదధౌ = ఉంచెను, తత్ = ఆ తృణమును, సర్వజవేన = సమస్త బలముతో, ఉపప్రేయాయ = సమీపించెను. ఐనను తత్ = గడ్డిపఱకను, దగ్ధుం = దహించుటకు, న శశాక = అగ్ని సమర్థుఁడు కాలేదు. సః = ఆ అగ్ని, ఏతద్యక్షం = ఈ యక్ష స్వరూపము, యత్ = ఎట్టిదో, ఏతత్ = ఈ యక్షమహిమను, విజ్ఞాతుం = విశేషించి తెలిసికొనుటకు, నాశకం = అసమర్థుఁడనైతి నని, అగ్ని- తత ఏవ = ఆ క్షణముననే, నివవృతే = మఱలెను

"అథ వాయు మబ్రువన్, వాయవేతద్విజానీహి,
కిమేత ద్యక్ష మితి తథేతి" 7

"తదభ్యద్రవ త్త మభ్యవదత్ కోఽసీతి, వాయుర్వా
అహ మస్మీత్యబ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి" 8

"తస్మిం స్త్వయి కిం వీర్య మిత్యపీదగ్ం సర్వ మాద
దీయం, యదిదం పృథివ్యా మితి" 9

ప. అథ = తరువాత, వాయుం = వాయుదేవుని, ఏతద్యక్షం ఈ యక్షస్వరూపము, కిం = ఎట్టిదో, ఏతత్ = ఈ యక్షస్వరూపమును, విజానీహి = బాగుగ తెలిసికొనుము! అని అమరులు చెప్పిరి. తథేతి = అటులే నని వాయువు-

తత్ = యక్షస్వరూపమును గురించి, అభ్యద్రవత్ = అభిముఖ

ముగ వేగమున నడచెను. కోఽసీతి = నీవు ఎవడవని, తం = వాయువును, అభ్యవదత్ = పూజ్యమగు శివలింగమున భాసించు పరమేశ్వరుఁడు ప్రశ్నించెను. అహం = నేను, వాయుర్వా = వాయుదేవుడను, అస్మి = మీ ముందున్నాను. మాతరిశ్వావా అహమస్మి = మాతరిశ్వను నేను"

తస్మింస్త్వయి = అట్టి నీయందు, కిం వీర్యం = ఎట్టి సామర్థ్యము కలదని యక్షస్వరూపము ప్రశ్నింపగా వాయువు- పృథివ్యాం = పృథివి మొదలగు ప్రపంచమున, జదం = దృశ్యమానమగు యత్ = ఏదేది గలదో, సర్వమపీదం = ఈ సమస్తమునంతయు, ఆదదీయం = ఆకర్షింతును" అని పలికెను.

యక్షమనగాఁ పూజనీయమని నైఘంటుకార్థము. హరిబ్రహ్మ ద్యర్చనీయంబగు మహాశివలింగము అంతరిక్షమునందు ప్రత్యక్షమై అగ్నివాయువుల ద్వారా అమరుల మదము నణచి తన దివ్యవాణితో మందలించుటయు, "అసురుల నోడించుట మనది కాదని" ఇంద్రాదులు గుర్తించి స్వాభిమానమును విడనాడుటయు ఇందున్నందున ప్రతి మాహేశ్వరుఁడును భావలింగప్రేరితుఁడై ప్రాణలింగాశ్రయమున నిశ్చయించుకొని "జయాపజయములు సుఖదుఃఖాదులు నీవలననే కలుగుచున్నవని'' ఇష్టలింగమును ప్రార్థించి పూజింపవలెనని విదితమైనది.

"తస్మై తృణం నిదధా వే తదాదత్స్వేతి తదుపప్రేయాయ,
సర్వజవేన తన్న శశాకాదాతుం, స తత ఏవ నివవృతే,
నైత దశకం విజ్ఞాతుం యదేత ద్యక్ష మితి" 1

ప. ఏతత్ = దీనిని, ఆదత్స్వ = కదలించి ఆకర్షింపుః ఇతి = అని, తస్మై = ఆ వాయువు ఆకర్షించుటకై, తృణం నిదధౌ

శ్రీ మహాగణాధిపతయే సాంబశివాయ నమః

# కేనోపనిషత్-చతుర్థఖండము

"సా బ్రహ్మేతి హోవాచ, బ్రహ్మణో వా ఏతద్విజయే
మహీయధ్వ మితి, తతో హ వై విదాంచకార బ్రహ్మేతి" 1

ప. సా = భగవతియగు పార్వతీదేవి, బ్రహ్మేతి = మీకు కనుపడిన యక్షస్వరూపము-బ్రహ్మ (పరశివమహాలింగ) మని, ఉవాచ హ = ప్రతిపాదించెను. బ్రహ్మణో వా = పరశివునియొక్క. ఏతద్విజయే = ఈ రాక్షసులను ఓడించుట విషయమైె కర్తృత్వము సంభవించుటచే, మహీయధ్వం = గొప్పవారుగ సంతోషించుడు! తతో హ వై = పార్వతీ దేవియొక్క ఉపదేశమువలననే, బ్రహ్మేతి = యక్షస్వరూపము పరశివుని జ్యోతిఃస్తంభాకారమగు బ్రహ్మంబని, విదాంచకార = దేవేంద్రుఁడు తెలిసికొనెను.

అగ్నివాయువుల గర్వాపహరణము ఐన తరువాత దేవేంద్రుఁడు అహంకారముతో సమీపింపగా-యక్షస్వరూపము కనుమఱుగై—పార్వతీదేవి ప్రబోధించినందున- తన యభిమానమును విసర్జించి—యక్షరూపము బ్రహ్మంబే నని నిర్ధారించుకొనెనవి సారాంశము.

"తస్మాద్వా ఏతే దేవా అతితరా మివాన్యాన్ దేవాన్,
యదగ్నిర్వాయు రింద్రస్తే హ్యేనన్నేదిష్ఠం పస్పృశు స్తే,
హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి" 2

ప. తస్మాద్వా = అందువలననే, యత్ = ఏ, అగ్నిః=అగ్ని, వాయుః = వాయువు, ఇంద్రః = దేవేంద్రుఁడు ఉన్నారో, తే = అవ్వారు, ఏనత్ = ఈ బ్రహ్మమును, నేదిష్ఠం = సమీపించినదానిగ, పస్పృశుః = అవలోకించి సంభాషించిరి. ఏతే దేవాః = ఈ అగ్ని వాయ్వింద్రులు, అన్యాన్ దేవాన్ = ఇతరదేవతలను, అతితరా మివ అతిక్రమించి అధికులైనవారేను, హి = ఎందువలన ననఁగా? తే = ఆ ముగ్గురు దేవతలు, ఏనత్ = ఈ ప్రత్యక్షమైనదానిని, బ్రహ్మేతి = బ్రహ్మంబని, విదాంచకార = గుర్తెరిగిరి.

భా. శివ దర్శనము వలన శివునితో సంభాషించుటవలనను మొదట అగ్ని వాయు ఇంద్రులకు, తరువాత అమరులకు జ్ఞానోదయము కలిగెనని.

"తస్మా ద్వా ఇంద్రోఽతితరా మివాన్యాన్ దేవాన్, స హ్యేన న్నేదిష్ఠం పస్పర్శ, స హ్యేనత్ ప్రథమో, విదాంచకార బ్రహ్మేతి" 3

ప. తస్మాద్వా = అందువలననే, ఇంద్రః = దేవేంద్రుఁడు, అన్యాన్ దేవాన్ = ఇతరులైన అగ్నివాయ్వాది దేవతలను, అతితరా మివ = అతిశయించినవాడేను, హి = ఎందువలననఁగా? సః = ఇంద్రుఁడు. నేదిష్ఠం = సమీపించినట్టి, ఏనత్ = ఈ బ్రహ్మమును, పస్పర్శ = సంవాదముతో చేరువై గుర్తించెను. హి = మరియు, సః = దేవేంద్రుఁడు, ప్రథమః = అగ్నివాయువులకంటె ముందు, ఏనత్ = ఈ యక్షస్వరూపము, బ్రహ్మేతి = బ్రహ్మంబని, విదాంచకార = తెలిసికొనెను.

భా. దేవేంద్రుఁడు మొదట యక్షము దేవీప్రబోధముచే శివ

మహాలింగమని గుర్తించి చెప్పగా అగ్నివాయువులు తెలిసికొనిరి. పిమ్మట నమరులు గుర్తించిరి గాన అమరులకంటె నగ్నివాయువులు శ్రేష్ఠులనియు, అగ్నివాయువులను మించినవాడు ఇంద్రుఁడనియు వివేకము.

"తస్యైష ఆదేశో, యదేతద్విద్యుతో వ్యద్యుతదా ఇతీ
న్న్యమీమిషదా, ఇత్యధిదైవతమ్" 4

ప. యత్ = ఎందువలన, ఏతత్ = యక్షరూపమున కనుపడిన ఈ బ్రహ్మము, విద్యుతః = మెరుపుయొక్క, వ్యద్యుతదా = (తత్ = అ) ప్రకాశమువలె ఆవిర్భవించినదో, న్యమీమిషదా = (మిషత్ = అ) మరల మెరుపుయొక్క అప్రకాశమువలె నంతర్ధానముఁ జెందినదో, ఇదే విధము ఉపాసనాకాలమున దృశ్యము అదృశ్యంబు నగునని, తస్య = శివలింగ స్వరూపుండగు పరమేశ్వరునియొక్క, ఏషః = ఈ. ఆదేశః = ఆజ్ఞారూపమైన ఉపదేశము, ఇతి = ఇట్లు, ౹ధిదైవతం = ఇంద్రాది దేవతల నుద్దేశించి మెఱుపు ఉపమానముతో ౹యఁబడిన ప్రబోధమని తెలియవలెను.

"అథాధ్యాత్మం, యదేతత్ గచ్ఛతీవ, చ మనోఽనేన
చైత దుపస్మర త్యభీక్ష్ణం సంకల్పః" 5

ప. అథ = బాహ్యోపదేశానంతరము, అధ్యాత్మం = అంతఃకరణమును గురించి-ఆధ్యాత్మికోపదేశము చేయఁబడినది.

మనః = మనస్సు, ఏతత్ = ఈ బ్రహ్మమును, గచ్ఛతీవేతి యత్ = పొందుచున్నట్లు తోచుట ఏదో, మనః = మనస్సు, అనేన ఇట్టి ప్రాప్తితో, ఏతత్ = ఈ బ్రహ్మమును, అభీక్ష్ణం = అత్యంతము, ౹పస్మరతి = సమీపించి ధ్యానించుచున్నదనుట- సంకల్పః = మనస్సు

సంకల్పవికల్పాత్మక మగుటచే మనస్సును చిరకాలము శివునియందు నిలుపుట సాధ్యము కాదను నర్థము గలిగియున్నది.

మనస్సు చంచల మగుటఃజేసి పరమేశ్వరునందు స్థిరపఱుప రాదు. అనాదివిషయవాసనాబద్ధమగు మనస్సును బలాత్కారముగ శివధ్యాన నిమగ్నముగ జేయుట- శివానుగ్రహము వలననే ఘటించు నని సారాంశము.

"తద్ధి తద్వనం నామ, తద్వనమిత్యుపాసితవ్యం, స ఏతదేవం వేదాభిహైనగ్ం సర్వాణిభూతాని సంవాంఛంతి" 6

ప. తత్ = పరశివాఖ్య బ్రహ్మము, వనం నామ = భక్తులందరిచే ప్రార్థింపఁదగినది గదా! ఎందువలన బ్రహ్మము ప్రార్థింపఁదగినదో, తత్ = అందువలన, తత్ = బ్రహ్మము, వనమితి = ప్రార్థింపదగినదని, ఉపాసితవ్యం = శాంభవదీక్షా స్వీకార పూర్వకముగ ఉపాసింపఁదగినది. సః = అట్టి శివోపాసకుఁడు, ఏతత్ = బ్రహ్మమును, ఏవం = ప్రార్థింపఁదగినదానిగా, వేద = గుర్తెరిగి యుపాసించునెడ, ఏనమభి = ఇట్టి యుపాసకుని గూర్చి, సర్వాణిభూతాని ప్రాణులందరు, సంవాంఛంతి = విధేయులై "ఈ శైవుడు మనందరికంటె చాల గొప్పవాడు" అను ఆదరముతో నభిలషించుచుందురు.

ఇట వన శబ్దమునకు ప్రార్థింపఁబడునదను నర్థము- ఉచితమగుటచే- శాంభవదీక్షితుఁడు-స్వవామకరతలమున ప్రత్యక్షముగ నవలోకించుచు ప్రార్థింపఁదగినది అరాధింపఁదగినదియు ఇష్టలింగమే నని ద్యోతకమగుచున్నందున- అట్టి ఇష్టలింగమును శివాగమోక్త రీతిని నిత్యము పూజించుచు భోగ్యమునంతయు శివప్రసాదముగ స్వీకరించు మాహేశ్వరుని-తోటి మాహేశ్వరులే గాక శివభక్తులందరును ప్రశంసించుచుందురని వివేకము.

"ఉపనిషదం భో బ్రూహీత్యుక్తా, త ఉపనిషద్, బ్రాహ్మీం వావ, త ఉపనిషద మబ్రూమేతి" 7

ప. భోః = ఆచార్యా! ఉపనిషదం = శివోపాసనారహస్యమును, బ్రూహి = వివరించి వక్కాణింపుము అని శిష్యుఁడు ప్రశ్నింపగా. తే = నీకు, ఉపనిషత్ = శివోపాసనలో రహస్యమైన ఇష్ట ప్రాణ భావ లింగోపాసన, ఉక్తేతి = చెప్పఁబడినదనియు, తే = నీకు, ఉపనిషదం = అట్టి శివోపాసనాదార్ఢ్యమునకై, నిగమాగమాంతసారాంశముగ రహస్యమైన "వనం" ఇత్యాదివాక్యమున ఇష్టలింగాద్యర్చనాదికమును అబ్రూమ వావ = చెప్పినవారమేను.

"తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా, వేదాః సర్వాంగాని సత్య మాయతనమ్" 8

ప. తస్యై = బ్రహ్మవిద్యయనఁదగు శివోపాసనకై, తపః = నక్తవ్రతాదికమగు తపస్సు, కర్మేతి = శివార్చనాదికమగు కర్మయు, దమః = ఇంద్రియనిగ్రహమున్ను, ప్రతిష్ఠా = సాధనములై శివోపాసనను నిరంతరము నిలుపునవగును, వేదాః = వేదములు, సర్వాంగాని = వేదాంగములు, శివాగమాదులును, సత్యం = యథార్థమైన, ఆయతనం = శివోపాసనను బలపఱచు స్థానములగును.

భావము-"శివార్థే దేహసంశోష - స్తప ఇత్యుచ్యతే బుధైః-శివార్చా కర్మ విజ్ఞేయం - నాన్యత్ కర్మ ప్రశస్యతే" ఇత్యాది ప్రమాణములు శివారాధనమునే ముఖ్యకర్తవ్యముగ నిరూపించుట గమనార్హము.

శ్లో॥ తపో దమో వివేకశ్చ - వైరాగ్యం పూర్ణభావనా,
క్షాంతిః కారుణ్యసంపత్తిః - శ్రద్ధా సత్యసముచ్చయా।

ర క్తిః పరో ధర్మః - శివజ్ఞానస్య బాంధవాః ॥
సిద్ధాంతశిఖామణి–రేణుకాచార్యులు

వతాదులతో శివషడక్షరీమహామంత్రజపరూపమైన తపస్సు, ం్రదియములను అదుపులో నుంచుకొనుట, దేశకాలపాత్ర నరించిన శాస్త్రీయ లౌకికమైన వివేకము, అహంకార మమ ప తగ్గించి విరక్తి కలిగియుండుట, శివుడే సూక్ష్మరూప 'నా చేతనములయందు నిండియున్నాడని భావించుటయు, క్షుత్రైన అర్హుల యందు కరుణ, యథార్థదృష్టిని కలుగు శివుని పై ఏకాగ్రభక్తి, వర్ణాశ్రమధర్మములలో స్వవర్ణాశ్రమ విన శ్రేష్ఠమైన ధర్మాచరణము ఇష్టప్రాణభావలింగోపాస కూలములగునవి.

" ఏతా మేవం వేదాపహత్య పాప్మాన మనంతే
'కే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి" 8

యోవా = ఎవడైతే, ఏతాం = ఈవరకు చెప్పఁబడిన బ్రహ్మ గోపాసనను, ఏవం = తపస్సు మొదలగు అంగములతో నిగా, వేద = గుర్తించి చేయునో, అట్టివాడు- పాప్మానం త దుష్కృతరూపమగు సంచితకర్మను, అపహత్య = ని, అనంతే=కాలపరిచ్ఛేదరహితమగు (అథవా=అనంతుఁ బడు శివునిచే నిండియుండునట్టి,) జ్యేయే = సర్వశ్రేష్ఠ స్వర్గే లోకే=నిరతిశయ ఆనందాస్పదమగు శివలోకమునందు, తి= శాశ్వతకాలము నివసించును. ప్రతితిష్ఠతి అను ద్విరు తో చేయఁబడినది.

హారిశ్చ భగవా - నాద్యంతం నోపలబ్ధవాన్,
శ్యే చ సురా యస్మా-దనంతోఽహ ముతోస్మ్యహమ్"

"బ్రహ్మదేవుఁడు, భగవానుఁడగు శ్రీహరియు, అమరులును నా ఆద్యంతములను కనుగొనలేదు గావున అనంతుఁడ నని చెప్పఁబడుదును" అని పరమేశ్వరుఁడు—పద్మపురాణమున శివగీతలో శ్రీరామచంద్రునకు చెప్పినట్లు కలదు. అందువలన అనంతుడను నామధేయము శివునకే చెల్లునని విదితమైనది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య ప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రి కృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కేనోపనిషత్తు—చతుర్థఖండముతో
సర్వంబు సమాప్తము

## ముఖ్య సారాంశము

ఇందు గల మనోబుద్ధ్యాదులను ప్రేరేపించుట యను లక్షణము భర్గపదఘటితమగు గాయత్రీ మంత్రమున ప్రతిపాదింపఁబడిన పరమేశ్వరునకే సరిపడుచున్నందున, మరియు తృతీయచతుర్థఖండముల లోని ఆఖ్యాయికవలనను ఈ కేనోపనిషత్తు-శివపారమ్యమును, జీవాత్మ యొక్క పరాధీనకర్తృత్వమును నిరూపించుచు శివాద్వైతసిద్ధాంతమును సమర్థించుచున్నయది.

శ్రీ మహాగణాధిపతయే నమః

# కఠోపనిషత్తు - ప్రథమాధ్యాయము

"ఉశన్ హ వై వాజశ్రవసః సర్వవేదసం దదౌ,
తస్య హ నచికేతా నామ పుత్ర ఆస" 1

ప. వాజమనఁగా అన్నము, అద్దాని నొసగుట వలన, శ్రవం= కీర్తిని పొందినవాడు వాజశ్రవుఁడనఁబడును. వాజశ్రవుని పుత్రుఁడగు వాజశ్రవసుఁడు, ఉశన్ = ఫలమును కోరినవాడై, విశ్వజిత్ అను యాగమును చేయుచు, సర్వవేదసం = సమస్తమైన సొత్తును దదౌ= = ఋత్విజులకు సమర్పించెను. తస్య = ఆ వాజశ్రవసునకు, నచికేతా నామ = నచికేతుఁడను, పుత్రః = కుమారుఁడు, ఆస = ఉండెను.

వాజశ్రవసుఁడు స్వర్గసుఖాదుల నపేక్షించి మహాయాగము నొనర్చి - సర్వస్వమును ఋత్విజులకు సమర్పింపఁదలచెను. నచికేతుఁడను కుమారుఁడు ఉండుటచే వాజశ్రవసుఁడు గృహస్థుఁడని విదితమైనది.

"తగ్ం హ కుమారగ్ం సంతం దక్షిణాసు నీయ-
మానాసు, శ్రద్ధాఽఽవివేశ, సోఽమన్యత" 2

ప. దక్షిణాసు=యజ్ఞదక్షిణలుగా వాజశ్రవసునిచే సమర్పింపఁబడిన ఆవులు, నీయమానాసు = ఋత్విజులచే తీసికొనఁబడుచుండగా కుమారం సంతం=పదునైదువత్సరముల కౌమారదశయందున్నను,

తం = ఆ నచికేతుని, శ్రద్ధా = తన జనకునకు యజ్ఞఫలము లభింప వలెనను పట్టుదల, ఆవివేశ = ప్రవేశించెను, సః = ఆ నచికేతుఁడు అమన్యత = దిగువవిధము విచారించెను.

వాజశ్రవసుఁడు ఋత్విజులకు దక్షిణలుగా ఇచ్చిన ఆవులు పనికిరానివని నచికేతుఁడు గుర్తించి-తన తండ్రిని గూర్చి విచారపడె నని భావము.

"పీతోదకా జగ్ధతృణా - దుగ్ధదోహా నిరింద్రియాః,
అనందా నామ తే లోకా - స్తాన్ స గచ్ఛతి తా దదత్" 3

ప. పీతోదకాః = ఈ వరకే నీరు త్రాగినవి, జగ్ధతృణాః = గడ్డిమేసినవి, దుగ్ధదోహాః = పాలు పితికింపఁబడినవి, నిరింద్రియాః = పుట్టించు శక్తి లేనివియు, తాః = అట్టి ఆవులను, దదత్ = ఇచ్చు నట్టి, సః = వాజశ్రవసుఁడు, అనందా నామ = సుఖములేనివని ప్రసిద్ధములైన, తే లోకాః = లోకములు ఏవి గలవో, తాన్ = అట్టి లోకములను, గచ్ఛతి = పొందును.

వాజశ్రవసుఁడు దానముఁజేసిన ఆవులు-ప్రస్తుతము నీరు త్రాగ లేవనియు, గడ్డి మేయలేవనియు, దూడలను కనలేవనియు నచి కేతుఁడు గుర్తించి-తన తండ్రికి నరకలోకములు రాకూడదని మదిఁ దలచియు పనికిరాని ఆవుల నీయకూడదని చెప్పినచో వాజశ్రవ సుఁడు అంగీకరింపడని భావించినవాఁడై దిగువవిధము ప్రశ్నించె నని సారాంశము.

"స హోవాచ పితరం - తాత! కస్మై మాం దాస్యసీతి,
ద్వితీయం తృతీయం తగ్ం హోవాచ, మృత్యవే త్వా
దామీతి" 4

ప. సః = ఆ నచికేతుఁడు, తాత = నాయనా! మాం = నన్ను, కస్మై = ఏ ఋత్విజునకు, దాస్యసీతి = దానము చేయగల వని, పితరం = తండ్రిఁ గూర్చి, ఉవాచ = పలికెను, ద్వితీయం = రెండవ తూరి, తృతీయం = మూడవ తడవ, తం = ఆ వాజశ్రవసు నుద్దేశించి, ఉవాచ = ప్రశ్నగా సంభాషించెను. అట్టితఱి వాజశ్రవ సుఁడు క్రుద్ధుఁడై, త్వా = నిన్ను, మృత్యవే = యమునకు, దదామి = సమర్పింతును, ఇతి = అని పలికెను.

తన తండ్రికి "విశ్వజిత్" అను యజ్ఞముఁదగు ఫలముఁ లభింప వలెనని మదిఁ దలచిన నచికేతుఁడు- పితృసర్వస్వములో తాను చేరినవాడగుటచే "నన్నెవరి కిత్తు"వని మాటిమాటికి ప్రశ్నించినందున "వీడు పిల్లతనమునఁజేసి నిరర్థకముగ మాటలాడుచున్నాడని ఒకటి రెండు పర్యాయములు నచికేతుని ప్రశ్నకు సమాధానము నిడలేదు. మూడవ తడవ గూడా ప్రశ్నించినందున వాజశ్రవసుఁడు కుపితుఁడై "నిన్ను యమున కీయగల" నని అనాలోచితముగ పలికె నని భావము.

"బహూనా మేమి ప్రథమో-బహూనా మేమి మధ్యమః
కిం స్విద్యమస్య కర్తవ్యంయన్మయాఽద్య కరిష్యతి?" 5

ప. బహూనాం = పెక్కు సేవకులలో, ప్రథమః = మొదటి వాడనై ఏమి = యమునిఁజేరుదును. (అథవా) బహూనాం = పరిచార కులనేకులలో మధ్యమః = రెండవవాడనై, ఏమి = మృత్యుదేవతను సమీపింతును. అద్య = ఇప్పుడు, యమస్య = యమునిసంబంధముగ, కింస్విత్ = ఎట్టి యభీష్టము, కర్తవ్యం? = నా తండ్రిచే సాధింపఁ దగినది ? మయా = యమునకు దానముఁజేయఁబడిన నాచే, యత్ = ఎట్టి ప్రయోజనమును, కరిష్యతి? యముఁడు సాధించును ?

ప్రభువు శాసింపకమునుపే సందర్భమును కనిపెట్టి పనులు చేయువాడు-పరిచారకులలో ప్రథముఁడు కాగా-అధికారి ఆజ్ఞానుసారము ప్రవర్తించువాడు-మధ్యముఁడుగాను, ఏలికనుడివిన నాతని యానతిని పాటింపనివాడు అధముఁడుగాను పరిగణింపఁబడుదురు.

తనను ఋత్విజునకు దానముఁజేయక-యమునకిత్తునని తండ్రి నుడువుటచే యజ్ఞఫలము సంప్రాప్తింపదు గాన యమునివలన తన తండ్రి ఆశించునదేమి? ఇట్లు నచికేతుఁడు విచారపడెను కాని యముని సన్నిధికి ఏగుటకు వెనుకంజ వేయలేదని భావము.

"అనుపశ్య యథా పూర్వే-ప్రతిపశ్య తథాఽపరే,
సస్య మివ మర్త్యః పచ్యతే-సస్య మివాజాయతే పునః" 6

ప. నాయనా! నిన్ను యమునకీయగలనని కోపముతో పలికి పశ్చాత్తాపముఁ జెందుచున్నావు. యథా = ఏ విధముగా, పూర్వే = పితామహాది మన పూర్వికులు ఆడినమాట తప్పలేదో, అనుపశ్య = వారిని అనుసరించి పరిశీలింపుము! తథా = అదే విధముగా, అపరే ఇప్పటి మనవారు ఎట్లున్నారో, ప్రతిపశ్య = గమనింపుము!

ఈలోకమున ప్రాణుల పరిస్థితి నాలోచింపగా-మర్త్యః = మానవుఁడు, సస్యమివ = పైరువలె, పచ్యతే = ఫలించి జీర్ణించును. సస్యమివ = పైరువలె, పునః = మరల, ఆజాయతే = త్వరలో జన్మించును.

భా. తండ్రి నన్ను యమునకు సమర్పించినను బాధపడను. ప్రపంచమున జీవనము శాశ్వతము కాకుండుటచే-పుత్రవియోగమునకు దుఃఖింపక-సత్యవాక్యమును పరిపాలింపుమని నచికేతనుఁడు వాజశ్రవసు నోదార్చెనని భావము.

"వైశ్వానరః ప్రవిశత్యతిథి ర్బ్రాహ్మణో గృహాన్,
తస్యైతాగ్ం శాంతిం కుర్వంతి హర వైవస్వతోదకమ్"7

ప. వైవస్వత = యమా! అతిథిర్బ్రాహ్మణః = అతిథియగు బ్రాహ్మణుఁడుగ, వైశ్వానరః=అగ్ని దేవత, గృహాన్=గృహమును గురించి, ప్రవిశతి = ఏతెంచి ప్రవేశించును. తస్య = అట్టి అతిథికి, ఏతాం = అర్ఘ్యపాద్యాది రూపంబగు, శాంతిం = ఉపశమనమును, కుర్వంతి = వృద్ధులు చేయుచుండెడివారు. అందువలన ఉదకం = పాదప్రక్షాళనార్థము ఉదకము మొదలగువానిని, హర = తీసికొనిరమ్ము.

నచికేతసుఁడు-వాజశ్రవసుని సమ్మతిఁబడసి యమలోకమునకు ఏగినతఱి-ఆ సమయమున యముఁడు ఇంటిలో లేనందున-ఉపవాసముతో ద్వారముచెంత నుండెను. యముఁడు రాగానే అగ్నికల్పుఁడైన బ్రాహ్మణుని శాంతింపఁజేయుటకు పాద్యోదకము మున్నగు వానిని గొనితెమ్మని వృద్ధులు యమునకు హితమును వాక్రుచ్చిరని సారాంశము.

"ఆశాప్రతీక్షే సంగతగ్ం సూనృతాం చేష్టాపూర్తే
పుత్రపశూగ్ం శ్చ సర్వాన్। ఏ తద్వృఙ్క్తే పురుషస్యా
ల్పమేధసో, యస్యానశ్నన్ వసతి బ్రాహ్మణో గృహే"8

ప. అల్పమేధసః = కొద్ది తెలివిగల, యస్య పురుషస్య = ఏ పురుషునియొక్క, గృహే = ఇంటియందు, బ్రాహ్మణః = బ్రాహ్మణుఁడు, అనశ్నన్ = అతిథిగ నేతెంచి ఉపసించునో, ఏతత్ = బ్రాహ్మణుని ఉపవాసమువలన కలుగు అపరాధము, తస్య=అట్టి గృహస్థుని యొక్క। ఆశాప్రతీక్షే = ఆశ = పొందని దానిని సంపా

దించు కోరిక, ప్రతీక్షా = లభించినదాని ననుభవింప నెంచుట, ఈ రెంటినే గాక సంగతం = పుణ్యాత్ములతో సహవాసముఁదగు ఫలమును, సూనృతాం = సత్యవాక్య పరిపాలనమును, ఇష్టాపూర్తే = ఇష్టం = = యజ్ఞయాగఫలమును, పూర్తం = బావి మొదలగు జలాశయముల నేర్పరచిన పుణ్యమును, పుత్ర పశూంశ్చ సర్వాన్ = పుత్రులు మున్నగు కుటుంబమును పశువులు మొదలగు సమస్త సంపదను, వృఙ్క్తే = నశింపఁజేయును.

అపరిచితములైన స్వర్గసుఖాదుల నపేక్షించుట-ఆశ యనియు, పరిచితములగు ధనాదుల నపేక్షించుట-ప్రతీక్ష యనియు. వివేకము-గృహస్థుఁడు-అతిథిని సత్కరింపనిచో తన సర్వస్వమును పోగొట్టు కొనునని తేటపడినది.

> "తిస్రో రాత్రీ ర్యదవాత్సీ ర్గృహే మేఽనశ్నన్ బ్రహ్మ
> న్నతిథి ర్నమస్యః, నమస్తేఽస్తు బ్రహ్మన్, స్వస్తి మేఽస్తు,
> తస్మాత్ ప్రతి త్రీన్ వరాన్ వృణీష్వ" 9

ప. ఇట్లు పెద్దలు బోధించిన పిదప యముఁడు-నచికేతసు నర్ఘ్యపాద్యాదులతో సత్కరించి, బ్రహ్మన్ = బ్రాహ్మణా! నమస్తేఽస్తు = నీకు నమస్కారమగుగాక! అతిథిః = అతిథివై, మే గృహే = నా ఇంటియందు, తిస్రోరాత్రీః = మూడు అహోరాత్రములు, యత్ = ఎందువలన, అనశ్నన్ = ఉపవసించి, అవాత్సీః = ఉంటివో, తస్మాత్ = ఆ కారణమువలన, నమస్యః = నమస్కారాదులతో సత్కరింపఁదగినవాఁడవైతివి, మే = అపరాధినగు నాకు, స్వస్త్యస్తు = శుభమగుగాక! ప్రతి = నా యపరాధమునకు పరిహారముగ, త్రీన్ వరాన్ = మూడు వరములను, వృణీష్వ = కోరుము!

అతిథియగు నచికేతసుఁడు రాగానే సత్కరింపనందున అతిథి-అగ్నితో సమానుఁడగుటచే తన సర్వస్వము నశించునని యముఁడు భయపడినవాడై మూడువరములతో నచికేతసుని ప్రసన్నుఁజేయ తలపెట్టెనని భావము.

"శాంతసంకల్పః సుమనా యథా స్యా ద్వీతమన్యు
ర్గౌతమో మాఽభి మృత్యో, త్వత్ప్రసృష్టం మాఽభి
వదేత్ ప్రతీత. ఏత త్త్రియాణాం ప్రథమం వరం వృణే"10

ఇవ్విధము యముఁడు వినయముతో ప్రార్థించినందున నచికేతసుఁడు దిగువవిధము మొదటివరమును కోరెను.

వ. మృత్యో = మృత్యుస్వరూపుడవైన యమధర్మరాజా! గౌతముఁడనఁబడుఁగు నా తండ్రి, శాంతసంకల్పః = "నా కుమారుఁడు యమునిఁజేరి ఎట్టి అవస్థ ననుభవించునో" అను చింత లేనివాడై, సుమనాః = ప్రసన్నమైన మనస్సు గలవాడై, వీతమన్యుః = తనను విసిగించినాడను రోషము లేనివాడును, యథా స్యాత్ = ఎట్లగునో, మరియు త్వత్ప్రసృష్టం = ప్రసన్నుడవైన నీచే పంపఁబడిన, మాఽభి = నన్ను గురించి, ప్రతీతః = "భువినుండి యమలోకమున కేగిన నా కుమారుఁడే మానవ రూపమున మరల నాయొద్దకు వచ్చినాడని" విశ్వసించినవాడై, వదేత్ = నాతో సంభాషించునో, తథా కురు ఆ విధముగా నా జనకు నుండఁజేయుము! త్రయాణాం = మూడిటిని, ఏతత్ = ఈ, ప్రథమం వరం = మొదటి వరమును, వృణే = కోరుచున్నాను.

"యథా పురస్తాత్ భవితా ప్రతీత-ఔద్దాలకి రారుణి
ర్మత్ ప్రసృష్టః, సుఖగ్ం రాత్రీః శయితా వీతమన్యుః
త్వాం దదృశివాన్ మృత్యుముఖాత్ ప్రముక్తమ్"

ప. ఔద్దాలకిః=ఉద్దాలకుఁడనఁదగునట్టి, ఆరుణిః= అరుణుని వంశమునందు జన్మించినట్టి, గౌతముఁడనఁబడు వాజశ్రవసుఁడు, మత్ప్రసృష్టః=నాచే అనుగ్రహింపఁబడినవాఁడై, పురస్తాత్=నీవు ఈ లోకమునకు రాకమున్ను, యథా=ఎట్లుండెనో, తథా భవితా=అట్లే ఉండుఁగాక! ప్రతీతశ్చ=విశ్వాసముగలవాఁడగును కూఁడ, మృత్యుముఖాత్=మృత్యుదేవతయగు నా సన్నిధినుండి, ప్రముక్తం=బయలుదేరుటకు విడుదలఁజెందినట్టి, త్వాం=నిన్ను, దదృశివాన్=చూచినవాఁడై, వీతమన్యుః=కోపములేనివాఁడునై, రాత్రీః రాత్రులందు, సుఖంశయితా=సుఖముగ నిద్రించును.

నచికేతసుని వినయశీలమునకు యముఁడు సంతసించి-అడుగుటయే తడవుగా మొదటివరమును ప్రసాదించెనని భావము.

"స్వర్గే లోకే న భయం కించ నాస్తి, న తత్ర త్వం
న జరయా బిభేతి, ఉభే తీర్త్వాఽశనాయాపిపాసే,
శోకాతిగో మోదతే స్వర్గలోకే" 12

స్వర్గప్రాప్తిసాధనమగు అగ్ని విద్య నుపదేశింపుమని నచికేతసుఁడు-రెండవ వరమును కోరుచు స్వర్గ స్వరూపమును నిర్దేశించుచున్నవాఁడు.

ప. స్వర్గలోకే-సర్వోత్తరమగు పరమపద (శివలోక) మున; భయం కించ=ఎంతమాత్రము పతనభయము నాస్తి-లేదు. తత్ర=ఆచోట, త్వం=నీవు, న=ఉండవు. జరయా=ముదుసలితనముచే, న బిభేతి=భయపడవలసిన అవసరము లేదు. అశనాయా పిపాసే ఉభే=ఆకలి దప్పికల రెంటిని, తీర్త్వా=లేకుండఁజేసి, శోకాతిగః=దుఃఖము నతిక్రమించినవాఁడై, స్వర్గలోకే=శివలోకమున, మోదతే=ఆనందించును.

ఇఁట స్వర్గ శబ్దము - ఇంద్రాదిలోకములఁజెప్పనిదై - పరశివ లోకార్థము గలదని నిర్వచింపవలెను. ఎందుకనఁగా? మరణ భయక్షుత్పిపాసాదుఃఖములు-సామాన్య స్వర్గమునందుండున వగుటచే- అట్టివి లేనిది పరమపద (పరశివలోక)ము ఒక్కటేనని సారాంశము.

యముని రెండవవరముఁగోరునపుడే మోక్షస్థానమును ప్రతి పాదించుటచే నచికేతసుఁడు ముముక్షువుగ పరిగణింపఁబడుచున్న వాడని వివేకము.

"స త్వ మగ్నిగ్ం స్వర్గ్య మధ్యేషి మృత్యో-ప్రబ్రూహి
తగ్ం శ్రద్ధధానాయ మహ్యాం, స్వర్గలోకా అమృతత్వం
భజంతే-ఏతద్ ద్వితీయేన వృణే వరేణ'' 13

ప. మృత్యో = మృత్యుస్వరూపము గల యమధర్మరాజా! సః = లోకవేదప్రసిద్ధుఁడవైన, త్వం=నీవు, అగ్నిగ్ం=అగ్నివిద్యను, స్వర్గ్యం=స్వర్గసాధనముగ, అధ్యేషి=గురైరుగుదువు, శ్రద్ధధానాయ = ఫట్టుదల గలయట్టి, మహ్యాం = నాకు, తగ్ం = అట్టి అగ్ని విద్యను, ప్రబ్రూహి=బాగుగా వక్కాణింపుము! స్వర్గలోకాః=స్వర్గ మనఁబడు పరమపదముఁజేరినవారు, అమృతత్వం = జన్మమరణా దులు లేనట్టి ముక్తిని, భజంతే = పొందుదురు. ఏతత్ = ఈ అగ్ని విద్యా పరిజ్ఞానమును, ద్వితీయేన వరేణ=రెండవ వరముగ, వృణే= కోరుచున్నాను.

పునర్జన్మ లేనట్టి శాశ్వత శివసాయుజ్యము నపేక్షించి—అట్టి ముక్తిని చిత్తశుద్ధిద్వారా కలుగఁజేయునట్టి అగ్నిహవనాది నిష్కామ కర్మయోగమును నీవలన తెలియఁగోరుచున్నానని నచికేతసుఁడు యముని ప్రశ్నించెనని విదితమైనది.

"ప్ర తే బ్రవీమి తదు మే నిబోధ, స్వర్గ్య మగ్నిం
నచికేతః ప్రజానన్, అనంతలోకాప్తి మథో ప్రతిష్ఠాం
విద్ధి త్వ మేతం నిహితం గుహాయామ్" 14

యముఁడు - చెప్పుచున్నాఁడు.

ప. నచికేతః = నచికేతసుఁడా ! స్వర్గ్యం = పరమపదప్రాప్తికి సాధనమగు, అగ్నిం = అగ్నిహవనాదికర్మయోగమును ప్రజానన్ = గుర్తెరిగిన నేను, తే = నీకు, ప్రబ్రవీమి = పూర్తిగ వివరించి చెప్ప గలను. తదు = అట్టి కర్మయోగ విధానమును, మే = నావలన, నిబోధ = తెలిసికొనుము ! అనంతలోకాప్తిం = అవధిలేని లోకము నొందుటకు సాధనమైనట్టి, అథ = మరియు, ప్రతిష్ఠాం = శాశ్వత స్థితికి సాధనము నగు, ఏతం = చెప్పబోవు విధము గల అగ్ని హవనాదికమును, గుహాయాంనిహితం = అతి రహస్యమైనదిగా, త్వం నిబోధ = నీవు గుర్తింపుము !

"లోకాది మగ్నిం తమువాచ తస్మై, యా ఇష్టకా
యావతీ ర్వా యథా వా, స చాపి తత్ప్రత్యవదద్యథోక్త
మథాస్య మృత్యుః పున రేవాహ తుష్టః" 15

ప. లోకాదిం = పరమపదమునకు కారణమైన, తం = లోకవేద ప్రసిద్ధమైన, అగ్నిం = అగ్ని విద్యయనఁదగు కర్మయోగవిధాన మును, తస్మై = ఆ నచికేతనునకు, ఉవాచ = చెప్పెను.

యా ఇష్టకాః = ఏ ఆహుతులు, యావతీర్వా = ఎన్ని సమర్పింపఁ దగినవో, యథా వా = ఎట్లు సమర్పింపవలెనో, యముఁడు విశదీ కరించి వక్కాణించెను. సచాపి = ఆ నచికేతసుఁడును, యథోక్తం = యముఁడు చెప్పినట్లు, తత్ = ఆ అగ్నిహవనాదికమును, ప్రత్య

వదత్ = మరల వివరించి నుడివెను. అథ = తాను బోధించిన కర్మ విధానమునంతయు నచికేతసుఁడు బాగుగా విశదీకరించి చెప్పినందున, మృత్యుః = యముఁడు, తుష్టః = సంతోషించినవాడై, అస్య = ఈ నచికేతునకు, పునరేవ = మరల తనంతట తానే, ఆహ = పలికెను.

ఉపాసనాత్మకమగు జ్ఞానము–నిష్కామకర్మతో కూడినపుడే చిత్తశుద్ధి ద్వారా శివానుగ్రహనిదానమై ముక్తిప్రదంబగునని సారాంశము.

> "తమబ్రవీత్ ప్రీయమాణో మహాత్మా-వరం తవేహాద్య
> దదామి భూయః, తవైవ నామ్నా భవితాఽయ మగ్నిః
> సృంకా చేమా మనేకరూపాం గృహాణ!" 16

ప. మహాత్మా = గంభీరమానసుఁడైన యముఁడు, ప్రీయమాణః = సర్వాత్మనా ప్రసన్నుఁడై, అద్య = ఇప్పుడు। ఇహ = ఈ చెప్పబోవు, వరం = వరమును. భూయః = మరల, తవ = నీకు, దదామి = ఇచ్చుచున్నాను.

అయం = ఈ, అగ్నిః = అగ్నిహోత్రము, తవైవ నామ్నా = నీ పేరుతోడనే, భవితా = ప్రసిద్ధంబగును. అనేకరూపాం = నానావిధములైన వన్నెలు గలయట్టి, ఇమాం = ఈ. సృంకాం = శబ్దముఁజేయు రత్నమాలికను, గృహాణ = స్వీకరింపుము!

ఈవరకు యముఁడొసగెదనని చెప్పిన మూడు వరములే గాక నియ్యది నాలుగవ వరమని విదితమైనది.

> "త్రిణాచికేత స్త్రిభి రేత్య సంధిం-త్రికర్మకృ త్తరతి
> జన్మమృత్యూ-బ్రహ్మజజ్ఞం దేవ మీడ్యం విదిత్వా-
> నిచాయ్యేమాగ్ం శాంతి మత్యంత మేతి" 17

ప. "త్రికర్మకృత్ = యజ్ఞ, వేదశాస్త్రాభ్యాస, దానములనఁదగు మూఁడు కర్మలను చేయువాఁడై, త్రిణాచికేతః = ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములయందు అగ్ని నాహుతులను సమర్పించువాఁడునై, త్రిభిః = ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులతో సంధిం = శివోపాసన యొక్క సంబంధమును, ఏత్య = పొందినచో, జన్మమృత్యూ = జననమరణములను, తరతి = అతిక్రమించును.

శివోపాసన మెట్లనఁగా ?

బ్రహ్మజజ్ఞం = పరమేశ్వరునివలన ఆవిర్భవించునట్టి కించిజ్ఞుఁడైనట్టియు జీవాత్మను, ఈడ్యం = నుతింపఁదగిన, దేవం = పరమేశ్వరుని, విదిత్వా = శాస్త్ర ఆచార్యోపదేశము వలన పరోక్షముగ గుర్తించి, నిచాయ్య = పూజాజపధ్యానములతో ప్రత్యక్షముగ దర్శించియు, ఇమాం = పూర్వోక్తమగు, అత్యంతం శాంతిం = సంసారబంధము పూర్తిగ తొలగుట (మోక్షము)ను, ఏతి = పొందును.

త్రివిధకర్మలను కాలత్రయకర్తవ్యమగు హవనమును ఈశ్వరార్పణబుద్ధితో నాచరించుచు అట్టి కర్మయోగమున చిత్తశుద్ధిఁబడసియు, చిత్తశుద్ధ్యనంతరము గూఢా కర్మలను విడనాడక శివు నుపాసించువాఁడు-నిజరూపమును శివసాక్షాత్కారమును పొందినవాఁడై ముక్తుఁడగునని సారాంశము.

> "త్రిణాచికేత స్త్రయ మేత ద్విదిత్వా-య ఏవం విద్వాగ్ం
> శ్చినుతే నాచికేతం—స మృత్యుపాశాన్ పురతః ప్రణోద్య-
> శోకాతిగో మోదతే స్వర్గలోకే" 18

ప. యః = ఎవఁడు, ఏతత్ = ఈ, త్రయం = అగ్నిజీవాత్మ పరమాత్మ స్వరూపములను. విదిత్వా = వేదశాస్త్రములవలన గుర్తించి,

ఏవం = పూర్వవాక్యోక్త రీతిని, విద్వాన్ = భావించువాడై, నాచికేతం = అగ్నిని, చినుతే = ఉపాసించునో, సః = అట్టివాడు, మృత్యు పాశాన్ = మృత్యుదేవతయొక్క పాశములనఁదగు రాగద్వేషాది వికారములను, పురతః = శరీరత్యాగమునకు మున్నే, ప్రణోద్య = పోగొట్టుకొని, స్వర్గలోకే = స్వర్గమనఁదగు శివలోకమున, శోకా తిగః = సంసార దుఃఖము లేనివాడునై, మోదతే = నిజరూపావిష్కార ముతో ఆనందించును.

కర్మయోగమున ముఖ్యమగు అగ్నిహవనమును శాస్త్రోక్తరీతిని ఆచరించు జీవాత్మ- తాను పరమాత్మవలన నావిర్భంచువాడనని గుర్తించి-నిజరూపమును ముక్తదశయందు బయలుపఱచుకొనియు శివసాయుజ్యమును పొందునని భావము.

"ఏష తేఒగ్ని ర్నాచికేతః స్వర్గ్యో యమవృణీథా ద్వితీయేన వరేణ, ఏత మగ్నిం తవైవ ప్రవక్ష్యంతి జనాస-స్తృతీయం వరం నాచికేతో వృణీష్వ" 19

ప. నాచికేతః = నచికేతసుఁడా! యం = ఏ అగ్నివిద్యను, ద్వితీయేన వరేణ = రెండవవరముతో, అవృణీథాః = తెలియఁగోరి తివో, స్వర్గ్యః = మోక్షస్థానప్రాప్తి సాధనమగు, ఏషః = ఈ, అగ్నిః = అగ్నియందు హవనరూపముగ ఆచరింపఁబడు కర్మయోగము, తే = నీకు చెప్పఁబడినది. జనాసః = లోకులు, ఏతమగ్నిం = ఈ యగ్నిని, తవైవ = నీ పేరుతోడనే, ప్రవక్ష్యంతి = చెప్పుదురు నాచి కేతః = నచికేతసుఁడా! తృతీయం వరం = మూడవ వరమును, వృణీష్వ = కోరుము!

నిష్కామకర్మయోగమును గురించి నచికేతసుఁడు యముని

ప్రశ్నించినందున యముఁడు ఉపయోగించిన స్వర్గశబ్దమునకు మోక్ష స్థానము అను నర్థమే సమంజసమైనది. నిష్కామకర్మానుష్ఠానము శివధ్యానమునకు వలయు చిత్తశుద్ధిని కలుగఁజేయును గాన-శివధ్యాన సాధనములగు జపపూజాదుల నొసర్చి - శివధ్యాననిష్ఠుఁడై శివాను గ్రహపాత్రుఁడు కావలసియుండును. పరంపరయా కర్మయోగము మోక్షసాధనమగుననియు, అందువలననే స్వర్గము పరమపదమనఁ బఱఁగు ననియు విదితమైనది

యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకే,
నాయ మస్తీతి చైకే - ఏతద్విద్యా మనుశిష్ట
స్త్వయాఽహం - వరాణా మేష వరస్తృతీయః" 20

ప. మనుష్యే = మానవశరీరాదులయందలి జీవాత్మ, ప్రేతే = = చివరిశరీరమునుండి వెళ్ళగా, యా = ఏ, ఇయం = ఈ, "అస్తి ఇతి = జీవాత్మ ఉండునని, ఏకే = కొందరు చెప్పుటయు, అయం = ఈ జీవాత్మ, నాస్తి ఇతి = లేకుండునని, ఏకే = మరికొందరు నిరూపించు టయు" అను విచికిత్సా = సంశయమో. త్వయా = నీచేత. అనుశిష్టః = ఉపదేశింపఁబడినవాడనై, ఏతత్ = ఈ చెప్పఁబోవు ముక్తస్థితిఁ గూర్చి, విద్యాం = సంశయనివృత్తితో గుర్తెరుగుదును గాక! ఏషః = వరః = ఈ వరము, వరాణాం = వరములలో, తృతీయః = మూడవ దగును.

చిత్తశుద్ధిని కలిగించు అగ్నిహవనాదికర్మయోగమును తెలిసికొనిన నచికేతసుఁడు-ముక్తపురుషుని లక్షణమును తెలియఁగోరిన వాడై ఆదివరకు గల వాదములను నిరూపించి-మృత్యుదేవతకే ఈ యంశము బాగుగా తెలియునని భావించి పైవిధము యముని ప్రశ్నించె నని సారాంశము.

"దేవై రత్రాపి విచికిత్సితం పురా, న హి సువిజ్ఞేయ
మణు రేష ధర్మః - అన్యం వరం నచికేతో వృణీష్వ!
మా మోపరోత్సీ రతి మా సృజైనమ్" 11

ప అత్ర = నీవడిగిన ముక్తపురుషుని స్థితిఁ గూర్చి, దేవైరపి = అమరులచేతగూడ, పురా = పూర్వకాలమున, విచికిత్సితం = సంశయింపఁబడినది. హి = ఎందువలన ననఁగా? న సువిజ్ఞేయం = సుకరముగ తెలియునది కాదు, ఏషధర్మః = ముక్తస్వరూపము, అణుః = సూక్ష్మమైనది, అందువలన నచికేతః = నచికేతసుఁడా! అన్యం వరం = మరియొక వరమును, వృణీష్వ = కోరుము! మా = నన్ను, మోపరోత్సీః = ఇదే వరము కావలెనని నిర్బంధింపకుము! ఏనం = ఇదేవరముఁ గూర్చి, మా = నన్ను, అతిసృజ = బొత్తుగా విడువుము!

రెండవ వరము నచికేతసుఁడు కోరిన అగ్నివిద్య—ఇంద్రుని స్వర్గముఁదగు సుఖము లభించుటకు సాధనముగ యమునిచే నుపదేశింపఁబడినదను పక్షమున గూడ నీ సంవాదమును సమర్థింపవచ్చును. ఎట్లనఁగా? మానవలోక గతములైన భయ క్షుత్ పిపాసాదులు స్వర్గమున నుండవు గాన అట్టి సుఖభోగము నచికేతసునకు విదితమగుటకై యముఁడు- అగ్నిహవనాది కర్మవిధానమును వివరించినను నచికేతసుఁడు స్వర్గసుఖమునందు విరాగము గలవాడై ముక్తపురుషుని స్వరూపమును గురించి ప్రశ్నించెననియు, అట్టి నచికేతసుని ముముక్షను దృఢపరచుటకై ముక్తస్థితి సులభముగ తెలియునది కాదని యముఁడు పరీక్షించెననియు విదితమైనది.

"దేవై రత్రాపి విచికిత్సితం కిల - త్వం చ మృత్యో యన్న

సువిజ్ఞేయ మాత్థ - వక్తా చాస్య త్వాదృగన్యో న లభ్యో-
నాన్యో వరస్తుల్య ఏతస్య కశ్చిత్" 22

నచికేతసుఁడు-

ప. అత్ర = ముక్తపురుషస్థితి విషయమై, దేవైరపి=అమరుల చేతగూడ, విచికిత్సితం కిల = సంశయింపఁబడినది గదా! మృత్యో = యమధర్మరాజా! త్వం చ = నీవు గూడ, యత్ = ఏ ముక్తస్వరూపము, న సువిజ్ఞేయం = సుఖముగ తెలియనలవిగానిదని ఆత్థ = చెప్పుచున్నావో, అస్య = ఇట్టి ముక్తస్థితిని, త్వాదృక్వక్తా= నీవంటి ఉపదేశకుఁడు, అన్యః = మరియొకఁడు, నలభ్యః=లభింపడు, అందువలన, ఏతస్య = ఈవరమునకు, తుల్యః=సమానమైన, అన్యో వరః = మరియొక వరము, కశ్చిత్ = ఏదియు, న = లేదు, అని పలికెను.

ముక్తపురుషస్థితిని గూర్చి- మానవుల కన్న నధికమైన బుద్ధిబలము గల దేవతలే తేల్చలేదు గాన మృత్యువును కలుగఁజేయు నీవే నిర్ధారించి చెప్పవలెనని నచికేతసుఁడు యముని ప్రార్థించె నని భావము.

"శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ - బహూన్
పశూన్ హస్తిహిరణ్య మశ్వాన్ - భూమే ర్మహదాయతనం
వృణీష్వ - స్వయం చ జీవ శరదో యావ దిచ్ఛసి" 23

నచికేతసుఁడు-వైరాగ్యముతో ముక్తిని గురించి వివరింపుమని ప్రశ్నించినను యముఁడు నచికేతసు నింకను పరీక్షించుచున్నవాడు.

ప. శతాయుషః = నూరేండ్లు బ్రతుకునట్టి, పుత్రపౌత్రాన్ =

కుమారులను, మనుమలను. మరియు బహూన్ పశూన్ = గోవృష భాది అనేక పశువులను, హస్తి హిరణ్యం = ఏనుగలను బంగారమును, అశ్వాన్ = గుఱ్ఱములను, వృణీష్వ = కోరుము! ఇంతియే గాక, భూమేః = భూమిఁ జెందినట్టి, మహత్ = గొప్పదైనట్టి ఆయతనం = స్థానమును, అనఁగా రాజ్యమును, వృణీష్వ = కోరుము! యావత్ శరదః ఇచ్ఛసి = ఎన్ని సంవత్సరములు, భువిని జీవింపఁ గోరుదువో, అన్ని సంవత్సరములు, స్వయం చ జీవ = స్వయముగ జీవించుము!

దీర్ఘాయుష్యమును స్వేచ్ఛామరణమును సుఖజీవనమును గొప్ప పదవిని, అతులితసంపదను ఇచ్చెదనని అపేక్షను కలుగఁజేసి యముఁడు నచికేతసుని-ప్రకృతి భోగములవైపు మరల్ప యత్నించెనని ఇందు తేటపడినది.

"ఏతత్తుల్యం యది మన్యసే వరం-వృణీష్వ విత్తం
చిరజీవికాం చ, మహాభూమౌ నచికేత స్త్వమేధి-కామానాం
త్వా కామభాజం కరోమి" 24

ప. నచికేతః = నచికేతసా! ఏతత్తుల్యం = ముక్తస్వరూప పరిజ్ఞానముఁ గూర్చిన వరముతో సమానమగుదానిగ; వరం = మరియొక వరమును, మన్యసే యది = భావింతువేని, విత్తం = సువర్ణాది ధనమును, చిరజీవికాంచ = చిరంజీవిత్వమును, వృణీష్వ = కోరుము! ఇంతియే గాక మహాభూమౌ = విశాలమైన భూప్రదేశమునందు, త్వం = నీవు, ఏధి = నచికేతసుఁడను పేరుతో, రాజవ్యచూడామణివై వెంపొందుము! త్వా = నిన్ను, కామానాం = దివ్యాంగనాసాహచర్యము మొదలగు మహాభోగ్యములను, కామభాజం = తృప్తిగ ననుభవించువానిగా, కరోమి = చేయగలను.

నచికేతసుఁడా! ముక్త స్వరూపమును తెలిసికొనుటతో ప్రయోజనము లేదు. సార్వభౌముఁడవై భువిని దివ్యసుఖముల ననుభవించు చిరంజీవివై కాంతాకనకసమృద్ధితో ప్రసిద్ధుఁడవు కమ్మని యముఁడు నచికేతసుని మరియొకసారి పరీక్షించెనని భావము

"యే యే కామా దుర్లభా మర్త్యలోకే - సర్వాన్ కామాగ్ం శ్ఛందతః ప్రార్థయస్వ, ఇమా రామాః సరథాః సతూర్యా-నహీదృశా లంభనీయా మనుష్యైః । అభి ర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ - నచికేతో మరణం మాఽనుప్రాక్షీః" 25

ప. నచికేతః=నచికేతసా! యే యే కామాః=ఏ యే కోరికలు మర్త్యలోకే= మానవలోకమున, దుర్లభాః = పొందసలవిగానివో, సర్వాన్ కామాన్ = అట్టి కోరికల నన్నిటిని, ఛందతః = ఇష్టప్రకారము, ప్రార్థయస్వ = విశేషించి కోరుము! ఇమాః= ఈ, రామాః = పురుషుని రమింపఁజేయు అమరనారీమణులు, సరథాః = రథాశ్వగజములతోడను, సతూర్యాః = దివ్యమంగళవాద్యముల తోడను నీకొరకు సిద్ధములుగా నున్నవి.

ఈదృశాః=ఇట్టి దివ్యభోగములు, మనుష్యైః = మానవులచేత, నలంభనీయాః = పొందఁదగినవి కావు, మత్ = నాచేత, ప్రత్తాభిః = ఈయఁబడినట్టి, అభిః = ఈ దివ్యాంగనలు మున్నగు పరిచారికలతో, పరిచారయస్వ = సేవింపఁజేసికొనుము! కాని మరణం = మోక్షమును గురించి, మాఽనుప్రాక్షీః = ప్రశ్నింపకుము।

స్వర్గమున అనుభవింపఁదగు భోగములను భూలోకమున నొసఁగెదనని- యముడు నచికేతసుని వైరాగ్యము దృఢపడుటకు నీ వాక్యమునందును పరీక్షించె నని విదితమైనది.

"శ్వోఒభావా మర్త్యస్య యదంతకైతత్సర్వేంద్రియాణాం జరయంతి తేజః - అపి సర్వం జీవిత మల్పమేవ, తవైవ వాహా స్తవ నృత్యగీతే' 26

నచికేతసుఁడు దిగువవిధము వక్కాణించెను.

ప. అంతక = యమధర్మరాజా! మర్త్యస్య = మానవుని భోగములు, శ్వోఒభావాః = మరునాడు ఉండునవి కావు, (అనిత్యములని భావము) యదేతత్ = ఏ నీచే ఈయఁబడు దివ్యభోగములైతేనో, సర్వేంద్రియాణాం = ఇంద్రియములన్నిటియొక్క, తేజః = బలమును, జరయంతి = క్షీణింపఁజేయును వి, జీవితం సర్వమపి = జీవితమంతయు, అల్పమేవ = కొద్దికాలముండునదియేను, వాహాః = గజాశ్వరథాదులు, తవైవ = నీకే నుండుగాక! నృత్యగీతే = నాట్య సంగీతములును, తవ = నిన్నే చెందియుండుగాక!

భా. యముఁడు స్త్రీ గజాశ్వసువర్ణగీర్ఘాయురారోగ్యాదిసంపద ననుగ్రహింతునని నచికేతుని ప్రాకృతభోగాపేక్షను పరీక్షింపగా- నచికేతుఁడు నిండు వైరాగ్యము గలవాడగుటఁజేసి- భోగము అన్నియు శాశ్వతములు కావని ఇందు నిరూపించెను.

"న విత్తేన తర్పణీయో మనుష్యో - లప్స్యామహే విత్త మద్రాక్ష్మ చేత్త్వా-జీవిష్యామో యావదీశిష్యసి త్వం - వరస్తు మే వరణీయః స ఏవ'' 27

ప. మనుష్యః = మానవుఁడు, విత్తేన = సువర్ణాదిధనముతో, తర్పణీయః = తృప్తిఁజెందింపఁదగినవాడు, స = కాడు, త్వా = నిన్ను, అద్రాక్ష్మచేత్ = దర్శించినంతమాత్రమున విత్తం = సర్వవిధ సంపదను, లప్స్యామహే = పొందగలుగుదుము. మరియు త్వం

= నీవు, యావత్ = ఎంతకాలము, ఈశిష్యసి = ప్రాణికోటిని శాసించుచుందువో, (తావత్ = అంతకాలమువరకు,) జీవిష్యామః = బ్రతుకగలము. అందువలన స ఏవ వరః = ముక్తస్వరూప ప్రబోధముఁగూర్చిన వరమే. మే = నాకు, వరణీయః = కావలసినది.

భా. ముముక్షువైన మానవునకు గజాశ్వసువర్ణాదిసంపద నిచ్చినను తృప్తి కలుగదనియు, యముని మానవుఁడు జీవితమున దర్శించినంతమాత్రమున సంపన్నుఁడు చిరంజీవి యగునని నచికేతుఁడు భావించి-మరణానంతరము ముక్తుఁడను కావలెనని ఆశించి అట్టి వరమే కావలెనని ప్రార్థించెను.

"అజీర్యతా మమృతానా ముపేత్య - జీర్యన్మర్త్యః
క్వధఃస్థః ప్రజానన్ । అభిధ్యాయన్ వర్ణరతిప్రమోదా
నతిదీర్ఘే జీవితే కో రమేత? 28

ప. జీర్యన్ = జరామరణధర్మము గల, మర్త్యః = నావంటి మానవుఁడు, క్వధఃస్థ, = కుత్సితము క్రిందిదియు నగు భూలోకమున నుండువాడై, ప్రజానన్ = తన జీవితము జరామరణాది దుఃఖభూయిష్ఠమని గుర్తించిన వాడునై, అజీర్యతాం = జరామరణాదులు లేనట్టి, అమృతానాం = ముక్తపురుషులయొక్క స్వరూపస్థితులను, ఉపేత్య = నీవంటివారివలన కనుగొని, వర్ణ = సూర్యాదిరూపములను, రతిప్రమోదాన్ = బ్రహ్మదేవుని అనందము ననుభవించుట మున్నగు సుఖవిశేషములను, అభిధ్యాయన్ = చింతించువాడై, అతిదీర్ఘే = చిరకాలస్థాయి యగు, జీవితే = జీవించుట యందు, కో రమేత? = ఎవఁడు ఆసక్తి కలవాడగును?

చిరంజీవిత్వంబు శాశ్వతము కాదని నచికేతసుఁడు భావించి

పునరావృత్తి లేనట్టి శాశ్వతశివసాయుజ్యమే కావలెనని అపేక్షించి-ముక్తస్థితిఁగూర్చియే యముని ప్రశ్నించెనని సారాంశము.

"యస్మి న్నిదం విచికిత్సంతి మృత్యో - యత్సాంపరాయే మహతి బ్రూహి న స్తత్ । యోఽయం వరో గూఢ మను ప్రవిష్టో-నాన్యం తస్మాన్నచికేతా వృణీతే" 29

ప. మృత్యో = మృత్యుదేవా! యస్మిన్ = ఏ ముక్తపురుషుని విషయమై, ఇదం = ఉన్నాడు లేడు అను నీ యంశమును గురించి, విచికిత్సంతి = అమరులు గూడ సంశయించుచున్నారో, మహతి = సర్వోత్తరమగు, సాంపరాయే = పరశివలోకప్రాప్తి విషయమై ఎద్ది తెలిసికొనఁదగినదో, తత్ = ఆ యంశమును, నః = మాకు, బ్రూహి = చెప్పుము! గూఢం = రహస్యభావమును, అనుప్రవిష్టః = పొందినట్టి, యోఽయం = ఏ యీ, వరః = నేనడిగిన వరమో, తస్మాత్ = అట్టి వరమున కంటె, అన్యం = మరియొక వరమును, నచికేతాః = నచికేతసుఁడు, న వృణీతే = కోరఁడు.

స్వర్గాదిభోగములు గూడ శాశ్వతములు కావని గుర్తించి-బ్రహ్మాండోపరి దివ్యాంతరిక్షమున నిత్యప్రకాశముతో రాణించు పరమపదముఁ జేరునట్టి ముక్తపురుషుని లక్షణముఁదగు పరిజ్ఞానము కలుగఁజేయుటయే మూడవ వరమనియు, మరియొక వరము వలదనియు నచికేదసుఁడు-తన పేరుతో యముని ప్రార్థించెను.

ఇయ్యది
శ్రీ నీలకంఠశివాచార్యప్రణీతభాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రికృత సంస్కృతవ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కఠోపనిషద్గత-ప్రథమవల్లి-సమాప్తము.

శ్రీ మహా గణాధిపతయే నమః

# కఠోపనిషత్తు-ద్వితీయవల్లి

"అన్యచ్ఛ్రేయోఽన్యదుతైవ ప్రేయ-స్తే ఉభే నానార్థే పురుష గ్ం సినీతః। తయోః శ్రేయ ఆదదానస్య సాధు-భవతి హీయతేఽర్థాద్య ఉ ప్రేయో వృణీతే" 1

నచికేతుని ముముక్షుత్వమును పరీక్షించి యముఁడు మొదట మోక్షమును ప్రశంసించుచున్నవాఁడు

ప. శ్రేయః = శ్రేయస్సు. అన్యత్ = వేరైనది. ప్రేయః = ప్రేయస్సు, అన్యత్ = వేరైనది. అనఁగా శ్రేయస్సు ప్రేయస్సుగాదు, ప్రేయస్సు శ్రేయస్సు గాదని భావము. ఉతైవ = మరియు, నానార్థే = భిన్నప్రయోజనము గల, తే ఉభే = ఆ రెండు, పురుషం = పురుషుని, సినీతః = తమ వశునిఁ జేసికొనునట్టివి.

తయోః = ఆ శ్రేయఃప్రేయస్సులలో, శ్రేయః = శ్రేయోవిధానమును, ఆదదానస్య = అవలంబించువానికి, సాధు = భద్రము, భవతి = అగుచున్నది, యః = ఎవఁడైతే, ప్రేయః = ప్రేయోవిధానమును, వృణీతే = అపేక్షించునో, (సః = అట్టివాఁడు) అర్థాత్ = పరమ పురుషార్థమునుండి, హీయతే = భ్రష్టుఁడగును.

కేవలము ప్రేయోవిధాన (కర్మయోగ)ము నవలంబింపక నీశ్వ ారర్పణబుద్ధితో సంధ్యావందనాది నిత్యనైమిత్తికకర్మల నాచరించుచు చిత్తశుద్ధిఁబడసియు శివపూజనధ్యానాది శ్రేయోవిధానము ననుష్ఠించు

వానికి- పరమపురుషార్థమనదగు మోక్షము ఆత్మోన్నత్యముతో చేకూరునని భావము

"శ్రేయశ్చ ప్రేయశ్చ మనుష్యమేత-స్తౌ సంపరీత్యవివినక్తి ధీరః॥ శ్రేయో హి ధీరోఽభిప్రేయసో వృణీతే-ప్రేయో మందో యోగక్షేమాద్వృణీతే" 2

ప. శ్రేయశ్చ= మోక్షవిధానము, ప్రేయశ్చ= కర్మవిధానంబు. మనుష్యం = మానవుని, ఏతః = అభిముఖములుగ పొందునట్టివి, ధీరః = బుద్ధిమంతుడు, తౌ = ఆ రెంటిని, (రాజహంస-నీరక్షీరములను వలె) సంపరీత్య=బాగుగా పరిశీలించి, వివినక్తి= విభజించును.

ధీరో హి=బుద్ధిమంతుడైతేనో, ప్రేయసోఽభి = ప్రేయస్సును మించిన దానిగా, శ్రేయః = శ్రేయస్సును, వృణీతే = అపేక్షించి ఆచరించును. మందస్తు = అల్పబుద్ధిగలవాడైతే = యోగక్షేమాత్ = యోగక్షేమముల కారణముగా, ప్రేయః = ప్రియమైన భోగ్యజాతమును, వృణీతే = కర్మనాచరించుచు అపేక్షించును.

తన బుద్ధిని శివజ్ఞానము ననుష్ఠించుటకు స్థిరపరచినవాడై ఇంద్రియభోగములకై దేవమానవశరీరములు తటస్థించినను శరీరేంద్రియాదులపై మమకారమును తగ్గించుకొని శాంభవదీక్షితుడై ముక్తుడు కావలెనని సారాంశము.

"స త్వం ప్రియాన్ ప్రియరూపాగ్ంశ్చ కామా-న్నభిధ్యాయన్నచికేతోఽత్యస్రాక్షీః-నైతగ్ం సృంకాం విత్తమయీ మవాప్తో-యస్యాం మజ్జంతి బహవో మనుష్యాః" 3

ప. నచికేతః = నచికేతసా! సః = శ్రేయః ప్రేయస్సులలో

నేదేని కోరు నవకాశము గలయట్టి, త్వం = నీవు, ప్రియాన్ = సహజ ముగ ప్రియములగు పుత్రాదులను, ప్రియరూపాన్ = మనస్సునకు ఇంపైన రూపము గల, కామాన్ = అమరాంగనాసుఖభోగాది కామ్యము లను, అభిధ్యాయన్ = దుఃఖభూయిష్ఠములుగ భావించినవాడవై, అత్యస్రాక్షీః = విడనాడితివి, మరియు ఏతాం = ఈ, విత్తమయీం = ధనపూర్ణంబగు, సృంకాం = తుచ్ఛమైన గతిని, నావాప్తః = పొందని వాడవైతివి, యస్యాం = ఏ తుచ్ఛమైన సుఖానుభూతియందు, బహవో మనుష్యాః = అనేకమానవులు, నిమజ్జంతి = జలప్రవాహమునందు మునిగినట్లు ఆసక్తులగుచున్నారో.

"దూర మేతే విపరీతే విషూచీ-అవిద్యా యా చ విద్యేతి జ్ఞాతా । విద్యాఽభీప్సినం నచికేతసం మన్యే - న త్వా కామా బహవోఽలోలుపంత" 4

ప. యాచ = ఏది, విద్యేతి = విద్యయనియు, యాచ = ఏది, అవిద్యేతి = అవిద్యయనియు, జ్ఞాతా = పండితులచే తెలియఁబడినవో, ఏతే = అట్టి యీ విద్యావిద్యలు, దూరం = మిక్కిలి, విషూచీ = వేరు వేరు గమనము గలవై, విపరీతే = ఒకదానికి మరియొకటి విరుద్ధమైనవి. ఇతే నచికేతసం = నచికేతసుఁడను నిన్ను, విద్యాభీప్సినం = నిష్కామ కర్మసముచ్చితమైన శివోపాసనమను విద్య నపేక్షించువానిగ, మన్యే = భావించుచున్నాను. కుతః = ఎందుకనఁగా? కామాః = స్వర్గ సుఖాది వాంఛలు, బహవోఽపి = అనేకవిధములైనను, త్వా = నిన్ను న అలోలుపంత = ఆకర్షింపలేదు.

కేవల కర్మగాని, కేవల జ్ఞానముగాని మానవుని తరింపఁజేయఁ జాలవు, నిష్కామనిత్యనైమిత్తికకర్మతో శివు నుపాసించుట యను జ్ఞానమార్గము నవలంబించి తరించవలెనని సారాంశము.

"అవిద్యాయా మంతరే వర్తమానాః - స్వయం ధీరాః
పండితంమన్యమానాః । దంద్రహ్యమాణాః పరియంతి
మూఢా-అంధేనైవ నీయమానా యథాౘఽంధాః" 5

ప. పుత్ర పశు అన్నాది భోగముల స్వరూపము గల యట్టి అవిద్యాయాం = అ(ల్ప) జ్ఞానమునందు, అంతరే = నడుమ, వర్తమానాః = ఉండునట్టి, స్వయంధీరాః = తమంతటతాము ప్రజ్ఞాశాలుర మని బావించునట్టి. పండితంమన్యమానాః = మేమే వేదశాస్త్ర పండితు మనీ విఱ్ఱవీగునట్టి, మూఢాః = తెలివితక్కువవారు, అంధేనైవ = గ్రుడ్డివానిచే, నీయమానాః = గొంపోవఁబడు, అంధా యథా = గ్రుడ్డి వారివలె, దంద్రహ్యమానాః = కుటిలగతిఁజెందినవారై, పరియంతి = సంసారచక్రమున జననమరణాదులతో పరిభ్రమించుచుందురు.

కామ్యములైన శాస్త్రీయకర్మల యందాసక్తులై స్వర్గసుఖాదుల ననుభవించినను మానవజన్మలు అనివార్యములగుటచే నవ్వానియందు పుణ్యములను పాపములఁజేయుచు-అనుభవమునకై మరల మరల పుట్టుచు గిట్టుచు ఎల్లకాలము సంసారబద్ధులగుదురు గాన నిష్కామ కర్మసహితమగు శివోపాసనచే జన్మరాహిత్యము ఒనగూరుటయే గాక శాశ్వత శివానందప్రాప్తి చేకూరునని వివేకము.

"న సాంపరాయః ప్రతిభాతి బాలం-ప్రమాద్యంతం విత్త
మోహేన మూఢమ్। అయం లోకో నాస్తి పర ఇతి
మానీ–పునః పున ర్వశ మాపద్యతే మే" 6

ప. ప్రమాద్యంతం = పుత్ర పశు అన్నాదులయందు అత్యాసక్తితో శాస్త్రీయమార్గమునుండి జారిపడునట్టి, విత్తమోహేన = ధన కనక వస్తువాహనాదుల యందలి అనురాగముతో, మూఢం = తెలివిఁదప్పి

నట్టి,బాలంప్రతి=వివేకహీనుఁగూర్చి, సాంపరాయః=పరమపదప్రాప్తి సాధనమగు శాస్త్రీయమైన శివోపాసనామార్గము, నభాతి=ప్రకాశింపదు. అనఁగా అవగతము కాదని భావము.

అయం లోకః= ఈ భూలోకము మాత్రము కలదనియు, పరః = పైలోకము నాస్తీతి= లేదనియు, మానీ= భావించువాడు, పునః పునః= మరల మరల, మే=నాయొక్క, వశం= అధీనత్వమును, ఆపద్యతే= పొందును.

దారాపుత్రాది మమకారముతో పరమార్థమును సాధింపనివాడు-జనన మరణములను పొందుచు యమయాతనల ననుభవించుచుండు నని భావము.

"శ్రవణాయాపి బహుభి ర్యో న లభ్యః-శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః। ఆశ్చర్యో వక్తా కుశలోఽస్య లబ్ధా-ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" 7

ప. యః= ఏ పరమాత్మ, శ్రవణాయాపి= వినుటకు గూడ బహుభిః= అనేకులచేత. నలభ్యః=పొందనలవిఁగానివాడో, శృణ్వంతోఽపి= వినువారుగూడ, బహవః= పెక్కురు, యం= ఏ పరమాత్మను. న విద్యుః=తెలిసికొనఁజాలరో, అస్య=ఇట్టి పరమాత్మను గురించి, కుశలో వక్తా= సమర్థుఁడైన వక్త, ఆశ్చర్యః= అరుదుగ నుండువాడు, కుశలానుశిష్టః=సమర్థుఁడగు ఆచార్యునిచే ఉపదేశింపఁబడినట్టి, జ్ఞాతా=పరమాత్మను తెలియువాడు, ఆశ్చర్యః=ఒకానొకఁడుగ నుండును. లబ్ధా= పరమాత్మను పొందువాడును, ఆశ్చర్యః= ప్రాకృ జనులకు అచ్చెరువుగ నుండును.

పరమేశ్వరుని గురించి వివరించి చెప్పువారును, భక్తిశ్రద్ధలతో వినువారును, గురూపదిష్టులును ఆజన్మాంతము శివు నుపాసించియే

చిత్తశుద్ధి గలవారై శివోఽహం భావనతో శివుని ధ్యానించి-ప్రారబ్ధ శరీర త్యాగానంతరము పరంజ్యోతిని దర్శించి ముక్తులగుదురని ఇందు విదితమైనది.

"న నరేణావరేణ ప్రోక్త ఏష-సువిజ్ఞేయో బహుధా చింత్యమానః। అనన్యప్రోక్తే గతి రత్ర నా స్త్యణీయాన్-హ్యతర్క్య మణుప్రమాణాత్" 8

ప. ఏషః = ఈ పరమాత్మ, అవరేణ = అభిజ్ఞుఁడు కానట్టి, నరేణ = మానవునిచే, ప్రోక్తః = ఉపదేశింపఁబడినను, బహుధా = ఊహాపోహలతో అనేకవిధములు, చింత్యమానోఽపి = చింతింపఁబడినను, న సువిజ్ఞేయః = సుఖముగ తెలియువాడు కాడు. అనన్యప్రోక్తే = సమర్థుఁడైన ఆచార్యునిచే బోధింపఁబడనట్టి, అత్ర = ఈ పరమాత్మ విషయమై- గతిః = తెలిసికొను నవకాశము గూడ, నాస్తి = ఉండదు; ఎందుకనఁగా ? అణుప్రమాణాత్ = సూక్ష్మమగు పరమాణువుకన్న, అణీయాన్ = అతిసూక్ష్మమైనదీ పరమాత్మతత్త్వము; ఇందువలన నిది అతర్క్యం = ఊహింపనలవిఁగానిది,

శివారాధనము లేని పండితులు అవరులనఁబడుదురు- ఇట్టివారు బోధించినను శివజ్ఞానము సంభవింపదు. సమర్థులు బోధించినను అనాది పాపవాసనలు గలవారికి అవగతము కాదు. ఒకవేళ తానే ఊహతో పరమేశ్వరుని గుర్తింపగలనని పెక్కుభంగిముల నాలోచించినను శివజ్ఞానము కలుగదు గాన శివయోగివర్యుఁడైన కల్యాణదేశికు నాశ్రయించి శాంభవదీక్షితుఁడై శివు నారాధించుచు ధ్యానించినచో పాప పుంజములను విదలించుకొని శివసాక్షాత్కారము నంత్యకాలమునఁ బడయునని సారాంశము.

"నైషా తర్కేణ మతి రాపనేయా- ప్రోక్తాఽన్యేనైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ। యాం త్వమాపః సత్యధృతి ర్బతాసి-త్వాదృఙ్ నో భూయాన్నచికేతః ప్రష్టా" 9

ప. ఏషా మతిః = పరమాత్మను గురించి కలిగిన ఈ బుద్ధి, తర్కేణ = ఊహచేత, నాపనేయా = పొందింపఁదగినది కాదు- యాం = ఏ బుద్ధిని, త్వం = నీవు, ఆపః = పొందితివో, హే ప్రేష్ఠ ? మిక్కిలి ప్రియమైనవాడా! ఈ బుద్ధియు, అన్యేన = గురువుచేత, ప్రోక్తా ఏవ = చెప్పఁబడినదే, సుజ్ఞానాయ = పరిపూర్ణ శివజ్ఞానమునకై ఉపయోగించును. నచికేతః = నచికేతసా! సత్యధృతిః = స్వర్గసుఖ భోగాదుల నపేక్షింపక మోక్షమునకై యథార్థమగు ధైర్యము గల వాడవు, అసి = ఐతివి, బత = సంతోషము, త్వాదృక్ = నీయటువంటి, ప్రష్టా = పరమార్థమును గురించి ప్రశ్నించువాడు, నః = మాకు, భూయాత్ = ఇక ముందు నుండుగాక!

వివేకము వైరాగ్యము ముముక్షుత్వము సంశయరాహిత్యము మొదలగు సద్గుణములు నచికేతసునకు గలవని యముఁడు ప్రశంసించి- ప్రసన్న చిత్తుఁడై నచికేతసుని పరమార్థజిజ్ఞాసకు అనుగుణమైన ప్రబోధము నొసర్చుచున్నవాడని విదితమైనది.

"జానామ్యహం శేవధి రిత్యనిత్యం - న హ్యధ్రువైః ప్రాప్య తే హి ధ్రువం తత్। తతో మయా నాచికేత శ్చితోఽగ్ని-రనిత్యై ర్ద్రవ్యైః ప్రాప్తవానస్మి నిత్యమ్"

ప. శేవధిః = సువర్ణనిధివంటి కర్మఫలము, అనిత్యమితి = శాశ్వతము కాదని, అహంజానామి = నేను గుర్తెరిగియున్నాను. హి = ఎందువలన ననఁగా ? అధ్రువైః = అనిత్యములైన ఇంద్రాది పద

వులతో, ధ్రువం=నిత్యమగు, తత్=పరశివ స్వరూపము, నప్రాప్యతే = పొందఁబడదు. తతః = అందువలన, మయా=నాచేత, నాచికేతః = నచికేతసుని పేరు గల, అగ్నిః = అగ్నిహోత్రము, చితః = వేల్పఁబడినది అనిత్యైః=శాశ్వతములు కానట్టి, ద్రవ్యైః=ఇటికెలు మున్నగు వస్తువులతో, నిత్యం = శాశ్వతమైన శివజ్ఞానమును, ప్రాప్తవానస్మి = పొందిన వాడనైతిని.

యముఁడు ప్రసన్నుఁడై-కామ్యకర్మఫలభోగము శాశ్వతము కాదని గుర్తించి ఇటికెలు సమిధలు ఘృతము ధాన్యము ఇత్యాది అనిత్య వస్తువులచే ఆహుతుల నగ్నియందు నిష్కామ్యముగశివార్పణ బుద్ధితో సమర్పించి చిత్తశుద్ధిద్వారా శివధ్యాననిష్ఠ యనఁదగు జ్ఞానము నల వఱచుకొంటినని – నచికేతసునకు తన యోగ్యతను వివరించెనని భావము.

"కామస్యాప్తిం జగతః ప్రతిష్ఠాం-క్రతో రానంత్య మభ
యస్య పారమ్ । స్తోమం మహ మరుగాయం ప్రతిష్ఠాం-
దృష్ట్వా ధృత్యా ధీరో నచికేతోఽత్యస్రాక్షీః" 11

ప నచికేతః = నచికేతసా! ధీరః = స్థితప్రజ్ఞుఁడవై, క్రతోః = యాగాది కామ్యకర్మకు, ప్రతిష్ఠాం=ఫలరూపముగ ఆధారమైనట్టి, జగతః = బ్రహ్మాది చరాచరముఁజెందిన, కామస్య = కోరికల చేరిక యొక్క, ఆప్తిం = పొందుటను, క్రతోః = నిష్కామకర్మానుష్ఠాన పూర్వకముగ శివునుపాసించుటఁగురించి, అనంత్యం=అవధిలేకుండు టను, అభయస్య=క్షుత్పిపాసాజరామరణాది భయములేకుండుటకు, పారం = ఆశ్రయమగుటను, స్తోమం = అపహతపాప్మత్వాది నిజగుణసముదాయ ఆవిర్భావమును, మహత్ = సర్వాతిశయమైన, ఉరుగాయం = లోకవేదములందు గొప్ప కీర్తి గలయట్టి, ప్రతిష్ఠాం = పునరావృత్తిరహిత శాశ్వతస్థితిని, దృష్ట్వా=పరిశీలించి, ధృత్యా

= ధైర్యముతో, అత్యస్రాక్షీః = జగద్గతకామ్యముల నన్నిటిని విస ర్జించితివి.

నేను నీకు ప్రాకృత దివ్యసుఖభోగములను కలుగఁజేయుదునని చెప్పినను నీవు నిష్కామకర్మననుష్ఠించి చిత్తశుద్ధిని సంపాదించుకొని శివధ్యానముతో సంభవించు శాశ్వత ముక్తస్థితినే ఆశించితివి గాన ధన్యుఁడవని యముఁడు నచికేతసుని ప్రశంసించుచు తన ప్రసన్నతను చాటెనని ఇందు విదితమైనది.

"తం దుర్దర్శం గూఢ మనుప్రవిష్టం-గుహాహితం గహ్వ
రేష్ఠం పురాణం। అధ్యాత్మయోగాధిగమేన దేవం-మత్వా
ధీరో హర్షశోకౌ జహాతి" 12

ప- ధీరః = నిశ్చితబుద్ధిమంతుఁడు. దుర్దర్శం = సుఖముగ చూడనలవిగానట్టి, గూఢం = మాయయవనిక (తెఱ) యందు దాగినట్టి, గుహాహితం = హృదయగుహయందు కర్మవశమున పడవేయఁబడినట్టి జీవాత్మను, అనుప్రవిష్టం = అనుసరించి ప్రవేశించినట్టి, గహ్వరేష్ఠం = బద్ధజీవులకు ప్రవేశింపనలవిగాని దివ్యనుహాకైలాసమున నివసించు, పురాణం = జగత్కారణముగ ప్రాచీనుఁడైన, తం = వేద ప్రసిద్ధుఁడగు దేవం = పరమాత్మను, అధ్యాత్మయోగాధిగమేన = బాహ్యమునుండి మనస్సును మఱల్చి ఆత్మయందు మనస్సును నెలకొలుపుట-అధ్యాత్మయోగమనఁబడును. అట్టి యోగము నభ్యసించుటచే కలుగు విజ్ఞానమున. మత్వా = ఉపాసించి, హర్షశోకౌ = సుఖదుఃఖములను, జహాతి = విడుచును.

శాశ్వత శివసాయుజ్యము-మొదట ఇంద్రియ నిగ్రహముతో మనస్సును నిజరూపజ్ఞానమునకై ఉపయోగించి-ఆత్మదర్శనము

ద్వారా పరమాత్మను హృదయమున భావించినచో-సమకూరునని ఇందు విదితమైనది.

"ఏతచ్ఛ్రుత్వా సంపరిగృహ్య మర్త్యః-ప్రవృహ్య ధర్మ్య మణుమేత మాప్య। స మోదతే మోదనీయం హి లబ్ధ్వా-వివృతం సద్మ నచికేతసం మన్యే" 13

ప. మర్త్యః = మానవాది ఉత్తమాధికారి, ఏతత్ = ఈ అంతర్యామియగు పరమేశ్వరుని స్వరూపమహిమాదికమును, శ్రుత్వా = సద్గురువువలన విని, సంపరిగృహ్య = మనస్సున బాగుగా విచారించి. ధర్మ్యం = ధర్మసాధనమగు శరీరమును, ప్రవృహ్య = వేరుచేసి (పరిత్యజించి,) ఏత మణు మాప్య = ఈ సూక్ష్మతమమగు పరమాత్మ నాశ్రయించియు, సః = అట్టి శివోపాసకుఁడు, మోదనీయం = అపహతపాప్మత్వాది నిజ స్వరూపమును, లబ్ధ్వా = పొంది, మోదతే = ఆనందించును. నచికేతసం = నచికేతసుఁగూర్చి, సద్మ = పరశివలోకము, వివృతం = తెఱువఁబడిన ద్వారము గలదని, మన్యే = భావించుచున్నాను.

వేదశాస్త్రములవలన పరమాత్మనుగురించి ఆపాతతః జ్ఞానము కలిగినను సంశయనివృత్తికై సద్గురువు నాశ్రయింపవలెననియు, గురూపదిష్టమును ఆచరణలో పెట్టినవాడై శరీర వియోగము వరకు శివు నుపాసించినచో మరణానంతరము పరమేశ్వరుని సంపూర్ణదర్శనమున నిజరూపమును పొంది శివసాయుజ్యముతో బ్రహ్మానందము ననుభవించుననియు వివేకము.

ఆత్మ-పరమాత్మలో లీనమగు ననుటయు, లింగశరీరభంగమే మోక్ష మనుటయు, నిరాధారములని ఇందు తేటపడినది.

"అన్యత్ర ధర్మాదన్యత్రాధర్మాదన్యత్రాస్మాత్కృతాకృతాత్।
అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ-యత్తత్పశ్యసి తద్వద ॥ 14

ప. ధర్మాత్ = పుణ్యమునకంటె, అన్యత్ = వేరైనది, అధర్మాత్ = పాపమునకంటెను, అన్యత్ర = భిన్నమైనదియు, అస్మాత్ = ఈ, కృతాకృతాత్ = కార్యకారణములకంటెను. అన్యత్ర = విలక్షణమైనదియు, భూతాచ్చ = ఐనదానికంటెను, భవ్యాచ్చ = కానున్నదానికంటెను, అన్యత్ర = మరియొకటి; యత్ = ఏ సాధనమును, పశ్యసి = భావనతో ఆచరించుచున్నావో, తత్ = అట్టి పరమసాధనమును వద = వివరించి చెప్పుము!

పుణ్యము శుభమును పాపము అశుభమును కలుగఁజేయుననుట ప్రసిద్ధము గదా! భూతభవిష్యత్తులు-ప్రపంచమునకు చెందినవగును. వీని నన్నిటిని మించినట్టి శివోపాసన సాధనమును ఈవరకన్న విశదముగా బోధింపుము! అని నచికేతసుఁడు యముని మరల ప్రశ్నించుటచే నచికేతసుని మోక్షేచ్ఛ ప్రబలము నిష్కళంబు నని ఇఁట విదితమైనది.

"సర్వే వేదా యత్పద మామనంతి-తపాంసి సర్వాణి చ యద్వదంతి। యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి-తత్తే పదం సంగ్రహేణ బ్రవీమ్యోమిత్యేతత్" 15

ప సర్వే వేదాః = ఋగ్యజుఃసామాదర్వణవేదములు, యత్ = ఏ, పదం = పరమాత్మ స్వరూపమును ఆమనంతి = ఇంద్ర చంద్రాది ద్వారా, సాక్షాత్తుగాను కీర్తించుచున్నవో, సర్వాణి తపాంసి చ = వేదాంతము (ఉపనిషత్తు)లన్నియు, యత్ = ఏ బ్రహ్మమును, వదంతి = ప్రతిపాదించుచున్నవో, యత్ = ఏ పరమాత్మ సంపదను, ఇచ్ఛంతః = కోరువారై, బ్రహ్మచర్యం = గురుకులవాసము స్త్రీసంబంధత్యాగము మొదలగు బ్రహ్మచర్యమును, చరంతి = ఆచరించుచున్నారో, తత్పదం = అట్టి పరమాత్మ

స్వరూపమును, సంగ్రహేణ = బాగుగా తనలో నిమిడ్చుకొను శబ్ద ముతో, బ్రవీమి = నిరూపించి చెప్పెదను. ఏతత్ = ఇది, ఓమితి= ఓమనునది యగును.

వేదవేదాంత ప్రతిపాద్యమగు పరశివతత్త్వము నవగతముఁజేసి కొనుటకై శివయోగిచెంత శాంభవదీక్షఁబరిగ్రహించి స్థూలపంచాక్షరికి సూక్ష్మ పంచాక్షరి యనఁదగు ప్రణవము మూలమని గుర్తించియు ప్రణవసహితశివపంచాక్షరీ మహామంత్రమును జపించుచు ఇష్ట ప్రాణ భావలింగముల నారాధింపవలెనని సారాంశము.

"ఏదద్ధ్యేవాక్షరం బ్రహ్మ-ఏతద్ధ్యేవాక్షరం పరమ్ ।
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వా-యో యదిచ్ఛతి తస్య తత్" 16

ప. ఏతదక్షరమేవ = ఈ ప్రణవాక్షరమే, బ్రహ్మ = జపాదిక ముచే అభీష్టముల నిచ్చునదగుటఁజేసి-బ్రహ్మముగ ప్రశంసింపఁబడు నది. ఏతదక్షరమేవ = ఈ ఓంకారాక్షరమే, పరం = జపింపఁదగిన మహామంత్రములలో శ్రేష్ఠమైనది. ఏతదక్షరమేవ = ఈ ప్రణవాక్షర మునే, జ్ఞాత్వా = ఉపాసించి (అనుష్ఠించి) యః = ఎవఁడు, యత్ = దేనిని, ఇచ్ఛతి = కోరునో, తత్ = అదియంతయు సిద్ధించును.

"ఏతదాలంబనం శ్రేష్ఠ-మేతదాలంబనం పరమ్ ।
ఏతదాలంబనం జ్ఞాత్వా-బ్రహ్మలోకే మహీయతే" 17

ప. ఏతత్ = ఈ అక్షరమే, ఆలంబనం=ధ్యానాధారముగ శ్రేష్ఠం = ముఖ్యమైనది. కావుననే ఏతదాలంబనం = ఈ ప్రణవమే ఆధార ముగా గల శివోపాసనము, పరం = సమస్తమహామంత్రానుష్ఠానము లలో మిన్నయైనది.

ఏతత్ = ఈ ప్రణవాక్షరముతో కూడిన శివపంచాక్షరీమహా

మంత్రమునే, ఆలంబనం = శివధ్యానమునకు నతిముఖ్యసాధనముగ, జ్ఞాత్వా = భావించి జపించినచో, బ్రహ్మలోకే = శివలోకమునందు, మహీయతే = శివసముద్రై చిరకాలము నివసించును

అకార ఉకార మకార బిందు నాదములతో సూక్ష్మ పంచాక్షరి యనఁదగు ప్రణవమునకు-స్థూలపంచాక్షరియనఁదగు శివమంత్రమునకు ఇతర మంత్రములకన్న నధికసమీపసంబంధముండుటఁజేసి-నాలుగు ఆశ్రమముల వారికి ప్రణవ సహిత శివషడక్షరీ మహామంత్రజపమే. శివోపాసనకు ముఖ్యమైనదని సారాంశము.

> ''న జాయతే మ్రియతే వా విపశ్చి-న్నాయం కుతశ్చిన్న బభూవ కశ్చిత్। అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో. న హన్యతే హన్యమానే శరీరే" 18

ప. విశేషేణ = ప్రత్యేకించి. పశ్యంతీ = కనిపెట్టు, చిత్ = జ్ఞానము గలవాడగుటచే, విపశ్చిత్ = కించిజ్ఞుఁడైన, అయం = ఈ జీవాత్మ, న జాయతే=జన్మించువాడు కాడు,న మ్రియతే=మరణించువాడు కాడు, మరియు కుతశ్చిత్ = ఏదేనొక వ్యక్తినుండి పుట్టువాడు కాడు. ఇంతియే గాక, కశ్చిత్=దేవమానవాదులలో నొకానొకఁడుగ, నబభూవ = లేకుండెను.

ఇందు వలననే "నిజః" "నిత్యః" "శాశ్వతః" అని చెప్పఁబడు యం = ఈ జీవాత్మ, శరీరే హన్యమానే సత్యపి = శరీరము సంహపఁబడినను, న హన్యతే = హింసింపఁబడువాడు కాడు.

కావున నీ యాత్మ-పురాణః = అనాది యని చెప్పఁబడును.

ప్రణవపంచాక్షరితో పరమాత్మ నుపాసించుటకు రాను ఎట్టివాడో

తెలిసికొనుట యవసరమగుటచే యముఁడీవాక్యమున జీవాత్మయొక్క లక్షణమును వివరించెను.

"హంతా చే న్మన్యతే హంతుం-హత శ్చే న్మన్యతే హతం।
ఉభౌ తౌ న విజానీతో-నాయం హంతి న హన్యతే" 19

ప. హంతా = చంపువాడు, హంతుం (హంతారం) తనను చంపువానిగా, మన్యతే చేత్ = భావించునెడల, హతః = చంపఁబడువాడు, హతం = తనను మరియొకరిచే చంపఁబడువానిగా, మన్యతే చేత్ = తలచునెడల, ఉభౌ తౌ = వారిద్దరు, న విజానీతః = ఆత్మను గుర్తింపనివారగుదురు. వాస్తవమేమనఁగా ? అయం = ఈ జీవాత్మ, న హంతి = సంహరించువాడుకాడు. న హన్యతే = చంపఁబడువాడును కాడు.

పగతుఁడచే శరీరము హింసింపఁబడును గాని అతిసూక్ష్మమగు ఆత్మకు ఎట్టి బాధయుండదని గుర్తించి శరీరేంద్రియాదులపై మమకారమును తగ్గించుకొని-శరీరమే నేను-అను భావన లేనివాడై "శివోఽహం" భావనతో శివానుగ్రహపాత్రుఁడు కావలెనని సారాంశము

"అణో రణీయాన్ మహతో మహీయా-నాత్మాఽస్య
జంతో ర్నిహితో గుహాయాం। తమక్రతుః పశ్యతి వీత
శోకో-ధాతుః ప్రసాదా న్మహిమాన మాత్మనః" 20

ప ఆత్మ = పరమాత్మ, అణోః = సూక్ష్మ స్వరూపుఁడైన జీవాత్మకంటె, అణీయాన్ = అతిసూక్ష్మమైనవాడు మహతః = గొప్పదైన ఆకాశమునకన్న, మహీయాన్ = గొప్పవాడగును. 'ఇంతియేగాక, అస్య జంతోః = ఈ ప్రాణియొక్క, గుహాయాం = హృదయగుహయందు, నిహితః = దాగియున్నవాడు.

తం = అట్టి పరశివుని, అక్రతుః = కర్మఫలము నాశింపనివాడై ఉపాసించునెడల, ధాతుః = పరమేశ్వరుని యొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, వీతశోకః = దుఃఖములేనివాడై, ఆత్మనః = పరమాత్మ యొక్క, మహిమానం = గొప్పదనమును, అనఁగా ప్రాకృత ప్రపంచమును మించిన శివస్వరూపమును, పశ్యతి = అవలోకించును.

అణువునకంటె అణువుగ నుండుటయు, మహత్తునకంటె మహత్తుగనుండుటయు పరమేశ్వరుని మహిమలు కాగా-కామ్యములను విసర్జించి చిత్తశుద్ధితో తన నారాధించుచు ధ్యానించువారిని శివుఁడను గ్రహించి సాక్షాత్కరించునని సారాంశము. మరియు నుపాసించుటకు హృదయగుహయందు సన్నిహితుఁడగు పరశివుని-ఇష్టలింగముగ-బాహ్యమున ధరించి-నిత్యము పూజింపవలెనని ఇందు ద్యోతకమగుచున్నయది.

“ఆసీనో దూరం వ్రజతి-శయానో యాతి సర్వతః ।
కస్తం మదామదం దేవం-మదన్యో జ్ఞాతు మర్హతి?”21

ప. మరియు నీ పరమాత్మ ఆసీనః = ఒకచో స్థిరపడినవాడైనను, దూరం వ్రజతి = దూరప్రదేశములకు వెళ్ళఁగలుగును. శయానః = పరుండినను, సర్వతః = ప్రపంచమునంతయు, యాతి = పొందును. మదామదం = సంతోషదుఃఖభావములు గల, దేవం = స్వయం ప్రకాశమానుఁడగు పరమాత్మను, మదన్యః = నాకంటె నితరుఁడు, జ్ఞాతుం = తెలిసికొనుటకు, అర్హతి = యోగ్యుఁడగును ?

అణువునకంటె నణువై సర్వవ్యాపియగు పరమాత్మను అనుపాసకుఁడు గుర్తింపఁజాలడనియు, నేనాపరమాత్మ నుపాసించి శివతాదాత్మ్యము నొందితిననియు యముఁడు నచికేతునునకు శివోపాసన

యందు ఆత్మవిశ్వాసము కలిగించెనని వివేకము. జీవాత్మ ద్వారా దుఃఖనటనము, స్వయం సుఖపూర్ణతగలవాడు పరమాత్మయని ఇందు రహస్యము.

''అశరీరం శరీరేష్వ-నవస్థేష్వవస్థితం। మహాంతం విభు
మాత్మానం-మత్వా ధీరో న శోచతి'' 22

ప. ఆత్మానం = పరమాత్మను, అనవస్థేషు శరీరేషు = శాశ్వత స్థితి లేనట్టి దేవమానవాది శరీరములలో, అవస్థిత మపి = అంతర్యామిగ నివసించినను, అశరీరం = ప్రాకృతశరీరము లేనివానిగను, మహాంతం = గొప్పవానిగను, విభుం = సర్వవ్యాపకునిగాను, ధీరః = శాంతవదీక్షచే బుద్ధిబలము కలిగిన మహాపురుషుడు, మత్వా = పూజాజపధ్యానముల నుపాసించినచో, నశోచతి = ప్రారబ్ధాంతమున దుఃఖములేనివాడగును.

పరమాత్మ సర్వవ్యాపియై జీవాత్మను వెంటాడినను కర్మవశ్య మగు శరీరము లేనివాడై దివ్యశరీరముతో మహాకైలాసమున నివసించి నను భక్తుల మొఱలాలించి రక్షింప వడిగా నేతెంచు మహిమ గల వాడని చింతించువాడు-శరీరవియోగమే తడవుగా పరమపదమున ఆనందించునని ఇందు తేటపడినది.

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో-న మేధయా
నబహునా శ్రుతేన।యమైవైష వృణుతే తేన లభ్య- స్తస్యై
ఆత్మా విపృణుతే తనూగ్ం స్వామ్" 23

ప. అయం = ఈ, ఆత్మ = పరమాత్మ, ప్రవచనేన = వేదాంత ములను బాగుగా వివరించి చెప్పుటచేతను, న లభ్యః = లభించువాడు కాడు. మేధయా = గ్రంథార్థమును విని జ్ఞప్తియందు ఉంచుకొను తెలివి

తోడను, న = అందువాడు కాడు. బహునా శ్రుతేన = పలుమారులు వినుట తోడను, న = గోచరింపడు.

ఐతే ఏషః = ఈ పరమాత్మ, యం = ఏ ఉపాసకుని, వృణుతే = అనుగ్రహించునో, తేనైవ = అట్టి ఉపాసకునిచేతనే, లభ్యః = పొందఁదగినవాడు మరియు ఏష ఆత్మా = ఈ పరమాత్మ, స్వాం తనూం = తనదైన దివ్య స్వరూపమును, వివృణుతే = విశదీకరించుటద్వారా ప్రసాదించును పరమేశ్వరుని దర్శించుటకు ప్రవచనము, మేధ, బహుశ్రుతము ఉపయోగింపవనియు, నిశ్చలమనంబున శాంభవదీక్షితుఁడై శివారాధనమును శివమంత్రజపమును శివధ్యానమును నిత్యము ఆజన్మాంతము ఆచరించు శివయోగిని పరమేశ్వరుఁడనుగ్రహించి-తన ఆనందమయ స్థితి నొసఁగుననియు వివేకము.

"నావిరతో దుశ్చరితా - న్నాశాంతో నాసమాహితః,
నాశాంతమానసో వాఽపి-ప్రజ్ఞానేనైన మాప్నుయాత్"

ప. దుశ్చరితాత్ = దుర్మార్గప్రవర్తనమునుండి. అవిరతః = తప్పుకొననివాడు, అశాంతః=ఇంద్రియచాంచల్యము గలవాడు, అసమాహితః = ఏకాగ్రచిత్తము లేనివాడు, అశాంతమానసః = మనోవికారములఁజెందువాడు, ప్రజ్ఞానేనవాఽపి = వేదాంత పరిజ్ఞానమాత్రమున, ఏవం = ఈ పరమాత్మను, నాప్నుయాత్ = పొందఁజాలడు.

వేదశాస్త్ర పాండిత్యముచే శివస్వరూపమును పరోక్షముగ గుర్తించి పరమేశ్వరుని సాక్షాత్కారము అను అపరోక్షజ్ఞానమునకై పూజా జప ధ్యానముల నాచరించు శివయోగికే-ప్రారబ్ధాంతమున శివానుగ్రహముచే శివానందము లభించునని-ఇందు విదితమైనది.

"యస్య బ్రహ్మ చ క్షత్రం చ-ఉభే భవత ఓదనః,
మృత్యు ర్యస్యోపసేచనం-క ఇత్థా వేద యత్ర సః"25

ప. యస్య = ఏ పరమాత్మకు, బ్రహ్మ చ = బ్రాహ్మణవర్గము, క్షత్రం చ = క్షత్రియులు మొదలగు ప్రాణులందరును, ఉభే = ఈ రెంటితో నిండిన ప్రపంచము, ఔదనః = ప్రళయమున ఆహారము, భవతః = అగుచున్నదో, యస్య = ఏ శివునకు, మృత్యుః = మృత్యు కారకులగు యమాదులు, ఉపసేచనం = వ్యంజనమో, యత్ర = ఎట్టి మహిమయందు, సః = ఆ పరమాత్మ యుండునో, అట్టి మహిమ ఇత్థా = ఇవ్విధంబేనని, కః = ఎవఁడు, వేద = గుర్తెరుగును ?

"బ్రహ్మ చ క్షత్రంచ" "బ్రాహ్మణులు, క్షత్రియులు" అని చెప్పుట-ప్రపంచమున దేవమానవాదులలో బ్రాహ్మణులుక్షత్రియులు ముఖ్యులని తెలుపునది. ప్రపంచమును ఆహారముగ స్వీకరించు పరమేశ్వరుని మహిమ చెప్పనలవిఁగానిదగుటచే-మేధాదులచే పరమాత్మను కనుగొనఁజాలరనియు, శాంభవదీక్షితులై తననుపాసించు వారికే శివుని మహిమ అవగత మగుననియు సారాంశము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య ప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రి కృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కఠోపనిషద్గత ద్వితీయవల్లి-సమాప్తము.

శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# కఠోపనిషత్తు-ప్రథమాధ్యాయము

## తృతీయ వల్లి

"ఋతం పిబంతౌ సుకృతస్య లోకే-గుహాం ప్రవిష్టౌ
పరమే పరార్థ్యే-ఛాయాఽతపౌ బ్రహ్మవిదో వదంతి-
పంచాగ్నయో యే చ త్రిణాచికేతాః" 1

ప. జీవాత్మ పరమాత్మలు, సుకృతస్య = పుణ్యముయొక్క, లోకే = భోగరూపమగు మానవలోక (శరీర)మునందు, ఋతం = జీవపరముగా కర్మఫలమును, ఈశ్వరపరముగా సంకల్ప ఫలమును, పిబంతౌ = అనుభవించువారై, గుహాం = హృదయగుహను, ప్రవిష్టౌ = ప్రవేశించినవారై, పరమే = ఉత్కృష్టమగు, పరార్థ్యే = సర్వశ్రేష్ఠమైన చిదాకాశమునందు ఛాయాచు తపౌ = నీడ ఎండలవలె వర్తింతురు.

ఈవిధముగా-బ్రహ్మవిదః = శివోపాసకులు, పంచాగ్నయః = గార్హపత్య దక్షిణ, ఆహవనీయ, సభ్య, ఆవసధ్యములు అనఁబడు ఐదుగ్నుల నుపాసించిన వారు, త్రిణాచికేతాః = ప్రాత ర్మధ్యాహ్న సాయంకాలముల నగ్నిని హవనముఁజేయువారును-వదంతి = పక్కాణించుచున్నవారు.

రెండవవల్లి యందు జితేంద్రియులై తన నుపాసించువారిని శివుఁడను గ్రహించునని నిరూపింపఁబడినది. ఇఁక నీ తృతీయవల్లి యందు- ఇంద్రియములను జయించి శివునుపాసించుట-కఠినము కాద నియు, తన నుపాసించుటకై శివుఁడు-జీవాత్మకు చేరువగా హృదయ గుహలో దహరాకాశమునందు నివసించుననియు, జీవాత్మ-హృదయ గుహయందు నీడవంటివాడై కించిజ్ఞుఁడుగా కర్మఫలమును ననుభవించు ననియు, పరమాత్మ—ఎండవంటివాడై సర్వజ్ఞుఁడుగా తన సంకల్ప ముచే లీలావిలాసముగ హృదయగుహయందు రాజించుననియు ఇందు విదితమైనది.

జీవాత్మకు హృదయ గుహయందు సన్నిహితుఁడగు పర మాత్మను బాహ్యమున లింగాంగ సామరస్యముతో ఇష్టలింగము నారాధించినచో- అంతర్దృష్టి గలవాడై భావలింగమును ధ్యానించి దహరాకాశమున శివుని దర్శింపఁగలుగునని వివేకము.

"యః సేతు రీజానానా-మక్షరం బ్రహ్మయత్పరం,
అభయం తితీర్షతాం పారం-నాచికేతగ్ం శకేమహి" 2

ప. యః = ఏ పరమాత్మ, ఈజానానాం = ఇంద్రవరుణాది దేవతల నారాధించువారికి, సేతుః = పరమావధిగ నుండువాడో, అక్షరం బ్రహ్మ = బ్రహ్మమనఁదగు ప్రణవాక్షరము (ప్రణవ సహిత శివ పంచాక్షరము) యత్పరం = ఏ పరమాత్మ పరుఁడుగా కలదో, (లేక) యత్ = ఏ శివతత్త్వము, పరం = శ్రేష్ఠమైన, అక్షరం = = వినాశములేనట్టి, బ్రహ్మ = సర్వవ్యాపకమగు బ్రహ్మయో, తితీర్ష తాం = బ్రహ్మమును పొందఁగోరువారికి, అభయం పారం = భయము లేని తీరమగునో, అట్టి పరమాత్మను నాచికేతం = అగ్నిహవనాది

కర్మసహిత జ్ఞానయోగముచే ప్రాప్యునిగా కనుగొనుటకు శకేమహి = సమర్థులము కాగలము.

వ. పరమాత్మ హృదయగుహాప్రవిష్టుఁడగుటచే నా పరమ పురుషుని ప్రణవపంచాక్షరితో నుపాసించుటకు మనము సమర్థులమే, కాని ఇంద్రియజయమునకై ప్రయత్నింపవలెననియు, ఆయాదేవతల నంతర్యామియై సర్వకర్మఫలముల నొసఁగువాఁడు శివుఁడే ననియు, తన భూమిలో హిరణ్య నిధి యున్నదని తెలిసిన వాఁడు నిధికై శత ప్రయత్నముల నొనర్చునట్లు—స్వహృదయాంతర్వర్తియగు శివుఁజేరుటకు మనో నిగ్రహమును ఇంద్రియజయమును సాధింపవలె ననియు ఇందు ద్యోతకమగుచున్నందున క్రిందివన ఇంద్రియజయ విధానము నిర్దేశింపఁబడినది.

"ఆత్మానం రథినం విద్ధి-శరీరం రథ మేవ తు,
బుద్ధిం తు సారథిం విద్ధి-మనః ప్రగ్రహ మేవ చ" 3
"ఇంద్రియాణి హయా నాహు-ర్విషయాం స్తేషు గోచరాన్,
ఆత్మేంద్రియమనోయుక్తం-భోక్తే త్యాహు ర్మనీషిణః"4

వ. ఆత్మానం = జీవాత్మను; రథినం = రథస్వామిగాను; శరీరం = దేహమును; రథం = రథముగాను విద్ధ = గుర్తింపుము! బుద్ధిం = నిశ్చయాత్మకబుద్ధిని; సారథిం = నియంతగాను; మనః = మనస్సును; ప్రగ్రహం = పగ్గముగాను; విద్ధి = తెలియుము!

ఇంద్రియాణి = కర్మజ్ఞానేంద్రియములను; హయాన్ = అశ్వములుగా; విషయాన్ = శబ్ద స్పర్శరూప రస గంధాది విషయములను; తేషు = ఆ ఇంద్రియముల విషయమై; గోచరాన్ = మార్గములుగా; ఆహుః = విజ్ఞానులు చెప్పుదురు. ఆత్మేంద్రియమనో

యుక్తం = శరీర ఇంద్రియ మనస్సులతో కూడిన జీవాత్మను; భోక్తేతి = సుఖ దుఃఖముల ననుభవించువానిగా; మనీషిణః = విద్వాంసులు; ఆహుః = వక్కాణింతురు.

మనస్సను పగ్గముతో ఇంద్రియములను గుఱ్ఱముల నడుపులో పెట్టుటకు బుద్ధియను సారథియొక్క సహకారము అవసరమనియు, సారథి రథికుఁడును అధిష్ఠించుటకు శరీరము ఆధారమనియు; శరీరము మనస్సు ఇంద్రియములుకలిగి యున్నచో జీవాత్మ-కర్త భోక్తయు కాఁజాలుననియు, ఇందు రథిక రథ సారథి అశ్వ మార్గముల రూపకముతో జీవాత్మాదుల లక్షణములు పేర్కొనఁబడినవని వివేకము.

ఇఁట గల ఆత్మశబ్దమునకు-"తాను అనఁగా శరీరముతో కూడిన ఆత్మ అను నర్థమే సమంజసంబైనది.

"య స్త్వవిజ్ఞానవాన్ భవ త్యయు క్తేన మనసా సదా,
త స్యేంద్రియాణ్యవశ్యాని–దుష్టాశ్వా ఇవ సారథేః" 5

ప. యస్తు = ఏజీవాత్మ ఐతేనో, అవిజ్ఞానవాన్ = అవివేకము గలవాడై, అయు క్తేన = నిగ్రహము లేనట్టి, మనసా = మనస్సుతో, సదా = ఎల్లకాలము, భవతి = ఉండునో, తస్య = అట్టి రథికున (జీవాత్మ)కు, ఇంద్రియాణి = జ్ఞానకర్మేంద్రియములు, సారథేః = అసమర్థుఁడైన సారథికి, దుష్టాశ్వా ఇవ = దుడుకు గుఱ్ఱములవలె, అవశ్యాని = స్వాధీనములు కాకుండును.

బుద్ధిబలముతో మనస్సు నదుపులో పెట్టనివాని యొక్క ఇంద్రియములు-విషయములవైపు పరుగిడుననియు, మనశ్చాంచల్యముచే శివు నుపాసించు యోగ్యత లేనివాడై వ్యసనములపాలై ప్రపంచపర మార్థములకు దూరమగునని భావము.

"యస్తు విజ్ఞానవాన్ భవతి-యుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణి వశ్యాని-సదశ్వా ఇవ సారథేః' 6

ప. యస్తు = ఎవఁడైతే, విజ్ఞానవాన్ = ధర్మాధర్మవివేకము గలవాఁడై, యుక్తేన = నిగ్రహింపబడిన, మనసా = అంతఃకరణముచే సదా = జీవితము మొత్తము, భవతి = ఉండునో, తస్య = అట్టి మహా పురుషునకు, ఇంద్రియాణి = త్వక్ చక్షుః శ్రోత్ర జిహ్వా ఘ్రాణములు, వాక్ పాణిపాదపాయూపస్థములు అను దశేంద్రియములు, సారథేః = సమర్థుఁడైన సారథికిః సదశ్వాఇవ = ఉత్తమాశ్వములవలె, వశ్యాని = లొంగినవగును.

పూర్వజన్మ సుకృతమున శాస్త్ర ఆచార్యోపదేశమునందలి విశ్వాసముతో ఏర్పడిన వివేక (బుద్ధిబల)ము వలన మనస్సును నిగ్రహించు వానికి-మంచి గుఱ్ఱములు-నేర్పరియగు రథసారథికి అనుకూలములగు నట్లు-ఇంద్రియములన్నియు స్వాధీనములగుటచే మనోబుద్ధిబలముతో శివు నారాధింప నర్హుఁడగునని-సారాంశము.

"యస్త్వవిజ్ఞానవాన్ భవత్యమనస్కః సదాఽశుచిః,
న స తత్పద మాప్నోతి-సంసారం చాధిగచ్ఛతి" 7

"యస్తు విజ్ఞానవాన్ భవతి-సమనస్కః సదా శుచిః,
సతు తత్పద మాప్నోతి-యస్మా ద్భూయో న జాయతే" 8

ప. యస్తు = ఎవఁడైతే, అవిజ్ఞానవాన్ = బుద్ధిబలము లేనివాఁడై, అమనస్కః = మనోనిగ్రహము లేనివాఁడునై, సదా = ఎల్లకాలము, అశుచిః = శరీర వాఙ్మనఃశుద్ధి లేనివాఁడుగా, భవతి = ఉండునో, సః అట్టి కనిష్ఠుఁడు, తత్పదం = శివస్వరూపమును, నాప్నోతి = పొంద

కుండును. మరియు సంసారంచ = జనన మరణజరాతాపత్రయసంభరితమగు సంసారమును, అధిగచ్ఛతి = పునఃపునః పొందుచుండును.

యస్తు = ఎవడైతే, విజ్ఞానవాన్ = బుద్ధిబల (వివేక)ము గలవాడై, సమనస్కః = స్థిరమైన మనస్సు గలవాడునై, సదా = జీవితమంతటను, శుచిః = నిర్మలుఁడై, భవతి = ఉండునో, సతు = అట్టి ఉత్తముఁడే, యస్మాత్ = ఏ స్వరూపమువలన, భూయః = మరల, న జాయతే = జన్మింపడో, తత్పదం = అట్టి దివ్యశివస్వరూపమును ఆప్నోతి = పొందును.

ఇంద్రియ మనోనిగ్రహము బుద్ధిబలంబు లేనివానికి-శివోపాసనము ఘటింపదు గాన అట్టివాడు జన్మపరంపరలో నుండుననియు మనోనిగ్రహముతో ఇంద్రియముల నరికట్టుటకు వలయు బుద్ధిబలమున శివు నుపాసించువానికి-పునరావృత్తి రహితమగు శివసాయుజ్యము చేకూరునని వివేకము.

"విజ్ఞానసారథి ర్యస్తు-మనః ప్రగహవా న్నరః ।
సోఽధ్వనః పార మాప్నోతి-తద్విష్ణోః పరమం పదమ్"

ప. యస్తు నరః = ఏ మానవోత్తముఁడైతే, విజ్ఞానసారథిః = సమీచనబుద్ధి సారథిగ గలవాడై, మనఃప్రగహవాన్ = 'వికల్పరహితమైన మనస్సును పగ్గముగ నమర్చుకొనినవాడై, శివు నారాధించునో, సః = అట్టి మహాత్ముఁడు, అధ్వనః=సంసారమార్గమునకు, పారం = పరమావధి యగు స్థానమును, ఆప్నోతి = పొందును.

తత్ = అట్టి స్థానము, విష్ణోః = బ్రహ్మాండసీమయగు విరజా నదీతీరమునందు గల వైకుంఠమున నివసించు విష్ణువునకంటె, పరమం = శ్రేష్ఠంబగు, పదం = స్వరూపంబగును.

"ఉభయనిర్దేశే పంచమీబలీయాన్" పంచమీషష్ఠీవిభక్తుల నిర్దేశమున-పంచమీవిభక్త్యర్థము బలిష్ట" మను పూర్వమీమాంసాన్యాయము ననుసరించి "విష్ణోః" అనుచో "విష్ణువునకంటె" అని చెప్పుటయే సమంజసమైనది.

బ్రహ్మాండమునకు పొలిమేఱ యగు విరజానదియొక్క తీరము నందు విలసిల్లు వైకుంఠము ననుసరించియే శివపదమును ముక్తపురుషుఁడు చేరును. మనోబుద్ధుల సహకారమున శివు నుపాసించువారు-శరీరము విడిబడుటయే తడవుగా-శివలోకముఁజెంది శివానందామృతాస్వాదలోలురై తుచ్ఛమైన దేవమానవాది జన్మపరంపరలోనికి రారని-కఠోపనిషద్గతమైన యమనచికేతః సంవాదము నొక్కి చెప్పుచున్నయది.

"ఇంద్రియేభ్యః పరా హ్యర్థా-అర్థేభ్యశ్చ పరం మనః,
మనస స్తు పరా బుద్ధి-ర్బుద్ధే రాత్మా మహాన్ పరః" 10
"మహత పరం మవ్యక్త-మవ్యక్తాత్ పురుషః పరః,
పురుషా న్న పరం కించిత్-సా కాష్ఠా సా పరా గతిః"

ప. ఇంద్రియేభ్యః = ఇంద్రియములకంటె, అర్థాః = విషయములు, పరాః = శ్రేష్ఠములు, అర్థేభ్యః = విషయములకంటె, మనః = మనస్సు, పరం = బలిష్ఠము, మనసః = మనస్సునకంటె, బుద్ధిః = బుద్ధి, పరా = ముఖ్యమగునది, బుద్ధేః = బుద్ధికన్న, మహాన్ ఆత్మా = ఇంద్రియవిషయ మనోబుద్ధులను ఆశ్రయమగుటచే మహాన్ అనఁదగు జీవాత్మ, పరః = మిన్నయగుమ.

మహతః = జీవాత్మకంటె, అవ్యక్తం = శరీరము, పరం = శ్రేష్ఠమైనది, అవ్యక్తాత్ = శరీరమునకన్న, పురుషః = పరమాత్మ,

పరః = ఉత్తముఁడగును, పురుషాత్ = పరిపూర్ణుఁడైన పరమాత్మ కంటె, కించిత్ = ఏదియు, పరం న = శ్రేష్ఠము లేదు. సా = అట్టి పరమపురుషప్రాప్తియే, కాష్ఠా = జీవాత్మప్రాప్యముగ పరమావధి యగునది, సా = అట్టి పరమేశ్వరుఁ జేరుటయే, పరాగతిః = ఉత్తమ గతియగును.

నిశ్చయాత్మకబుద్ధిబలమున జీవాత్మ మనస్సును నిగ్రహించి ఇంద్రియములను విషయములనుండి మఱల్చి పరమేశ్వరాభిముఖము లుగ నొనర్చియు పరమేశ్వరుని ప్రార్థింపవలెనని సారాంశము.

"ఏష సర్వేషు భూతేషు-గూఢోఽఽత్మా న ప్రకాశతే,
దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా-సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః

ప. సర్వేషు భూతేషు = ప్రాణులందరిలో, గూఢః = దాగినట్టి, ఏష ఆత్మా = ఈ పరమాత్మ, న ప్రకాశతే = బాహ్యేంద్రియగోచ రుఁడు కాడు, కింతు = కాని, సూక్ష్మదర్శిభిః = జీవాత్మకంటె సూక్ష్మ మగు పరమాత్మ నుపాసించువారిచే, అగ్ర్యయా = ఏకాగ్రమగునట్టి సూక్ష్మయా = వివేకముచే వికల్పములేనట్టి, బుద్ధ్యా = ధ్యానరూపమగు భావనచే, దృశ్యతే = గాంచఁబడును.

చిత్తశుద్ధితో ఏకాగ్రబుద్ధిని శివపూజాజపధ్యానముల నొనర్చు వారికి-పరమాత్మ సాక్షాత్కరించునని ఇందు విదితమైనది.

"యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞ-స్తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని
జ్ఞాన మాత్మని మహతి-నియచ్ఛే త్తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని"

ప. ప్రాజ్ఞః = విడువదగినది ఏదియో, గ్రహింపఁదగినదేదియో, నిర్ణయించుకొను వివేకము గలవాడు, వాక్ = వాక్కు మొదలగు

ఇంద్రియములను, మనసి = మనస్సునందు నియమింపవలెను, తత్ = ఇంద్రియములను లోబఱచుకొనిన మనస్సును, ఆత్మవి జ్ఞానే = జీవాత్మను సమీపించియుండు బుద్ధియందు, యచ్ఛేత్ = నిలుపవలెను.

జ్ఞానం = తెలివిగ పేర్కొనఁదగు బుద్ధిని, మహతి ఆత్మని = ఇంద్రియ మనోబుద్ధులకన్న గొప్పయగు జీవాత్మయందు, నియచ్ఛేత్ = స్థిరపరుచవలెను, తత్ = ఇంద్రియమనోబుద్ధులను తన యధీనముల నొనర్చుకొనిన జీవాత్మను, శాంతే ఆత్మని = నిర్వికారుఁడైన పరమాత్మయందు, యచ్ఛేత్ = నిలుపవలెను.

బుద్ధియొక్క అదుపులో నుండు మనస్సును ఇంద్రియములవైపు పోనీయక అనఁగా- ఇంద్రియవ్యాపారముల నన్నిటిని మనస్సు ద్వారా బుద్ధినాశ్రయింపఁ జేయవలెననియు, బుద్ధిని ఆత్మయందు నిలిపి-ఆత్మను-పరమాత్మను ధ్యానించుటలో ఉపయోగింపవలెను. దీనినంతటిని చేయుటకు-శాంభవదీక్షితుఁడు సమర్థుఁడగునని భావము.

"ఉత్తిష్ఠత జాగ్రత! ప్రాప్య వరా న్నిబోధత,
క్షురస్య ధారా నిశితా దురత్యయా-దుర్గం పథ
స్తత్కవయో వదంతి" 14

ప. ఉత్తిష్ఠత = ముముక్షువులారా! ఇంతవరకు పరమేశ్వరుని మఱచి ఇంద్రియసుఖానుభవము గల అజ్ఞాననిద్రలోనుంటిరి. అట్టి నిద్రను చాలించి మేలుకొనుఁడు! వరాన్ = శివయోగిశ్రేష్ఠులను, ప్రాప్య = ఆశ్రయించి, నిబోధత = శివోపాసనవిధానమును తెలిసికొనుఁడు!

ఒకవేళ మీ బుద్ధిబలముతోడనే శివజ్ఞానమును సంపాదింపనెంతు

రేని దురత్యయా = దుఃఖముచేతగూడా అతిక్రమింప నలవిగానట్టి క్షురస్యధారేవ = కత్తి అంచువలె, దుర్గం పథః = గురుకటాక్షము లేనిది-పరమేశ్వరునుపాసించి సాక్షాత్కరింపఁజేసికొనుట- కంటక పాషాణాదిసంకులమైన మార్గముగ నుండును.

కల్యాణదేశికునిఁజేరి ప్రార్థించి శాంభవదీక్షఁబరిగ్రహించినవాడై ఇష్టప్రాణభావలింగాత్మకుఁడగు పరమేశ్వరుని పూజాజపధ్యానము లతో అరాధించువానికే పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడై ప్రారబ్ధాంత మున సాక్షాత్కరించునని సారాంశము.

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం—తథాఽరసం
నిత్యమగంధవచ్చ యత్, అనాద్యనంతం మహతః
పరం ధ్రువం నిచాయ్య తన్మృత్యుముఖాత్ప్రముచ్యతే"

ప. పంచభూతాత్మక ప్రకృతిఁ జెందిన శబ్ద స్పర్శరూపములు లేని దగుటచే-అశబ్దము, అస్పర్శము అరూపంబునని చెప్పఁబడునట్టి, అవ్యయం = వృద్ధిక్షయములు లేనిదియు, అరసం = రసము లేని దియు, అగంధవచ్చ = గంధము లేనిదియు, నిత్యం = శాశ్వతమైన దియు నగునది, యత్ = ఎద్దియో, తత్ = అట్టి శివతత్త్వమును అనాద్యనంతం = ఆది అంతములు లేనిదిగను, మహతః = జీవాత్మ కంటె, పరం = శ్రేష్ఠమైనదిగాను, ధ్రువం = స్థిరమైనదానిగాను, నిచాయ్య = ఉపాసించి సాక్షాత్కరింపఁజేసికొని, మృత్యుముఖాత్ = జననమరణరూపమగు మృత్యుముఖమునుండి, ప్రముచ్యతే = విడి బడును.

శివస్వరూపము- ప్రాకృతము గానిదై దివ్యంబని భావించు

శైవుడు-అంత్యకాలమున శివుని దర్శించి ముక్తుఁడగునని ఇందు విదిత మైనది.

"నాచికేత ముపాఖ్యానం-మృత్యుప్రోక్తం సనాతనం,
ఉక్త్వాశ్రుత్వాచ మేధావీ-బ్రహ్మలోకే మహీయతే" 16

ప. నాచికేతం = నచికేసుఁ జెందినట్టి, మృత్యుప్రోక్తం = యమునిచే చెప్పఁబడినట్టియు, సనాతనం = అనాదికాలస్థితమగు, ఉపాఖ్యానం = ఇతిహాసమును, మేధావీ = గ్రంధార్థమును నిరూపించు ప్రజ్ఞగల పండితుఁడు, ఉక్త్వా = వక్కాణించినను, శ్రుత్వా చ = సమర్థునివలన వినినను, బ్రహ్మలోకే = శివలోకమునందు, మహీయతే = శివసముఁడై శివానందము ననుభవించు గొప్పవాడగును.

ఈ నచికేతోయమ సంవాదమును వివరించి చెప్పువాడు, మనః పూర్వకముగ వినువాడును శివానుగ్రహపాత్రులగుదురని భావము.

"య ఇమం పరమం గుహ్యం-శ్రావయేత్ బ్రహ్మసం
సది, ప్రయతః శ్రాద్ధకాలే వా-తదానంత్యాయ కల్పతే,
తదానం త్యాయ కల్పతే" 17

ప. యః = ఏ భక్తుఁడు, పరమం = శ్రేష్ఠము, గుహ్యం = రహస్యము, ఇమం = ఈ ఆఖ్యానమును, ప్రయతః = సదాచారాది నియమము గలవాడై బ్రహ్మసంపది = బ్రాహ్మణసమాజమున, శ్రాద్ధ కాలే వా = పితృకర్మసమయమునందైనను, శ్రావయేత్ = శ్రాద్ధభోక్తలకు వినిపించునో, తత్ = అట్టి శ్రాద్ధము, ఆనంత్యాయ = అనంత ఫలప్రాప్తికై, కల్పతే = సమర్థంబగును.

సదాచార సంపన్నులకు శ్రాద్ధభోక్తలకును ఈ కఠోపనిషద్గత

మైన యమనచికేతః సంవాదమును వినుపించుట-వక్తకు శ్రోతకును శ్రేయస్కరమై శ్రాద్ధాదికర్మలను పరిపుష్టములఁ జేయునని వివేకము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్యప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రికృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కఠోపనిషద్గత-తృతీయవల్లి,
ప్రథమాధ్యాయము-సమాప్తము.

* * *

ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణా మూర్తయే నమః

# కఠోపనిషత్తు-ద్వితీయాధ్యాయము

## ప్రథమవల్లి

"పరాంచి ఖాని వ్యతృణ త్స్వయంభూ-స్తస్మా త్పరాఙ్
పశ్యతి నాంతరాత్మన్, కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష
దావృత్త చక్షు రమృతత్వ మిచ్ఛన్" 1

ప. ఖాని = దశేంద్రియములను, పరాంచి = ఇంద్రియభిన్నములు ఇంద్రియ గతములు నగు విషయములను వెలుబఱచునవిగా, స్వయంభూః = పరమేశ్వరుఁడు, వ్యతృణత్ = మధించి సృష్టించెను, తస్మాత్ = అందువలన, పరాఙ్ = విషయములనే, పశ్యతి = అవలోకింతురు. అంతరాత్మన్ = అంతర్యామియగు పరమేశ్వరుని, న= దర్శింపరు. ఐతే కచ్చిత్ = ఒకానొక, ధీరః = పురుషశ్రేష్ఠుఁడు, ఆవృత్త చక్షుః = నేత్రము మొదలగు ఇంద్రియములను విషయముల నుండి మరల్చినవాడై, అమృతత్వం = మోక్షమును, ఇచ్ఛన్ = కోరువాడునై, ప్రత్యగాత్మానం=జీవాత్మ ప్రేరకుఁడగు పరమాత్మను ఐక్షత్ = అవలోకింపఁగలుగును.

పరమేశ్వరుఁడు సర్వస్వతంత్రుఁడగుటచే- సృష్టిపరంపర కొనసాగుటకై ఇంద్రియములను విషయాభిముఖములుగ నిర్మించి

తనను ప్రార్థించినచో విషయముల నుండి ఇంద్రియములను నిగ్రహింపఁగలుగు సామర్థ్యమును ధీరునకు ప్రసాదించి సాక్షాత్కరించు ననియు, ప్రవాహమును ఎదురుప్రవాహము అడ్డుకొనునట్లు ధీరుఁడు ఆత్మబలముతో పరమేశ్వరుని దర్శింపఁగలుగుననియు విదితమైనది.

"పరాచః కామా ననుయంతి బాలా-స్తే మృత్యో ర్యంతి
వితతస్య పాశం, అథ ధీరా అమృతత్వం విదిత్వా-
ధ్రువ మధ్రువేష్విహ న ప్రార్థయంతే" 2

ప. బాలాః = అజ్ఞానులు, పరాచః = ఇంద్రియవిషయగతములైన, (పరాన్ = విషయములను. అంచంతీతి = పొందుచున్నవి గాన పరాంచి అనఁబడును.) (పరాఙ్ పరాంచౌ పరాంచః, పరాంచం పరాంచౌ పరాచః, అని పులింగ శబ్ద నిర్వచనము).

కామాన్ = కోరికలను, అనుయంతి = అనుసరింతురు. తే = అట్టి స్వల్పప్రజ్ఞులు. వితతస్య = విస్తరించియుండు, మృత్యోః = మృత్యువుయొక్క. పాశం = బంధమువంటి జననమరణాత్మక సంసారమును, యంతి = పొందుచుందురు.

అథ = స్వల్పప్రజ్ఞులకంటె వేరైన, ధీరాః = నిశ్చయాత్మకమైన బుద్ధిగల నిష్కాములు. అమృతత్వం = మోక్షమును, ధ్రువం = శాశ్వతముగా, విదిత్వా = గుర్తించి, ఇహ = ఈ బ్రహ్మాండమున, అధ్రువేషు = అశాశ్వతములైన భోగములలో, నప్రార్థయంతే = ఏ ప్రాపంచికసుఖభోగమును గూడ నభిలషించువారు కారు.

స్థిరమైన బుద్ధి లేనివారు-ఇహపరలోకసుఖముల నపేక్షించుచు-స్వాంతర్యామియగు శివుని పూజాజపధ్యానాదుల నారాధింపక-పునఃపునః పుట్టుచు గిట్టుచుందురు. శివానుగ్రహపాత్రుఁడైన ఒకానొక

ధీరుఁడు మాత్రము ఇంద్రియసుఖభోగముల నపేక్షింపక—పరమే శ్వరునందే చిత్తమును నిలిపి-సంసారబంధనిర్ముక్తుఁడగునని భావము.

"యేన రూపం రసం గంధం-శబ్దాన్ స్పర్శాంశ్చ మైథునాన్,
ఏతేనైవ విజానాతి–కిమత్ర పరిశిష్యతే ? ఏతద్వై తత్" 3

ప, యేన = ఏ అంతరాత్మచే, రూపం = రూపమును, రసం= రసమును, గంధం = వాసనను, శబ్దాన్ = శబ్దములను, స్పర్శాంశ్చ = తాకిడులను, మైథునాన్ = స్త్రీ పురుషసంబంధములగు శృంగా రానుభవములను, ఏతేనైవ = ఈ అంతరాత్మబలము వలననే, విజానాతి = శరీరేంద్రియ విశిష్టుఁడైన జీవాత్మ గుర్తించునో, అత్ర= ఈ పరమాత్మబలమువిషయమై, కిం = ఏది, పరిశిష్యతే = మిగిలి యుండును? ఏతద్వై = సర్వేంద్రియ విషయములను వెల్లడించు నదియే, తత్ = ఆ శివతత్త్వము.

జీవాత్మ పొందువాడుగను, పరమాత్మ పొందఁబడువాడుగ నిదివరలో "ఋతం పిబంతౌ" ఇత్యాదిని నిరూపించి ప్రాప్తవ్యుఁడైన పరమాత్మ యొక్క బలము వలననే ప్రాప్తయగు జీవాత్మ ఇంద్రియ సుఖముల ననుభవింపఁగలుగునని సారాంశము.

"స్వప్నాంతం జాగరితాంతం-చోభౌ యేనానుపశ్యతి,
మహాంతం విభు మాత్మానం-మత్వా ధీరో న శోచతి"4

ప స్వప్నాంతం = స్వప్నము (నిద్ర)లోని విషయమును, జాగరితాంతం = మెలకువ యందలి ప్రత్యక్షములను, ఉభౌచ = రెంటిని గూడ, యేన = ఏపరమాత్మ ఆశ్రయముచే, అను పశ్యతి = అనుభవముతో నుపయోగింపఁగలుగునో, అట్టి విభుం = సర్వవ్యాపకుఁడైన, మహాంతం ఆత్మానం = పరమాత్మను (శివుని)

మత్వా = ఉపాసించుచు శరణాగతుఁడైనచో, ధీరః = బుద్ధిమంతుడు, న శోచతి = దుఃఖింపడు.

లౌకిక విజ్ఞానమునకు గూడ కారకుఁడైన సదాశివుని సర్వాత్మనా ప్రార్థించి ఇహపర దుఃఖములను పోగొట్టుకొనవలెనని భావము.

"య ఇమం మధ్వదం వేద-ఆత్మానం జీవ మంతికాత్,
ఈశానం భూతభవ్యస్య-న తతో విజుగుప్సతే" 5

ప యః = ఎవడు, ఇమం = ఈ, జీవమాత్మానం = జీవాత్మను, మధ్వదం = కర్మఫలము ననుభవించువానిగాను, భూతభవిష్యత్ ప్రపంచము యొక్క, ఈశానం = శాసించు ప్రభువైన పరమాత్మను, అంతికాత్ = జీవాత్మను సమీపించి కర్మఫలము ననుభవింపఁజేయువానిగాను, వేద = గుర్తించి భావించునో, అట్టి మహనీయుడు, తతః = అట్టి భావనవలన, న విజుగుప్సతే = తనను దాచుకొను నవసరము లేనివాడగును.

జీవాత్మను కర్మఫలము ననుభవింపఁజేసి నిష్కాము నొనర్చి పరమాత్మ అనుగ్రహించునని వివేకము.

"యః పూర్వం తపసో జాత-మద్భ్యః పూర్వ మజాయత।
గుహాం ప్రవిశ్య తిష్ఠంతం-యో భూతేభి ర్వ్యపశ్యత,
ఏతద్వైతత్" 6

ప. యః = ఏ పరమాత్మ, అద్భ్యః పూర్వం = ఉదకములు మొదలగు పంచ మహాభూతముల కన్న ముందు, పూర్వం = సృష్టిలో మొదటివాడైన బ్రహ్మదేవుని, అట్లే మహదాదులను, తపసః = తన సంకల్పముచేతనే, జాతం = ఆవిర్భవించినట్టి, గుహాం బ్రహ్మాండాంతర్భాగమును, ప్రవిశ్య = ప్రవేశించి, తిష్ఠంతం = ఉన్నట్టి బ్రహ్మ

దేవుని, అజాయత = పుట్టించెనో, యః=ఏ పరమాత్మ, భూతేభిః= సూక్ష్మపంచభూతములతో కూడియున్నవానిగా, వ్యపశ్యత = అను గ్రహముతో బ్రహ్మదేవు నవలోకించెనో. ఏతద్వై = బ్రహ్మాది స్తంబా వధిక ప్రపంచమును పుట్టించునదియే. తత్ = ఆ శివతత్త్వము,

సమస్త సృష్టికర్త - పరమేశ్వరుఁడేనని సారాంశము.

"యా ప్రాణేన సంభవ-త్యదితి ర్దేవతామయీ,
గుహాం ప్రవిశ్య తిష్ఠంతీ-యా భూతేభి ర్వ్యజాయత,
ఏతద్వై తత్" 7

వ. దేవతామయీ = శరీరమును ప్రకాశింపఁజేయునవగుటచే ఇంద్రియములు - శరీరగతదేవతలుగా నిట వ్యవహరింపఁబడినవి. అట్టి కర్మజ్ఞానేంద్రియమయుఁడగు, యా = ఏ, అదితిః = (అత్తి కర్మఫలానీతి = అదితిః) జీవాత్మ, ప్రాణేన = ప్రాణవాయువుతో కూడ, సంభవతి = జన్మించునో, యా = అదితి యనఁదగు ఏ జీవాత్మ, గుహాం = హృదయగుహను, ప్రవిశ్య = ప్రవేశించి, భూతేభిః = శరీరముగా పరిణమించు పృథివ్యాది పంచభూతములతో, తిష్ఠంతీ = ఉన్నదై, వ్యజాయత = జన్మించెనో, ఏతద్వై = ఈ జీవాత్మ లోనిదే, తత్, ఆ శివతత్త్వము.

పరమాత్మయొక్క అంశమగుటచే-జీవాత్మయు శివస్వరూపుఁడే ని ఇందు విదితమైనది,

"అరణ్యో ర్నిహితో జాతవేదా-గర్భ ఇవ సుభృతో
గర్భిణీభిః, దివేదివ ఈడ్యో జాగృవద్భి-ర్హ విష్మద్భి
ర్మనుష్యేభిరగ్నిః, ఏతద్వై తత్" 8

ప. జాతవేదాః = అగ్నిహోత్రుడు, గర్భిణీభిః = ఋత్విజులచే, అరణ్యోః = ఆరణులలో, గర్భఇవ = గర్భమువలె, సుభృతః = రక్షింపఁబడును. మరియు అగ్నిః = ఈ అగ్నియే, జాగృవద్భిః మేలుకొనినట్టి, హవిష్మద్భిః = హవిస్సులుగలయట్టి, మనుష్యేభిః = మానవులచే, దివే దివే = ప్రతిదినము, ఈడ్యః = ప్రార్థింపఁబడును.

పరమేశ్వరప్రాప్తిసాధనమగు యజ్ఞముఁజెందు అగ్ని-పరమేశ్వరాంశమేనని భావము.

"యతశ్చోదేతి సూర్యోఽస్తం యత్ర చ గచ్ఛతి,
తం దేవాః సర్వే అర్పితా- స్తదు నాత్యేతి కశ్చన ఏతద్వైతత్"!

ప. సూర్యః = సూర్యుఁడు, యతశ్చ = ఏ పరమాత్మనుండి ఉదేతి = ఉదయించునో, యత్ర చ = ఏ పరమాత్మయందు, అస్తంగచ్ఛతి = అస్తమించునో, తం = అట్టిపరమాత్మను, సర్వే దేవాః = అగ్న్యాదిదేవతలందరు, అర్పితాః = ఆశ్రయించియుండువారు, తదు = ఆ పరమాత్మను, కశ్చన = ఏ చేతనము గూడా, నాత్యేతి = అతిక్రమింపఁజాలదు.

ఏతద్వై = సర్వాధారమగు నిదియే, తత్ = ఆ శివతత్త్వమగును. దేవ మానవాదిసమస్తప్రాణులును పరమాత్మపై ఆధారపడునవని వివేకము

"యదేవేహ తదముత్ర-యదముత్ర తదన్విహ.
మృత్యోః స మృత్యు మాప్నోతి-య ఇహ నానేవ పశ్యతి॥10
"మనసైవేద మాప్తవ్యం-నేహ నానాఽస్తి కించన,
మృత్యోః స మృత్యుం గచ్ఛతి-య ఇహ నానేవ పశ్యతి"11

ప. ఇహ = ఈ లోకమున. యదేవ = ఏ పరమాత్మ-చేతనాచేతనరూపమున నున్నదో, అముత్ర = పరలోకమున, తత్ = ఆ పరమాత్మయే నుండును. యత్ = ఏ పరమాత్మ, అముత్ర = పరలోకమునందున్నవాడో, తదను = ఆ పరమాత్మయే, ఇహ = ఈ లోకమునందుండువాడేను,

యః = ఎవఁడు, ఇహ = ఈ ప్రపంచమున, నానేవ = పరమాత్మ ననేక విధములు గలవానిగా, పశ్యతి = భావించునో, సః = అట్టివాడు, మృత్యోః = జననమరణాదికమునుండి, మృత్యుం = జననమరణాదికమును, ఆప్నోతి = పొందుచుండును. 10

ఇహ = ఈ జగత్తున, కించన = ఏదియు, నానా = పరమేశ్వరుని వేఱుపఱచునది, నాస్తీతి = లేదని, మనసైవ = మనస్సు చేతనే, ఇదం = ఈ పరమాత్మతత్త్వము ఒకటేనని, ఆప్తవ్యం = భావింపఁదగినది. 11

బాహ్యేంద్రియములకు నానావిధములుగ కనఁబడు ప్రపంచమున అంతర్యామియు, పరమపదమున విరాజమానంబునగు శివతత్త్వ మొకటియేనని భావించువారికి-జన్మమృత్యుపరంపర-అంతరించునని. సారాంశము

"అంగుష్ఠమాత్రః పురుషో-మధ్య ఆత్మని తిష్ఠతి,
ఈశానో భూతభవ్యస్య-స తతో విజుగుప్సతే, ఏతద్వై తత్" 12
"అంగుష్ఠమాత్రః పురుషో-జ్యోతిరివాధూమకః,
ఈశానో భూతభవ్యస్య-స ఏవాద్య స ఉ శ్వః,
ఏతద్వై తత్" 13

ప. పురుషః = పరమపురుషుఁడైన శివుఁడు, అంగుష్ఠమాత్రః బొటనవ్రేలంతవాడై, ఆత్మని మధ్యే—ఒడలునడుమ మనస్సులో, అధూమకః = పొగలేనట్టి, జ్యోతిరివ = అగ్నివలె ప్రకాశించుచు, తిష్ఠతి = ఉండును. తతః=అట్టి హృదయమునుండి, న విజుగుప్సతే = తనను మఱుగుపరచుకొనువాడు కాడు. ఏతద్వై = సమస్తప్రాణి హృదయాంతర్వర్తియగునదియే, తత్ = ఆ పరశివతత్త్వము.

స ఏవ = నిర్ధూమాగ్నిప్రకాశమానుఁడగు శివుఁడే. అద్య = ప్రస్తుతముండువాడు, స ఉ = అట్టి శివుఁడే, శ్వః = భవిష్యత్తునందుండువాడును.

ఏతద్వై = భూతభవిష్యత్ ప్రపంచమును శాసించునదియే. తత్ = ఆ పరశివతత్త్వము.

శరీరధారులగు జీవాత్మలందరి హృదయములలో నివసించుచు కరుణతో నవ్వారిని విడువక-ప్రేరేపించుచుండువాడే పరమాత్మ యని విదితమైనది.

"యథోదకం దుర్గే వృష్టం—పర్వతేషు విధావతి,
ఏవం ధర్మాన్ పృథక్ పశ్యం-స్తానేవానువిధావతి" 14

ప. యథా = ఏవిధముగా, దుర్గే = పోనలవిగానట్టికొండపై వృష్టం = కురిసినట్టి, ఉదకం = జలము, పర్వతేషు = క్రిందికొండ నేలలయందు, విధావతి = పరుగుడి పడునో, ఏవం = అదేవిధముగా, ధర్మాన్ = దేవత్వమానవత్వాది స్వరూపవైఖరులను, పృథక్ = ప్రత్యేక స్వతంత్రములుగా, పశ్యన్ = భావించువాడు, తానేవ = అట్టి దేవత్వమానవత్వాది ధర్మములనే, అనుధావతి = అనుసరించి పరుగిడుచుండును,

ఎత్తుపై పడిన నీరు క్రింది చోట్లకు పడునట్లు-దేవతలు మానవులు మొదలగు శరీరధారి జీవాత్మలు-స్వతంత్రులుగా వేరు వేరని భావించువాడు- పరమాత్మ సర్వత్ర సర్వదా వ్యాపించియుండు ననియు, దేవమానవాదులు స్వతంత్రులు కారనియు భావింపనిచో జన్మల నొందుచుండునని భావము

"యథోదకం శుద్ధే శుద్ధ-మాసిక్తం తాదృగేవ భవతి,
ఏవం మునే ర్విజానత-ఆత్మా భవతి గౌతమ" 16

ప. గౌతమా = నచికేతా! యథా = ఎట్లు, శుద్ధం = పరిశుభ్రమైన, ఉదకం = జలము, శుద్ధే = పరిశుభ్రజలమునందు, ఆసిక్తం = కలిసినదై, తాదృగేవ = అట్టి శుద్ధోదకమే, భవతి = అగునో, విజానతః = దేవమానవాదులలో నంతర్యామి పరమేశ్వరుఁడేనని గుర్తించునట్టి, మునేః = నిరంతరము భావించువానియొక్క, ఆత్మా = స్వరూపము, ఏవం = పరమేశ్వరస్వరూపముగా, భవతి ఏర్పడును.

"పరమేశ్వరుఁడు- సర్వాంతరాత్మ ఒకఁడే పలురకములనుండువాఁడు, చరాచరప్రపంచమునకు కారణము, సమస్తమునకు ఆధారము, ఉపాసకుల హృదయములలో నుండువాఁడని" తమ మనస్సులో భావించుటయేగాక-శాంభవదీక్షా స్వీకృతమైన ఇష్టలింగమును పూజించుచు అందు (పరమేశ్వరుని) ధ్యానించువాఁడు-ముక్తుఁడై శివసముఁడగునని విదితమైనది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్యప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రికృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కఠోపనిషద్గత ద్వితీయాధ్యాయమున ప్రథమవల్లి- సమాప్తము.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# కఠోపనిషత్తు-ద్వితీయాధ్యాయము



## ద్వితీయవల్లి



"పుర మేకాదశద్వార-మజస్యావక్రచేతసః,
అనుష్ఠాయ న శోచతి-విముక్తశ్చ విముచ్యతే,



ఏతద్వై తత్" 1

ప, అజస్య = జన్మమరణాదిరహితుఃడై నిత్యుఁడైన, అవక్రచేతసః = సంపూర్ణజ్ఞానము గల పరమేశ్వరుని కొరకై, ఏకాదశద్వారం = పదునొకండు ద్వారములు గల, పురం = శరీరమును, అనుష్ఠాయ = ఉపయోగించినచో, నశోచతి = దుఃఖింపఁజాలడు. మరియు విముక్తశ్చ = జీవితముననే రాగద్వేషాదులచే విడిబడినవాడైనచో విముచ్యతే = దేహాంతమున పరమపదముఁజెంది నిజరూపము గలవాడై శివసాయుజ్యము నొందును.

ముఖమున ఏడు, నాభితోగూడ క్రిందివి మూడు, శిరస్సు, ఇవి- ఏకాదశద్వారములు కాగా-త్వఙ్మాంసరక్తాదులు ప్రాకారములు, త్వఙ్మాంసాదుల నధిష్ఠించు ఆదిత్యాదులు-ద్వారపాలురు నగుటచే శరీరము పురమనియు, ఇంద్రియములనెడు పౌరులద్వారా నానావిధ భోగముల ననుభవించు జీవాత్మ-ప్రభువనియు వర్ణింపఁబడినది.

పురము పౌరులు ద్వారపాలురు ననువానికన్న-ఆత్మ-విలక్షణుఁడని గుర్తించినను జీవాత్మను శరీరేంద్రియాదిప్రభువుగ నియమించిన వాడు పరమేశ్వరుఁడగుటచే-జీవాత్మ తాను స్వతంత్రుఁడనని భావింపక—పరమాత్మకై శరీరాదుల నుపయోగించినచో-రాగద్వేషాది రహితమగు చిత్తవిశ్రాంతి గలవాడై ముక్తుండగును.

శరీరాదులు-ఇష్టప్రాణభావలింగధారణతోడనే శివునకు ఉప యోగింపఁదగిన వనుట- ఇందు పరమార్థము-

"హగ్ంసః శుచిషద్వసు రంతరిక్షసద్ధోతా వేదిషదతిథి
ర్దురోణసత్, నృషద్వరస దృతస ద్వ్యోమ ప దబ్జా
గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్" 2

ప. శుచిషత్ హంసః = పరిశుభ్రమైన ఆకాశమునందు సంచరించు సూర్యుఁడు, అంతరిక్షసత్ వసుః = అంతరిక్షమున నిరంతరము వీచునట్టి వాయువు. వేదిషత్‌హోతా = వేదికయందు నెలకొనియుండు అగ్ని, దురోణసత్ అతిథిః = గృహమునఁ బ్రవేశించునట్టి అతిథి, నృషత్ = మానవజన్మస్థుఁడు, వరసత్ = దేవయోనివిద్యమానుఁడు, ఋతసత్=సత్యలోకమున విరాజిల్లువాడు, వ్యోమసత్=దివ్యాంతరిక్షమున ఆనందించువాడు, అబ్జాః=జలమందు జన్మించునట్టి, గోజాః = నేలలో పుట్టునట్టి, ఋతజాః=ఆకాశమున సంభవించునట్టి, అద్రిజాః = కొండలయందు ఆవిర్భవించునట్టి జీవాత్మలు-బృహత్=అపరిచ్ఛిన్నమగు (ఇంత అంత యని కొలత లేనట్టి) ఋతం = బ్రహ్మంబేను.

"ఋతం సత్యం పరంబ్రహ్మ" ఇత్యాది శ్రుతి ననుసరించి "ఋతం" అనగా-బ్రహ్మంబని చెప్పఁబడినది. ఇఁట గల ఋత

శబ్దము—ఒకచో సత్యలోకమనియు, మరియొకచో ఆకాశమనియు సందర్భానుసారముగ నిర్వచింపఁబడినది.

చరాచర ప్రపంచమంతయు పరమేశ్వరుఁడంతర్యామిగ గల దగుటచే సూర్య వాయు అగ్ని అతిథి మానవ దేవతాదిరూపములుగల జీవులందరు ఏనాటికైనను ముక్తులగుదురు గాన శివస్వరూపులని ఇందు విశదీకరింపఁబడినది.

"ఊర్ధ్వం ప్రాణ మున్నమయ-త్యపానం ప్రత్యగస్యతి,
మధ్యే వామన మాసీనం-విశ్వేదేవా ఉపాసతే" 3

ప. యః = ఎవఁడు, ప్రాణం = ప్రాణవాయువును, ఊర్ధ్వం ఉన్నమయతి = పైకి నడిపించునో. అపానం = అపానవాయువును, ప్రత్యగస్యతి = క్రిందికి నడిపించునో, తం = అటువంటి, మధ్యే = హృదయకమలమధ్యమున, ఆసీనం = నెలకొనిన, వామనం = హృదయపుండరీకగత ప్రదేశమున ఇముడఁగలుగు చిన్న రూపము గల పరమాత్మను, విశ్వే దేవాః = దైవీసంపద గల సత్త్వగుణ ప్రధానులు, ఉపాసతే = పూజాజపధ్యానముల నుపాసింతురు.

దేవమానవాదులలో సత్త్వగుణసంపన్నులగువారు — తమ హృదయమున భావలింగమును "శివోఽహం" అని ధ్యానించుచు, ప్రాణలింగమును శివపంచాక్షరీజపముతో అనుసంధించుచు, హృదయమున అంగుష్ఠమాత్రుఁ (వామనుఁ)డై నివసించు పరమేశ్వరుని ప్రతిరూపముగ ఇష్టలింగమును ధరించి-శివాగమోక్తరీతి నర్చించుచు జన్మాంతమున ముక్తులగుదురని వివేకము.

"అస్య విస్రంసమానస్య-శరీరస్థస్య దేహినః,
దేహా ద్విముచ్యమానస్య-కిమత్ర
పరిశిష్యతే, ఏతద్వై తత్" 4

ప. శరీరస్థస్య = దృఢశరీరమునందు ఉన్నట్టి, దేహినః = ప్రాణియగు, అస్య = ఈ ఉపాసకుని పరిగణింపక, విస్రంసమానస్య = శిథిలమైనశరీరము గల, దేహాత్ = దేహమునుండి, విముచ్యమానస్య = ప్రాణము విడిపోవుచుండగా, అత్ర = ఈ విషయమై, కిం పరిశిష్యతే = మిగులునదేమిటి ? ఏతద్వై = శరీరమునుండి ప్రాణమును విడిపించునధియే, తత్ = ఆ శివతత్త్వమగును.

ఎన్నాళ్ళు జీవించినను ఇంకను బ్రతుకవలెనని భావించు జీవాత్మను రోగాదులచే వృద్ధత్వమువలనను జీర్ణించిన శరీరమునుండి ప్రాణముతో సహ బయలుపఱచువాడు. శివుఁడే గాని జీవుఁడు కాదని ఇందు తేటపడినది.

"న ప్రాణేన నాపానేన-మర్త్యో జీవతి కశ్చన,
ఇతరేణ తు జీవంతి-యస్మిన్నేతా వుపాశ్రితౌ." 5

ప. కశ్చన మర్త్యః = ఏ మానవుఁడైనను, ప్రాణేన = ప్రాణవాయువుతో, న = జీవింపడు, తథా = అట్లే, అపానేన = అపానవాయువుతో, న జీవతి = మనుగడఁ జేయఁజాలడు. యస్మిన్ = ఏ శివుని యందు, ఏతౌ = ఈ ప్రాణ అపానములు, ఉపశ్రితౌ = ఆధారపడి యున్నవో, ఇతరేణ తు = ప్రాణాపానభిన్నుఁడైన శివునిచేతనే, జీవంతి = ప్రాణులు బ్రతుకుచున్నవి.

ప్రాణుల జీవితములు శివాధీనములని భావము.

"ప్రాణానాం గ్రంథి రసి రుద్రో మా విశాంతకః" అనుశ్రుతి వాక్యము-ఇందుకు ప్రోద్బలకము.

"హంత త ఇదం ప్రవక్ష్యామి-గుహ్యం బ్రహ్మసనాతనం,
యథా చ మరణం ప్రాప్య-ఆత్మా భవతి గౌతమ" 6

పదార్థము - గౌతమ = నచికేతసుఁడా! తే = నిష్కాముడవైన నీకు; గుహ్యం = రహస్యమైన; సనాతనం = శాశ్వతమైన; ఇదం = ఇంతవరకు నిర్దేశింపఁబడిన ఈ; బ్రహ్మ = పరమాత్మను గురించి, ప్రవక్ష్యామి = మరల వివరించి చెప్పెదను. ఆత్మా = జీవాత్మ; పరమాత్మనుపాసింపనిచో; మరణం = మరణమును; ప్రాప్య = పొంది; యథా = ఏవిధము; భవతి = అగుచున్నాడో; హంత = ఆశ్చర్యము;

శివునుపాసింపని పామరుని గతిని చెప్పినచో శివోపాసకుఁడైన పండితుని శరీర పాతానంతర స్థితి అవగతమగునని సారాంశము.

"యోని మన్యే ప్రపద్యంతే - శరీరత్వాయ దేహినః,
స్థాణు మన్యేఽను సంయంతి-యథాకర్మ యథాశ్రుతమ్"

పదార్థము - దేహినః = బ్రహ్మజ్ఞాన (శివోపాసన)ము లేనట్టి ప్రాణులైన, అన్యే = పూర్వకృతప్రారబ్ధకర్మభోగులు కొందరు, శరీరత్వాయ = మరియొక శరీరము కలిగియుండుటకై, యోనిం = బ్రాహ్మణాది మానవజన్మను, ప్రపద్యంతే = పొందుదురు. అన్యే = మరికొందరు, స్థాణుం = వృక్షాదిజన్మను, ప్రపద్యంతే = పొందుదురు. వీరందరును యథాకర్మ = పూర్వకర్మ ననుసరించియు, యథాశ్రుతం = పూర్వజన్మసంపాదితజ్ఞానము ననుసరించియు, అనుసంయంతి = జననమరణాత్మకమగు సంసారము ననుసరించువారేను:

వస్తుతః దుఃఖభూయిష్ఠమైన సంసారమునందు విరక్తిగలవారై జన్మ మరణ పరంపరా పాశమును విడిపించుకొని శివసాయుజ్యము నొందవలెనని ఇందు ద్యోతకమగుచున్నయది.

"య ఏష సుప్తేషు జాగర్తి - కామం
కామం పురుషో నిర్మిమాణః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ – తదేవామృత ముచ్యతేః
తస్మింల్లోకాః శ్రితాః సర్వే - తదు నాత్యేతి కశ్చన,
ఏతద్వై తత్" 8

పదార్థము–సుప్తేషు=ప్రాణులు నిద్రించుచుండగా, యఏషః= ఏ ఈ, పురుషః = పరమాత్మ, కామంకామం = నిద్రించిన జీవాత్మ యొక్క కర్మభోగమునకు అనుగుణముగా సంకల్పించి, నిర్మిమాణః = స్వప్నవిషయములను నిర్మించునో, తదేవ = అట్టి శివ తత్త్వమే. శుక్రం = ప్రకాశకముగా, తత్ = అదియే, బ్రహ్మ = బ్రహ్మముగా, తదేవ = అదియే, అమృతం = అనాదిముక్తముగా, (లేక) నిరవధిక ముక్తాత్మభోగ్యంబుగాను, ఉచ్యతే = చెప్పఁబడు చున్నది. తస్మిన్ = ఆ పరశివునందు, లోకాఃసర్వే = సత్యలోకాదులు, (లేక) దేవమానవాది జనులందరును, శ్రితాః = ఆధారపడియుండునవి, (ఉండువారు) తదు=ఆ పరశివ తత్త్వమును, కశ్చన= ఏప్రాణియు, నాత్యేతి = అతిక్రమింపజాలదు, ఏతద్వై=శుక్రత్వాది లక్షణములు గలదియే, తత్ = పరశివతత్త్వంబగును.

స్వప్నములో నానావిధ వస్తువులను చూపెట్టు సామర్థ్యము శివునకే కలదనియు, జీవాత్మ పరతంత్రుఁడగుటచే స్వప్న విషయములను కల్పింపలేడనియు, సమస్తలోకాధారము శివుఁడే ననియు ఇందు విదితమైనది.

"అగ్నిర్యథైకో భువనం ప్రవిష్టో- రూపంరూపం ప్రతి
రూపో బభూవ, ఏకస్తథా సర్వభూతాంతరాత్మా–
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ" 9

పదార్థము = యథా = ఏవిధముగా, అగ్నిః = అగ్ని, భువనం = కాష్ఠాదిస్థానమును, ప్రవిష్టః = పొందినదై, రూపం రూపం = పొందఁబడినవస్తువుగా, ప్రతిరూపః = ఆయా వస్తువుల రూపము గలది, భవతి = అగుచున్నదో, తథా = ఆ విధముగా, ఏకః = ఒకే పరమాత్మ, సర్వభూతాంతరాత్మా = ప్రాణులందరిలో చేరినవాడై, రూపంరూపం = తాను లోనఁ ప్రవేశించిన దేవమానవాదులుగా, ప్రతిరూపః = ఆ యా వ్యక్తుల రూపము గలవాడగును. బహిశ్చ = బ్రహ్మాండమునకు వెలుపలైతే అంతట వ్యాపించువాడు పరమాత్మయేను.

సంపూర్ణజ్ఞాన స్వరూపుఁడగు పరమాత్మచే జీవాత్మలు వ్యాపింపఁబడినను కర్మానుసారముగ జ్ఞానసంకోచము గలవారగుదురనియు, దేవమానవ పశు పక్ష్యాది శరీరములయందు నిండు అభిమానము గలవారగుటచే జీవాత్మలు-శరీరేంద్రియాది సుఖభోగలాలసులై-నిజరూపజ్ఞానమును గోలుపోయినందున జ్ఞానసంకోచ (అవివేక)ముచే పరమాత్మ తమలో నున్నాఁడని గుర్తింపక-బాధపడుచుందురని సారాంశము.

"వాయు ర్యథైకో భువనం ప్రవిష్టో - రూపం రూపం
ప్రతిరూపో బభూవ, ఏక స్తథా సర్వభూతాంతరాత్మా
రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ" 10

వాయుదృష్టాంతముతో పూర్వవాక్యమునందు చెప్పఁబడిన పరమేశ్వర సర్వాంతర్యామిత్వము ఈ వాక్యమున బలపరుపఁబడినది.

"సూర్యోయథా సర్వలోకస్య చక్షు - ర్న
లిప్యతే చాక్షుషై ర్బాహ్యదోషైః, ఏక స్తథా

సర్వభూతాంతరాత్మా - న లిప్యతే
లోకదుఃఖేన బాహ్యః" 11

సూర్యుఁడు సమస్త ప్రపంచమునకు నేత్రముగా నుండినను నేత్ర సంబంధములగు వికారములు లేనివాడైనట్లు-ఒకే పరమాత్మ-ప్రాణులందరిలో నుండినను జీవాత్మల సుఖదుఃఖములు లేనివాడై చేతనాచేతనములకన్న విలక్షణుఁడునై కర్మపరాధీనుఁడు కాదని భావార్థము.

"ఏకో వశీ సర్వభూతాంతరాత్మా - ఏకం బీజం
బహుధా కరోతి, త మాత్మస్థం యేఽను పశ్యంతి ధీరా-
స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్" 12

పదార్థము - సర్వభూతాంతరాత్మా = ప్రాణులందరిలో సూక్ష్మాతి సూక్ష్మరూపమున నివసించునట్టి, వశీ=చరాచర ప్రపంచమును తన యధీనము నొనర్చుకొనినట్టి, ఏకః = ఒకే పరమాత్మ ఏకం = తన నెడబాయనట్టి, బీజం = పంచభూతాదులకు కారణమైన ప్రధానమును (ప్రకృతిని) బహుధా = మహత్తు మొదలగు రూపములతో పలువిధములు గలదానిగా, కరోతి = తన సంకల్పముచేతనే, విపులీకరించువాడు.

ఆత్మస్థం=తమలోనున్నట్టి, తం=ఆ పరమాత్మను, యేధీరాః= ఏ బుద్ధిమంతులు, అనుపశ్యంతి = శ్రవణమననాదులతో సాక్షాత్కరింపఁజేసికొందురో, తేషాం = అట్టివారికే, శాశ్వతం సుఖం = శాశ్వతమైన మోక్షసుఖము చేకూరును. ఇతరేషాం = అనుపాసకులగు ఇతరులకు, న= జన్మరాహిత్యము సంభవింపదు.

ప్రకృతిని వశపఱచుకొని ప్రకృతిని విడువనివాడై ప్రకృతిని

విస్తరింపఁజేయు మహాపురుష (శివు)నితో సమానుఁడు గాని శివుని కంటె గొప్పవాడు గాని లేనందున - ప్రకృతిద్వారా ప్రపంచజనకుఁడైన పరమాత్మ-తనలో ఉన్నాడు - అనుటకు గుర్తుగా - బాహ్య లింగధారణఁ జేసికొని శివునుపాసించు భక్తునకే మోక్షము సిద్ధించు నని ఇందు విదితమైనది.

"నిత్యో నిత్యానాం చేతన శ్చేతనానా - మేకో
బహూనాం విదధాతి కామాన్, తమాత్మస్థం యేఽను
పశ్యంతి ధీరా- స్తేషాం శాంతిః శాశ్వతీ నేతరేషామ్" 13

పదార్థము = నిత్యులైన జీవాత్మలకు, నిత్యః = అంతర్యామిగ నెల్లకాలము సమీపించువాడు, చేతనానాం = తెలివిగల ఆత్మలకు, చేతనః = తెలివిని పెంపొందించువాడు, ఏకః = ఒక్కఁడే, బహూనాం = అనేకులైన భక్తులయొక్క, కామాన్ = ఐహిక ఆముష్మికములగు కోరికలను. విదధాతి = సిద్ధింపఁజేయువాడును పరమేశ్వరుఁడేను.

"అట్టి పరమాత్మ తమలో నున్నవాడని" భావించుచు పూజా జప ధ్యానములతో ప్రార్థించువారికే శాశ్వతశాంతి (శివసాయుజ్యము) చేకూరును. తదితరులకు సంసారప్రవృత్తియే నని ఉత్తరవాక్యార్థముగ విదితమైనది.

"తదేతదితి మన్యంతేఽనిర్దేశ్యం పరమం సుఖం,
కథం ను తద్విజానీయాం-కిము భాతి విభాతి వా" 14

పదార్థము - అనిర్దేశ్యం = ఇది ఇంతేనని నిరూపింపనలవిఁగానిది, పరమంసుఖం = సర్వశ్రేష్ఠమైన ఆనందమునగు తత్ = బ్రహ్మము, ఏతదితి = నిరతిశయ సుఖస్వరూపంబని, మన్యంతే = నీవంటి జ్ఞానులు భావింతురు.

తత్ = బ్రహ్మము, భాతి కిము = దివ్యవిగ్రహముతో ప్రకాశించునా ? విభాతి కిము వా = సంపూర్ణజ్యోతిః స్వరూపమున రాణించునా ? కథం విజానియాం = ఎట్లు తెలిసికొనవలెను ?

అపరిచ్ఛిన్నమగు బ్రహ్మమునకు దివ్యవిగ్రహము కలదని నిర్ణయమగుచో సామాన్యతః బ్రహ్మమును గుర్తించి - అఖండ జ్యోతిని భావించుచు విశేషతః బ్రహ్మసాక్షాత్కారమును పొంద వచ్చునా ? అని శిష్యుఁడు ఆచార్యుని ప్రశ్నించెనని ఇందలి సారాంశము.

"న తత్ర సూర్యో భాతి న చంద్రతారకం – నేమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః, తమేవ భాంత మను భాతి సర్వం-తస్య భాసా సర్వమిదం విభాతి''.

పదార్థము – తత్ర = అఖండజ్యోతివిషయమై, సూర్యః = రవి, నభాతి = ప్రకాశింపడు. చంద్రతారకం = చంద్రుఁడు నక్షత్రములును, న = ప్రకాశింపవు- ఇమా విద్యుతః = ఈ మెఱుపులు, నభాంతి = ప్రకాశింపవు- అయం అగ్నిః = ఈ అగ్ని, కుతః? = ప్రకాశింపదని వేరుగా చెప్పనవసరము లేదు.

భాంతం = స్వయంప్రకాశమానుఁడగు, తమేవ= అఖండజ్యోతి యగు పరమేశ్వరునే, సర్వం = సూర్యచంద్రాది తేజస్సులన్నియు, అనుభాతి = అనుసరించి ప్రకాశించునవి. తస్య = పరమేశ్వరుని యొక్క, భాసా = సహజమైన కాంతిచే, ఇదంసర్వం = సూర్య చంద్రాదికమగు ఈ జగత్తంతయు, విభాతి= వెలుగందుచున్నయది.

అఖండజ్యోతియొక్క లక్షణమును నిర్దేశించి - సూర్యాదులకు తేజస్సు నొసఁగునట్టి అఖండజ్యోతిని-పరమేశ్వరుని దివ్యవిగ్రహము

నందు దర్శింపవలెననియు, అందుకు సమీపసాధనము—ఇష్టప్రాణ భావలింగారాధనమనియు ఈ చివరి వాక్యమందు ద్యోతకమగుచున్న యది.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య ప్రణీత భాష్యమునకు
శ్రీ నాగలింగశాస్త్రి కృత సంస్కృత వ్యాఖ్యానమునకును
"శివతత్త్వప్రభ" అను శాంకరీయ ఆంధ్రానువాదమున
కఠోపనిషద్గత — ద్వితీయాధ్యాయమున ద్వితీయవల్లి
సమాప్తము



శ్రీ మహా గణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# కఠోపనిషత్తు-ద్వితీయాధ్యాయము

## తృతీయవల్లి

"ఊర్ధ్వమూలోఽవాక్ శాఖ-ఏషోఽశ్వత్థః సనాతనః,
తదేవ శుక్రం తద్బ్రహ్మ-తదేవామృత ముచ్యతే।
తస్మిన్ లోకాః శ్రితాః సర్వే-తదు నాత్యేతి కశ్చన॥
ఏతద్వై తత్॥ 1

ఏషః = ఈ ప్రపంచము, ఊర్ధ్వమూలః = పై హిరణ్యగర్భుఁడు మూలముగా గలిగినట్టి, అవాక్ శాఖః = క్రిందనుండు దేవ మనుష్యాదులు కొమ్మలుగా గలిగినట్టి, సనాతనః = అనాదికాలము నుండి ప్రవర్తించునట్టి. అశ్వత్థః = రావిచెట్టుగ నుండునది.

అశ్వత్థః = రేపు ఉండనిదగుటచే ప్రపంచము శాశ్వతము కాదని గుర్తింపవలెను. ప్రపంచమునకు మూలము పరమాత్మ యనినచో ప్రపంచమువలె పరమాత్మ గూడా శాశ్వతుఁడు కాదని అర్థమగునుగాన ప్రపంచ మూలము బ్రహ్మదేవుఁడని చెప్పవలసి వచ్చినది.

తదేవ = ప్రపంచవిలక్షణమైన శివతత్త్వమే, శుక్రం = సర్వ

ప్రకాశకముగా, తత్ = ఆ శివతత్త్వము, బ్రహ్మ = బ్రహ్మముగా, తదేవ = అదియే, అమృతం = అనాదిముక్తముగా, (లేక) నిరవధిక ముక్తాత్మభోగ్యంబుగాను, ఉచ్యతే = చెప్పఁబడుచున్నది. తస్మిన్ = ఆ పరశివునందు, లోకాః సర్వే = దేవమానవాది జనులందరును, శ్రితాః = ఆధారపడియుండువారు. కశ్చన = ఎవఁడును, తదు = ఆ పరశివస్వరూపమును, నాత్యేతి = అతిక్రమింపఁజాలఁడు. ఏతద్వై = శుక్రత్వాదిలక్షణములు గలదియే, తత్ = ఆ పరశివతత్త్వం బగును.

పరమేశ్వరుఁడే ఇంద్రచంద్రాదిలోకములను వ్యక్తపఱచువాఁడై శాశ్వతుఁడై యుండునని గుర్తించి అనిత్యమగు ప్రపంచముపై మమకారమును విడనాడవలెనని భావము.

"యదిదం కించ జగత్సర్వం-ప్రాణ ఏజతి నిఃసృతం,
మహద్భయం వజ్ర ముద్యతం-య ఏతద్విదు
రమృతా స్తే భవంతి" 2

"భయాదగ్ని స్తపతి-భయాత్తపతి సూర్యః,
భయా దింద్రశ్చ వాయుశ్చ-మృత్యుర్ధావతి పంచమః"3

ప. నిఃసృతం = తననుండి వెలువడినట్టి, యదిదం కించ = ఏ ఈ, జగత్సర్వం = జగత్తునంతటిని, ప్రాణః = పరమాత్మ,

ఉద్యతం = లేపఁబడిన, వజ్రం = వజ్రాయుధమువలె, మహద్భయం = గొప్పభయమును కలుగించువాఁడై, ఏజతి = వణికించును. భయాత్ = భీతివలన, అగ్నిః = అగ్ని, తపతి = తపించును. సూర్యః = సూర్యుఁడు, భయాత్ = పరమేశ్వరునివలన నైన వెఱపువలన, తపతి = ఆకాశమున సంచరించుచు ప్రకాశించును.

ఇంద్రః = దేవేంద్రుఁడు, వాయుశ్చ = వాయుదేవుడును, పంచమః = ఐదవదైనట్టి, మృత్యుః = మృత్యుదేవత, భయాత్ ధావతి = భయపడి పరుగిడునట్లు ప్రవర్తించును.

అగ్ని రవి ఇంద్ర వాయు మృత్యుప్రభృతికులగు లోకపాలురు సమర్థులైనను శివాజ్ఞాబద్ధులై శివశాసనమును జవదాటనివారై తమ తమ పనులను కొనసాగించుచుందురని భావము.

"ఇహ చే దశక ద్బోద్ధుం-ప్రాక్ శరీరస్య విస్రసః,
తతః సర్గేషు లోకేషు—శరీరత్వాయ కల్పతే" 4

ప. ఇహ = ఈ మానవలోకమున, శరీరస్య = దేహముయొక్క, విస్రసః = శిథిలత్వమునకంటె, ప్రాక్ = ముందు, బోద్ధుం = దేవమానవాదిచేతనవర్గమును తన శాసనముచే వశపఱచుకొనునట్టి పరమేశ్వరు నుపాసించుటకు, అశకచ్చేత్ = సమర్థుఁడు కానిచో, తతః = ఆటుపిమ్మట, సర్గేషులోకేషు = పశుపక్ష్యాదిజన్మల యందు, శరీరత్వాయ = శరీరముగలిగి యుండుటకై, కల్పతే = అర్హుఁడగును.

దుర్లభమైన ఈ మానవజన్మలోనే శాంభవదీక్షితుఁడై పరమేశ్వరు నారాధింపనిచో—ఈ శరీరమును విసర్జించిన తరువాత పశుపక్ష్యాదిజన్మల నొందునని భావము.

"యథాఽఽదర్శే తథాఽఽత్మని-యథా
స్వప్నే తథా పితృలోకే। యథాఽప్సు
పరీవ దదృశే-తథా గంధర్వలోకే,
ఛాయాతపయో రివ బ్రహ్మలోకే" 5

ప. యథా = ఏ విధము, ఆదర్శే = స్వచ్ఛమైన అద్దమునందు

ముఖము స్పష్టముగ కనుపడునో, తథా = అదే విధము, ఆత్మని = తన హృదయములో ధ్యానరూపముగ నుపాసించునెడల, పరమాత్మ సంపూర్ణముగ గోచరించును.

పితృలోకే = గంధర్వలోకే = బ్రహ్మలోకే = పితృ గంధర్వ హిరణ్యగర్భలోకాదులలో దర్శింపనుపాసించువానికి స్వప్నే యథా = స్వప్నమునందువలె, అప్సుయథా = ఉదకమునందువలె, పరీవ = స్వల్పముగానే దదృశే = పరమాత్మ కనుపడును.

హృదయమున శివసాక్షాత్కారము-ఎండవలె సంపూర్ణ ప్రకాశమానము కాగా పితృలోకాదులందు మహేశ్వర దర్శనము నీడవలె స్వల్పప్రకాశము కలదగును

సర్వోత్తరమైన పరమపదముఁజేరుటకు - మానవుడు తన హృదయములోనే శివుని ధ్యానింపవలెననియు, హృదయమున శివుని ధ్యానింపఁజాలక - పై దేవలోకాదులయందు శివుని దర్శించుటకు బాహ్యమున ప్రార్థించినచో అట్టివారికి శివదర్శనము సంపూర్ణముగ కాదనియు విదితమైనది.

"ఇంద్రియాణాం పృథక్ భావ-ముదయాస్తమయౌ చ యత్,
పృథగుత్పద్యమానానాం-మత్వా ధీరో న శోచతి" 6

ప. పృథక్ = వేరు వేరు స్వభావముతో, ఉత్పద్యమానానాం = ఆవిర్భవించునట్టి, ఇంద్రియాణాం = జ్ఞానకర్మేంద్రియముల యొక్క, పృథక్ భావం = వేరువేరు స్థితిని, ఉదయాస్తమయౌచ = విషయముల ప్రకాశన (ఉదయ)మును, అప్రకాశన (అస్తమయ) మునున్ను, ధీరః = ధీరుఁడు, మత్వా = భావించినచో, న శోచతి = దుఃఖింపడు.

ఇంద్రియములలో ఒకటి రూపమును చూపెట్టును. మరియొకటి-శబ్దమును వినుపించును. ఇట్లు ఇంద్రియములు వేరువేరు గుణములు కలవికాగా అవ్వాని ఉపయోగము ఉదయమనియు, అనుపయోగము అస్తమయమనియు గుర్తించి-పృథక్భావము ఉదయాస్తమయములు-ఇంద్రియములకు మరియు దేహమునకు మాత్ర ముండుననియు, జీవాత్మకు ఉండవనియు భావించువాడు-సంసారదుఃఖము ననుభవింపఁ జాలడని సారాంశము.

"ఇంద్రియేభ్యః పరం మనో-మనసః సత్త్వ ముత్తమం,
సత్త్వా దధి మహానాత్మా-మహతో ఽవ్యక్త మత్తమమ్"7
అవ్యక్తాత్తు పరః పురుషో-వ్యాపకో ఽలింగ ఏవ చ,
యం జ్ఞాత్వా ముచ్యతే జంతు-రమృతత్వం చ గచ్ఛతి"

ప. మనః = మనస్సు, ఇంద్రియేభ్యః = ఇంద్రియములకన్న, పరం = శ్రేష్ఠమైనది. మనసః = మనస్సునకంటె, సత్త్వం = బుద్ధి, ఉత్తమం = ముఖ్యమగునది. సత్త్వాత్ = బుద్ధికన్న, మహానాత్మా = జీవాత్మ, అధి = అధికుఁడగును. మహతః = జీవాత్మకంటె, అవ్యక్తం = అవ్యక్త (ప్రపంచభూతశరీరముగ పరిణమించు ప్రధాన)ము, ఉత్తమం = మించినది. అవ్యక్తాత్ = అవ్యక్తమునకంటె అలింగః = శబ్దాదివిషయములనఁదగు గుర్తులచే గోచరుఁడు కానట్టి, వ్యాపకః చరాచరప్రపంచమును వ్యాపించునట్టి, పురుషః = పరమపురుషుఁ డశివుఁ)డు పరః = శ్రేష్ఠుఁడగువాడు.

జంతుః = దేవమానవాది ప్రాణిమాత్రుఁడు, యం = ఏ పరమ పురుషుని, జ్ఞాత్వా = సర్వశ్రేష్ఠునిగా గుర్తించి ఉపాసించి దర్శించినచో,

ముచ్యతే=సంసార బంధవిముక్తుఁడగును. మరియు అమృతత్వంచ= శివసాయుజ్యమును, గచ్ఛతి=పొందును.

పరమాత్మనాశ్రయించి "నీవేగతి" యని ప్రార్థించు ఆత్మ ప్రకృతికి లొంగక బలిష్ఠమగును - ఆత్మబలమున బుద్ధి-వశవర్తి యగును బుద్ధిబలముచే-మనస్సు అదుపులో నుండును నిశ్చలమనంబున ఇంద్రియములు స్వాధీనములగునని భావము.

"న సందృశే తిష్ఠతి రూప మస్య—న
చక్షుషా పశ్యతి కశ్చనైనం, హృదా
మనీషా భక్త్యా ధృత్యా మనసాఽభిక్లుప్తో-య
ఏతద్విదు రమృతా స్తే భవంతి" 8

ప అస్య= ఈ పరమపురుషునియొక్క, రూపం= దివ్యము అప్రాకృతంబునగు స్వరూపము. సందృశే= ప్రాకృత దృక్పథమునందు, న తిష్ఠతి= లభ్యము కాదు. మరియు కశ్చన= ఎవఁడును, చక్షుషా= ప్రాకృతనేత్రముతో, ఏనం= ఈ పరమపురుషుని, న పశ్యతి= చూడలేడు.

హృదా= సమీపస్థములు దూరస్థములు నగు వస్తువులను కని పెట్టు చిత్తముతో, మనీషా= (ప్రథమాంతము ఛాందసము) ఆత్మానాత్మ వివేచన సమర్థమగు బుద్ధితో, మనసా= మననాత్మకమగు ఉపాసనముచేతను, అభిక్లప్తః= అభిముఖముగ సాక్షాత్కరించువాడే పరమాత్మ, యే= ఎవరు, ఏతత్= ఈ విధము, విదుః=భావింతురో, తే= వారు, అమృతాః= ముక్తులు, భవంతి= అగుదురు.

"రూపము, రూపముగలది" అను విభాగము అవసరములేనిదై

నికటదూరవర్తి అర్థజాతమును గ్రహించునది-చిత్తమగును. నేత్రాదులు రూపముగల వస్తువులను మాత్రము కనిపెట్టును. నేత్రాదులకు గోచరముకానట్టి విషయములను గ్రహించు సామర్థ్యము-శివపూజా స్తోత్రాదులచే సంస్కరింపఁబడిన మనస్సు అనఁదగు చిత్తమునకే నుండును. ఆత్మ ఏది, ఆత్మకానిది ఏది అని విమర్శించు శక్తి గల బుద్ధి-శివోపాసనమునకు ముఖ్యసాధనము కాగా-శివధ్యానము (శివోఽహంభావన) శివదర్శనము నొదవఁజేయును

శాస్త్ర పాండిత్యముచే ఆత్మానాత్మ వివేచన పరిజ్ఞానము కలిగినను శివసాక్షాత్కారము సంభవింపదు. మననమనగా-వివేచనముతో పరమాత్మగా గుర్తింపఁబడిన పరమపురుషుని చింతనము, భక్తి (హృత్)చేతను, ధైర్యము (ధృత్యా) చేతను పరమేశ్వరుని దర్శింపఁగలుగుదురనియు చెప్పవచ్చును.

"యదా పంచావతిష్ఠంతే-జ్ఞానాని మనసా సహ ।
బుద్ధిశ్చ న విచేష్టేత-తామాహుః పరమాం గతిమ్"10

ప. "యదా = ఎప్పుడు, పంచజ్ఞానాని = ఐదు జ్ఞానేంద్రియములు, మనసాసహ = మనస్సుతో గూడ, అవతిష్ఠంతే = పరమాత్మకు అభిముఖములై నిలుచునో, బుద్ధిశ్చ = బుద్ధియు, న విచేష్టేత = నిశ్చలమగునో, తాం = అట్టి స్థితిని, పవమాంగతిం = మోక్షసాధనమైన ముఖ్యమగు పరమపదప్రాప్తి సాధనముగా, ఆహుః = చెప్పుదురు.

మనస్సు సంకల్ప వికల్పములను మానుకొని శ్రోత్రాదిజ్ఞానేంద్రియములు శ్రవణాదులు లేనివై స్తంభించునెడ-బుద్ధియు పరమాత్మ

శివుని గురించియే ప్రవర్తించుచునెడ-అట్టి యోగధారణమే మోక్ష సౌధసోపానమగునని వివేకము,

"తాం యోగ మితి మన్యంతే-స్థిరా మింద్రియ ధారణాం,
అప్రమత్తస్తదా భవతి-యోగో హి ప్రభవాప్యయౌ" 11

ప. తాం = పూర్వమంత్రమునందు చెప్పఁబడిన, స్థిరాం = స్థిరమైన, ఇంద్రియధారణాం = ఇంద్రియములను నిలుపుటను, యోగ మితి = యోగమని, మన్యంతే = యోగసిద్ధివిదులు భావింతురు.

తదా = అట్టి సమయమున, అప్రమత్తః = ప్రమాదములేనివాడై, భవతి = ఉండవలెను. హి = ఎందుకనఁగా? యోగః = ప్రాణాయామాది యోగాభ్యాసము, ప్రభవాప్యయౌ = వృద్ధిక్షయములు గలదగును.

యోగాభ్యాసమున-మనస్సు బుద్ధి ఇంద్రియములు శరీరంబు స్థిరములైనను పొరపాటు (యోగసాధనలో తొట్రుపాటు) ఏర్పడును. గాన జాగరూకుఁడైనచో యోగసిద్ధి కలుగునని సారాంశము.

'నైవ వాచా న మనసా-ప్రాప్తుం శక్యో న చక్షుషా,
అస్తీతి బ్రువతోఽన్యత్ర-కథం తదుపలభ్యతే ?" 12

ప. చక్షుషా = ప్రాకృతనేత్ర దృష్టిచే, మనసా = ఊహాపోహలతో కూడిన మనస్సుతో, వాచా = వాదోపవాదనైపుణ్యము గల వాక్కుతోడను, ప్రాప్తుం = నిశ్చయించుటకు, న శక్యః = పరమాత్మ సమర్థింప వలనుపడనివాడు.

అస్తీతి = పరమేశ్వరుఁడు హృదయాదిస్థానములలో ఉన్నవాడని, బ్రువతః = చెప్పునట్టి వేదవాక్కుకంటె, అన్యత్ర = మరియొక

రీతిని, తత్ = బ్రహ్మము, కథం = ఎట్లు, ఉపలభ్యతే = అవగత మగును ?

శ్రుతిస్మృతి శివాగమ పురాణాది వాఙ్మయము ప్రమాణము కాదని లౌకిక వాక్యములతో దేశభాషా నిబద్ధములగు రచనల తోడను పరమేశ్వర పరిజ్ఞానము సంభవింపదని ఇందు విదితమైనది.

"అస్తీత్యేవో లబ్ధవ్య- స్తత్త్వభావేన చోభయోః,
అస్తీత్యేవోప లబ్ధస్య-తత్త్వభావః ప్రసీదతి" 13

ప అస్తీత్యేవ = బ్రహ్మము కలదనియే, తత్త్వభావేన = యథార్థమైన స్థితిని భావించుటతో, ఉపలబ్ధవ్యః = తెలియదగినవాడు పరమాత్మ, ఉభయోః = ఆస్తిక్య తత్త్వభావములలో, అస్తీత్యేవ = బ్రహ్మము ఉన్నదను ఆస్తిక్యమును, ఉపలబ్ధస్య = దృఢముగ పొందినవానికి, తత్త్వభావః బ్రహ్మముఁదగు స్వరూపము, ప్రసీదతి = సాక్షాత్కారయోగ్యముగ ప్రసన్న మగును. తత్త్వభావః ప్రసీదతి = మనస్సు ప్రసన్నమగుననియు చెప్పవచ్చును.

వేదశాస్త్రాదులయందు అప్రామాణ్యబుద్ధి లేనట్టి ఆస్తికశిఖామణులే శాంభవదీక్షితులై ఇష్టలింగము శివుఁడేనని దృఢముగ విశ్వసించి ప్రాణలింగానుసంధానమును చేయుచు భావలింగసాక్షాత్కారమును స్వాత్మలో బడయుదురని సారాంశరహస్యము.

"యదా సర్వే ప్రముచ్యంతే-కామా యేఽస్య హృది శ్రితాః,
అథ మర్త్యోఽమృతో భవ-త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" 14

ప. యదా = ఎప్పుడు, అస్య = ఈ శివోపాసకుని యొక్క, హృది = హృదయమునందు, శ్రితాః = పాదుకొనియున్నట్టి, కామాః

= అవిహితములైన కోరికలు, సర్వే = అన్నియు, ప్రముచ్యంతే = విడిపోవునో, అథ = కామవిమోచనానంతరము, మర్త్యః = ఉపాసకుఁడైన మానవుఁడు, అమృతః = జననమరణరహితుఁడు, భవతి = అగును. మరియు అత్ర = ఈ ప్రారబ్ధాంతమున, బ్రహ్మ = బ్రహ్మమును, సమశ్నుతే = ఆనందాస్వాదరూపమున అనుభవించును.

శివధ్యానయోగసిద్ధునకు శివప్రాప్తి నిశ్చితమైనను కామము విరోధించునదగుటచే శరీరవియోగమునకు ముందే మనస్సులో దాగియున్న కోరికలు సమసిపోవలెననియు, అట్టివానికే శివసాయుజ్యము చేకూరుననియు విదితమైనది.

"యదా సర్వే ప్రభిద్యంతే-హృదయస్యేహ గ్రంథయః,
అథ మర్త్యోఽమృతో భవ-త్యేతావదనుశాసనమ్" 15

వ. యదా = ఏ సమయమున, హృదయస్య = హృదయముఁజెందిన గ్రంథయః = గ్రంథులవలె విడువనలవిఁగాని ఇంద్రియసుఖవాననలు, సర్వే = అన్నియు, ఇహ = ఈ జీవితమునందే, ప్రభిద్యంతే = అంతరించునో, అథ = ఆ సమయమున, మర్త్యః = శివోపాసకుఁడైన మానవుఁడు, అమృతః = మరణధర్మరహితుఁడు, భవతి = (భవేత్)అగును. ఏతావత్ = ఇదియే, అనుశాసనం = మహోపదేశము,

కోరికలులేకుండుటయే గాక కోరికలనుద్భవింపఁజేయు వాసనా గ్రంథులు నశించినదో బ్రహ్మప్రాప్తి సమకూరునని సారాంశము.

"శతంచైకా చ హృదయస్య నాడ్య-స్తాసాం మూర్ధాన
మభినిఃసృతైకా, తయోర్ధ్వ మాయ న్నమృతత్వమేతి-
విష్వఙ్ఙన్యా ఉత్క్రమణే భవంతి" 16

ప. హృదయస్య=హృదయమునకు సంబంధించిన, నాడ్యః = నరములు, శతంచైకాచ=నూటనొక్కటి యుండును. తాసాం= అవ్వానిలో, ఏకా = సుషుమ్నానాడియొకటి, మూర్ధానం = శిరస్సును, అభినిఃసృతా = అంటుకొనియుధిడునది తయా = ఆ మూర్ధన్యనాడి ద్వారా, ఊర్ధ్వం = పై శివలోకమునుగూర్చి, ఆయన్=వెళ్ళునట్టి జీవాత్మ, అమృతత్వం = మోక్షమును, ఏతి = పొందును. అన్యాః = ఇతరనాడులు, విష్వక్ = శరీరమంతటినుండి, ఉత్క్రమణే = లేచుటవిషయమై, భవంతి = ఉపయుక్తములగునవి.

శివయోగసిద్ధుఁడు మూర్ధన్యనాడిద్వారా శిరస్సునుండి బయలు దేరి శివలోకముఁజేరుననియు, ఇతర నాడుల ద్వారా నిష్క్రమణము దేవమానవ పశు పక్ష్యాదిజన్మల నొసఁగుననియు వివేకము.

"అంగుష్ఠమాత్రః పురుషోఽంతరాత్మా-సదా జనానాం హృదయే సన్నివిష్టః, తం స్వా చ్ఛరీరాత్ ప్రవృహే- న్ముంజాదివేషీకాం ధైర్యేణ, తం విద్యా చ్ఛుక్ర మమృతమితి" 17

ప. పురుషః=పరమపురుషుఁడు, అంతరాత్మా = ఆత్మలోని వాడై, జనానాం హృదయే = ప్రాణుల హృదయమునందు, అంగుష్ఠ మాత్రః = బొటనవ్రేలంతటి రూపముతో, సదా సన్నివిష్టః = ఎల్ల కాలము నివసించువాడు. (తథాపి = ఐనప్పటికి) తం = ఆ పరమ పురుషుని, ముంజాత్ = మంజుగడ్డినుండి, ఇషీకామివ = లోని గడ్డి పఱకనువలె, స్వాత్ = తనదైనట్టి, శరీరాత్ = శరీరము నుండి, ధైర్యేణ = బుద్ధిబలముతో, ప్రవృహేత్ = వేరు చేయవలెను.

తం = శరీరగతదోషములు అంటనివాడని భావింపఁబడు

పరమపురుషుని, శుక్రం = జరామరణాదిరాహిత్యముతో స్వచ్ఛమైన వానిగాను, అమృతం = అనాదిముక్తునిగాను, విద్యాత్ = గుర్తింప వలెను

శరీరములో జీవాత్మలో నుండువాడైనను పరమాత్మ నిర్దోషుఁడనియు, శరీరాదివిలక్షణుఁడనియు తెలిసికొని భావింపవలెనని సారాంశము.

"మృత్యుప్రోక్తాం నాచికేతోఽథ లబ్ధ్వా-విద్యా మేతాం
యోగవిధిం చ కృత్స్నం, బ్రహ్మప్రాప్తో విరజోఽభూ
ద్విమృత్యు-రన్యోఽ ప్యేవం యో విదధ్యాత్మ మేవ"

ప నాచికేతః = నచికేతసుఁడు, మృత్యుప్రోక్తాం = యమునిచే చెప్పఁబడిన, ఏతాం విద్యాం = ఈ బ్రహవిద్యను, యోగవిధిం కృత్స్నంచ = సమస్తమైన శివధ్యానయోగవిధానమును, లబ్ధ్వా = స్వీకరించి, బ్రహ్మప్రాప్తో బ్రహ్మముఁజేరినవాడై, విరజో విమృత్యుః = క్షుత్పిపాసాదులు లేనట్టి జననమరణాది రహితంబు నగు నిజరూపము గలవాడు, అభూత్ = ఆయెను అన్యోఽపి = ఇతరుఁడు కూడ, అధ్యాత్మ = పరమాత్మను, విత్ = ఉపాసించి ధ్యానించునెడ, ఏవమేవ = నచికేతసునివలె ముక్తుఁడే నగును

"సహ నా వవతు సహ నౌ భునక్తు సహ వీర్యం కరవావహై,
తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై"

ఓం శాంతిః శాంతిః శాంతిః.

"శాంతిః" = అని మున్మారు పలుకుట సర్వదోషశాంతి ప్రదమగును. ధర్మవిరుద్ధమును బోధించు ఆచార్యుఁడు, నీతినియమ రహితుఁడై ప్రశ్నించు శిష్యుఁడును ద్వేషపాత్రులగుదురని పైశాంతి పాఠములోని చివరి పదముయొక్క తాత్పర్యము.

ఇయ్యది
శ్రీ నీలకంఠ శివాచార్య ప్రణీత భాష్యమునకు
శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి మహోపాధ్యాయ కృత
సంస్కృత వ్యాఖ్యానమునకు "శివతత్త్వప్రభ" అను
శాంకరీయ ఆంధ్రానువాదమున కఠోపనిషత్తు నందలి
రెండవ అధ్యాయమునందలి మూడవ వల్లి-సర్వంబు
సమాప్తము.

# కఠోపనిషత్-సారాంశము

ప్రథమాధ్యాయగత తృతీయవల్లి యందు "ఋతం పిబంతౌ" అను ప్రథమమంత్రమున "గుహాం ప్రవిష్టా వాత్మానౌ హి తద్దర్శనాత్" అను వ్యాససూత్రము ననుసరించి హృదయగుహయందు ఉన్నవారు జీవేశ్వరులే సనియు, బుద్ధి జీవులు కారనియు విశదమగుచున్నందున "ద్వాసుపర్ణా సయుజా సఖాయా" ఇత్యాది శ్రుతిచే 'భేదవ్యపదేశాచ్చ" అను వ్యాససూత్రముఁ బట్టియు జీవేశ్వరభేదము జీవేశ్వరసాహచర్యంబు కల్పితములు కావని తేట పడుచున్నందునను, "యస్య బ్రహ్మచ క్షత్రంచ" ఇత్యాది మంత్రమున-సమస్త జగత్తు పరమేశ్వరునకు ఆహారమగునని నిరూపించి-జగత్తు భ్రాంతిపరికల్పితము గానిదై నిత్యమగునని తేల్చినందునను, ముక్తజీవుఁడు గూడా మూర్ధన్యనాడిద్వారా శరీరమునుండి లేచి పరమ పదముఁజేరి-నిజ రూపావిష్కారముతో శివసాయుజ్యము నొందునని ప్రతిపాదించుట వలనను ఈ యుపనిషత్తు-శివాద్వైతపరమైనదే సనియు, కేవలాద్వైతమును బోధింపదనియు విదితమైనది.

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# ప్రశ్నోపనిషత్సారాంశము

ప్రథమప్రశ్నలో గల పదునైదు (15) వాక్యములయందు భరద్వాజపుత్రుఁడగు సుకేశుఁడు, శిబిసంతానమగు సత్యకాముఁడు, గర్గగోత్రికుఁడు సౌర్యుని సంతానము నగు ఒకానొక మునీంద్రుఁడు, ఆశ్వలాయనసంతానమగు కౌశలుఁడు, భృగుగోత్రికుఁడు విదర్భి సంతానము నగు ఒకనొక జిజ్ఞాసువు, కాత్యాయన గోత్రికుఁడైన కబంధియను మహామహుఁడును వీరు ఆరుగురు-వేదార్థవిచారపరులు తపోనిష్ఠులునై పరబ్రహ్మను తెలియఁగోరినవారై బ్రహ్మజ్ఞాన పరిపూర్ణుఁడైన పిప్పలాదుఁడను మహామునిని శిష్యభావముతో సమీపించి ప్రశ్నింపగా-పిప్పలాదుఁడు-మొదట సృష్టిని గురించి దిగువ విధము ఉత్తరించెను.

సూర్యుఁడు చంద్రుఁడు మొదలగు ప్రపంచమును పరమేశ్వరుఁడు పుట్టించి దక్షిణోత్తరాయణాది కాలవిభాగము నేర్పరచియు యజ్ఞాది కామ్యకర్మల నాచరించినవారు చంద్రునిద్వారా స్వర్గముఁ జేరినవారై మరల భువిని జన్మించునట్లు విధించెననియు, నిష్కామ కర్మాచరణులు సూర్యుని ద్వారా పరమపదముఁజేరి పునర్జన్మ లేని వారగుదురనియు, అన్నము శివస్వరూపమగుటచే అన్నము వలన రేతస్సు, రేతస్సు వలన ప్రజలు జన్మింతురనియు, ప్రబోధించి.

"యేషాం తపో బ్రహ్మచర్యం-యేషు సత్యం ప్రతిష్ఠితం,
తేషా మసౌ విరజో బ్రహ్మలోకో-న యేషు జిహ్మమనృతం
న మాయా చేతి" అను పదునారవ వాక్యమున.........

శివజ్ఞానప్రదమైన శాంభవదీక్షాస్వీకారము అను తపస్సు, బ్రహ్మచర్యము, (ఋతుకాలభార్యాగమనము) త్రికరణశుద్ధిని శివారాధనము, సత్ ప్రవర్తనము, సత్యవాక్యంబు గల మాహేశ్వరులకే-ప్రాకృతము కానట్టి శివలోకము లభించునని పిప్పలాదుఁడు-మునిషట్కమునకు ఉపదేశించెను.

ఆదిత్యుఁడనగా - జీవుఁడని, ఉదయమనఁగా సుషుప్తినుండి జాగ్రత్తని, నిర్వచించువారి వాదము-క్లిష్టార్థకమగునని పాఠకులు గ్రహింతురు గాక!

ద్వితీయ ప్రశ్నలో 13 వాక్యములు కలవు.

భార్గవుఁడైన వైదర్భి-పిప్పలాదు నిట్లు ప్రశ్నించెను.

ఈ శరీరమును పోషించువారెందరు? ఎవరీ శరీరధారణమును వెల్లడింతురు? శరీరధారకులలో ముఖ్యుఁడెవరు?

ఆకాశ వాయు అగ్ని ఉదక భూములు వాగాది ఇంద్రియములును శరీరమును నిలుపునవని పిప్పలాదుఁడు చెప్పఁదొడఁగెను. ఆవ్వానిలో ప్రాణవాయువు ముఖ్యమనఁగా-ఆకాశాదులు అంగీకరింపనందున ప్రాణము శరీరమునుండి బయలుపడుచుండ ఆకాశాదులు అనివార్యముగ శరీరమును విడిచిపోవలసి వచ్చెను. అట్టితఱి ప్రాణము యథాస్థానమున నుండగా ప్రాణము నాశ్రయించి ఆకాశాదులు శరీరమునందు ఉండఁగలిగినవి. అందువలన వాఙ్మనశ్చక్షుః శ్రోత్రములు సంతసించి ప్రాణమును దిగువ విధము ప్రశంసించినవి.

ముఖ్యప్రాణమే అగ్నిరూపమున తపించునది, మరియు సూర్య రూపమున ప్రకాశించునదియు, మేఘరూపమున వర్షించునది— ప్రాణ మేను, త్రిలోకాధిపతియగు ఇంద్రరూపమున—ముఖ్యప్రాణము ప్రవ ర్తించును. ఈ ప్రాణమే మేఘాదులను విడదీయును. చరాచర ప్రపంచమును ధరించు భూమి-ప్రాణమేను, ఈ ముఖ్యప్రాణమే- ఓషధులను పోషించు చంద్రుఁడగుటయే గాక సూక్ష్మము,స్థూలంబు, అజరామరత్వము నొసఁగు శివతత్త్వంబు నగు. ఋగ్యజుః సామవేద ములు,స్థావర జంగమములన్నియు,వేదచోదితమైన యజ్ఞాదిసుకృతంబు యజ్ఞాదులను రక్షించు క్షత్రియవర్గము, యజ్ఞాదులను ప్రవర్తింపఁ జేయు బ్రాహ్మణవర్గంబు, సమస్తము ప్రాణమునందే ఆధారపడి యున్నవి.

ప్రాణమా! నీవే బ్రహ్మదేవుఁడవై గర్భమునందు సంచ రింతువు, పుత్రాది రూపమున జన్మించువాడవు నీవేను, ప్రజలు నీ కొరకు అన్నాదులను బలిగా సమర్పించుచుందురు, దేవతలకు హవి స్సులను, పితరులకు ప్రియమైన ఆహారమును. అందించువాడవు నీవేను, అథర్వాంగిరసులు అను ఋషుల యథార్థప్రవర్తనను నీ వలననే సంభవించును. ప్రాణమా! నీవు పరమేశ్వరుఁడవు, తేజస్సుతో రుద్రుఁడవు, రక్షించు విష్ణువగుదువు, నీ శక్తి—వాగింద్రియమున శ్రోత్రమున నేత్రమందు మనస్సునందును ప్రతిష్ఠింపఁడియున్నందున వాగాది మనఃపర్యంతములగు ఇంద్రియములయందు గల నీ శక్తిని శుభమయముగ నొనర్పుము!

ప్రాణమా! భూలోకమున స్వర్గమందును గలదంతయు నిన్నాశ్రయించియున్నది. అందువలన—మాత పుత్రులను వలె—నీవు మమ్ము రక్షింపుము! మాకు సంపత్తును తెలివి నొసఁగుము!

తృతీయ ప్రశ్నలో 12 వాక్యములు కలవు

కౌశల్యుఁడు పిప్పలాదుని దిగువ విధము ప్రశ్నించెను.

పూజ్యుఁడా! ప్రాణము దేనినుండి ఆవిర్భవించును! శరీరమున ఎట్లు ప్రవేశించును? జీవాత్మకంటె వేరు ఎట్లుండును? ఏ విధముగా శరీరమునుండి లేచును? సూక్ష్మ స్థూల శరీరముల నెట్లు నిలుపును ?

పిప్పలాదుఁడు-ఇట్లు సమాధానము నొసఁగెను.

ముఖ్యప్రాణము పరమేశ్వరుని వలననే అవిర్భవించి-మనః కృతమగు కర్మ ననుసరించి శరీరమునఁ బ్రవేశించును-పురుషుని నీడవలె-జీవాత్మననుసరించి ప్రాణము గమనాగమనములఁ జేయు చుండును. రాజు-అధికారులను నియమించునట్లు-ముఖ్యప్రాణమే నేత్రాది ఇంద్రియములను ప్రేరేపించుచు స్వకార్యములయందు వేరు వేరు ప్రవర్తింపజేయును.

ప్రాణము నీవిధము భావించువానికి వంశవృద్ధియే గాక-మోక్షము సమకూరును. అనఁగా ప్రాణాధారుఁడగు పరమేశ్వరుఁడు-బంధవిముక్తిఁజేయునని తెలియవలెను.

ప్రాణము-పరమేశ్వరునినుండి వచ్చుననియు, కర్మచేత నిలచు ననియు. అపానాదులపై అధికారము కలిగియుండుననియు, శరీరములో ప్రాణ అపాన వ్యాస ఉదాన సమాన రూపమున నివసించు ననియు, బాహ్యమున సూర్యరూపమున ప్రకాశించుననియు భావించు శివోపాసకుఁడు-ముక్తుఁడగును.

చతుర్థప్రశ్నలో గల 11 వాక్యముల యందు-

సౌర్యాయణి యనఁబడు గార్గ్యుని ప్రశ్నకు పిప్పలాఁదుఁడు- "సూర్యుఁడు అస్తమించునపుడు కిరణములు సూర్యునితో ఏకీభవించు

నట్లు-నేత్రాది ఇంద్రియములు స్వప్నమునందు మనస్సుతో ఏకీభవించును నిద్రయందు వినుట, చూచుట, వాసనఁజూచుట, రుచిఁ గ్రహించుట, తాకుట, మాటలాడుట, స్వీకరించుట, సంతోషించుట, విడచుటయు, సంభవింపవు. అందువలన నీ పురుషుఁడు నిద్రించుచున్నట్లు మాత్రము గుర్తింపఁబడును. ప్రాణవాయువు మాత్రము ఈ శరీరమునందు మేలుకొనియుండును.

ఇంద్రియములన్నియు మనస్సులో దాగియున్న తరువాత, గాఢనిద్రకు ముందు ఈ జీవాత్మ-స్వప్నమునందు రథగజాద్యుపయోగమును పొందును. చూచినదానిఁగాంచును. వినినదానిని వినును. దేశదేశములయందు దిగంతరములయందును సంచరించును, సర్వస్వరూపుఁడై సమస్తము ననుభవించును.

జీవాత్మ - పరమాత్మతో నేకీభవించినతఱి- స్వప్నములను గాంచక- ఇంద్రియసుఖాతీతమైన సుఖము ననుభవించును. మరియు సుషుప్తి (గాఢనిద్ర) యందు పక్షులు గూడులయందువలె-విషయములతో కూడ ఇంద్రియములన్నియు జీవాత్మద్వారా పరమాత్మయందు విశ్రమించును. జీవాత్మ గూడ పరమాత్మయందే విశ్రమించును. ఇట్టి పరమాత్మను జీవాత్మ-ఏనాటికైన నుపాసించి దర్శించినచో ముక్తుండగును-అని సమాధానము నొసఁగెను.

పంచమ ప్రశ్నలో 7 వాక్యములు గలవు.

సత్యకాముఁడు దిగువ విధము ప్రశ్నించెను.

పూజ్యుఁడా ! మానవులు జీవితాంతము వరకు ప్రణవమ ఓంకారఘటితమైన శివపంచాక్షరీమహామంత్రము ననుసంధించ(జపించెడ-ఎట్టి స్థానము లభించును ?

పిప్పలాదుఁడు చెప్పఁదొడఁగెను.

సత్యకామా! ఓంకారము-పరమనియు అపరమనియు రెండు విధములు గలదగును. అపరము-చతుర్ముఖుఁడు అవధికలది కాగా-పరము శివుఁడే నగును. చతుర్ముఖాదుల నుద్దేశించి ఓంకారమును జపించువారు - మానవలోకమున సదాచారసంపన్నులుగ జన్మించి మానవసుఖము నంతయు ననుభవింతురు.

ఓంకారమును రెండుమాత్రలు గలదానిగ జపించువారు-చంద్రుని ద్వారా స్వర్గముఁజేరి అమరసౌఖ్యముల ననుభవించి మరల భూలోకమున ఉత్తములై జన్మింతురు.

అ. ఉ. మ్. అను త్రిమాత్రలు గలదిగ ప్రణవమును ప్రణవ సహిత శివపంచాక్షరిని జపించుచు శివుని ధ్యానించువారు ఆరు క్షుత్ పిపాసాది ఊర్ములు లేనట్టి. జరామరణరహితంబు నగు పరమాత్మఁ జెందినవారై పరమకైలాసమున శివానందము ననుభవించుచుందురు. అట్టి వారికి పునర్జన్మ సంభవింపదు.

షష్ఠప్రశ్నలో 8 వాక్యములు గలవు.

పదునారు కళలు గల పురుషుఁడెచ్చోట నుండునని భరద్వాజుఁడు ప్రశ్నింపగా పిప్పలాదుఁడు-

పదునారు కళలు ఎవనియందు ఆవిర్భవించినవో అట్టి పరమ పురుషుఁడు-ఈ శరీరమునందే జీవాత్మనంటుకొని యుండును. పరమాత్మ శరీరమునఁ బ్రవేశించుటను శరీరమునుండి లేచుటను జీవాత్మద్వారా చేయుచున్నను జీవాత్మవలె కర్మబద్ధుఁడు కానివాడై స్వతంత్రభావమున సర్వశరీరములయందు విహరించువాడగును. అందువలన ప్రాణము మొదలగు పదునారు కళలు గలవాడు-పరమ పురుషుఁడే నని తెలియవలెను.

గంగాది మహానదులు-సముద్రమునాశ్రయించుతఱి విభజింప రాని నామరూపములు గలవగునట్లు-ఈ ప్రాణాదిషోడశకళలు-జీవాత్మ – పరమాత్మఁజెందినపుడు-స్థూలములైన నామరూపములు లేనివగును. అట్టి శివోపాసకుఁడు అమృతుఁడు పరిపూర్ణుఁడు నగును.

ప్రాకృతనామరూపములు లేనివాడై శివసముఁడగునని భావము. ఇంతమాత్రము నేనెరుగుదును. ఇంతకు మించినది లేదని—నిర్వచించెను.

అట్టితఱి—ఆరుగురు మునులు-మా అజ్ఞానమును తొలగించి శివజ్ఞానము నంకురింపఁజేసిన పరమాచార్యుఁడవని — పిప్పలాదుని ప్రశంసించి-ప్రణామాదులతో సత్కరించిరి.

(మొత్తం 66 వాక్యములు) ప్రశ్నోపనిషత్సారాంశము-

సమాప్తము.



ఓమ్

శ్రీ మహాగణాధిపతయే నమః

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

అథర్వణవేదమున శౌనక శాఖయందలి

# ముండకోపనిషత్తు

## శివతత్త్వ ప్రభా౽౽ంధ్రీకరణము

నిర్మల శంకరశాస్త్రి

### శాంతిమంత్రము

"ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః! భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః। స్థిరై రంగై స్తుష్టువాగ్ంస స్తనూభిః, వ్యశేమ దేవహితం యదాయుః। స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః, స్వస్తినః పూషా విశ్వే దేవాః। స్వస్తిన స్తార్క్ష్యో౽రిష్టనేమిః, స్వస్తినో బృహస్పతి ర్దధాతు".

ఓం శాంతిః శాంతిః శాంతిః

మంత్ర పదార్థము-

దేవాః! = చక్షుఃశ్రోత్రాది ఇంద్రియాభిమాని దేవతలారా!, కర్ణేభిః = మాచెవులతో, భద్రం = సర్వమంగళాస్పదమగు శివ పంచాక్షరీ మహామంత్రమును, శృణుయామ=వినుటకు సమర్థులము

అగుదుముగాక! అక్షభిః = నేత్రములతో, భద్రం = ఇష్టలింగరూపుఁ డగు సదాశివుని, పశ్యేమ = చూడఁగలుఁగుదుము గాక! స్థిరైః = నిత్యములగు, అంగైః = సర్వజ్ఞత్వాది షడంగములతో కూడ నుండునట్టి, భద్రం = ఇష్టలింగమును, యజత్రాః = ధరింతుముగాక! ఇందువలననే తుష్టువాంసః = ఇష్టలింగధారణపూజనాదులచే సంతృప్తి పడు మేము. దేవహితం = బ్రహ్మవిష్ణ్వాదిదేవతలకు ఇష్టమైన శివ లింగమును, యదాయుః = దేవాదులలో మా ఆయుష్యము ఉన్నంత వరకు, తనూభిః = స్థూలశరీరాదులచే, వ్యశేమ = పొందుదుము గాక!

వృద్ధశ్రవాః = పెంపొందిన కీర్తి గల యట్టి, ఇంద్రః = దేవేంద్రుఁరు, నః = మమ్ము, స్వస్తి = శివలింగమును, దధాతు = ధరింపఁజేయుగాక! పూషా = సూర్యుఁడు, విశ్వేదేవాః = విశ్వేదేవతలు, తార్క్ష్యః = గరుత్మంతుఁడు, అరిష్టనేమిః = శుభప్రాపకుఁడైన విష్ణువు, బృహస్పతిః = దేవాచార్యుఁడును, స్వస్తి దధాతు = ఇష్టలింగమును ధరింపఁజేయుదురు గాక!

లింగమహాపురాణమున

శ్లో॥ భద్రం పరశివం భక్త్యా-శృణుయామ సురర్షభాః।
భద్రం నేత్రైః ప్రపశ్యామో-లింగరూపం సదాశివమ్ ॥

భద్రం యజామః సతతం-తుష్టువామో యథావిధి।
యావదాయుః ప్రవర్తేత-తావద్దేవహితం శివమ్ ॥

తనూభిః సతతం భక్త్యా-స్థాపయామో యథావిధి ॥
స్వస్త్యాఖ్యం శాంభవం లింగ-మింద్రో వృద్ధశ్రవాస్తథా।
పూషా చ విశ్వేదేవాశ్చ-తార్క్ష్యో విష్ణుస్తథైవ చ॥
బృహస్పతిస్తథా లింగం-దధాతు పరమైశ్వరమ్ ॥

అమరశ్రేష్ఠులారా! పరశివాత్మకము సర్వమంగళాస్పదంబు నగు శివపంచాక్షరీ మహామంత్రమును వినఁగలుఁదుము గాక! ఇష్ట లింగస్వరూపుడైన సదాశివుని కన్నులతో చూడఁగలుఁగుదుము గాక! ఇష్టలింగము నహోరాత్రములు ఆజన్మాంతము ధరింతుముగాక! ఇష్ట లింగధారణ పూజనాదులచే సంతృప్తిపడునట్టి మేము-స్థూలదేహాదులచే ఆయుష్యమున్నంతవరకు భక్తిచే ఆరాధింతుము గాక !

స్వస్తి యనఁబడు శివలింగమును గొప్ప కీర్తిగల-దేవేంద్రుఁడు, సూర్యుఁడు, విశ్వేదేవతలు, గరుత్మంతుఁడు, విష్ణుమూర్తి బృహస్పతియు (శివలింగమును) ధరింపఁజేయుదురు గాక! అని శ్లోకార్థసంగ్రహము

ముండుకోపనిషత్తు-ప్రథమము, ద్వితీయము, తృతీయంబు నని మూడు విభాగములు గలది కాగా-ఒక్కొకవిభాగమున రెండేసి ఖండములు నిర్దేశింపఁబడినవి.

ప్రథమముండకమున-ప్రథమఖండమునందు ఎనిమిది వాక్యములు గలవు.

విష్ణ్వాది దేవతలలో మొదటివాడైన చతుర్ముఖబ్రహ్మదేవుఁడు పరమేశ్వరునినుండి జన్మించి జగత్తును సృజించి పాలించువాడయ్యెను. అట్టి బ్రహ్మదేవుఁడు-సమస్త విద్యాధారమగు వేదవిద్యను జ్యేష్ఠ పుత్రుఁడైన అథర్వునకు ఉపదేశించెను.

అథర్వుఁడు = అంగిఋషికి, అంగిఋషి = భరద్వాజ పుత్రుఁడైన సత్యవాహునకు, సత్యవాహుఁడు=అంగిరస్సునకు నుపదేశించిరి. ఇఁట గురుపరంపర-వేదవిద్య-ప్రవర్తించుటకు చెప్పబడినది.

ఆత్మాశ్రమి గృహస్థుఁడు నగు శౌనకుఁడు-సమిధలు

మొదలగు వానిని చేతఁబట్టుకొని అంగిరస్సును సమీపించి "భగవానుఁడా! దేనిని తెలిసికొనినచో చరాచరప్రపంచమంతయు తెలియునని ప్రశ్నించెను అంగిరస్సు-శౌనకునకు దిగువ విధము సమాధానము నొసఁగెను. పర, అపర అనఁబడు విద్యలు రెండని బ్రహ్మవిదులు వక్కాణింతురు. ఋగ్యజుఃసామాథర్వవేదములు, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము నను వేదాంగములును అపరవిద్య యనఁబడును.

"అథ పరా-యయా తదక్షర మధిగమ్యతే" 5వ వాక్యము.

ప. "యయా = ఏ మహావిద్యచేత, (నాలుగవవాక్యమునగల యచ్ఛబ్దముచే పరామృష్టమైన) తత్ = అట్టి, అక్షరం = పరశివలింగము, అధిగమ్యతే = పొందఁబడునో, (సా = అట్టివిద్య) పరా= శ్రేష్ఠమైనదని, అథ = అపరవిద్యానిరూపణానంతరము అని ఇందు నిర్దేశింపఁబడినది.

ఇందుకు ప్రమాణములు-

"పంచాక్షరీం పరాం విద్యాం" అను అనుభవసూత్రోక్తిచే-ప్రణవసహిత శివ పంచాక్షరీమహామంత్రము-పరావిద్యయని తేటపడుచున్నయది

శ్లో॥ జపేత్ పంచాక్షరీ మేతాం-విద్యాం పాశవిముక్తయే ।
యథాఽనాది ర్మహాదేవః—సిద్ధః సంసారమోచకః ॥
తథా పంచాక్షరో మంత్రః-సంసారక్షయకారకః॥

"ఓం నమఃశివాయేతియాజుషమంత్రోపాసకో రుద్రత్వ మాప్నోతి."

"యజుర్వేదమున రుద్రాధ్యాయమునందు చెప్పఁబడిన-ఓం నమఃశివాయ అను మహామంత్రమును శివప్రీత్యర్థము జపించువాడు శివసాయుజ్యము నొందును" త్రిపురతాపిన్యుపనిషత్తు.

సద్యోజాతాది పంచ బ్రహ్మములనుండి నకారాదిపంచాక్షరములు ఉద్భవింపగా-నకారాదులనుండి ఋగ్వేదాదులు అవిర్భవించుటచే పంచాక్షరి - కారణమనియు, ఋగ్వేదాదులు - కార్యమనియు తెలియవలెను.

శ్రీ రుద్రాధ్యాయము, పంచబ్రహ్మోపనిషత్తు, పంచాక్షర జాబాలోపనిషత్తు, సిద్ధాంతశిఖోపనిషత్తు, భస్మజాబాలోపనిషత్తు మొదలగు పరమప్రమాణములు-ప్రణవసహిత శివపంచాక్షరీ మహావిద్య-వేదవిహితంబని-చాటుచున్నవి.

"పంచాక్షరీ పరా విద్యా-శివజ్యోతి రవాప్తయే"శివాగమము

ప్రణమము-అకార ఉకార మకార బిందునాదములు కలిగియుండుటచే సూక్ష్మపంచాక్షరి యనియు, నకారాదులు గలది. స్థూల పంచాక్షరి యనియు వివేకము.

శ్లో॥ తద్బీజం సర్వవిద్యానాం-మంత్ర మాద్యం షడక్షరం ।
అతిసూక్ష్మం మహార్థం చ-జ్ఞేయం తద్వటబీజవత్॥
సాంగాని వేదశాస్త్రాణి-సంస్థితాని షడక్షరే॥

ఇత్యాది ప్రమాణములు-శివపంచాక్షరియే పరవిద్యయగునని నిరూపించినవి.

"నాయమాత్మా బలహీనేన లభ్యః" ఇత్యాది శ్రుతి వాక్యములు శివపంచాక్షరీ స్వీకార పూర్వక లింగధారణదీక్ష-అను బలము లేని వానికి-పరమాత్మ-లభ్యుఁడు కాదని విశదీకరించినవి.

ఇష్టప్రాణభావలింగాత్మకుఁడైన శివుఁడు - శాంభవదీక్షచే శుద్ధమైన అంతఃకరణము గలవానికే సాక్షాత్కరించుననియు, బహిరింద్రియములచే గుర్తింపఁబడనివాఁడనియు(భావమనఁగా-శివోఽహంభావమగును) "శివోఽహమితిభావోహి-శివత్వాప్తికారణమ్" అని ఆచార్య భగవత్పాదుల నిర్వచనము. గోత్ర వర్ణములు జ్ఞానకర్మేంద్రియములు లేనివాఁడనియు దేశకాలపరిచ్ఛేదరహితుఁడు, అక్షరపదవాచ్యుఁడు, త్రికాలాబాధ్యుఁడు, సూక్ష్మాతిసూక్ష్ముఁడు విశ్వకారణుఁడు ననియు ఆరవ వాక్యము నిరూపించినది.

ఇట్టి పరంజ్యోతిః స్వరూపుఁడైన శివుని-వేదా మను క్రియాత్మకమగు లింగధారణదీక్షచే చిచ్ఛక్తి వికాసము గల ధీరులే దివ్యనేత్రముతో-చూడఁగలుగుదురు.

సాలెపురుఁగు-తనలో దాగిన దారములను పుట్టించి-తనలో ఇమిడ్చుకొనునట్లు, నేలలోని ఓషధులు వర్షాకాలమున అంకురించి వేసవివేళ నంతరించునట్లును, శరీరధారియగు జీవాత్మనుండి వెంట్రుకలు ఉదయించునట్లును, అక్షరుఁడనఁబఱఁగునట్టి శివుని వలన చేతనాచేతన ప్రపంచము జన్మించి శివునిలో దాగియుండును.

ఏడవ వాక్యముఁదగు భావము.

జ్ఞానమయమగు తపస్సు (స్వసంకల్పము)చే బ్రహ్మము (శివుఁడు) విస్తరించెను. అట్టి శివుని నుండి-త్రిగుణమయంబగు ప్రకృతి-ఆవిర్భవించినది. ప్రకృతినుండి ప్రాణము మనస్సు జీవకోటియు శివపంచాక్షరీ మంత్రజపముతో కూడిన శివలింగార్చనాది సుకృతముల వలన మోక్షము అనదగు శివసాయుజ్య ప్రాప్తియు సంభవించినవి.

మోక్షము నిత్యమైనను లింగధారణ పూర్వక శివారాధనా

దులచే దురితనివృత్తి కాగా చిత్తశుద్ధి ఏర్పడును. చిత్తశుద్ధితో ధ్యానించువారిని శివుఁడు అనుగ్రహించి ముక్తులఁజేయును గాన నిట అమృతశబ్దవాచ్యంబగు మోక్షము-శివారాధనాదులచే సంభవించునని ప్రతిపాదింపఁబడినది.

శ్లో॥ కీటో భ్రమరయోగేన-భ్రమరో భవతి ధ్రువం,
మానవః శివయోగేన-శివో భవతి సర్వదా॥

కీటము (పుఱుఁగు) భ్రమర (తుమ్మెద) సంబంధముచే భ్రమరమైనట్లు మానవుఁడు శివసంబంధము (లింగధారణ)చే ఎల్ల కాలము శివుఁడై యుండును.

"కర్మచే మోక్షము లేదు" "నాస్త్యకృతః కృతేన" అను శ్రుతి వాక్యము-ఫలాభిసంధిగల కర్మతో మోక్షము లభింపదు. అను నర్థముఁజెప్పును. గాన శాంభవదీక్ష గూడా నిష్కామ్యమగుటచే మోక్షావహమగునని తెలియవలెను.

"యః సర్వజ్ఞః సర్వవిత్-యస్య జ్ఞానమయం తపః"
తొమ్మిదవ వాక్యము.

సమస్తమును గుర్తించునట్టి సర్వజ్ఞుఁడు-జ్ఞాన (ఆలోచన) మయమైన తపస్సు నొనర్చువాడు నగు శివుని నుండి మూల ప్రకృతియే గాక స్థూల ప్రపంచగతములైన నామరూపములు అవిర్భ వించుచున్నవి

"కృశానురేతాః సర్వజ్ఞో - ధూర్జటి ర్నీలలోహితః"అను నిఘంటువు-సర్వజ్ఞశబ్దము శివునకే చెల్లునని-నిరూపించుటచే నిట-

"సర్వవిత్" విశేషణము, "సర్వజ్ఞః" విశేష్యంబునని తెలియ వలెను.

సూతసంహితలో బ్రహ్మగీతయందు-

"యుష్మభ్యోఽహం మహాప్రాజ్ఞో-మత్తః ప్రాజ్ఞోజనార్దనః,
జనార్దనాదపి ప్రాజ్ఞః-శ్రీరుద్రో గురుమూర్తిమాన్"
తతః ప్రాజ్ఞతమః సాక్షాత్-శివఃసాంబః సనాతనః
సఏవ సాక్షాత్ సర్వజ్ఞ-స్తతోఽన్యో నాస్తి కశ్చన"

"మీ కంటె నేను ప్రాజ్ఞుడను, నన్ను మించినవాడు నారాయణుడు, నారాయణు నతిక్రమించి శ్రేష్ఠమైన స్వరూపముగలవాడు శ్రీరుద్రుడు. శ్రీరుద్రునికన్న నత్యంత శ్రేష్ఠుడు-సనాతనుడైన సాంబశివుడగును. సాంబశివుడే సాక్షాత్ సర్వజ్ఞుడనబడును. సాంబశివుని మించినవాడు మరియొకడు లేడు. శివుడే-లింగము,

లింగమనగా-శక్తి విశిష్ట శివుడని "లింగంతు శివయో ర్దేహః" అను శివాగమవాక్యము విశదీకరించినది.

"లయం గచ్ఛతి యత్రైవ-జగదేతచ్చరాచరం, పునఃపునః సముత్పత్తిం-తల్లింగం బ్రహ్మ శాశ్వతమ్" సిద్ధాంతశిఖామణి.

ఇయ్యది-ప్రథమ ముండకమున-ప్రథమ ఖండము-

అథ

ప్రథమ ముండకమున ద్వితీయ ఖండము-

ఇందు 13 వాక్యములు గలవు.

"ఋగ్వేదాదులలో గల శివప్రీతికరములైన శివపంచాక్షరీ జపాది సుకృకములను అతీంద్రియ విషయ జ్ఞాన సమర్థులైన కవులు నిరూపించిరి. అయ్యవి-త్రేతాదియుగములయందు శివయోగ సిద్ధ

పురుషులచే బహుళ ప్రచారము చేయఁబడినవి. మోక్షాపేక్షతో శాంభవ దీక్షితులగు వారందరు అట్టి సుకృతములనే ఆ జన్మాంతము ఆచరింప వలెను-అని ప్రథమవాక్య సారాంశము. శాశ్వత శివసాయుజ్యము నకు ఇదియే శ్రేష్ఠమైన మార్గము. ఇందుకు-

"నకారాది యకారాంతం-జ్ఞాత్వా పంచాక్షరీం జపేత్"

"నకారము మొదలుకొని యకారము వరకు గల పరమార్థ మును గురుముఖతః తెలిసికొని శివపంచాక్షరీ మహామంత్రమును జపింపవలెను."

"యదా చర్మవదాకాశం-వేష్టయిష్యంతి మానవాః,
తదా శివ మవిజ్ఞాయ-దుఃఖస్యాంతో భవిష్యతి"

"ఆకాశమును చర్మవలె చుట్టఁగలిగినచో-మానవదేవతాదులు శివారాధనము లేకయే మోక్షమును పొందవచ్చును. అనఁగా శివు నారాధించినవారే ముక్తులగుదురని భావము."

ఇత్యాది ప్రసిద్ధ ప్రమాణములు-ప్రోద్బలకములగుచున్నవి. 2. 3, 4, 5, 6, 7, 8, 9, 10, వాక్యములయందు ప్రజ్వలించు అగ్నియొక్క జ్వాలాగ్రము కదులునప్పుడు వ్రేల్చఁబడు హవిస్సు స్వర్గసుఖాదుల నొసఁగును.

దర్శపౌర్ణమాసీ చాతుర్మాస్య ఆగ్రయణములనఁబడు ఇష్టులు లేనిది, అతిథిసత్కారము, వైశ్వదేవాదులు లేనిది, విధిలేనిదియు, నగు హవనము-భూలోకాది సత్యలోకాంతములగు ఏడు లోకములను లభింపఁజేయును.

కాలి, కరాలి, మనోజవ,సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరుచి, అను కదలుచుండు ఏడు నాలుకలు-అగ్నికి ఒప్పారునవి.

ఈ సప్తవిధములైన అగ్నిజిహ్వలయందు హవనము నాచరించు వానిని- అమరప్రభువైన చతుర్ముఖుని సత్యలోకమునకు సూర్య కిరణములు గొంపోవును.

భువిని, విధివిహితములైన ఆహుతులు-యజమానుని-సూర్య రశ్మిద్వారా-రమ్ము రమ్మని ఆహ్వానించును. ప్రియముఁబలుకును. ఇదియే మీకు సుఖమొసఁగు బ్రహ్మలోకంబని చూపెట్టును-

జీర్ణములైన నౌకలు-నీటను ముంచునట్లు-యజ్ఞాది రూపములగు కామ్య కర్మలు-సంసారసముద్రనిమగ్నులఁజేయుచు ఇదియే శ్రేయస్కరమని భావించు మూఢులకు జనన జరా మృత్యువులను పునఃపునః కలుగఁజేయును.

"అమృతస్య దేవధారణో భూయాసం" "సర్వాలింగగ్గ్ స్థాపయతి పాణిమంత్రం పవిత్రమ్" "ఓం నమో బ్రహ్మణే, ధారణం మేఽస్త్వనిరాకరణం ధారయితా భూయాసం" "మోక్షార్థినాం ముక్తిహేతు-ర్లింగధారణ మిష్యతే"

ఇత్యాది అసంఖ్యాత ప్రమాణములచే ప్రతిపాదింపఁబడు శివలింగ ధారణము నిష్టపడనివారు-మూఢులై-కామ్యకర్మప్రవృత్తులగుదురు. లింగధారణాంగములైన భస్మరుద్రాక్షధారణ శివమంత్ర జపముల నాచరింపనివారును మూఢులనఁబఱఁగుదురు.

కామ్యకర్మకర్తలు-శివవిజ్ఞానదూరులై-తాము పండితులమని భావించుచు జరామరణాదులచే బాధపడుచుందురు.

యజ్ఞాదులు స్వర్గ సుఖప్రదములగుటచే సుకృత శ్రేష్ఠములని గుర్తించి-కామ్యకర్మను మించిన సుకృతములేదని భావించియు

స్వర్గాదులయందు అమరసుఖము ననుభవించి-మరల భువిని జన్మించు చుందురు.

11 వ వాక్యము

"తపః శ్రద్ధే యే హ్యుపవసంత్యరణ్యే-శాంతా విద్వాంసో భైక్షచర్యాం చరంతః। సూర్యద్వారేణ తే విరజాః ప్రయాంతి-యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా"

భస్మరుద్రాక్షధారణ శివపంచాక్షరీ మంత్రజపాది శివధర్మ ములతో కూడిన ఇష్టప్రాణభావలింగారాధనము తపస్సనఁబడును. గురూపదిష్ట మహామంత్రానుష్ఠానమునందు విశ్వాసము-శ్రద్ధయనఁ బడును ఇట్టి తపః శ్రద్ధలుగలవారై ఏకాంతస్థలమున నివసించుచు యాచనతో జీవించువారై శాంతస్వభావులై-శివజ్ఞానులై ప్రవర్తించు వారు-నిర్మలులై సూర్యమండలమును భేదించి అమృత పురుష శబ్దవాచ్యుఁడు నిత్యస్వరూపుఁడునగు పరమేశ్వరునిచే అధిష్ఠింపఁబడిన శివలోకముఁజెంది శివానందామృతరసాస్వాద లోలురగుదురు.

ఇందుకు ప్రమాణములు-

శ్లో॥ లింగాంగ సంగం కుర్వంతం-దృష్ట్వా ద్విజవరం రవిః।
స్థానాచ్చలత్యయం భిత్వా-మండలం మే వ్రజేచ్ఛివమ్॥

లింగధారియగు శ్రోత్రియుని రవి చూచి "ఈతఁడు నా మండలమును భేదించి శివుఁజేరు"నని తన స్థానమునుండి కదలును" అని వాతూలాగమశ్లోకార్థము

అమృత పురుషశబ్దములు-బహుశ్రుతిప్రమాణములచే పరమేశ్వరునే చెప్పునని విదితమగుటచే-ఇట ముముక్షుప్రాప్యము శివలోకమే యగుననియు, చతుర్ముఖబ్రహ్మలోకపరమగు వ్యాఖ్యానము సమంజసము కాదనియు తెలియవలెను.

12 వ వాక్యము

"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో-నిర్వేద మాయా న్నాస్త్యకృతః కృతేన। తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్-సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"

ఎవడు స్వర్గాదిలోకములు-కర్మసంపాదితములగుటచే అనిత్య ఫలము నొసగునవని మదిని పరిశీలించి వైరాగ్యమును పొందునో, అట్టి శైవబ్రాహ్మణుఁడు-ఫలాభిసంధిగల (కామ్య) కర్మతో మోక్షము లభింపదని నిశ్చయించుకొనినవాడై పరశివతత్త్వమును తెలిసికొను టకై-శివనిష్ఠుఁడు శ్రోత్రియుఁడు నగు కల్యాణదేశికుని (శాంభవ దీక్ష గురువును) లింగధారణాంగ హవవాచులకు ఉపయోగించు సమిధలు మొదలగువానిని చేతఁబట్టుకొని-ఆశ్రయింపవలెను.

"శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం స్వగురుం గచ్ఛేద్యథావిధి, గురుస్తస్మై పరాం విద్యాం-దద్యాత్ బ్రహ్మాత్మబోధినీమ్" అను రుద్రహృదయోపనిషద్వాక్యము-పై విషయమును సమర్థించు చున్నయది.

"వ్రతమేత చ్ఛాంభవం, తత్సమాచరే న్ముముక్షు రపునర్భవాయ"

"ముముక్షువు - పునర్జన్మరాహిత్యమునకై శివలింగధారణా త్మకమగు శాంభవవ్రతము నాచరింపవలెను" తైత్తిరీయము.

"తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్-ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ। యేనాక్షరం పురుషం వేద సత్యం-ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్"

లింగాంగ సామరస్యజ్ఞానము గల ఆచార్యుఁడు-యథావిధి సమిత్ పాణియై తనను సమీపించినట్టి, నిర్మల మనస్కుఁడగు. శుద్ధ చిత్తుఁడునైన శిష్యునకు-అక్షరుఁడు పరిపూర్ణుఁడు సత్యస్వరూపుఁడు నగు పరశివుని తెలుపునట్టి, యథార్థముగ బ్రహ్మవిద్య యనఁబఱఁగు శివపంచాక్షరీ (షడక్షరీ) మహామంత్రము నుపదేశింపవలెను.

"పంచాక్షరీ పరావిద్యా-సతారా తు షడక్షరీ"

అను ప్రమాణము ననుసరించి-పంచాక్షరీ -- లేక-షడక్షరీ మంత్రము పరవిద్యయని తెలియుటచే పరవిద్యయే బ్రహ్మవిద్యగా ఇఁట చెప్పఁబడినది.

"తస్య దక్షిణకర్ణే తు-నిగూఢమపి కీర్తయేత్" రేణుకాచార్యులు తత్త్వమస్యాది మహావాక్యములును లింగాంగసామరస్యమునే బోధించు నవి. తత్-లింగము, త్వం-నీవు, అసి అగుదువు. త్వం అనుదానితో జీవాత్మ-అంగముగాను, తత్ అనుదానితో పరమాత్మ-లింగము గాను నిరూపింపఁబడుటచే ఏనాటికైనను జీవుఁడు శివుఁడగునని తేట పడుచున్నది

"పంచాక్షరప్రభావేన-సర్వకామాః సమాహితాః, సత్యం
సత్యం పునః సత్యం-సర్వసంజీవనౌషధమ్"
క్రియాసారము.

"పంచాక్షరీ జపమహిమతో భుక్తి ముక్తి రూపములగు కోరికలన్నియు సిద్ధించును శివపంచాక్షరీ మహా మన్త్రానుష్ఠానము - సాధకులందరిని శాశ్వతులుగ నొనర్చు పరమౌషధమగును"

ప్రథమ ముండకమున-ద్వితీయ ఖండము-సమాప్తము.

# ద్వితీయముండకము-ప్రథమఖండము

## ఇందు 10 వాక్యములు గలవు

1 వ వాక్యమున

బాగుగా మండుచున్న అగ్నినుండి-అగ్నిఁబోలిన వేలకొలది మిణుగురులు-ఆవిర్భవించినట్లు-శివునినుండి జీవాత్మలు-సృష్టికాలమున విడిబడి-ప్రళయమున-అక్షరమనఁబడు పరశివు నాశ్రయించును.

ప్రళయములో జీవాత్మలు మరుగుపడుటయే తిరోభావమనఁబడును. జీవపరమాత్మలకు అంశాంశిభావమును దిగువ మంత్రమున గాననగును.

"మాయాం తు ప్రకృతిం విద్యాత్-మాయినం తు
మహేశ్వరం, తస్యావయవభూతైస్తు-వ్యాప్తం సర్వ
మిదం జగత్"

"అంశో నానా వ్యపదేశాత్" అను బ్రహ్మసూత్రంబు నిదే విషయమును సమర్థించుటచే-జీవమిథ్యాత్వము ఉపపన్నము అగుట లేదు

"శివాంశా బ్రహ్మవిష్ణ్వాద్యా-అంశీ దేవః శివః స్మృతః" శివగీత.

"దివ్యో హ్యమూర్తః పురుషః-సబాహ్యాభ్యంం
తరో హ్యజః। అప్రాణో హ్యమనాః శుభ్రో-హ్యక్షరాత్
పరతః పరః"

2 వ వాక్యము

స్వతంత్రమగు సర్వప్రకాశమునందున్నందున దివ్యుఁడు, పరిచ్ఛిన్నము కానట్టి స్వరూపముగలవాడగుటచే-అమూర్తుఁడు, పురుష పదవాచ్యుఁడునగు శివుఁడు – స్థూలసూక్ష్మశరీరములయందు ఇష్ట ప్రాణభావలింగస్వరూపమున నుండువాడై జన్మరహితుఁడు ప్రాకృత ప్రాణశూన్యుఁడు ప్రాకృత మనస్సు లేనివాడు నిర్మలుఁడు జడ ప్రపంచాతీతమగు చేతన శక్తి కన్న పరుఁడు నగును.

3 వ వాక్యము

"ఏతస్మా జ్జాయతే ప్రాణో–మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయు ర్జ్యోతి రాపః-పృథివీ విశ్వస్య ధారిణీ"

శివుని నుండియే ప్రాణవాయువు, మనస్సు, జ్ఞానకర్మేంద్రియములు, అకాశము, వాయువు, అగ్ని, ఉదకము, ప్రపంచమును ధరించు భూమి యుదయించును.

ఆకాశాభిమాని దేవతయగు సదాశివుని నుండి–వాయ్వభిమానియగు మహేశ్వరుఁడు, మహేశ్వరునుండి – అగ్న్యభిమానియగు రుద్రుఁడు, రుద్రునినుండి – ఉదకాభిమానియగు నారాయణుఁడు, విష్ణువునుండి–పృథివ్యభిమానియగు బ్రహ్మదేవుఁడు ఆవిర్భవించిరని చెప్పవచ్చును.

"ధ్యాయీతేశానం ప్రధ్యాయితవ్యం। సర్వమిదం బ్రహ్మ విష్ణురుద్రేంద్రాస్తే సంప్రసూయంతే సర్వాణి చేంద్రియాణి సహభూతై ర్న కారణం కారణానాం ధ్యాతా। కారణంతు ధ్యేయః, సర్వైశ్వర్య సంపన్నః సర్వేశ్వరః శంభు రాకాశ మధ్యే" అథర్వశిఖోపనిషత్తు.

ఇట ఇంద్రశబ్దము-మహేశ్వర సదాశివులఁజెప్పును.

ధ్యానింపఁదగిన పరమేశ్వరుని ధ్యానింపవలెను. ఎట్లనఁగా? బ్రహ్మవిష్ణురుద్ర మహేశ్వర సదాశివులు, సర్వేంద్రియములు,పంచ భూతములు, పరమేశ్వరునుండియే జన్మించుచున్నవి. కారణకారణు డైన శివుఁడు, జీవాత్మయు జన్మించుటలేదు-సర్వైశ్వర్య సంపన్నుఁడు గాను సర్వేశ్వరుఁడుగాను సర్వకారణుఁడైన పరమేశ్వరుఁడు-హృద యాకాశమున ధ్యానింపఁదగినవాఁడు".

శ్లో॥ ఏక ఏవ శివః సాక్షాత్-సత్యజ్ఞానాది లక్షణః।
వికారరహితః శుద్ధః-స్వశక్త్యా పంచధా స్థితః॥
సూతసంహిత.

శ్లో॥ కార్యం బ్రహ్మ మహీభాగే-కార్యం విష్ణుర్జలాంశకే।
వహ్నిభాగే తథా రుద్రో-వాయ్వంశే చేశ్వరః స్థితః॥
ఆకాశాంశే శరీరే తు-సాక్షాదేవ సదాశివః॥
సూతసంహిత-

4 వ వాక్యమున - స్వర్గాదిలోకములు శిరస్సుగాను, సూర్య చంద్రులు నేత్రములు గాను, దిశలు చెవులుగాను, వర్ణాది రూపమున వివరింపఁబడిన వేదములు వాక్కుగాను, మహా వాయువు ప్రాణము గాను, చరాచర ప్రపంచము హృదయము గాను, పృథివి పాదములు గాను పరమేశ్వరుని విరాట్ స్వరూపమునకు ఒప్పారుచున్నవి. ఇట్టి పరశివుఁడే-సూక్ష్మరూపమున సర్వప్రాణుల నంతర్యామి యగువాఁడు. అని చెప్పఁబడినది.

ఇందుకు మరియొక ప్రమాణము-

"ఏకో దేవః సర్వభూతేషు గూఢః-సర్వవ్యాపీ సర్వ

భూతాంతరాత్మా। కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః-సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ"

శ్వేతాశ్వతరోపనిషత్తు 6-11

5 వ వాక్యమున దిగువ విషయము గలదు.

సూర్యుఁడు సమిధగా గల ద్యులోకము, ద్యులోకమునుండి చంద్రుఁడు, చంద్రుని నుండి పర్జన్యుఁడు. మేఘమునుండి పృథివిని ఓషధులు, ఓషధులనుండి పురుషునకు సంభవించు రేతస్సును స్త్రీ యోనియందు విడచినచో సంతానము. కాగా అక్షరుఁడనఁబడు శివుని వలననే ఇవియన్నియు ఆవిర్భవించును

6, 7, 8, 9 వాక్యములలో

ఋగ్యజుఃసామవేదములు, యజ్ఞాదిదీక్షయు, యజ్ఞములు, క్రతువులు (యూపస్తంభములేనివి) యజ్ఞాది దక్షిణలు, సంవత్సరాది కాలము, యజమానుఁడు, కర్మఫలానుభవముగల స్వర్గాదిలోకములు, సూర్యప్రకాశము. చంద్రకాంతియు, బ్రహ్మ విష్ణు రుద్రాది దేవతలు, సాధ్యులు, మానవులు, పశులు, ప్రాణాపానములు, వ్రీహియవాది ధాన్యము. శివారాధనమునకై పుష్పబిల్వాదులను సేకరించు పరిశ్రమ, లేక శివషడక్షరీమహామంత్రజపరూపమైన తపస్సు, శ్రద్ధ, సత్యము, బ్రహ్మచర్యము, నిత్యనైమిత్తికాది కర్మవిధియు, (కర్ణద్వయము. నేత్రయుగ్మము, నాసికాయుగళము, వాక్కు, అను) సప్తప్రాణములు, కర్ణాది ఇంద్రియవ్యాపారములనఁదగు సప్త అర్చిస్సులు, సముద్రములు, పర్వతములు. ప్రవహించు మహానదులు ఓషధులన్నియు, మధురము మొదలగు షడ్విధరసంబు, పృథివ్యాది పంచభూతముల నధిష్ఠించు బ్రహ్మవిష్ణ్వాది పంచస్వరూపములును పరమేశ్వరు నుండి

యావిర్భవించును గాన పరమేశ్వరుఁడు సర్వకారణుఁడగుచున్న వాడు-సర్వాంతర్యామియు నగువాడు-అని కలదు

10 వ వాక్యము

"పురుష ఏవేదం విశ్వం-కర్మ తపో బ్రహ్మ పరామృతం, ఏతద్యో వేద నిహితం గుహాయాం - సోఽవిద్యాగ్రంధిం వికిరతీహ సౌమ్య".

పరమేశ్వరునివలన జన్మించిన ఈ విశ్వము-పరమేశ్వరుఁడేను, పరమేశ్వరుఁడనగా-ఇఁట శివలింగమని అర్థము.

శ్లో॥ పీఠికా పరమా శక్తి-ర్లింగం సాక్షాత్ పరః శివః।
శివశక్తి సమాయోగం-విశ్వం లింగం తదుచ్యతే ॥
సిద్ధాంతశిఖామణి.

పై వాక్యమున గల పురుషశబ్దము యొక్క-నిర్వచనము ది‌‌గువ విధము గలదు.

"పురి స్థూలాది శరీరే ఇష్టాదిలింగరూపేణ
శయనాత్-పురుషసంజ్ఞకం పరశివలింగమేవ"

"స్థూల సూక్ష్మ కారణ శరీరములయందు ఇష్ట ప్రాణ భావలింగ రూపముస శయనించుటచే - శివలింగము-పురుషశబ్దవాచ్యంబైనది" కర్మ (దీక్షాకర్మసాధ్యమగుటచే ఇష్టలింగము) తపస్సు (శివపంచాక్షరీ జపాత్మకమగు ఉపాసనకు విషయమగు ప్రాణలింగము) బ్రహ్మ-(భావలింగము) పరామృతంబేను (పురుషశబ్దవాచ్యుఁడైన పరమేశ్వరుఁడేను.)

శ్లో॥ లింగం తు త్రివిధం ప్రోక్తం-స్థూలం సూక్ష్మం తు
కారణం। ధారయంతో నరాః స్థూలం-కారణం
సంప్రయాంతి హి॥ లింగపురాణము ఉత్తరభాగము,20అ

"శివలింగము-స్థూలమనియు, సూక్ష్మమనియు, కారణమనియు త్రివిధంబు నగు. స్థూలమగు ఇష్టలింగమును ధరించు మానవులు-కారణమగు భావలింగమును పొందుదురు."

అనఁగా-హృదయమున భావలింగ సాక్షాత్కారముచే శివసాయుజ్యము నొందుదురని భావము.

శ్లో॥ భావలింగం పరం తత్త్వం-ప్రాణలింగం తు సూక్ష్మకం।
ఇష్టలింగం భవేత్ స్థూల-మేతల్లింగత్రయం స్మృతమ్॥
శివానుభవసూత్రము.

సౌమ్యుఁడా ! అత్యంత రహస్యమైన ఇవ్విషయమును గుర్తించువాడు—అవిద్యాగ్రంధినుండి విడిబడి-ముక్తుఁడగును.

ద్వితీయముండకమున
ప్రథమ ఖండము సమాప్తము.

# ద్వితీయ ముండకము - ద్వితీయఖండము

ఇందు 11 వాక్యములు గలవు.

1 వ వాక్యమున -

ప్రాణులందరి హృదయగుహలో నుండునదియు, అందువలననే జీవాత్మను సమీపించునదియు, వస్తుతః అదృశ్యమైనను చంద్రగత రాహువువలె హృదయమున సాక్షాత్కరించునదియు, గొప్ప స్వరూపము గలదియు, గురు చర ఇష్టలింగరూపమున బయలు పడునదియు, నగు (ఇందుకు ప్రమాణములు - "ఏకఏవ శివః సాక్షాత్- సర్వానుగ్రహ కారకః । గురు జంగమ లింగాత్మా-వర్తతే భుక్తిముక్తిదః" సిద్ధాంతశిఖామణి. 9-2 "లలాటలోచనం చాంద్రీం కళామపి చ దోర్ద్వయం । అంతర్నిధాయ వర్తేఽహం-గురురూపో మహేశ్వరి! 9-3 సిద్ధాంతశిఖామణి, "సర్వలోకోపకారాయ-యో దేవః పరమేశ్వరః । చరత్యతిథి రూపేణ-నమస్తే జంగమాత్మనే" వీరాగమము) పరశివతత్త్వము అనఁదగు ఇష్టలింగమునకు ఆహారాది భోగ్యజాతమునంతయు సమర్పించి తత్ప్రసాదముగ అనుభవింపవలెను.

శిష్యులారా! సమర్పింపఁబడు వస్తువుల రూపమును ఇష్టలింగమునకు; రుచిని ప్రాణలింగమునకు; ఆనందమును భావలింగమునకు సమర్పింపవలెను. అని అనుభవసూత్రమున గలదు.

జాగ్రత్తు, స్వప్నము, సుషుప్తి అను దశలయందు గోచరించు

నదియు, జీవాత్మలందరిచే ప్రార్థింపఁబడునదియు, బ్రహ్మవిష్ణ్వాదులను మించినదియు, జీవాత్మకంటె విలక్షణమైనదియు నగు శివతత్త్వమునే ఉపాసించి తరింపుఁడు! అను ఆచార్యప్రబోధమును గాననగును

2 వ వాక్యమున-

సర్వప్రకాశకము, అణువులకన్న అణువు, భూరాదిలోకములకు లోకనివాసులకు ఆధారము, ప్రాణము వాక్కు మనస్సు సత్యము అమృతము అక్షరంబు నగు శివలింగమును దర్శింప నారాధింపుడు! అని చెప్పఁబడినది.

2 వాక్యమున ప్రతిపాదింపఁబడిన శివలింగము.

"సద్రూపం భావలింగంస్యాత్-చిద్రూపం ప్రాణలింగకం
ఆనందరూప మాచార్యై - రిష్టలింగ ముదాహృతమ్"
అనుభవసూత్రము

సచ్చిదానందమయము శివలింగము కాగా-భావలింగము సద్రూపమై ప్రాణలింగము చిద్రూపమై ఇష్టలింగము ఆనందరూపముగ-శాంభవ దీక్షితునకు మహాభాగ్యముగ లభించుచున్నయది.

3, 4 వ వాక్యములలో ఇట్లు కలదు

"ఉపనిషత్తులలో ప్రసిద్ధము, శివపంచాక్షరీ మహామంత్రము అను కల్పవృక్షమునకు బీజమగు ప్రణవము అను గొప్ప ధనుస్సును గురుముఖతః స్వీకరించి-శాంభవదీక్షా సంస్కృతమగు శుద్ధాత్మ అను బాణముతో ననుసంధించి శివార్పితంబగు మనస్సు అను హస్తముతో ధనుస్సునాకర్షించి అక్షరశబ్దవాచ్యమైన మహాలింగమును గురిపెట్టి శుద్ధాత్మఅను అమ్మును ప్రయోగింపవలెను.

జీవాత్మ–శాంభవదీక్షితుఁడైనచో–శివస్వరూపుఁడగును శివుఁడు కానిది శివునారాధింపనర్హుఁడు కాడని–

"నాశివస్య శివోపాస్తి–ర్ఘటతే జన్మకోటిభిః" అను అనుభవ సూత్ర ప్రమాణము–చాటినది.

అందువలననే ప్రణవపంచాక్షరి ధనుస్సనియు. శుద్ధాత్మబాణ మనియు, శివలింగము లక్ష్యమనియు, చెప్పఁబడినందున బాహ్య విషయాభిరుచి అను ప్రమాదము లేనివాడై శుద్ధాత్మ అను బాణమును ప్రయోగించినచో-బాణము లక్ష్యముతో ఏకీభవించినట్లు శుద్ధాత్మ-శివమయుండగును.

"భ్రమద్భ్రమరచింతాయాం-కీటోఽపి భ్రమరాయతే,
శివచింతాసమాక్రాంతః- శివరూపీ భవేద్ధ్రువమ్"
వీరాగమము

తనచుట్టు తిరుగుచున్న తుమ్మెదను కీటము (పురుగు) నిరంతరము భావించుటచే (కీటము) భ్రమరమగునట్లు - శాంభవ దీక్షితుఁడు–ఇష్టలింగము నర్చించుచు ప్రణవపంచాక్షరీ జపాత్మక మగు ప్రాణలింగము ననుసంధించుచు "శివోఽహం" ధ్యానమున భావలింగమును భావించునెడల – శివస్వరూపుఁడగును. ఇద్ది నిశ్చితము.

౮ వ వాక్యమున

"తనను తాను ప్రకాశింపఁజేయు శక్తి (ద్యౌః) పృథివీ జలాగ్నివాయ్వాకాశాఖ్య పంచభూతములు, బాహ్యాంతరింద్రియము లతో కూడిన మనస్సు, ఎవనియందు ఆధారపడియున్నవో, అద్వి తీయుఁడైన అట్టి పరశివునే పరవిద్య (ప్రణవపంచాక్షరీ మహా

మంత్రము)తో ఆశ్రయింపుడు! ఇంద్ర చంద్రాది కామ్యదేవతలఁ గూర్చిన వాక్కులను విడనాడుడు! "అమృతస్యైష సేతుః" ఈ మహా మంత్రము మోక్షముఁజెందుటకు ముఖ్యసాధన మగును.

కల్యాణ దేశికుఁడు-శాంభవదీక్షితులైన శిష్యులకు ఉపదేశించి నట్లు పై వాక్యమున గాననగును.

"జపః పంచాక్షరాభ్యాసః-ప్రణవాభ్యాస ఏవ వా,
రుద్రాధ్యాయాదికాభ్యాసో-నావేదాభ్యసనాదికమ్"
రేణుకభగవత్పాదులు.

"ప్రణవశివపంచాక్షరి నభ్యసించుట, రుద్రాధ్యాయము మొదలగు శివపరమైన ఉపనిషత్తుల నభ్యసించుటయు జప మనఁబడును. వేదవిరుద్ధములైన వాఙ్మయము నభ్యసించుట-జపము కాజాలదు." అని రేణుకాచార్య నిర్వచనము.

6 వ వాక్యమున-

రథమధ్యమున గల కఱ్ఱల వలె-హృదయమున నాడులు-తగులుకొనియున్నవి. నాడీ పరివృతమైన హృదయమందు-శివుఁడు సంచరించుచున్నవాడు. ఇట్టి శివుఁడే బ్రహ్మవిష్ణ్వాది భక్తుల ననుగ్రహించుటకు చంద్రశేఖరాది పంచవింశతి లీలారూపముల నావిర్భవించెను. అట్టి శివునే ప్రణవ ఘటిత శివపంచాక్షరీ మహామంత్ర జపముతో ధ్యానింపుడు!

శిష్యులారా! తమస్సు (ప్రకృతి) నతిక్రమించిన శివునారాధించుటచే శుభము (నిఃశ్రేయస్సు) కలుగుగాక!

అని-గురువు ప్రబోధించెనని కలదు.

7 వ వాక్యము

"యః సర్వజ్ఞః సర్వవి-ద్యస్యైష మహిమా భువి,
దివ్యే బ్రహ్మపురే హ్యేష-వ్యోమ్న్యాత్మా ప్రతిష్ఠితః"
మనోమయః ప్రాణశరీరనేతా-ప్రతిష్ఠితోఽన్నే
హృదయం సన్నిధాయ । తద్విజ్ఞానేన పరిపశ్యంతి
ధీరా-ఆనందరూప మమృతం యద్విభాతి"

సమస్తమును గుర్తించునట్టి శివుఁడు-భూలోకమున భక్తుల ననుగ్రహించుటకు గురు లింగ జంగమరూపమున తన మహిమను చూపెట్టును ఇట్టి పరశివుఁడు – హృదయాకాశమున భావలింగ రూపమున, హృదయమునందు ప్రాణలింగరూపమున, స్థూల శరీర మున ఇష్టలింగరూపమునను ఆచార్యునిచే ప్రతిష్ఠింపఁబడియున్నవాడు.

ధీరులు-అట్టి లింగత్రయము నుపాసించి-సచ్చిదానందమయము స్వయం ప్రకాశమానంబు నగు మహాలింగమును సాక్షాత్కరించు కొందురు.

శివుఁడే – శుద్ధమనోగ్రాహ్యుఁడై ప్రాణశరీరముల యొక్క ప్రభువు నగును.

8 వ వాక్యమున-

"భిద్యతే హృదయగ్రంధి-శ్ఛిద్యంతే సర్వసంశయాః,
క్షీయంతే చాస్య కర్మాణి-తస్మిన్ దృష్టే పరావరే"

శివోఽహం ధ్యానమునందు – నిష్కళము సకళంబునగు శివలింగమయమైన జ్యోతిస్సు సాక్షాత్కరించినచో ఈ జీవాత్మ యొక్క - అణు సంబంధమైన మలము అనఁదగు గ్రంధి (ముడి)

విడిపోవును. మాయా మల సంబంధములైన సంశయములన్నియు తొలగును. ప్రారబ్ధముదక్క ఇతర కర్మలన్నియు క్షీణించును. అని కలదు.

9 వ వాక్యమున.

అగ్నితప్త సువర్ణమువలె ప్రకాశించునట్టి కారణశరీరమునందు— అనాదికాలమునుండి ఎట్టి మలము లేనట్టి విభాగరహితము అతి స్వచ్ఛము సూర్యాది జ్యోతిః ప్రకాశకము నగు భావలింగము (బ్రహ్మము)ను శివోపాసకులు గుర్తెరుగుదురు. వేదాగమపురాణేతి హాసాద్యర్థ జ్ఞానమాత్రమున భావలింగ సాక్షాత్కారము కాదనియు, శాంభవదీక్షితులై ఇష్ట ప్రాణ భావలింగముల నారాధించు శివయోగు లకే శివదర్శనము లభించుననియు దిగువ గల అభియుక్తోక్తి వ్యక్త పఱచినది అని కలదు.

"యది వాచనికాత్ జ్ఞానాత్-ముక్తిఃస్యాద్భావనాం
వినా, శరీరమానసై ర్దుఃఖై-ర్ముచ్యేరన్ సర్వజంతవః"

10, 11 వ వాక్యములలో

"సూర్యచంద్ర నక్షత్రములు, మెఱుపులు, అగ్నియు పరశివుని ప్రకాశింపఁజేయునవి కావు. స్వయం ప్రకాశమానమగు శివజ్యోతిస్సు నాశ్రయించియే సూర్యచంద్రాది సమస్త జ్యోతిర్వర్గము వెలు గొందుచు - శివజ్యోతిస్సు కాంతిచేతనే ప్రపంచమును ప్రకాశింపఁ జేయుచున్నవని నిరూపింపఁ బడినది.

జరామరణాది రహితమై అమృతమనఁబడు పరశివ బ్రహ్మము ముందు, వెనుక, దక్షిణమున, ఉత్తరమున, క్రింద, పైన, బ్రహ్మం

దమునంతట వ్యాపించియున్నది. వేయేల? దృశ్యమానమగు ప్రపంచమంతయు సర్వోత్కృష్టమైన బ్రహ్మంబేను.

పృథివ్యాది పంచమహాభూతములు, సూర్య చంద్రులు ఆత్మ యను అష్టమూర్తులతో శివుఁడు ప్రపంచమును వ్యాపించియున్నవాడు. అని ప్రతిపాదింపఁబడినది.

ద్వితీయ ముండకమున-ద్వితీయ ఖండము
సమాప్తము.



శ్రీ మహా గణాధిపతయే నమః

# తృతీయ ముండకము - ప్రథమఖండము

## ఇందు పది వాక్యములు గలవు-

1 వాక్యము.

"ద్వా సుపర్ణా సయుజా సఖాయా - సమానం వృక్షం పరిషస్వజాతే। తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి-అనశ్న న్నన్యోఽభిచాకశీతి"

"రెండు పక్షులు - కూడినవై - చైతన్యమున సమానములునై .కే శరీరవృక్షము నాశ్రయించినవి. అవ్వానిలో నొక పక్షి జీవాత్మ) పరిపక్వమైన కర్మఫలము ననుభవించుచుండును. మరి యొక పక్షి (పరమాత్మ) కర్మఫలము ననుభవింపక-జీవాత్మను చూచుచుండును.

ఇందుకు సూతసంహితలో

"ద్వౌ సుపర్ణౌ శరీరేఽస్మిన్-జీవేశాఖ్యౌ వ్యవస్థితౌ,
తయో ర్జీవః ఫలం భుంక్తే-కర్మణో న మహేశ్వరః"

2, 3, వాక్యములయందు-

జీవాత్మ పరమాత్మతో కూడి-ఒకే శరీర వృక్షమునందున్నను పరాధీనకర్తయై శరీరమే నేనను మోహముచే దుఃఖించుచుండును. ఎప్పుడైతే తనకంటె వేరైన పరమేశ్వరుని లింగధారణదీక్షితుఁడై

శివపంచాక్షరీ జప భస్మరుద్రాక్షధారణములఁ గావించి "శివోఽహం" ధ్యానముతో ప్రసన్నుఁజేసికొనునో - అప్పుడు తన నుద్ధరింప సమీపించియుండు పరమేశ్వరు నవలోకింపఁగలుఁగును. అట్టితఁడు సంసారదుఃఖము బొత్తుగా లేనివాడై పరమేశ్వరుని మహిమ (శివ సాయుజ్యము)ను పొందును.

ఏ సమయమున శాంభవదీక్షితుఁడు శివోఽహం భావనతో శుద్ధాంతఃకరణమున-బంగారువన్నె గలిగినట్టి, బ్రహ్మ విష్ణు రుద్రాదులకు కర్తయైనట్టి, పరిపూర్ణుఁడైన శివుని-చూచునో-అప్పుడు పరిపూర్ణ జ్ఞానము గలవాడై - అనేక కోటిజన్మార్జిత పుణ్యపాపములను పోగొట్టుకొని-అజ్ఞాన లవలేశము గూడ లేనివాడునై శివునితో అత్యంత సమానమగు వైభవము గలవాడగును.

"భోగమాత్ర సామ్యలింగాచ్చ" అను బ్రహ్మసూత్రముఁబట్టి-సృష్ట్యాది పంచకృత్యాధికారము దక్క నితరమైన శివమహిమ యంతయు ముక్తాత్మకు లభించునని తెలియవలెను.

4 వ వాక్యమున-

"ప్రాణలింగ స్వరూపుఁడైన పరమాత్మ-పృథివ్యాద్యభిమాని దేవతలగు బ్రహ్మాదులయొక్క నివాసములగు ఆధారాదిచక్రముల నధిష్ఠించి ప్రకాశించుచుండును. అట్టి పరశివు నుపాసించుచు సాక్షాత్కరించుకొనిన మహాపురుషుఁడు-శివుఁడు దక్క నితరము నవలోకింపడు. శివునియందే విహారము ఆసక్తి గలవాడై శివతాదాత్మ్య క్రియ (శివోహంభావనతో శివునితో నేకీభవించుట) కలవాడగును. ఇట్టివాడే శివోపాసకులలో శ్రేష్ఠుఁడనఁబడుఁగును.

"సతీ చాహం పతిర్లింగం" ఇత్యాది రీతిని తాను భార్యననియు,

శివుఁడు భర్తయనియు భావించి-సాధ్వి పతిఁగూడి ఆనందించునట్లు తాను శివునిఁగూడి పరవశుఁడు కావలె"నని శ్రీ రేణుకాచార్యులు ప్రవచించెను" అని నిరూపింపఁబడినది.

5 వ వాక్యము.

"సత్యేన లభ్య స్తపసా హ్యేష ఆత్మా-సమ్యక్ జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం। అంతఃశరీరే జ్యోతిర్మయో హి శుభ్రో-యం పశ్యంతి యతయః క్షీణదోషాః"

"కామక్రోధాది దోషములు లేనట్టి ఇంద్రియములను వశపఱచుకొనినట్టి, శివోపాసకులు-శరీరమున గల హృదయమునందు చిదాకాశ రూపమున ప్రకాశించు ఏ పరమాత్మ నవలోకింతురో అట్టి శివుఁడు-సత్యముచేతను పంచాక్షరీజపాది నిరంతర తపస్సుచేతను శివోఽహం ధ్యానము చేతను బ్రహ్మచర్యము వలనను పొందఁదగినవాడు.

6, 7 వాక్యములలో

సత్యమే జయించును. అనృతము ఓడిపోవును. దేవయాన మార్గము-సత్యముచేతనే లభించును. శివజ్ఞానులు-నిష్కాములై దేవయాన మార్గము నాక్రమించి-సత్యము యొక్క పరమ నిధానమగు మహాకైలాసస్థానముఁజెంది ఆనందింతురు. తపోధ్యానబ్రహ్మచర్యములకన్న-సత్యమే శ్రేష్ఠ మగునని ప్రతిపాదింపఁబడినది.

మరియు

సత్యస్వరూపమైన బ్రహ్మము - ఆకాశమునకంటె గొప్పదై హృదాకాశమున ప్రకాశించునది. ఇద మిత్థమని చెప్పనలవి గాని లింగరూపము గలది, జీవాత్మకంటె సూక్ష్మమునై లింగాంగ

సామరస్యముతో శివునుపాసించువారికి - ఈ శరీరమునందే హృదయ గుహయందు సాక్షాత్కరించునది యగును. ఉపాసకులు గానివారికి దూరమగునని భావము.

"తస్యాః శిఖాయా మధ్యే-పరమాత్మా వ్యవస్థితః"
(మహానారాయణము)"

ఇటు-తస్యాః శిఖాయా అనుదానికి జీవుడనియు, అట్టి జీవాత్మలో పరమాత్మయున్నాడనియు పై వాక్యార్థము.

"స బాహ్యాభ్యంతరం సాక్షా-ల్లింగం జ్యోతిఃపరంస్వకం,
తిలే తైల మివాభాతి-హ్యారణ్యామివ పావకః,
క్షీరే సర్పిరివ స్రోత-స్యంబువత్ స్థిత మాత్మని"
అనుభవసూత్రము.

బాహ్యమున అంతరమున ప్రకాశించు జ్యోతిర్లింగము-నువ్వులలో నూనెవలె, అరణియందు అగ్నివలె, పాలలో నెయ్యివలె. ప్రవాహమున ఉదకమువలె, తనలో సాక్షాత్కరించునని శ్లోకార్థము.

8 వ వాక్యము.

"న చక్షుషా గృహ్యతే నాపి వాచా-నాన్యై ర్దేవై స్తపసా కర్మణా వా, జ్ఞానప్రసాదేన విశుద్ధసత్వః-తతస్తు తం పశ్యతే నిష్కళం ధ్యాయమానః"

పరశివస్వరూపమగు భావలింగము - ప్రాకృతనేత్రముచేతను శివజ్ఞానము లేనట్టి వాక్కుచేతను కర్మజ్ఞానేంద్రియములచేతను కృచ్ఛ్రచాంద్రాయణాది శరీరశోషణాత్మకమగు తపస్సుచేతను జ్యోతిష్టోమయాగాది కామ్యకర్మచేతను సాక్షాత్కరించునది కాదు.

విభాగములేని పరిపూర్ణుఁడైన శివుని ధ్యానించువాడు-శివానుగ్రహము వలన చిత్తశుద్ధి గలవాడై-హృదయమున భావలింగమును దర్శింపఁ గలుఁగును.

శ్లో॥ విశుద్ధ మన్నజాతం హి-యచ్ఛివాయ నివేదితం।
తదేవ సార్వకాలం తు-భుంజానో లింగతత్పరః॥
మనః ప్రసాద మతులం-లభతే జ్ఞానకారణమ్॥

సిద్ధాంతశిఖామణి.

"శుద్ధమైన ఆహారమును శివునకు నివేదించి తత్ప్రసాదము నే ప్రతిదినము శివపూజావసానమున భుజించు మాహేశ్వరుఁడు-శివ దర్శనకారణమైన తిరుగులేని మనఃప్రసన్నతను పొందును."

9, 10 వ వాక్యములలో

ఐదు విధములగు ప్రాణవాయువునకు ఆధారమగు పరశివునందు ఇంద్రియములను లోఁబఱచుకొని చిత్తమును నిలుపునట్టి-శివయోగి-పరమేశ్వరు నంతఃకరణమునందే సాక్షాత్కరింపఁజేసికొనును. అట్టి శివయోగియొక్క శుద్ధచిత్తమునందు భావలింగమనఁదగు పరమేశ్వరుఁడు ఎక్కువ ప్రకాశించును.

శివయోగసిద్ధుఁడు-నిర్వికారచిత్తమున అభిలషించు కోరికలను మనస్సునందే తాననుభవించుటేగాక-శివభక్తులైన తన పరివారమునకు కోరికల ననుభవింపఁజేయును.

అందువలన శివయోగులను శివునివలె - పాదప్రక్షాళనాదులచే పూజించి శ్రేయస్సుఁబడయవలెను. శివభక్తుని శివుని శివాచార్యుని సమానులుగ భావించువారికే శివానుగ్రహము లభించును. సానంద మహర్షి-తన పరివారముతో గూడ యమలోకముఁజని నరకవాసు-

లందరికి-శివపంచాక్షరీ మహామంత్రమును వినుపించి మహాకైలాస మునకు గొంపోయిన వృత్తాంతము-పురాణప్రసిద్ధమైయున్నది.

ముక్తులు సదేహులు విదేహులునై యుందురు, శివలోకప్రాప్తులకు పునరావృత్తి-అనఁగా-పునర్జన్మ-లేదు.

శ్లో॥ దినకృత్కోటి సంకాశం-స్థాన మాద్య ముమాపతేః ।
సర్వకామసమాయుక్త-మంతఃక్లేశవివర్జితాః ॥
సర్వజ్ఞాః సగణాః శుద్ధాః-పరిపూర్ణా భవంతి చ ।
విశుద్ధకార్యకరణాః-పరమైశ్వర్య సంయుతాః ॥
సదేహాశ్చ విదేహాశ్చ-భవంత్యాత్మేచ్ఛయా పునః ।
సంప్రాప్తా యే పరం స్థానం-జ్ఞానయోగరతా నరాః ॥
న తేషాం పునరావృత్తి-ర్ఘోరే సంసారమండలే ॥

పరమేశ్వరుని లోకము-ఆద్యము, సూర్యకోటి ప్రకాశమానము, సర్వకామసమృద్ధంబునగు - ఇష్టప్రాణభావలింగోపాసనాత్మకమగు శివజ్ఞానయోగము నభ్యసించినవారు-శివలోకమునఁ బ్రవేశించి అంతః క్లేశములేనివారై, సర్వజ్ఞులు ప్రమథగణములతో క్రీడించువారు నిర్మలురు పరిపూర్ణులు మాయామోహరహితులు దివ్యకార్యసాధనములు గలవారు శివునితో సమానమగు వైభవము గలవారునై ఆనందపడుచుందురు. అని యుల్లేఖింపఁబడినది.

తృతీయముండకమున-ప్రథమ ఖండము సమాప్తము.

శ్రీ మహా గణాధిపతయే నమః

# తృతీయ ముండకము-ద్వితీయ ఖండము

ఇందు 11 వాక్యములు కలవు

1, 2 వాక్యములలో

స్థూల సూక్ష్మ ప్రపంచము నధిష్ఠించు బ్రహ్మాది వర్గము-శివునందు ప్రకాశించునదగును. అట్టి శివస్వరూపమును గుర్తించిన మహా పురుషులగు గురువును నిష్కాములై శివప్రీత్యర్థము పూజించువారు-ముక్తులగుదురు గాన వారు పునర్జన్మ నొంది స్త్రీ యోనియందు రేతస్సును విడువవలసినవారు కారు. గురువుచే గుర్తింపబడునది-సర్వోత్కృష్టమగు మహాలింగ మగును.

స్వర్గ మర్త్య పాతాళగతములైన కోరికల నపేక్షించువాడు—అట్టి కోర్కెల ననుభవించుటకు పునః పునః జన్మించుచుండును. శివ సాక్షాత్కారముచే కోర్కెల నన్నిటిని పొందినవాడు-అనగా-కోర్కెలు కోరనివానికి—ఈ జన్మయందే-కామములన్నియు అంతరించును.

3 వ వాక్యము.

"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో—న మేధయా న బహునా శ్రుతేన-యమేవైష వృణుతే తేన లభ్య-స్తస్యైష ఆత్మా వివృణుతే తనుం స్వామ్"

వేదశాస్త్రాభ్యాసము చేతను వేదార్థమును విశదీకరించు ప్రజ్ఞ

చేతను గురూపదేశము లేనట్టి వేదపురాణేతిహాసాది శ్రవణము చేతను పరమేశ్వరుఁడు-లభించువాడు కాడు ఇష్టప్రాణభావలింగధారణముచే ఈ సాధకుఁడు పరమేశ్వరు నుపాసించినదో అట్టి శివయోగికి-పరమేశ్వరుఁడు-తన సచ్చిదానందమయమగు మూర్తి నను గ్రహించును.

"మోక్షార్థినాం ముక్తిహేతు-ర్లింగధారణ మీర్యతే"

పురాణవచనము.

"మల్లింగధారణాల్లోకే-న కించిదపి దుర్లభం"

కామికోత్తరాగమము.

"యే ధారయంతి హృదయే-లింగం చిద్రూప మైశ్వరం
న తేషాం పునరావృత్తిః- ఘోరే సంసారమండలే"

రేణుకాచార్యులు.

మోక్షార్థులకు ముక్తి నిచ్చునది-లింగధారణమని పురాణము నిరూపించెను. శివలింగధారులకు ప్రపంచమున పొందరానిది లేదు. అని కామికోత్తరము వ్యాకుచ్చినది పద్రూపమగు శివలింగమును బాహ్యాభ్యంతరములయందు ధరించినవారికి-భయంకరమైన సంసార మండలములోనికి రావడం ఉండదు. అని రేణుకాచార్యులు ప్రతిపాదించిరి.

4 వ వాక్యమున-

పరమాత్మ--శాంభవదీక్షచే కలుగు మనోబలము లేనివానికి-లభింపడు. మాటిమాటికి పొరపడువాడును శివుని దర్శింపఁజాలడు. పంచాక్షరీజపములేనట్టి ఇతర మంత్ర జపాత్మకమగు తపస్సు

చేతను శివుఁడు సన్నిహితుఁడు కాడు. శివలింగధారణము లేని వానిని సదాశివుఁడు సమీపింపడు.

మనోబలము, అప్రమాదము శివపంచాక్షరీ జపము శివలింగ ధారణము అను ఉపాయములచే శివు నుపాసించు ఆత్మ-పశుత్వమును విడనాడి-పతియనుగ్రహముచే మహాకైలాసముఁ బ్రవేశించును.

"లింగం బ్రహ్మైవ కేవలం" "లింగే సుషుప్తిః" "ఊర్ధ్వాయ నమః ఊర్ధ్వలింగాయనమః" ఇత్యాది ప్రమాణములచే ఈ వాక్యమున గల లింగశబ్దమునకు శివలింగమను నర్థమే సమంజసంబని తేటపడు చున్నది. లింగ శబ్దము సన్న్యాసము అను అర్థము కలదని చెప్పుట-శివనిష్ఠారాహిత్యమును తెలుపును. అని నిరూపింపఁబడినది.

5 వ వాక్యమున-

శివోపాసనచే సంతృప్తిఁబడయునట్టి ధీరులు-దేనియందును అసక్తి లేనివారై తమ స్థూలసూక్ష్మశరీరములయందు ఇష్ట ప్రాణ లింగముల నారాధించుచు ఋషితుల్యులై ప్రారబ్ధాంతమున పరమ పదముఁజేరి-నిజరూపమునావిష్కరింపఁజేసికొనియు పరమేశ్వరుని సంపూర్ణముగ ఆశ్రయించినవారై సర్వవ్యాపియగు శివునితో సమానులునై శివానందము ననుభవింతురు. యని యుల్లేఖింపఁబడినది.

6 వ వాక్యమున-

"వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః-
సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః,
తే బ్రహ్మలోకే తు పరాంతకాలే-
పరామృతాత్ పరిముచ్యంతి సర్వే"

లింగధారణపూర్వక శివపంచాక్షరీజప శివార్చనాది ప్రయత్న పరులగు శివయోగులందరు–నిష్కామ నిత్యనైమిత్తిక కర్మాచరణ ముచే చిత్తశుద్ధి గలవారై వేదాంత ప్రతిపాదితమగు విజ్ఞాన (శివధ్యాన) ముచే–లేక–వేద వేదాంత శ్రవణముచే ఏకార్థనిశ్చయము గలవారై పరమేశ్వరునందు చిత్తమును నిలుపు సమాధియోగమున సిద్ధులునై ప్రారబ్ధాంతమునందు బ్రహ్మ (శివ) లోకముఁజేరి సంపూర్ణ శివానుగ్రహము వలన శివసాయుజ్యమును చెందుదురు.

7 వ వాక్యమున–

ప్రాణము, శ్రద్ధ, స్థూల పంచమహాభూతములు, పంచజ్ఞానేంద్రియములు, అన్నమయమగు మనస్సు, వాక్కు–అను పదునైదు-తమ తమ మూల రూపములయందు లీనములు కాగా – ప్రారబ్ధముదక్క–నితరములైన సంచిత ఆగామి కర్మలు, కర్మజ్ఞానేంద్రియాభిమాని దేవతలు. విజ్ఞానమయుఁడగు జీవాత్మ, ఇవి యన్నియు ముక్తదశ యందు పరమేశ్వరునితో ఏకీభవించును. అనఁగా- ప్రాకృతము లన్నియు దివ్యములై ముక్తాత్మకు శాశ్వతకాలము ఉపయోగించునని భావము ఆని విశదీకరింపఁబడినది-

8 వ వాక్యమున-దిగువ విధము చెప్పఁబడినది.

గంగా యమునా సరస్వత్యాది నదులు ప్రవహించుచు-స్థూల దశఁ జెందిన నామరూపములను విడనాడి–సముద్రముతో ఏకీభవించినట్లు–శివోపాసకుఁడు–ప్రాకృకములగు నామరూపములను పరిహరించి పరత్పరుఁడైన పరమ పురుష (శివు)ని పొందును

ఇఁట–నదులు సముద్రములో కలియుట యనఁగా - వృత్తి లయము-(అనఁగా ప్రవాహము మరుగుపడుట) అని తెలియవలెను.

నామరూపపరిత్యాగము - స్వవినాశము కాజాలదు. సముద్రములో కలిసిన నదులు సముద్రముగా గుర్తింపఁబడునట్లు—శివయోగి శివ సాయుజ్యముఁజెందినతరి శివుఁడుగానే గుర్తింపఁబడును. పూర్తిగా లేనివాడగునని చెప్పు వాదమున "సోఽశ్నుతే సర్వాన్ కామాంత్సహ, బ్రహ్మణా విపశ్చితా" "ముక్తః శివసమో భవేత్" ఇత్యాది శ్రుత్యాది ప్రమాణములు వ్యర్థములగును.

ఒకవేళ నదులు పూర్తి లేనివగు ననునెడ—పునః సృష్టిలో నదులు ఉండవని చెప్పవలసి వచ్చును. అట్లగుచో సృష్టిలో లోపము ఏర్పడును. గాన పూర్వోక్తమే సమంజసమై విశిష్టశివాద్వైతమును సమర్థించుచున్నయది.

9 వ వాక్యార్థము

ఏ పురుషుఁడు-నిశ్చయముగా సర్వోత్కృష్టమైన మహాలింగమును దర్శించునో, అట్టివాడు శివసదృశుఁడగును. అతని పుత్రాది వంశమున శైవఃడే జన్మించును. శివదర్శకుఁడు—దుఃఖమును, దుఃఖహేతువువైన అధర్మమును దూర మొనర్చుకొనును. హృదయగతములైన గ్రంధులవంటి సంశయములను తొలగించుకొని-జరామరణ రహితుఁడగును.

10 వ వాక్యార్థము

పరమేశ్వరుని కొరకు సత్కర్మల నాచరించు శ్రోత్రియులు-లింగధారణాత్మకమగు బ్రహ్మనిష్ఠ గలవారై శ్రద్ధతో స్వయముగా శివు నారాధింతురు శిరోవ్రతమనఃబడు లింగధారణము గలవారికే బ్రహ్మవిద్య (శివపంచాక్షరీ మహామంత్రార్థము) నుపదేశింపవలెను.

సూతసంహితాది గ్రంధములు. మాధవాచార్యాది మహాపురుషు

లును శివో వ్రతమనఁగా-భస్మ చ్ఛద్రాక్షమంత్రలింగధారణాత్మకమగు పాశుపతవ్రతంబగునని నిర్ణయించినవి. (8.)

అధర్వశిరస్సు, ముండకము, కైవల్యము, శ్వేతాశ్వతరము కాలాగ్ని రుద్రము మున్నగు ఉపనిషత్తులందు-పూర్వోక్త పాశుపతము-శిరోవ్రతమనియు, అత్యాశ్రమమనియు, శాంభవవ్రతమనియు పేర్కొనఁబడినది. కేవలము భస్మధారణము-సంపూర్ణ పాశుపతము కాదు.

శ్లో॥ పరబ్రహ్మాభిధం లింగం-పశుపాశవిమోచకం।
యో ధారయతి సద్భక్త్యా-స పాశుపత ఉచ్యతే॥

స్కాందపురాణము.

పరబ్రహ్మమనఁదగు శివలింగము-పశువునకు పాశమును విడిపించును. అట్టి లింగమును సద్భక్తితో ఎల్లకాలము ధరించువాడు-పాశుపతుఁడనఁబడును. పురాణ ఉపబృంహణముఁబట్టి వేదార్థమును నిర్ణయించుట-ప్రశస్తము.

ఇక చివరి 11 వ వాక్యార్థమేమనఁగా ?

ఈయుపనిషత్తున అక్షరముగ నిరూపింపఁబడిన పరశివబ్రహ్మమే సత్యమైనది. ఇట్లు పూర్వము అంగిరోఋషి-శౌనకునకు ఉపదేశించెను. ఇట్టి బ్రహ్మవిద్యను శిరోవ్రతములేనివాడు-చదువ గూడదు.

పరమ ఋషులైన శివయోగాచార్యులకు నమస్కారము.

నమః పరమ ఋషిభ్యః

(మొత్తం 68 వాక్యములు) ముండకోపనిషత్సారాంశము సమాప్తము.

"ద్వాసుపర్ణా" ఇత్యాది మంత్రములు శివాద్వైతమునే బలపరచు చున్నందున నీ యుపనిషత్తు-శైవ సంప్రదాయ బోధకమని విదిత మైనది.

సర్వం-శ్రీ రాజరాజేశ్వర చరణారవిందార్పణమస్తు.

ఓం తత్సత్.

---

శ్రీ

# కైవల్యోపనిషత్తు ప్రథమ ఖండము

"ఓం సహ నా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నా వధీత మస్తు, మా విద్విషావహై"

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

కాయిక వాచిక మానసిక దోషములు శమించుటకై "శాంతిః" అని ముమ్మారు ఉచ్చరించి ఆత్మజ్ఞానముకొరకు ఆస్తికులు వేదాంతముల నభ్యసించి యవ్వాని సముచితార్థమును తెలిసికొని-శివపూజన జపధ్యానముల నాచరింపవలెనని-సూత సంహితా నిర్వచనము.

"ఓమ్, అథాశ్వలాయనో భగవంతం పరమేష్ఠిన ముప సమేత్యోవాచ-అధీహి భగవో బ్రహ్మవిద్యాం వరిష్ఠాం, సదా సద్భిః సేవ్యమానాం నిగూఢాం-యయాఽచిరాత్ సర్వపాపం వ్యపోహ్య-పరాత్పరం పురుషంయాతి విద్వాన్" 1

ఓంకారము అథశబ్దము మంగళార్థకములు- ఐన నిట అథ శబ్దము-"శాంభవదీక్షాస్వీకారానంతరము" అను నర్థము గలదగును. ఆశ్వలాయనుఁడను బ్రహ్మర్షి-ముముక్షువై-లింగధారణ దీక్షానంతరము-భగవానుఁడైన బ్రహ్మదేవుని సమీపించి ప్రశ్నించెను.

భగవానుఁడా! సత్పురుషులచే సదా సేవింపఁబడునది, రహస్యంబు, "త్వరలో పాపములఁబోగొట్టుకొని సాధకుడు-పరాత్ప

రుఁడు పురుషశబ్దవాచ్యుఁడు నగు శివునిఁజేరునట్లు ప్రయోజనము గలదియు, వరిష్ఠంబు నగు బ్రహ్మవిద్య నుపదేశింపుము!

వివరణ—

"కీర్తింపఁబడుచుండగానే - లింగధారణ పూర్వక శివధ్యాన యోగము నొసఁగి భవమును తొలగించువాడగుటచే ఆచార్యుఁడు భగవానుఁడనఁబడును." ఇట్లు అథర్వశిఖోపనిషత్తు-నిరూపించినది.

సత్పురుషులెవరనఁగా? "పవిత్రం తే వితతం" ఇత్యాది ఋగ్వేద మంత్రములు "యా తే రుద్ర! శివా తనూ రఘోరాఽపాపకాశినీ" ఇత్యాది యజుర్వేద మంత్రములు, బ్రహ్మగీతాది ప్రమాణములును ప్రతిపాదించు లింగధారణము గలవారు.

బ్రహ్మవిద్యయనఁగా-లింగాంగ సామరస్యముతో చేయఁబడు శివారాధనము. హరిబ్రహ్మాదులకన్న శ్రేష్ఠుఁడు-పరాత్పరుఁడనఁబడును. ఇందుకు-

"పరాత్పరతరో బ్రహ్మా-తత్పరాత్ పరతో హరిః,
యత్పరాత్ పరతోఽధీశ- స్తన్మే మనః శివసంకల్పమస్తు"

అను శివసంకల్పోపనిషత్తు మొదలగునవి-ప్రోద్బలకములగునవి.

"ఋతం సత్యం పరంబ్రహ్మ-పురుషం కృష్ణపింగళం" ఇత్యాది శ్రుతులు-పురుషశబ్దవాచ్యుఁడు-శివుఁడే నని నిర్ధారించినవి.

"పురుషో వై రుద్ర- స్తన్మహో నమో నమః" మహానారాయణము.

"తమీశానం పురుషమీడ్యం - నిచాయ్యోత్తారం శాంతి మత్యంత మేతి". శ్రీకరభాష్యము.

శ్లో॥ పురుషో నామ సంపూర్ణః-శివః సత్యాదిలక్షణః ।
సాంబమూర్తిధరో నాన్యో-రుద్రో విష్ణు రజోఽపివా ॥
బ్రహ్మగీత

సత్యాదిలక్షణుఁడైన శివుఁడే - పురుషుఁడనఁబడుఁగుచు పరిపూర్ణుఁడై యుండును. రుద్ర విష్ణు బ్రహ్మలకు పురుషశబ్దము ముఖ్యవాచకము కాదని బ్రహ్మగీతోపదేశము.

వరిష్ఠ విద్య యనఁగా-పరా విద్యయగును. అక్షరుఁడైన శివుని చెందించు పంచాక్షరియే బ్రహ్మవిద్యయని గూడా చెప్పవచ్చును.

"తస్మై సహోవాచ పితామహశ్చ-శ్రద్ధా భక్తి ధ్యాన యోగా దవేహి" 2

ఆశ్వలాయనునకు పితామహుఁడు-ఇట్లు వక్కాణించెను. శ్రద్ధ భక్తి ధ్యానము యోగము అను వానితో శివు నుపాసింపుము :

శ్రద్ధ - గురువు మాహేశ్వరుఁడు ఉపదేశించిన విషయముపై విశ్వాసము.

భక్తి - ఎల్లకాలము శివునియందు అనురాగముతో కూడిన ఆసక్తి,

ధ్యానము - శివపూజనభాగముగా శివోఽహంభావన,

యోగము - శివారాధనమే ముఖ్యమని భావించుట.

"న కర్మణా న ప్రజయా న ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః । పరేణ నాకం నిహితం గుహాయాం-విభ్రాజతే యద్యతయో విశంతి. 3

పుణ్యతీర్థ స్నానాది కర్మచేతను పుత్రపౌత్రాది సంతానము చేతను ధనకనకవస్తువాహనాది ప్రాప్తిచేతను మోక్షము లభింపదని

....కొందరు దార ధన పుత్రేషణా త్యాగముచేత – లేక-సర్వకర్మ త్యాగముచేత మోక్షమును పొందిరని స్ఫురించుట యథార్థము కాదు. కర్మ జ్ఞానేంద్రియ విషయములను శివేతరములనుండి మరల్చి–శివ పూజా జప ధ్యానాది ప్రయత్నశీలురు (యతయః) దేనిని పొందుదురో అట్టి శివతత్త్వము-హృదయగుహఁజెందిన చిదాకాశమునందు సన్నిహితమై ఉపాసకుల ననుగ్రహించుటకై-ప్రకాశించుచున్నది. ఇట్టి శివయోగులు—గురూపదిష్టమార్గమున ప్రవర్తించి–మహాకైలాసమునఁ బ్రవేశింతురని భావము.

"జ్ఞానే సిద్ధేఽపి విదుషాం-కర్మాపి వినియుజ్యతే,
ఫలాభిసంధిరహితం-తస్మాత్ కర్మ న సంత్యజేత్"

శివోపాసనాదార్ఢ్యముచే శివస్వరూపము అవగతమగుచున్నను జ్ఞానులు-ఫలాపేక్ష లేనట్టి వైదికకర్మఁజేయవలెను. కాని కర్మను విడువరాదు. శ్రీకరభాష్యము

"వేదాంతవిజ్ఞాన సునిశ్చితార్థాః - సన్న్యాసయోగా ద్యతయః శుద్ధసత్త్వాః । తే బ్రహ్మలోకే తు పరాంతకాలే- పరామృతాత్ పరిముచ్యంతి సర్వే" 4

వేదాంతవిజ్ఞానముచే పరతత్త్వము శివుఁడని నిశ్చయించినట్టి ఫలము నపేక్షింపక–శివు నారాధించు యోగమువలన చిత్తశుద్ధి గలిగినట్టి; శివదర్శన ప్రయత్నశీలురు అందరు (యతయః) ప్రారబ్ధ శరీరాంతమున శివలోకముఁ జెందినవారై నిజరూపావిర్భావము వలన శివునితో సమానముగ ఆనందామృతరసాస్వాదలోలురగుదురు.

లింగశూలాంకములు గలది తాంత్రికపాశుపతమగును గాన భస్మరుద్రాక్షమంత్ర శివలింగ ధారణాత్మకమగు వైదిక పాశుపతము

నవలంబింపవలెననియు, విఘ్నేశ రవి విష్ణు శక్తి శివులు సమానులని భావించుచు పూజించు మిశ్రపాశుపతము-శ్రౌతశైవులకు కూడదనియు కూర్మ మహాపురాణము నిర్వచించినది.

5, 6, 7, వ వాక్యములు

''వివిక్తదేశే చ సుఖాసనస్థః-శుచిః సమగ్రీవశిరఃశరీరః, అత్యాశ్రమస్థః సకలేంద్రియాణి - నిరుద్ధ్య భక్త్యా స్వగురుం ప్రణమ్య"

"హృత్ పుండరీకం విరజం విశుద్ధం-విచింత్య మధ్యే విశదం విశోకం, అచింత్యమవ్యక్త మనంతరూపం - శివం ప్రశాంత మమృతం బ్రహ్మయోనిమ్" 6

''త మాదిమధ్యాంతవిహీన మేకం-విభుం చిదానంద మరూప మద్భుతం, ఉమాసహాయం పరమేశ్వరం ప్రభుం-త్రిలోచనం నీలకంఠం ప్రశాంతమ్" 7

ధ్యాత్వా ముని ర్గచ్ఛతి భూతయోనిం - సమస్తసాక్షిం తమసఃపరస్తాత్".

"అత్యాశ్రమమనఁగా - బ్రహ్మచర్య గృహస్థ వానప్రస్థ సన్న్యాసములు అను నాలుగు ఆశ్రమముల లక్షణము గలదై ఆశ్రమములను మించినదగును.

శాంభవీదీక్షా ప్రధానాంగమగు ఇష్ట ప్రాణ భావలింగధారణముతో యావజ్జీవము శివునుపాసించు విప్రోత్తముఁడు-అత్యాశ్రమియై తనకు ఇష్టమైన ఏకాంత ప్రదేశమున సుఖాసనోపవిష్టుఁడై జలభస్మస్నానాదులచే శుచియై - కంఠము శిరస్సు, శరీరము అనువానిని

సమానములుగ నిలిపి–కర్మ జ్ఞానేంద్రియములను విషయముల నుండి మఱల్చి – భక్తిచే తన శాంభవదీక్షాగురువునకు ప్రణమిల్లిన వాడై కమలమువంటి హృదయమును దుష్టచింతనరహితముగ శుభ్రపఱచి-అట్టి హృదయమునడుమ విశదము శోకరహితము శబ్దస్పర్శరూపరసాదులు లేనిదగుటచే వ్యక్తముకానిదియు, ఇదమిత్థమని నిర్ణయింప నలవిఁగానిదియు చంద్రశేఖరత్వాది అనంత లీలా రూపములు గలదియు–లేక–గురు చర ఇష్ట ప్రాణ భావ లింగాద్యనంత రూపములు గలదియు నగు శివస్వరూపము ప్రశాంతమనియు అమృతంబనియు వేదవేదాంగకారణమనియు లేక చతుర్ముఖ బ్రహ్మ జనకమనియు ధ్యానింపవలెను.

పుణ్యాశ్రమము, అరణ్యము తనకు ప్రశస్తముగ కనఁబడు స్వగృహాదికంబు – ఏకాంతస్థలమగును. శివాలయము, బిల్వవృక్షమూలము, పర్వతగుహ, అగ్ని ఇసుక మున్నగునవి లేనిదియు నదీతీరము దేశకాలోచితంబు నగునవి–ఏకాంత స్థలములనఁబఱఁగును.

శుచిత్వము-జలభస్మ స్నానాదులచేతను శాంతి సత్యాదుల చేతను ఏర్పడును. సాత్త్వికమితాహారమున చిత్తశుద్ధి కలుగును.

స్వస్తికము పద్మము ఇత్యాదులు – సుఖాసనములగును.

"లింగాంగసంగినాం చైవ-పునర్జన్మ న విద్యతే"

శ్రీకరభాష్యము

"సర్వవేదాంతసారోఽయ – మత్యాశ్రమ ఇతి శ్రుతిః"

ఇంద్రియనిగ్రహమే తపస్సగును.

సాష్టాంగనమస్కారము–ప్రణామ మనఁబడును.

ఆరాధ్యశైవులు – శివపూజనమునందు దశావధానవిధానముగ

శివ ధ్యానమును చేయవలెను. శైవులందరు సామాన్యముగ ఇష్ట లింగమునందు భావలింగమును దిగువవిధము చింతించుటయు శివ ధ్యానమగును.

ఆది మధ్యాంతములయందు పరిచ్ఛిన్నమైన రెండవవస్తువు లేనివాడు, సృష్టి స్థితి లయములలో ఇతర సహకారము లేనివాడై ఏకరూపముగ నుండువాడు, లేక వృద్ధిక్షయాది రహితుఁడై ఏక స్వరూపుఁడగువాడు, ఇష్ట ప్రాణ భావలింగాది స్వగత భేదములు కలవాడైనను మూలరూపమున ఏకైకమహాలింగ మగువాడు, సూక్ష్మాతి సూక్ష్మఁడగుటచే సర్వమును వ్యాపించువాడు, చిదానంద (జ్ఞానా నంద) స్వరూపుఁడు, ప్రాకృతిరూపము లేనివాడు, హరిబ్రహ్మదులకు అచ్చెరువుఁగలిగించు జ్యోతిర్లింగస్వరూపము గలవాడు, ఉమ యనఁ బడు పరాశక్తి నెడబాయని ఇష్టలింగ మగువాడు, (యద్రో లింగ ముమా పీఠం-తస్మై తస్యై నమోనమః, రుద్రహృదయోపనిషత్తు) బ్రహ్మదుల ప్రభువు, ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తులు-లేక - సూర్య చంద్రాగ్నులు మూడు కన్నులుగా గలవాడు, విషపానముచే-స్వల్ప రేఖగా నల్లఁబడిన కంఠము గలవాడు,

క్షుత్పిపాసాదులు లేమిఁజేసి ప్రశాంతుఁడగువాడు పరమేశ్వ రుఁడు నని శివుఁడు ధ్యానింపఁదగినవాడు

మునిః = మోక్షాపేక్షచే నిరంతరము ముక్తిఁగూర్చి మననము (చింతన) గలవాడై పైవిధము శివుని ధ్యానించినచో-మహాప్రళయ మున తమస్సుగా నుండు ప్రకృతిని నియమించి మించునట్టి, జీవాత్మలందరి పుణ్యపాపములను కనిపెట్టునట్టి, సమస్తప్రాణులను పుట్టించునట్టి, శివుని-ప్రారబ్ధాంతమునందు పొందఁగలుగును.

8, 9 వాక్యములయందు-

బ్రహ్మదేవుఁడు, రుద్రుఁడు, ఇంద్రుఁడు, అక్షరుఁడు పరముఁడు, స్వరాట్, విష్ణువు, ప్రాణము, కాలము, అగ్ని, చంద్రుఁడు ఇత్యాది శబ్దములచే నిరూపింపఁబడు, లేక బ్రహ్మదిరూపములు గలయట్టి, భూత భవిష్యత్ వర్తమానములఁజెందినట్టి, సనాతనుఁడు నగు శివు నుపాసించి-దర్శించియు జననమరణాత్మకమగు సంసారమును పొందకుండును. శివజ్ఞానముదక్క- వేరొక మార్గము—మోక్షమునకు లేదని తెలియవలెను. అని ప్రతిపాదింపఁబడినది.

శ్లో॥ బ్రహ్మణా విష్ణునా చైవ-రుద్రేణాపి సదా హృది।
ఉపాస్యమానః సర్వాత్మా—భగవాన్ శివ ఉచ్యతే ॥
సూతసంహిత

"బ్రహ్మ విష్ణు రుద్రులచే తమ హృదయములయందు ఉపాసింపఁబడునాడు-భగవానుఁడగు శివుఁడేను"

ఇట్టి శివుని ఇష్టలింగమునందే పూజింపవలెను-ధ్యానింపవలెనని సిద్ధాంతశిఖామణి–దిగువవిధము వ్రాకుచ్చినది.

శ్లో॥ సర్వగోఽపి స్థితః శంభుః-స్వాధారే హి విశేషతః।
తస్మా దన్యత్ర విముఖః- స్వేష్టలింగే యజే చ్ఛివమ్"

శంకరుఁడు సర్వవ్యాపియైనను తన యాధారమునందు విశేషించి నివసించును గాన-ఇతర లింగములయందు గాని మూర్తులయందు గాని ఆసక్తిని విడనాడి-తన ఇష్టలింగమునందే శివుని పూజింపవలెను.

"యో వై రుద్రః స భగవాన్, యశ్చబ్రహ్మ, యశ్చ విష్ణుః" ఇత్యాది అథర్వశిరోపనిషత్తు-శివుఁడే బ్రహ్మవిష్ణ్వాదిరూపములు గలవాడగునని తేటపఱచినది.

శ్లో॥ తదీయం త్రివిధం రూపం-స్థూలం సూక్ష్మం చ తత్పరం।
అస్మదాద్యమరై ర్దృశ్యం-స్థూలం సూక్ష్మం చ యోగిభిః॥
తతః పరం తు యన్నిత్యం-జ్ఞాన మానంద మవ్యయం।
తన్నిష్ఠై స్తత్పరై ర్భక్తై-ర్దృశ్యం తద్వ్రత మాశ్రితైః॥

వాతూలాగమము

స్థూలము సూక్ష్మము పరము నని పరమేశ్వరుని రూపము త్రివిధము కాగా-స్థూలరూపము మానవులు దేవతలు మున్నగువారికి దృశ్యమగును. సూక్ష్మరూపము యోగాభ్యాసులకు సాక్షాత్కరించును. ఆనందమయము జ్ఞానాత్మకము నిత్యము ఏకరూపంబు నగు పరశివ స్వరూపము-శివునియందే నిష్ఠ, శివునియందే ఆసక్తి, ఇతరదేవతా భక్తిని విడనాడినట్టి అనన్య భక్తి గల లింగధారణవ్రతము నవలంబించినవారికే-ప్రారబ్ధాంతమున గోచరించును.

10 వ వాక్యమున-

పరమాత్మ-జ్యోతిర్లింగముగ ప్రాణులందరిలో ఉన్నాడనియు, పరమాత్మలో ప్రాణులందరు-మర్రివిత్తనమున (వట) వృక్షశాఖోప శాఖలవలె-ఉన్నారనియు - శివపూజనమున మనస్సులో భావించు శివయోగి-పరశివుని పొందఁగలుఁగును. మరియొక బాహ్యసాధనముతో శివసాయుజ్యము లభింపదు. అని వ్రాయఁబడినది.

11 వ వాక్యమున దిగువవిధము అర్థము కలదు.

శివధ్యాననిష్ఠుఁడు-తన నిర్మల చిత్తమును అరణి (క్రిందికట్టె) గాను ప్రణవపంచాక్షరిని-ఉత్తరారణి (పైకట్టె)గా నమర్చి-ప్రణవ పంచాక్షరీ జపముతో కూడిన "శివోఽహం" ధ్యానము అను మథనము

నభ్యసించినచో కాయిక వాచిక మానసిక జ్ఞానకృత అజ్ఞానకృత దురితమునంతయు పోగొట్టుకొనును.

జాబాలోపనిషత్తునందు-శతరుద్రీయాంతర్గతమగు ప్రణవపంచాక్షరీ జపముతో అమృతత్వము లభించునని నిరూపింపఁబడినది-ఇందుకు సూతసంహితాప్రమాణము దిగువ గాననగును.

శ్లో॥ శతరుద్రీయ సంజ్ఞస్తు-మంత్రో జప్యో మహత్తరః ।
రుద్రజాపీ విముచ్యేత-మహాపాతక పంజరాత్ ॥

సమ్యక్ జ్ఞానం చ లభతే-తేన ముచ్యేత బంధనాత్ ।
పంచాక్షరే మహాదేవః-సర్వదా సుప్రతిష్ఠితః ॥

ఆచార్యముఖతః ప్రాజ్ఞా-సిద్ధ్యత్యేవాచిరేణ తు ।
ఆచార్యరహితో మంత్రః-పుంసోఽనర్థస్య కారణమ్ ॥

శతరుద్రీయము అను గొప్ప మంత్రము జపింపఁదగినది. రుద్రాధ్యాయమును పఠించువాడు-మహాపాతకసముదాయము నుండి విడిబడును. మరియు సంపూర్ణ శివజ్ఞానము గలవాడై సంసారబంధ వివిర్ముక్తుఁడగును. రుద్రాధ్యాయమందలి శివపంచాక్షరీమంత్రము నందు శివుఁడు ఎల్లకాలముండును. ఈ మంత్రము-గురువు వలన లభించినచో శీఘ్రము సిద్ధించును. గురూపదేశము లేని మంత్రము అనర్థమును కలుగఁజేయును అనఁగా నిరుపయోగమగునని భావము.

"జీవాత్మ-మాయచే మోహముఁజెందినవాడై శరీరేంద్రియాదుల నధిష్ఠించి-ప్రాకృతికవ్యవహారము నంతయు చేయుచున్నవాడు. ప్రాకృతిక వ్యవహారము-ఎట్టిదనఁగా ?

జాగ్రత్ (మేలుకొనియున్న) దశయందు - స్త్రీరతి ఆహార పానీయాది విచిత్ర భోగములతో తృప్తిఁజెందుట.

స్వప్నావస్థ (నిద్ర) యందు పరమేశ్వరునిచే కల్పింపఁబడిన రథ గజ తురగాది వస్తువుల సంయోగమువలన సుఖ దుఃఖముల ననుభవించుట.

సుషుప్తి (గాఢనిద్ర)లో తమస్సునిండినవాఁడై ఇంద్రియ వ్యాపారములన్నియు స్తంభింపగా నిద్రాసుఖము ననుభవించుట;

వస్తుతః = జీవుఁడు-శివాంశమైనను అనాదికాలమునుండి శివారాధనమును చేయకుండుటచే భ్రమ ప్రమాదములకు లోనై జనన మరణాది సంసారపాశబద్ధుఁడై - వ్యథఁజెందుచుండుననియు, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో సుఖదుఃఖానుభవము - పరమేశ్వరుని వలననే కలుగుననియు 12, 13 వ వాక్యములలో నిరూపింపఁబడినది.

14 వ వాక్యమున దిగువవిధము కలదు.

పూర్వజన్మలయందు చేయఁబడిన కర్మయొక్క సంబంధము వలన జీవాత్మ-గాఢనిద్ర (సుషుప్తి)లో సుఖముగా పరుండును. మేలుకొని స్థూల సూక్ష్మ కారణ శరీరముల (పురత్రయము)లో విహరించును.

విచిత్రమైన చరాచర ప్రపంచమంతయు జీవాత్మ నంటుకొని యుండును. సమస్తజగత్తునకు ఆధారము, పరమానందభరితము, జ్ఞానపరిపూర్ణము నగు బ్రహ్మ (శివలింగ)ము నందు సమస్తము మహాప్రళయమున విశ్రాంతిఁజెందును. అందువలననే "విశ్వమంతయు విశ్వనాథునిచే వ్యాపింపఁబడి శివమయంబని" దిగువ శ్రుతివాక్యము ఉద్ఘోషించినది.

"విశ్వం భూతం చిత్రం బహుధా జాతం జాయమానం
చ యత్, సర్వోహ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ నమః"
నారాయణోపనిషత్తు

"ఏతస్మా జ్జాయతే ప్రాణో-మనః సర్వేంద్రియాణి చ,
ఖం వాయు ర్జ్యోతి రాపశ్చ-పృథ్వీ విశ్వస్యధారిణీ" 15

సర్వాధారమగు బ్రహ్మ (శివలింగ)ము వలన-ప్రాణవాయువు, మనస్సు, కర్మజ్ఞానేంద్రియములు, ఆకాశము, వాయువు, అగ్ని, ఉదకము, జగత్తునకు ఆధారమగు పృథివియు అవిర్భంచును. ఇట్లు కూర్మమహాపురాణము-ద్వితీయభాగమున, 31 అధ్యాయమున

శ్లో॥ యేనేదం భ్రామ్యతే విశ్వం-యదాకాశాంతరం శివం।
యోగిభి శ్చింత్యతే తత్త్వం-మహాదేవః స శంకరః ॥

విశ్వమునంతయు కర్మచక్రమున త్రిప్పునట్టి, చిదాకాశమున వెలుగొందునదియు, శ్రేయస్కరంబు, శివయోగులచే ధ్యానింపఁబడునట్టి పరతత్త్వము-మహాదేవుఁడైన శంకరుఁడగునని-వాక్రుచ్చినది.

ప్రపంచమునకు ఆశ్రయము, సర్వాంతర్యామియు మహత్తును, సూక్ష్మమునకంటె సూక్ష్మము, నిత్యము, సద్రూపంబు నగు పరబ్రహ్మము అంత్యరామిగా గల జీవాత్మ-ఏనాటికైనను బ్రహ్మసదృశుండగునని 16 వాక్యముఁదగు భావము.

జాగ్రత్స్వప్న సుషుప్తులలో అనుభవింపఁబడు ప్రపంచమును ప్రకాశింపఁజేయు బ్రహ్మమునేను (శివోఽహం) అని శివు నుపాసించువాఁడు-సర్వవిధ సంసారబంధములనుండి విముక్తుఁడగునని 17 వ వాక్యము నిరూపించినది.

